ఈ మహాసభలో జరుగవలసిన కార్యక్రమమంతా, సమితి కార్య నిర్వాహకవర్గం (గవర్నింగ్ బాడీ) వారు నియమిస్తారు. ఈ గవర్నింగ్ బాడీలో 32 మంది సభ్యులువుంటారు. వారిలో 16 మంది, వివిధదేశాల ప్రభుత్వాలతరఫున, ఎనిమిదిమంది పనివారితరఫునా, ఎనిమిదిమంది పరిశ్రమల యజమానుల తరఫునా ఎన్నుకోబడినవారు. ప్రభుత్వాల తరఫున ఎన్నుకోబడిన 16 మంది సభ్యులలోనూ, ఎనిమిదిమంది, పారిశ్రామికంగా ప్రాధాన్యత వహించిన దేశాలతరఫున ఎన్నుకోబడినవారు. మిగతా ఎనిమిదిమందీ, తక్కినదేశాల ప్రభుత్వాల తరఫున, మూడు సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడినవారు. పనివారితరఫున వుండే ఎనిమిదిమందీ, యజమానులతరఫునవుండే ఎనిమిదిమందీ, మూడేసి సంవత్సరాల కొకసారి, మహాసభకువచ్చిన ఆయావర్గాల ప్రతినిధులచేత ఎన్నుకోబడినవారు. ఈ గవర్నింగ్ బాడీకి అధ్యక్షుడుగా. ఇండియా ప్రభుత్వ కార్మిక మంత్రివర్గపు కార్యదర్శి శ్యామలధారి లాల్, 1948 డిసెంబరులో ఎన్నుకొనబడినారు. ఈపదవి పరిమితి ఒకఏడాది.

ఏదైనా ఒక ప్రతిపాదన, యీ మహాసభ కార్యక్రమంలో జరిగినప్పుడు, దానిని మహాసభ ఒక సలహాగా గాని, ఒక నియమంగా గాని అంగీకరించవచ్చును. నియమం (డ్రాఫ్ట్ కన్వెన్షన్)గా అంగీకరింపబడిన ప్రతివిషయానికీ, యీ మహాసభలో సభ్యత్వంగల దేశాల ప్రభుత్వాలు తమ ఆమోదం తెలిపినవెంటనే, ఆ దేశాలలో ఆచరణపెట్టాలి. సలహాగా అంగీకరించబడిన విషయంపట్ల, ఆ దేశాలు ఆమోదం తెలియపరచవలసిన నిర్బంధమూ లేదు; ఆచరణలో పెట్టవలసిన నిర్బంధమూ లేదు.

ఈ మహాసభలో ఒక సలహాగాని, నియమంగాని ఆమోదించబడిందంటే, సభకు హాజరైన ప్రతినిధులలో మూడింట రెండువంతుల మంది సభ్యుల అంగీకారాన్ని పొందిందన్నమాట. ఇలా ఆమోదించబడిన నియమాన్ని, ఈ మహాసభలో సభ్యత్వంగల ప్రతిదేశ ప్రభుత్వముకూడా,

ఆదేశపు శాసనసభలో ప్రవేశపెట్టాలి. సలహా విషయంలో ఆ అవసరం లేదు. ఆ సలహాను పాటించడం ఎంతవరకు అవసరమని ఆ దేశపు ప్రభుత్వానికితోస్తే, అంతవరకే దానిని ఆచరణలోకి తీసుకురావచ్చును. నియమాన్ని అంగీకరించిన ప్రతిదేశమూకూడా, ఆ నియమాన్ని పాటించడానికి ఆ దేశంలో అవలంబించబడిన చర్యనుగురించి సంవత్సరానికి ఒకసారి ఒక నివేదికను యీ మహాసభకు పంపాలి. ఆ నియమాన్ని పాటించని దేశాలపట్ల చర్యతీసుకోడానికికూడా మహాసభకు అధికారం వుంది.

ఈ సమితి, యునైటెడ్ నేషన్సువారి ఆమోదాన్నికూడా పొందింది. ఇది ఒక స్వతంత్రసంస్థగా వ్యవహరిస్తూ, యునైటెడ్ నేషన్సుకు చెందిన ఇతరసంస్థలతో సహకారంచేస్తూ పనిచేస్తుంది.

ఈ సమితి కార్యనిర్వాహకవర్గానికి, భాగతదేశప్రభుత్వం తరఫున ఈ సమితి మహాసభకు కార్యక్రమాన్ని తయారుచెయ్యడానికీ, పరిశ్రమల పరిస్థితులనుగురించీ, కార్మికులపరిస్థితులనుగురించీ పరిశోధనలు జరుపడానికీ యీ సమితి ప్రధానకార్యాలయం (ఇంటర్నేషనల్ లేబర్ ఆఫీసు) జనివాలో వుంది.

ఈ సమితికి డైరక్టర్ జనరల్‌గా మిస్టర్ డేవిడ్ ఎ. మోర్స్, 1948 జూన్ 13 తేదీన ఎన్నుకోబడినాడు. ఈ సమితి ప్రెసిడెంటుగా ఫ్రెంచి ప్రతినిధి, జస్టిస్ గొడార్ట్ ఎన్నుకొనబడినాడు.

1948 జూన్ 17 న శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన అంతర్జాతీయ కార్మికమహాసభకు ఇండియాప్రభుత్వ ప్రతినిధులుగా, యు. పి. మంత్రి సంపూర్ణానంద, ఒరిస్సా మంత్రి నిత్యానందకణుంగో, మైసూరు మంత్రి కె. టి. భాష్యంగార్లు పంపబడినారు.

## ఆరబ్ లీగ్ :

స్వతంత్ర అరబ్బీరాజ్యాలమధ్య స్నేహము పెంపొందించడానికీ, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక సంబంధాలను దృఢపరచడానికీ,

అరబ్ లీగ్ 1943 లో, అలెగ్జాండ్రియాలో జరిగిన అరబ్బీరాజ్యాల ప్రతినిధులసమావేశ ఫలితంగా ఏర్పడింది.

ఈ లీగ్ లో ఈజిప్ట్, ఇరాక్, లెబనాన్, సిరియా, సావుది అరేబియా, ట్రాన్స్ జోర్డాన్, ఎమన్, రాజ్యాలతరఫున, ఆ ప్రభుత్వాలు నియమించిన ప్రతినిధులూ, పాలస్తీనాతరఫున యీలీగ్ ఎన్నుకొనే ప్రతినిధీ సభ్యులుగా వుంటారు, స్వతంత్రంగావున్న ఏ అరబ్బీరాజ్యమైనా యీ లీగ్ లో సభ్యత్వాన్ని పొందవచ్చును.

లీగ్ కు శాశ్వతమైన అధ్యక్షుడులేడు. సెక్రటరీ-జనరల్: అబ్దుల్ రహమాన్ అజ్జంపాషా. లీగ్ కార్యస్థానం కైరోలో వుంటుంది.

అరబ్బీదేశాలు, వాటి జనాభా, వైశాల్యం వివరాలు

| దేశం | వైశాల్యం (చ. మైళ్ళు) | జనాభా |
|---|---|---|
| సావుది అరేబియా | 9,27,000 | 60,00,000 |
| మిగతా అరేబియా | 1,66,000 | 42,50,000 |
| ఈజిప్టు | 3,63,000 | 130,00,000 |
| ఆల్జీరియా | 2,22,000 | 60,00,000 |
| లిబియా | 8,10,000 | 10,00,000 |
| మొరాకో | 2,18,15[illegible] | 67,80,000 |
| ట్యూనీషియా | 45,000 | 20,00,000 |
| పాలస్తీనా | 10,400 | 10,00,000 |
| ట్రాన్స్ జోర్డన్ | 30,000 | 2,60,000 |
| సిరియా - లెబనాన్ | 60,000 | 22,00,000 |
| ఇరాక్ | 1,16,000 | 32,00,000 |

# ప్రపంచరాజ్యములు

ప్రపంచంలోని వివిధదేశాలలో, ప్రజలు, పంటలు ప్రభుత్వం మొదలైన వివరాలన్నీ యీక్రింద క్లుప్తంగా ప్రకటించబడినవి :

**అబిస్సీనియా :**

ఆఫ్రికాఖండంలో, ఈశాన్యప్రాంతంలో వున్న స్వతంత్రరాజ్యం. వైశాల్యం దాదాపు, 3,50,000 చ. మైళ్ళు. జనాభా, సుమారు 1,21,00,000. దేశం చాలావరకు కొండలమయం. 1934 లో ఈ దేశం మీద ఇటలీదండ యాత్రచేసి, క్రమేపీ దేశాన్నంతటినీ ఆక్రమించుకొన్నది. కాని, 1939–45 యుద్ధఫలితంగా ఇటలీ ఓటమితో, యీ దేశం మళ్ళీ స్వాతంత్ర్యాన్ని పొందింది. ఇంగ్లండులో తలదాచుకున్న చక్రవర్తి మళ్లీ స్వదేశానికివెళ్లి పరిపాలన సాగించుకుంటున్నాడు. చక్రవర్తి : హైలిసెలాసీ. రాజధాని, అడ్డిస్ అబాబా.

**అర్జెంటైనా :**

దక్షిణ అమెరికాలోని స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం, 10,84,935 చ. మైళ్ళు. జనాభా, 1,41,30,871. ఈదేశపు పరిపాలనా విధానం, యునైటెడ్ స్టేట్సు పరిపాలనా విధానాన్ని పోలివుంటుంది. దేశంలోని మొత్తం భూమిలో మూడవవంతు మాత్రమే వ్యవసాయానికీ. పశువులను మేపడానికీ పనికివస్తుంది. ఈ దేశంనుంచి పశువులు, పశువుల మాంసమూ విస్తారంగా విదేశాలకు ఎగుమతి అవుతవి. ఇక్కడ పండే ముఖ్యపంటలు . గోధుమ, మొక్కజొన్న, ఓట్లు, చెరకు, ద్రాక్షసారాయి. వున్ని, మొదలైనవి. ప్రెసిడెంట్ · జువాన్ డామింగో పెరాన్; రాజధాని, బోనస్ ఏర్సు.

ఆండోరా :

ఫ్రాన్సు, స్పెయినుదేశాల రెండింటికీమధ్య, యీ రెండిటి నాయకత్వానికీ లోబడిన, చిన్న ప్రజారాజ్యం. వైశాల్యం, 175 చ. మైళ్ళు. జనాభా, 6,000. ప్రజలలో కొంతమందిచేత ఎన్నుకోబడిన 24 సభ్యులు గల కౌన్సిలు, దేశపరిపాలనను సాగిస్తుంది. రాజధాని : అండోరా.

ఆఫ్ఘనిస్తాన్ :

ఆసియాలో, భరతఖండానికి పశ్చిమోత్తరాన, పాకిస్తానును ఆనుకొనివున్నదేశం. రాజుగలరాజ్యం. పార్లమెంటువుంది. ప్రభుత్వ మతం ఇస్లాం. దేశంలోవున్న హిందువులకు, యూదులకు మతవిషయాలలో సంపూర్ణమైన స్వేచ్ఛవుంది. వైశాల్యం: 245,000 చదరపుమైళ్ళు. జనాభా: 15,000,000; రాజు మహమ్మద్ జహీర్ షా. ప్రధానమంత్రి: సాదార్ షా మహమ్మద్ ఖాన్; రాజధాని, కాబూల్.

ఆల్బేనియా :

గత ప్రపంచయుద్ధకారణంగా ప్రజారాజ్యమైనది. యూరప్‌లో, ఆడ్రియాటిక్ సముద్రతీరానవున్నదేశం. వైశాల్యం, 10,629 చ. మైళ్ళు. జనాభా, 11,06,086. యుద్ధానికిపూర్వం ఇది రాజుపాలనలో వుండేది. ఇటలీదాడివల్ల, రాజు ఇంగ్లండుకు పారిపోయాడు. యుద్ధానంతరం దేశీయులు రాజరికానికి స్వస్తిచెప్పి, ప్రజారాజ్యాన్ని నెలకొల్పుకున్నారు. వ్యవసాయము, గొర్రెల పెంపకము ప్రజల ప్రధాన వృత్తులు; ప్రెసిడెంట్ మెహిది ఫ్రాషెరి; ప్రధానమంత్రి: రెక్సెప్ మిట్రోవికా. రాజధాని, తిరానా.

ఆస్ట్రియా :

గత ప్రపంచయుద్ధానికి కొంతముందుగా, జర్మనీచేత ఆక్రమింపబడిన స్వతంత్రప్రజారాజ్యం. యుద్ధంలో జర్మనీ ఓటమిఫలితంగా, మళ్ళీ

స్వతంత్రప్రజారాజ్యంగా ఏర్పడింది. దేశం వైశాల్యం. 32,369 చ. మైళ్లు. జనాభా, 1939 లో 70,09,014. జర్మనుల ఆక్రమణవల్లనూ, తరువాత రష్యను సైన్యాల దాడివల్లనూ విస్తారంగా జన, ధననష్టాలను పొందింది. ప్రెసిడెంట్ : కారల్ రెన్నర్; ప్రధానమంత్రి: డాక్టర్ లియొపాల్డ్ ఫిగిల్; రాజధాని; వియన్నా.

ఆస్ట్రేలియా :

పసిఫిక్ మహాసముద్రంలో, బ్రిటిషురాజు అధికారానికి లోబడి వున్న, స్వపరిపాలనగలఖండం. వైశాల్యం, 29,74,581 చ. మైళ్ళు. జనాభా, 73,64,841. దేశంలో స్వపరిపాలనగల రాష్ట్రాలు ఎనిమిది వున్నాయి. ఈ ఖండమంతటినీ కామన్ వెల్త్ ఆఫ్ ఆస్ట్రేలియా అంటారు. ఈ దేశంనుంచి వూలు, మాంసము, పాలు, వెన్న, గోధుమలు, బంగారం, తోళ్ళు, పళ్ళు విస్తారంగా ఎగుమతి అవుతాయి. టీ, పొగాకు, నూలు బట్టలు మొదలైనవి దిగుమతి అవుతాయి. గత ప్రపంచయుద్ధంలో ఆస్ట్రేలియాకూ, భారతదేశానికీమధ్య వ్యాపారం చాలా ఎక్కువగా సాగింది. దేశపరిపాలన, బ్రిటిషుప్రభుత్వం నియమించిన గవర్నర్-జనరల్, ప్రజలచే ఎన్నుకోబడిన శాసనసభ్యులలో అధిక సంఖ్యాకులపార్టీనుంచి మంత్రులను నియమించుకొని, వారి సలహాప్రకారం సాగిస్తాడు. 1947 లో మొట్టమొదటిసారి, ఆస్ట్రేలియా దేశీయుడే గవర్నర్-జనరల్ గా నియమింపబడ్డాడు. గవర్నర్-జనరల్ : డబ్ల్యు. జె. మెక్కెల్; ప్రధానమంత్రి: జె. బి. ఛిప్లే; రాజధాని, కాంబెరా.

ఇండో-చైనా :

ఫ్రెంచివారి అధీనంలోవున్న, చైనాభూఖండపు ఆగ్నేయభాగం. వైశాల్యం 2,81,174 చ. మైళ్లు. జనాభా, 2,44,61,251. దీనిలో కొచ్చిన్-చైనా అను 26,476 చ. మైళ్ళ దేశం ఫ్రెంచివారి వలస రాజ్యంగావుంది. కంబోడియా (67,550 చ. మైళ్ళు). అన్నాం

(56, 973 చ. మైళ్ళు) అను రాజ్యాలు ఫ్రెంచివారి రక్షణలో, వారికి లోబడిన రాజ్యాలుగా వున్నాయి. గత ప్రపంచయుద్ధానంతరం, స్వాతంత్ర్యవాంఛతో యీ దేశంలోని ప్రజలు ఫ్రెంచివారితో పోరాటం సాగిస్తున్నారు. వీరితో ఒక ఒడంబడికకువచ్చి, యీ దేశమంతటినీ తమ అధికారానికి కొంతవరకైనా లోబడివుండేటట్టు చేసుకోడానికి ఫ్రెంచివారు చేస్తున్న ప్రయత్నాలు యింకా కొనసాగలేదు. ఇండో-చైనా స్వాతంత్రోద్యమ నాయకుడు. డాక్టర్ హిషిమిన్; రాజధాని సైగాన్.

ఇండొనేషియా :

యుద్ధానికిపూర్వం డచ్చి వలసరాజ్యంగావున్న జావా, మధుర, సుమత్ర మొదలైన ద్వీపాలు. యుద్ధకాలంలో జపానువారి ఆక్రమణలో వున్నాయికాని, యుద్ధంఅంతంకాగానే స్వాతంత్ర్యాన్ని ప్రకటించాయి. డచ్చివారు, యీ దీవులస్వాతంత్ర్యాన్ని అంగీకరించక, వీటిని తమ పరిపాలనలోనే వుంచుకోవాలని ప్రయత్నించారు. చాలాకాలం డచ్చి సైన్యాలకూ, ఇండోనేషియా స్వాతంత్ర్యవీరులకూ పోరాటం జరిగింది. చివరకు ఉభయులూ ఒక ఒడంబడికకు వచ్చారు. ఈ ఒడంబడిక ప్రకారం, యీ దీవులు యునైటెడ్ స్టేట్సు ఆఫ్ ఇండొనేషియా అనే పేరుతో డచ్చిరాణికి లోబడిన ప్రజారాజ్యంగా ఏర్పడుతవి. కాని, 1948 డిసెంబరులో, డచ్చి ప్రభుత్వం ఇండోనేషియాపై యుద్ధచర్యలను జరిపి, దేశాన్నంతినూ ఆక్రమించి, రిపబ్లికను నాయకులను ఖైదు చేసింది. ఇండోనేషియాను 1950 లోపల డచ్చివారు విడచిపోవాలనీ, రిపబ్లికను నాయకులను విడుదల చెయ్యవలసిందనీ సెక్యూరిటీ కౌన్సిలు శాసించింది. ఈ దీవులన్నిటి వైశాల్యం, 7,30,000 చ. మైళ్ళు. జనాభా సుమారు, 7,20,00,000. చెరకు, బియ్యం, పొగాకు, టీ. కాఫీ, రబ్బరు మొదలైనవి యిక్కడపండే ముఖ్యపంటలు. చాలాభాగం ఎగుమతి అవుతవి. భారతదేశానికీ, ఇండొనేషియాకుమధ్య వ్యాపారం ఇటీవల బాగా జరుగుచున్నది. రిపబ్లిక్ ప్రెసిడెంటు: డాక్టర్ ఐ. అర్. సుకర్ణో; ప్రధానమంత్రి, డాక్టర్ మహమ్మద్ హట్టా. రాజధాని: బటేవియా.

## ఇటలీ :

యూరప్‌లో ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. ఇటీవలివరకు రాజు వుండేవాడు. కాని 1946 జూన్‌లో జరిగిన ఎన్నికలలో ప్రజలు ప్రజా రాజ్యంపట్లం అత్యధిక సంఖ్యాకంగా ఓటుచేసినందున, రాజు దేశాన్ని వదలి వెళ్ళిపోయాడు. వైశాల్యం : 1,19,800 చ. మైళ్ళు. జనాభా : (1946 అంచనా) 4,58,00,000. యుద్ధానికి పూర్వం దేశంలో ప్రజలలో అధిక సంఖ్యాకులు వ్యవసాయంమీద జీవించేవారు. పరిశ్రమలుకూడా చాలావరకు అభివృద్ధిపొందాయి. ప్రెసిడెంట్ : లూయి జి. యేనోడి; ప్రధానమంత్రి, ఆల్సిడి డి జాస్పెరి; రాజధాని, రోం.

## ఇరాక్ :

ఆసియాలో ఒక స్వతంత్ర ముస్లిందేశం; రాజుగల రాజ్యం. పార్లమెంటువుంది. ప్రధానమంత్రినీ, ప్రధానమంత్రి సలహామీద తక్కిన మంత్రుల్నీ రాజు నియమిస్తాడు. ప్రస్తుతం రాజు మైనరు. రాజు పేరిట, రాచకార్యములను రాజు మేనమామ నిర్వహిస్తున్నాడు. (అయన్ను రీజెంటు అంటారు). వైశాల్యం : 1,16,000 చ. మైళ్ళు. జనాభా సుమారు : 45,00,000; రాజు : ఫైజల్ II (జననం : మే 2, 1935. రాజరికం : ఏప్రెల్ 4, 1939); రీజెంటు : అమీర్ అబ్దుల్ ఇలాహి; ప్రధానమంత్రి : జనరల్ నూరి ఎస్. సయ్యద్. రాజధాని, బాగ్దాద్.

## ఇరాన్ (పెర్షియా) :

ఆసియాలో ఒక స్వతంత్ర ముస్లిందేశము; చక్రవర్తిగలరాజ్యం; పార్లమెంటు (మజిలిస్) వుంది. ప్రధానమంత్రి, తక్కిన మంత్రులను నియమిస్తాడు. ఈ మంత్రుల నియామకానికి మజిలిస్ వొప్పుకోవాలి. వైశాల్యం సుమారు 6,28,000 చ. మైళ్ళు. జనాభా సుమారు 150. లక్షలు; చక్రవర్తి : మహమ్మద్ రిజాషా పహ్లావి; ప్రధానమంత్రి : మహమ్మద్ సయ్యద్ మరఘె; రాజధాని, టెహరాన్.

**ఇశ్రాయేల్ :**

పాలస్తీనా విభజన ఫలితంగా ఏర్పడిన స్వతంత్ర యూదురాజ్యం. 1948 మే 15 తేదీన బ్రిటను, పాలస్తీనాలో తనపరిపాలనను వదలు కోవడంతో, ఇశ్రాయేల్ స్థాపన జరిగింది. దేశంలో కన్స్టిట్యుయంట్ అసెంబ్లీ స్థాపనతో 2,000 సంవత్సరాల అనంతరం, మళ్లీ 1949 ఫిబ్రవరి 14 తేదీన ఒకస్వతంత్ర యూదురాజ్యస్థాపన జరిగింది. అధ్యక్షుడు: చియిం వైజ్‌మన్; ప్రధానమంత్రి, డేవిడ్ బెన్ గూరియన్; రాజధాని, టెలవివ్.

**ఈక్వెడార్ :**

దక్షిణఅమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యము. వైశాల్యం, 2,75,936 చ. మైళ్ళు. జనాభా. 32,00,000. దేశంలో కోకోవిస్తారంగా పండుతుంది. కాఫీ, రబ్బరు, చెరకు, పొగాకు, పంచదార, సుగంధపాల చెట్లు, గోధుమ మొదలైనవి ముఖ్యపంటలు. ఈ పంటలలో చాలా భాగం ఎగుమతి అవుతవి. ఇవికాక, పెట్రోలు, టోపీలు, పచ్చలు, గంధకము, దంతము, బంగారముకూడ ఎగుమతి అవుతవి. ప్రెసిడెంట్: డాక్టర్ జోస్ ఇబర్రా; రాజధాని, క్విటో.

**ఈజిప్టు :**

ఆఫ్రికాలోవున్న స్వతంత్ర ముస్లిందేశము. రాజుగలరాజ్యం. పార్లమెంటువుంది; మంత్రులను నియమించే అధికారమూ, బర్తరఫ్ చేసే అధికారమూరాజుదే. వైశాల్యం 3,86,110 చ. మైళ్ళు దీనిలో ప్రజలు నివసించేభాగం, 13,578 చ. మైళ్ళు; 1943 అంచనా ప్రకారం జనాభా, 1,74,23,000. రాజు: ఫరూక్ (ఏప్రెల్ 28, 1936); ప్రధానమంత్రి, అబ్దుల్ హాదీపాషా; రాజధాని, కెయిరో.

**ఉత్తర ఐర్లెండు (అల్‌స్టర్)**

ఐర్లెండుదీవిలో, ఇంగ్లండురాజు పరిపాలనకు లోబడివున్న, ఉత్తరభాగం. వైశాల్యం, 5,237 చ. మైళ్ళు. జనాభా, సుమారు

13 లక్షలు. దేశంలో ప్రత్యేకం పార్లమెంటువుంది. ఇంగ్లండురాజా నియమించిన గవర్నరు, పార్లమెంటుకు బాధ్యులైన మంత్రుల సలహాతో దేశపరిపాలనను సాగిస్తాడు. గవర్నరు—గ్రాన్‌విల్ ప్రభువు; ప్రధానమంత్రి—సర్ బెసిల్ బ్రూక్; రాజధాని, బెల్‌ఫాస్ట్.

ఉత్తర రొడీషియా:

బ్రిటిషు పరిపాలనలోఉన్న ఆఫ్రికన్ భూభాగం. పరిపాలనాధికారం గవర్నరు చేతిలోవుంది. వైశాల్యం: 2,90,320 చ. మైళ్ళు. జనాభా: ఆఫ్రికనులు, 13,66,641; యూరపియనులు, 18,745. గవర్నరు: సర్ జాన్ వాడింగ్టన్; రాజధాని, లుసాకా.

ఉరూగ్వే:

దక్షిణఅమెరికాలోని చిన్నప్రజారాజ్యం. వైశాల్యం, 72,153 చ. మైళ్లు. జనాభా, 22,35,000. నాలుగుసంవత్సరాల కొకసారి శాసనసభచే ఎన్నుకోబడే ప్రెసిడెంటు. పరిపాలనను నిర్వహిస్తాడు. దేశంలో పచ్చికబయళ్లు విస్తారంగా వుండడంచేత, పశువుల పెంపకం ఎక్కువగా జరుగుతుంది. మాంసం ఎక్కువగా విదేశాలకు ఎగుమతి అవుతుంది. గోధుమ మొక్కజొన్న, బార్లీ, యీ దేశంలోని ప్రధాన పంటలు. ప్రెసిడెంట్, తామస్ బెరెటా; రాజధాని, మాంటివీడో.

ఏరా: (Eire):

ఐర్లెండులో దక్షిణభాగము; స్వతంత్ర ప్రజారాజ్యము; పార్లమెంటుకు బాధ్యులైన మంత్రులద్వారా పరిపాలన జరుగుతుంది. వైశాల్యం: 27,137 చ. మైళ్లు. దీనిలో 20,86,978 ఎకరాలభూమి వ్యవసాయంలోవుంది. 1941 లెఖలప్రకారం జనాభా: 29,89,700 ప్రెసిడెంట్: జాన్ టి. ఓ కెల్లీ; ప్రధానమంత్రి: జాన్ కాస్టెల్లో; రాజధాని, డబ్లిన్.

ఐల్ ఆఫ్ మాన్ :

ఇంగ్లండుకు సమీపంలో ఐరిష్ సముద్రంలోవున్న ఒక చిన్న ద్వీపం. వైశాల్యం. 227 చ. మైళ్ళు. జనాభా, సుమారు 50 వేలమంది. దేశపరిపాలన, బ్రిటిషుప్రభుత్వం నియమించిన లెఫ్టినెంట్ గవర్నరు సాగిస్తాడు. దేశంలో ఒక పార్లమెంటువుంది. గవర్నరు, తనకు సలహా యివ్వడానికి, యీ పార్లమెంటు సభ్యులలో ఇద్దర్ని మంత్రులుగా నియమించుకుంటాడు. లెఫ్టినెంట్ గవర్నర్ : సర్ జాఫ్రే బ్రోమెట్: రాజధాని డగ్లస్.

ఐస్ లెండ్ :

ఉత్తర అట్లాంటిక్ సముద్రంలోని ఒక పెద్దదీవి. పూర్వం డెన్మార్కు లోబడివుండేది. కాని, 1946 లో స్వతంత్ర ప్రజారాజ్యం అయింది. వైశాల్యం, 39,709 చ. మైళ్ళు. జనాభా, సుమారు 1,27, 770. ఈ దీవినుంచి ఎగుమతి అయే సరకులు : చేపలు, చేపనూనె, మాంసము. వున్ని, ఆహారధాన్యములు, పంచదార, కాఫీ, ఉప్పు, బొగ్గు మొదలైన నిత్యావసరాలన్నిటినీకూడా, యీ ద్వీపవాసులు దిగుమతి చేసుకోవలసిందే. ప్రెసిడెంట్—స్వీన్ బోరన్సన్; ప్రధానమంత్రి, ఒలాఫుర్ థోర్స్; రాజధాని, రేక్యావిక్.

క్యూబా :

అమెరికాఖండం సమీపంలోవున్న ఒక చిన్నదీవి. ప్రజారాజ్యం. వైశాల్యం, 44,164 చ. మైళ్ళు. జనాభా, 47,77,284. దేశంలోని ఎక్కువభాగంలో చెరకు, పొగాకు, చిలగడదుంపలు, అరటిపళ్ళు పండిస్తారు. ప్రెసిడెంట్ : కార్లోస్ ప్రయో సోకర్రాస్. రాజధాని, హవానా.

కెనడా :

బ్రిటిషుసామ్రాజ్యంలో, స్వపరిపాలన గలదేశం ఉత్తర అమెరికా ఖండంలోవుంది. వైశాల్యం, 36,90,410 చ. మైళ్ళు. జనాభా 1,15,06,655. బ్రిటిషురాజు తరఫున, గవర్నరు—జనరల్ నియామకం జరిగినప్పటికీ, దేశపరిపాలన పూర్తిగా దేశీయ మంత్రులచేతిలోనే వుంటుంది. మంత్రులు, పార్లమెంటుకు బాధ్యులు. జనాభాలో అధిక సంఖ్యాకులు యూరపియను జాతులవారే. లక్షకుపైగా భారతీయులూ, సుమారు 20 వేలమంది నీగ్రోలువున్నారు. దేశంలో పండేసంటలలో, గోధుమలు, ఓట్లు, బార్లీ, ముఖ్యమైనవి. దేశంఅంతా 12 రాష్ట్రాలుగా విభజింపబడివుంది. ఒకొక్క రాష్ట్రానికి ఒకొక్క లెఫ్టినెంట్ గవర్నరూ, మంత్రిమండలీ, శాసనసభా, వున్నాయి. 1497 నుంచీ బ్రిటిషువారి కాలనీగావున్న న్యూఫౌండ్ లాండ్ 1948 డిసెంబరులో, కెనడాలో ఒక రాష్ట్రం అయింది. న్యూఫౌండ్ లాండ్ జనాభా 318,000. వైశాల్యం, 1,62,750 చ. మైళ్ళు. కెనడా గవర్నర్—జనరల్ : లార్డ్ అలెగ్జాండర్; ప్రధానమంత్రి. లూయిస్ సెంట్ లోరెంట్; రాజధాని, అట్టావా.

కొలంబియా :

దక్షిణఅమెరికా పశ్చిమోత్తరకోణమువున్న స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం. 4,48,794 చ. మైళ్లు. జనాభా, 95,23,200 ఈ దేశంలో అడవులు ఎక్కువ. బంగారము, వెండి, రాగి, సీసము, బొగ్గు, పచ్చలు ముఖ్యమైన ఖనిజములు. పెట్రోలుకూడా చాలా ఎక్కువగా దొరుకుతుంది. వ్యవసాయపు పంటలు : కాఫీ, ప్రత్తి, అరటిపళ్లు, పొగాకు ముఖ్యమైనవి. ప్రెసిడెంట్ : మేరియానో ఓస్పినా పెరెజ్; రాజధాని బొగోట్టా.

## కోస్టారికా :

మధ్యఅమెరికాలోని స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం. 23,000 చ. మైళ్లు. జనాభా సుమారు ఏడు లక్షలు. నాలుగు సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడే ప్రెసిడెంటు దేశపరిపాలన సాగిస్తాడు. దేశంచాలా సారవంతమైనది. కాఫీ, బియ్యం, మొక్కజొన్న, చెరకు, బంగాళాదుంపలు, కోకో మొదలైనవి ముఖ్యపంటలు; ప్రెసిడెంట్, తియొడోరో పికాడో; రాజధాని, శాన్‌జోస్.

## గ్రీస్ :

యూరప్‌లో ఒకరాజుగలరాజ్యం. పార్లమెంటువుంది. మంత్రులు, చట్టప్రకారం, పార్లమెంటుకు బాధ్యులుగా వుండాలి. ప్రస్తుతం దేశంలో, కమ్యూనిష్టుల తిరుగుబాటువల్ల కల్లోలం ఎక్కువగావుంది. వైశాల్యం: 50,271 చ. మైళ్లు. జనాభా (1946 అంచనా) 77,88,000 ప్రజలలో సగానికిపైగా వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. దేశంలో ప్రధానపుపంట పొగాకు. పండినదానిలో సగం ఎగుమతి చేయబడుతుంది. రాజు: పాల్: ప్రధానమంత్రి: థెమిస్టోక్లిస్ సోఫోలిస్, రాజధాని, ఏథెన్సు.

## గ్రేట్ బ్రిటన్ :

ఇంగ్లండు. స్కాట్లండ్, వేల్సు అనే మూడు ప్రధానభాగాలుగల దీవి. వాడుకలో ఇంగ్లండ్ అనీ, గ్రేట్ బ్రిటన్ అనీ, యునైటెడ్ కింగ్డం అనీ అంటారు. వైశాల్యం 88,753 చ. మైళ్ళు. జనాభా నాలుగున్నరకోట్లు. ప్రపంచంలో, యీదేశానికి వున్నంత సామ్రాజ్యం మరేదేశానికీలేదు. ఆస్ట్రేలియా, కెనడా, దక్షిణాఫ్రికా, న్యూజీలాండ్, ఇండియా, అనే అధీనరాజ్యాలు, విస్తారంగా వలసరాజ్యాలు వున్నాయి.

బ్రిటిషువారి పరిపాలనలో, ప్రపంచంలోని అన్నిఖండాలలోను, ఎక్కడెక్కడ ఎంతభూభాగం వున్నదీ ప్రక్కపేజీలోని పట్టీవలన తెలుసుకోవచ్చును.

| | | |
|---|---|---|
| యూరప్‌లో | 1,21,512 | చ. మైళ్ళు. |
| ఆసియాలో | 15,62,900 | చ. మైళ్ళు. |
| ఆఫ్రికాలో | 46,52,000 | చ. మైళ్ళు. |
| ఉత్తర అమెరికాలో | 38,93,000 | చ. మైళ్ళు. |
| మధ్య అమెరికాలో | 8,600 | చ. మైళ్ళు. |
| దక్షిణ అమెరికాలో | 97,800 | చ. మైళ్ళు. |
| ఆస్ట్రేలియాలో | 33,00,000 | చ. మైళ్ళు. |

అంటే, ప్రపంచపు మొత్తపు భూవైశాల్యం, సుమారు 5,55,00,000 చ. మైళ్ళలోను, బ్రిటిషువారి పరిపాలనకు లోబడివున్న భూభాగం, 1,36,48,170 చ. మైళ్ళు.

ఈ దేశం విస్తారంగా పరిశ్రమలు పెంపొందినదేశం. యంత్రముల వల్ల ఉత్పత్తి అయినసరకులను సామ్రాజ్యదేశాలకుపంపి, సామ్రాజ్య దేశాలనుంచి ముడిసరకులను తెప్పించుకొని విశేషలాభాలనుపొందిన భాగ్యవంతమైనదేశం.

దేశంలో పరిపాలన అంతా రాజుపేరుమీద జరుగుతుంది. ప్రజలు ఎన్నుకున్న పార్లమెంటు సభ్యులలో అధిక సంఖ్యాకులు ఏ పక్షంవారయితే, ఆ పక్షనాయకుణ్ణి, ప్రధానమంత్రిగా రాజు నియమిస్తాడు. ఆ ప్రధానమంత్రి, రాజు అంగీకారంతో తన పార్టీసభ్యులలో తనతో కలసి పనిచెయ్యగల వారిని కొంతమందిని మంత్రులుగా నియమించుకొని పరిపాలన సాగిస్తాడు. ప్రస్తుతం యీ దేశంలో కార్మిక పక్షంవారు పార్లమెంటులో అధికసంఖ్యాకులుగా వున్నందున, ఆ పక్షానికి చెందిన ప్రభుత్వం అమలులో వుంది.

రాజు : ఆరవ జార్జి; ప్రధానమంత్రి : సి. ఆర్. అట్లీ; రాజధాని, లండన్.

గోతెమాలా :

మధ్యఅమెరికాలోని ఒకస్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం. 45,452 చ. మైళ్లు, జనాభా 34,50,732. దేశంనుంచి ఎగుమతి అయ్యే సరకులలో ముఖ్యమైనవి. కాఫీ, అరటిపళ్లు, తోళ్లు, తేనె, బంగారము. ప్రెసిడెంటు: జువాన్ జోస్ ఆవాలో; రాజధాని గోతెమాలా.

చిలి :

దక్షిణ అమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం. 2,96,717 చ. మైళ్లు. జనాభా. 52,37,432. ప్రజలలో అధికసంఖ్యాకుల చేత ఎన్నుకోబడిన ప్రెసిడెంటు, దేశపరిపాలన జరుపుతాడు. 21 సంవత్సరాల వయస్సుకు పైబడిన వారందరికీ ఓటుహక్కువుంది. దేశంలో రెండు శాసనసభలు వున్నాయి. వ్యవసాయము, ఖనిజములను త్రవ్వటమూ ప్రజల ప్రధానవృత్తులు. ప్రధానపంటలు: గోధుమలు, మొక్కజొన్న, బార్లీ, ఓట్లు, పొగాకు, మిరపకాయలు మొదలైనవి. దేశంనుంచి పుద్దుకూడా విస్తారంగా యూరప్‌కు ఎగుమతి అవుతున్నవి. రాగి, ఇనుము, మెంగనీసు యీ దేశంలో విస్తారంగా దొరికేఖనిజములు. మిరపకాయలు ఈ దేశంనుంచే, మనదేశానికి వచ్చాయి. అంతకుపూర్వం మనదేశంలో మిరపకాయలేదు. ప్రెసిడెంట్. గేబ్రియల్ గోంజాలెజ్ విడేలా; రాజధాని శాంటియాగో.

చెకోస్లావాకియా :

యూరప్ మధ్యభాగంలోని ఒక స్వతంత్రప్రజారాజ్యం. 1938 లో యీదేశాన్నిముందు కొంతభాగాన్ని, తరువాత పూర్తిగాను జర్మని ఆక్రమించింది. యుద్ధంవల్ల విస్తారంగాజన, ధన నష్టాలను పొందినదేశాలలో యిది ఒకటి. 1944 చివరవరకూ జర్మని ఆక్రమణలోనేవుంది. వైశాల్యం. 49,358 చ. మైళ్లు. జనాభా. 1,44,47000. దేశంలో ఖనిజసంపద చాలా హెచ్చుగావుందని అంచనా. కాని ఖనిజంత్రవ్వి తియ్యడం యింకా పెద్దయెత్తుమీద జరగడంలేదు. వ్యవసాయం ఆధునిక పద్ధతుల మీద బాగా జరుగుతోంది. ప్రెసిడెంట్ : క్లెమెంట్ గాట్‌వాల్డ్; ప్రధానమంత్రి, ఆంటోనిన్ జాపాట్కి; రాజధాని, ప్రాహా.

చైనా :

ఆసియాఖండంలోని పెద్దప్రజారాజ్యం. 1937 లో జపాను ఆక్ర మణ ఫలితంగా 1945 లో యుద్ధంముగిసేవరకూ విస్తారంగా ధననష్టాన్నీ జననష్టాన్నీ పొందింది. అంతేగాక, యిప్పటికీ దేశంలో కమ్యూనిస్టు పక్షానికీ, ప్రభుత్వపక్షానికీ పోరాటం సాగుతు నేవుంది. జననష్టం జరుగు తు నేవున్నది. వైశాల్యం, 22,79,134 చ. మైళ్ళు. జనాభా సుమారు 49 కోట్లు. ఇటీవలివరకు దేశపరిపాలన కొమిటాంగ్ అనే పార్టీ నాయ కత్వంలో జరుగుతూవుండేది. కాని, 1947 ఏప్రిల్ లో ఇతరపార్టీలకు కూడా ప్రభుత్వంలో ప్రాతినిధ్యం యివ్వబడింది. కొత్తరాజ్యాంగ విధానం అమలులోకి తీసుకొని రాబడింది. ప్రెసిడెంట్: జనరల్ జంగ్ కై షేక్: ప్రధానమంత్రి డాక్టర్ సున్ ఫో; రాజధాని, నాన్కింగ్.

జపాన్ :

1939-45 యుద్ధంలో పాల్గొని, ఓడిపోయిన కారణంచేత, మిత్ర మండలి ఆక్రమణలోవున్న రాజ్యం. ఆసియాఖండంలో పారిశ్రామికంగా చాలాముందుకు వచ్చినరాజ్యం. ఈదేశమంతా కూడా, 4,223 చిన్న ద్వీపాలసమూహం. వైశాల్యం. 1,46,690 చ. మైళ్లు. జనాభా 7,31,10,993. ప్రస్తుతం దేశపరిపాలన, మిత్రమండలి తరఫున సర్వసై న్యాధ్యక్షుడుగావున్న జనరల్ డగ్లస్ మెకార్థర్ సూచననుబట్టి జరుగుతున్నది. ఆసూచనలు అమలు జరుపడానికి, శాసనసభ చేత ఎన్నుకోబడిన మంత్రులున్నారు. పరిపాలన అంతాకూడా, చక్రవర్తి పేరుతో జరుగుతుంది. యుద్ధానికి పూర్వం, తన ఆక్రమణలోవున్న విశేష సామ్రాజ్యాన్ని, యీ దేశం యుద్ధఫలితంగా కోల్పోయింది. యుద్ధానం తరం, యీదేశంలో ప్రజలస్వాతంత్ర్యం కొంత ఎక్కువ అయింది. బ్రిటన్ లోని పరిపాలనావిధానంలాటి పరిపాలనావిధానం 1947 మే 3 తేదీన అమలులోకి వచ్చింది. చక్రవర్తి—హిరోహిటో; ప్రధానమంత్రి షిగేరు యోషిడా; రాజధాని, టోకియో.

జిబ్రాల్టర్ :

స్పెయినుదేశానికి దక్షిణంగా, మెడిటరేనియన్ సముద్రంలోవున్న ఒక పెద్దపర్వతం. బ్రిటిషువారి అధీనంలోవుంది. మెడిటరేనియన్ సముద్రంలో యూరప్‌కువెళ్ళే ఓడలు యిక్కడ ఆగుతాయి. ఈ ఓడలు చెల్లించేసుంకం, యీ పర్వతప్రభుత్వానికి ఆదాయం. దీని పొడవు 2 3/4 మైళ్ళు. వెడల్పు, 3/4 మైలు. ఎత్తు 1,396 అడుగులు. జిబ్రాల్టరు నుంచి స్పెయినుకు చిన్నభూసంధివుంది. దీని పరిపాలన బ్రిటిషుప్రభుత్వం నియమించిన గవర్నరు సాగిస్తాడు. ఆయన అధీనంలో, ఇక్కడ ఎప్పుడూ ఒక సైన్యం వుంటుంది. గవర్నర్: సర్ థామస్ రాల్ఫ్ ఈస్ట్‌వుడ్.

టర్కీ :

కొంతభాగం యూరప్‌లోనూ, కొంత అసియాలోవున్న స్వతంత్ర ప్రజారాజ్యం. 1923 లో, రాజును తొలగించి ప్రజారాజ్యంగా ఏర్పడింది. పార్లమెంటు (గ్రాండ్ నేషనల్ అసెంబ్లీ) వుంది. మంత్రులు అసెంబ్లీకి బాధ్యులు. వైశాల్యం: 294,502 చ. మైళ్లు; జనాభా: 1,89,71,300. ప్రెసిడెంటు: జనరల్ ఇస్మెట్ ఇనోను; ప్రధానమంత్రి: హసన్ సాకా; రాజధాని, అంకారా.

ట్రాన్స్‌జోర్డన్ :

ఆసియాలో ఒక స్వతంత్ర అరబ్బీదేశం; రాజుగలరాజ్యం. పార్లమెంటువుంది. మంత్రులను పార్లమెంటు సభ్యులలోనుంచి రాజు నియమిస్తాడు. వైశాల్యం: 34,740 చ. మైళ్లు. దీనిలో వ్యవసాయయోగ్యమైనభూమి, 19,25,000 ఎకరాలు: బీడు, 20,585,000 ఎకరాలు. జనాభా: 4,30,000; వీరిలో 3,00,000 మంది గృహస్థులు. మిగతావారు ద్రిమ్మరులు. జనాభాలో 36,000 మంది అరబ్బీ ముస్లిములు: 30,000 మంది అరబ్బీ క్రైస్తవులు; రాజు: అబ్దుల్లా ఇబిన్ హుస్సేన్; ప్రధానమంత్రి, తూఫిక్‌పాషా అబ్దుల్లామూలా; రాజధాని, అమ్మన్.

టిబెట్ :

ఆసియాలోని స్వతంత్ర పీఠాధిపత్య రాజ్యము. ప్రపంచంలోని అన్నిదేశాలకన్న ఎత్తునవున్న పీఠభూమి. ఈ దేశంలోని ఏ భాగము కూడా, సముద్రమట్టానికి 10,000 అడుగులకు తక్కువ ఎత్తులో లేదు. వైశాల్యం, 4,63,206 చ. మైళ్ళు. జనాభా, దాదాపు 30 లక్షలు. దేశ పరిపాలన అంతా దలైలామా అను పీఠాధిపతి సాగిస్తాడు. ఇతడే, ప్రజలకు మతాధిపతికూడాను. ఒక దలైలామా మరణించితే, అదే సమయంలో, ఆదేశంలో ఎక్కడ పురుషశిశువు జన్మిస్తే, ఆపురుషశిశువు నే దలైలామాగా దేశీయులంతా అంగీకరిస్తారు. ఈ దలైలామాను వెతికి, కనుక్కోడానికి ఒకొకప్పుడు కొన్నిసంవత్సరాలు పడుతుంది. టిబెట్టు నుంచి కస్తూరి, వున్ని, మనదేశానికి దిగుమతి అవుతాయి. మనదేశంనుంచి, వస్త్రాలు, వున్నివస్త్రాలు, ఆహారధాన్యాలు ఎగుమతి అవుతాయి; రాజధాని, లాసా.

డొమినికన్ :

దక్షిణ అమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం, వైశాల్యం 19,322 చ. మైళ్ళు; జనాభా, 18,26,407, చెరకు, కోకో, కాఫీ, పొగాకు యిక్కడ పండే ముఖ్యపంటలు. ప్రెసిడెంట్: పేనాస్తో; రాజధాని, సియుడాడ్ ట్రూజిల్లో.

డెన్మార్క్ :

యూరప్ ఉత్తరభాగంలో ఒక స్వతంత్రరాజ్యం. వైశాల్యం 16,576 చ మైళ్ళు; జనాభ, 40,24,000. రెండుశాసనసభలు వున్నాయి. మంత్రులు, శాసనసభలకు బాధ్యులై పనిచేస్తారు. ప్రజలలో సగంమంది వ్యాపారం, పరిశ్రమలమీద జీవిస్తారు; మూడోవంతుమంది వ్యవసాయం మీద జీవిస్తారు. ఈ దేశంనుంచి పశువులు, పందులు, వెన్న, ఎక్కువగా ఎగుమతి అవుతాయి, రాజు: ఫ్రెడరిక్; ప్రధానమంత్రి: హాన్స్ హెడ్టాఫ్ట్; రాజధాని, కోపెన్‌హాగన్.

తూర్పు ఆఫ్రికా :

ఆఫ్రికా ఖండంలో, బ్రిటిషువారి రక్షణలోవున్న కెన్యా, ఉగాండా, టాంగనైకా, జాంజిబారు అనే రాష్ట్రాలు. ప్రతిరాష్ట్రానికీ ఒకొక్క గవర్నరు ఉన్నాడు. ఆయనకు, ఆ రాష్ట్రపరిపాలనలో సహాయం చెయ్యడానికి కార్యదర్శులు మొదలైనవారు ఉన్నారు. కెన్యా వైశాల్యం, 2,24,960 చ. మైళ్లు; ఉగాండా, 93,981 చ. మైళ్లు (దీనిలో 13,981 చ. మైళ్లు, విక్టోరియా సరస్సు); టాంగనైకా 3,60,000 చ. మైళ్ళు (దీనిలో సరస్సులు, 20,000 చ. మైళ్ళు) జాంజిబార్. 1,020 చ. మైళ్లు. ఈ నాలుగు రాష్ట్రాలలోను వున్న జనాభా (1944): ఆఫ్రికనులు, 1,34,40,000; ఆసియావాసులు, 1,62,000; యూరపియనులు, 52,000; కెన్యాగవర్నర్: మేజర్ జనరల్ సర్ ఫిలిప్ యుజెన్ మిచ్చెల్; టాంగనైకా గవర్నర్ సర్ విలియం బాటర్‌హిల్; ఉగాండా గవర్నర్ : సర్ జాన్ హతారన్‌హాల్; జాంజిబార్ సుల్తాన్ : హిజ్ హైనెస్ సయ్యద్ సర్ ఖలీఫా బిన్‌హరూబ్; బ్రిటిషు రెసిడెంట్ · సర్ విన్సెంట్ గ్లండే.

దక్షిణ రోడీషియా :

ఆఫ్రికాలోని స్వపరిపాలనగల బ్రిటిషు వలసదేశం. పరిపాలన గవర్నరు చేతిమీద జరుగుతుంది. అసెంబ్లీ వుంది. వైశాల్యం: 1,50,333 చ. మైళ్లు. జనాభా: ఆఫ్రికనులు, 16,07,000; యూరపియనులు, 82,380; ఆసియావాసులు, 2913; ఇతర నల్లజాతులు, 4,500; గవర్నరు మేజర్-జనరల్ సర్ జె. ఎన్. కెన్నెడీ; ప్రధానమంత్రి సర్ గాడ్‌ఫ్రె ఎం. హుగ్గిన్ :

దక్షిణాఫ్రికా (యూనియన్) :

ఆఫ్రికాలో స్వపరిపాలనగల బ్రిటిషు డొమినియను, కేప్ ఆఫ్ గుడ్ హోప్, నేటాల్, ట్రాన్స్‌వాల్, అరేంజ్ ఫ్రీస్టేట్ అనే అయిదు రాష్ట్రాల సమాఖ్య. ప్రతిరాష్ట్రానికీ, రాష్ట్రీయ వ్యవహారాలను చూసుకోడానికి ఒక శాసనసభ వుంటుంది. పరిపాలనా వ్యవహారాలను జరుప

డానికి, ప్రతిరాష్ట్రానికీ ఒక ఎడ్మినిస్ట్రేటరు నియమింపబడుతాడు. యూనియను పరిపాలనకు అధిపతి, బ్రిటిషుప్రభుత్వం నియమించిన గవర్నరు జనరల్. పరిపాలన నిర్వాహకుడు, యూనియన్ ప్రధాన మంత్రి; ప్రధానమంత్రి నియామకం, యూనియన్ పార్లమెంటులో పార్టీబలంమీద ఆధారపడి వుంటుంది. వైశాల్యం; 4,72,550 చ. మైళ్ళు; (కేప్ ఆఫ్ గుడ్‌హోప్, 2,77,169; నేటాల్, 35.284; ట్రాన్స్‌వాల్, 1,10,450; ఆరేంజి ఫ్రీస్టేట్, 49,647) జనాభా (1945); 1,12,48,000; వీరిలో యూరపియనులు, 22,30,000; ఆఫ్రికనులు, 86,00,000; ఆసియావాసులు (చాలవరకు భారతీయులు) 2,19,690; గవర్నర్-జనరల్: మేజర్ జిడియన్ బ్రాండ్ వాన్ జిల్; ప్రధానమంత్రి: డాక్టర్ డి. ఏఫ్. మలాన్. రాజధాని, ప్రిటోరియా.

## నార్వే:

యూరప్‌లో ఉత్తరపు కొసనువున్న స్వతంత్ర రాజ్యము. వైశాల్యం, 1,24,556 చ. మైళ్ళు; జనాభా, 29,07,000; దేశంలో నాల్గవవంతు అడవులు; దేశంలో నలభయ్యోవంతు భూమి మాత్రమే వ్యవసాయానికి పనికివస్తుంది. వ్యవసాయంవల్లనూ, కలప కోతలమీదనూ, జనాభాలో మూడవవంతుమంది ఆధారపడివున్నారు. రెండు శాసన సభలు వున్నాయి. మంత్రిమండలి శాసనసభకు బాధ్యులై పనిచేస్తారు. రాజు: హాకన్; ప్రధానమంత్రి: జెరార్డ్ సెన్; రాజధాని, అస్లో.

## నికరాగువా:

మధ్యఅమెరికాలోని పెద్ద ప్రజారాజ్యం. వైశాల్యం. 51,660 చ. మైళ్ళు. జనాభా, 10,13,946. ప్రజలచేత, నాలుగు సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడే ప్రెసిడెంట్, పరిపాలన సాగిస్తాడు. కాఫీ, అరటి పండ్లు, పంచదార, కలప, పొగాకు, మొక్కజొన్న, బియ్యం, కోకో మొదలైనవి, యీ దేశపు ముఖ్యపంటలు. ప్రెసిడెంట్: జనరల్ సోమోజా; రాజధాని, మానాగువా.

నేపాల్ :

భారతదేశానికీ, టిబెట్టుకూమధ్య, హిమాలయపర్వత పాదంవద్ద వున్న స్వతంత్ర హిందూరాజ్యం. వైశాల్యం, 54,000 చ. మైళ్లు; జనాభా, 56,00,000. పరిపాలన అంతా ప్రధానమంత్రి చేతిలో వుంటుంది. బియ్యము, తోళ్ళు, తినధాన్యములు, నెయ్యి, పశువులు, జనప నార, కలప, యీ దేశంనుంచి ఎక్కువగా ఇండియాకు ఎగుమతి అవుతాయి. బట్టలు, పంచదార, ఉప్పు, లోహములు దిగుమతి అవుతాయి. ఈ దేశస్థులను గూర్ఖాలు అంటారు. భారతదేశంలోని సైన్యంలో వీరు ఎక్కువగా వున్నారు. రాజు: త్రిభువన వీరవిక్రమ సాదేవ: ప్రధాన మంత్రి: మహారాజ మోహన షంషేర్ జంగ్ బహదూర్ రాణా; రాజధాని, ఖాట్మండు.

న్యూజీలెండ్ :

బ్రిటిషురాజుకు లోబడిన అధినివేశం. వైశాల్యం, 1,02,374 చ. మైళ్లు. జనాభా, 18,00,000. ఆస్ట్రేలియా ఖండానికి 1,200 మైళ్ళ దూరంలో దక్షిణ పసిఫిక్ మహాసముద్రంలోవున్న 15 దీవుల సమూహం. జనాభాలో ఇంగ్లండునుంచి వలస వెళ్లిన తెల్లవారు, ఆ దీవి ఆదిమనివాసు లైన మయోరీజాతివారు అధికసంఖ్యాకులు. బ్రిటనుకు యీ దీవులనుంచి వెన్న, మాంసము అత్యధికంగా ఎగుమతి అవుతాయి. గవర్నరు జనరల్-సర్ బెర్నార్డ్ ఫ్రేబర్గ్; ప్రధానమంత్రి-పీటర్ ఫ్రేజర్; రాజధాని, వెల్లింగ్టన్.

పాలస్తీనా :

1923 లో అమలులోకి వచ్చిన మాండేట్ ప్రకారం 1948 మే 1 వరకు బ్రిటిషువారి పరిపాలనలో వున్న దేశం. పరిపాలన అంతా హైకమిషనరు చేతిలో వుండేది. దేశంమాది, అని అరబ్బులూ, యూదులూ తగాదా లాడుకుంటున్నారు. వీరుభయులకూ ఒడంబడిక కుదర్చడానికి

బ్రిటిషుప్రభుత్వము చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఈ తగాదా పరిష్కారాన్ని సంయుక్తరాజ్యసమితికి వప్పగించడానికి బ్రిటిషుప్రభుత్వం నిశ్చయించుకున్నట్టు, బ్రిటిషుప్రధానమంత్రి 1947 ఫిబ్రవరిలో ప్రకటించాడు: తరువాత సంయుక్తరాజ్యసమితివారు, పాలస్తీనా సమస్యను గురించి చర్చించి, యీదేశాన్ని యూదులకూ, అరబ్బులకూ మధ్య విభజించడానికి నిశ్చయించారు. ఆప్రకారం విభజన జరిగింది. యూదులకు యివ్వబడినభాగం 'ఇస్రాయెల్' అనేపేరుతో స్వతంత్రరాజ్యంగా ప్రకటింపబడింది. వైశాల్యం. 10,420 చ. మైళ్ళు. దీనిలో 272 చ. మైళ్ళు నీటిభాగం. జనాభా: (1944 లెఖలు): ముస్లిములు, 10,61,277: యూదులు, 5,28,702; క్రైస్తవులు, 1,35,547; ఇతరులు, 14,098 మొత్తం 17,39,624.

### పెనామా :

ఉత్తర, దక్షిణఅమెరికాలను రెంటినీ కలిపే చిన్నతోకలాంటి భూభాగం. ప్రజారాజ్యం. వైశాల్యం, 33,667 చ. మైళ్ళు ; జనాభా, 635,800. భూమి చాలా సారవంతమైనది. కాని, అధికభాగం వ్యవసాయంలో లేదు. ఇక్కడ పండే ప్రధానపంటలు, అరటిపళ్లు, కొబ్బరికాయలు, కాఫీ, కోకో. ఈదేశం వెడల్పు, 47 మైళ్లు. ప్రెసిడెంట్, డాన్ఎన్రికో ఎ. జిమినెజ్; రాజధాని, పెనామా.

### పెరాగువే :

దక్షిణఅమెరికాలోని ఒక స్వతంత్రప్రజారాజ్యం; వైశాల్యం, 149,770 చ. మైళ్లు. జనాభా 11,41,330. పొగాకు, నారింజ, మొక్కజొన్న, బియ్యం, చెరకు, వేరుశనగ, యీదేశపు ప్రధానపంటలు. ప్రెసిడెంట్ : డాక్టర్ హిజనియో మోరినిగో; రాజధాని, ఎసన్షన్.

### పోర్చుగల్ :

యూరప్‌లో ఒక ప్రజారాజ్యం. పార్లమెంటువుంది. మంత్రులు ప్రెసిడెంటుకు బాధ్యులుకాని, పార్లమెంటుకుకాదు. వైశాల్యం

పోర్చుగల్ : 35,000 చ. మైళ్లు; దీనికిలోబడి, చుట్టుప్రక్కలవున్న దీవులు 1,196 చ. మైళ్లు. వలససామ్రాజ్యం. 8,09,515 చ. మైళ్లు. 1945 నాటి లెఖ్ఖలప్రకారం జనాభా. పోర్చుగల్. 81,32,950. ప్రెసిడెంటు: జనరల్ ఆంటోనియో ఆస్కార్ డి ఫ్రాగోసో కార్మోనా; ప్రధానమంత్రి: డాక్టర్ ఆంటోనియో డి ఒలివీరా సాలాజార్: రాజధాని, లిస్బన్.

పోలెండ్ :

మొదటి ప్రపంచయుద్ధానికి పూర్వం, కొంతభాగం రష్యనుల అధీనంలోనూ, కొంతభాగం జర్మనుల అధీనంలోనూ వున్న పోలెండ్, స్వతంత్రప్రజా రాజ్యంగా 1918 నవంబరులో ప్రకటింపబడింది. తరువాత, 1939 సెప్టెంబరు 1 వ తేదిన జర్మనీ, పోలెండుపై దాడిచేసింది. కొంత భాగం జర్మనీ, కొంతభాగం రష్యా ఆక్రమించాయి. మళ్ళీ, 1944 అంతానికి పోలెండు చాలాభాగంనుంచి జర్మనులు తరిమివేయబడ్డారు. ప్రస్తుతం. పూర్వపు పోలెండులో కొంతభాగం రష్యా ఆక్రమించుకున్నా, మిగతా దేశం ప్రజారాజ్యంగావుంది. దేశానికి ప్రెసిడెంటు, శాసనసభకు బాధ్యులైన మంత్రులూ వున్నారు. వైశాల్యం, 1,50,000 చ. మైళ్లు. జనాభా, 2,36,22,334. యుద్ధకాలంలో కొన్నిలక్షలమంది ప్రజలను జర్మనులు హత్యచేశారు. ప్రెసిడెంట్-బోలెస్లా బైరట్; ప్రధానమంత్రి, ఎడ్వర్డ్ ఓసుబ్కా-మోరాస్కి; రాజధాని, వార్సా.

పెరు :

దక్షిణ అమెరికాలో ఒక ప్రజారాజ్యం. దీని వైశాల్యం, 5,32,000 చ. మైళ్ళు; జనాభా, 70,23,200. పెట్రోలు, బంగారం, వెండి, రాగి, తగరము మొదలైన ఖనిజాలు ఎక్కువగా దొరకుతవి. ప్రెసిడెంట్ డాక్టర్ జోస్ లూయిస్ బుస్టామంటె రివీరో; రాజధాని, లిమా.

## ఫ్రాన్సు :

యూరప్‌లో, ఉత్తరపుతీరంనుంచి, మధ్యవరకు ఉన్న స్వతంత్ర ప్రజారాజ్యం, వైశాల్యం. 2,12,895 చ. మైళ్ళు. జనాభా, 3,97,00,000 రెండవప్రపంచయుద్ధంలో జర్మనీ ఆక్రమణలోవుండి చాలా దెబ్బతిన్న దేశం. పార్లమెంటుకు బాధ్యులైన మంత్రివర్గంవుంది. ఫ్రాన్సుకు లోబడి వున్న సామ్రాజ్యం విస్తీర్ణం, 37,91,400 చ. మైళ్ళు. ఈ సామ్రాజ్యం లోని జనాభా, 7,25,14,640 ప్రెసిడెంట్ : విన్సెంట్ ఆరియోల్ ; ప్రధానమంత్రి: మారిస్ షుమాన్ ; రాజధాని, పారిస్.

## ఫిన్లెండ్ :

రష్యాకు పశ్చిమోత్తరంగా వున్నద్వీపం. స్వతంత్ర ప్రజారాజ్యం. గత ప్రపంచయుద్ధంవల్ల కొంతభూభాగాన్నీ, జనాభానూ, కోల్పోయిన దేశాలలో ఒకటి. వైశాల్యం, 1,30,162 చ. మైళ్ళు. జనాభా, 37,63,510. రష్యాను మినహాయిస్తే దీనినిమించి కలప విస్తారంగాగల మరొకదేశం ఏదీ యూరప్‌లో లేదు. కలప, కాగితము, వెన్న యీదేశం నుంచి ఎగుమతి అవుతవి. ప్రెసిడెంట్ : పాసికివి; ప్రధానమంత్రి : కార్ల్ ఆగస్ట్ ఫాగర్‌హోం; రాజధాని, హెల్సింకి.

## ఫిలిప్పైన్స్ :

ఆసియాఖండానికి ఆగ్నేయంగా, 500 మైళ్ళ దూరంలో పసిఫిక్ మహాసముద్రంలోవున్న ద్వీపసమూహం. ఈద్వీపాలవైశాల్యం, 1,15,600 చ. మైళ్ళు. జనాభా, 1,63,50,000 గతప్రపంచయుద్ధానికి పూర్వం, యీదేశం యునైటెడ్ స్టేట్సుకు లోబడి స్వపరిపాలన హక్కు కలిగివుం డేది. గతయుద్ధంలో యీదేశాన్ని జపాను ఆక్రమించుకున్నది. యుద్ధంలో విశేషంగా జననష్టాన్ని ధననష్టాన్ని పొందినదేశాలలో ఇది ఒకటి. యుద్ధా నంతరం, యునైటెడ్ స్టేట్సుప్రభుత్వం ఫిలిప్పైన్ దీవుల స్వాతంత్ర్యాన్ని అంగీకరించింది. 1946 జులై 4 తేదీన ఈ దీవులు స్వతంత్రప్రజా రాజ్యంగా ఏర్పడినవి. ప్రెసిడెంట్ : మాన్యుయెల్ రొక్సాస్ ; రాజ ధాని, మనిలా.

బర్మా :

భారతదేశానికి తూర్పున, అస్సాం బెంగాల్ రాష్ట్రాలతో సరిహద్దుగలిగిన ప్రజారాజ్యం. 1937 ఏప్రిల్ 1 తేదివరకు, ఇండియా వైస్రాయి అధికారానికి లోబడిన ఒకరాష్ట్రంగా వుండేది. కాని, ఆతరువాత వేరుగా బ్రిటనులోని బర్మామంత్రి (భారతదేశానికి, బర్మాకు ఒకే మంత్రి వుండేవాడు) కిబాధ్యుడైన గవర్నరు పరిపాలనకు లోబడిన ప్రత్యేకదేశంగా, వేరుచేయబడింది. 1941 డిసెంబరులో జపాను యుద్ధంలో ప్రవేశించి, 1942 మధ్యలో యీ దేశాన్ని పూర్తిగా ఆక్రమించుకొన్నది. 1943 నుంచీ దేశంలో కొంతమంది జపాను పరిపాలనను ధిక్కరిస్తూవచ్చినా, 1945 లో యుద్ధం పూర్తిఅయిన తరువాతగాని దేశం సంపూర్ణంగా జపానువారి చేతిలోనుంచి విడిపింపబడలేదు. భారతీయులలాగనే, బర్మా ప్రజలుకూడా స్వాతంత్ర్యంకోసం ఆందోళన చేస్తూవచ్చారు. ఈఆందోళన ఫలితంగా, దేశంలో కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీని ఏర్పాటుచేసి, ఆ అసెంబ్లీ తయారుచేసిన పరిపాలనవిధానాన్ని దేశంలో అమలుజరిపి, దేశానికి స్వాతంత్ర్యం యివ్వడానికి బ్రిటిషుప్రభుత్వంవారు అంగీకరించారు. తాత్కాలికంగా, బర్మాలో ఒక మంత్రిమండలి ఏర్పాటు చేయబడింది. కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ ఎన్నికలు 1947 ఏప్రిల్ నెలలో పూర్తిఅయాయి. ఈ కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ బర్మాను ప్రజారాజ్యంగా ప్రకటించింది. బ్రిటిషుప్రభుత్వం యీ నిర్ణయాన్ని అంగీకరించింది. 1948 జనవరి 4 న బర్మా ప్రజారాజ్యమైంది. దేశం వైశాల్యం, 2,61,610 చ. మైళ్లు. జనాభా, సుమారు ఒకటిన్నరకోట్లు. ఇక్కడ ముఖ్యమైనపంట బియ్యం. బియ్యము, టేకు, పెట్రోలు, వజ్రాలు, యీ దేశంనుంచి ఎక్కువగా ఎగుమతి అవుతాయి. ఎగుమతి అయేబియ్యంలో చాలాభాగం మనదేశానికే. ప్రెసిడెంట్ యు సా ష్వే థైక్; ప్రధానమంత్రి: థాకిన్ ను: రాజధాని, రంగూన్.

**బ్రజిల్ :**

దక్షిణ అమెరికాలోని ఒక ప్రజారాజ్యం. వైశాల్యం, 32,75,510 చ. మైళ్లు. జనాభా. 4,53,00,000. అమెజాన్, శావో ఫ్రాన్సిస్కో, పెరాగువే మొదలైన పెద్దనదులువుండటంవల్ల భూమి సారవంతమైనది. అడవులు జాస్తి. వ్యవసాయభూమి చాలా ఎక్కువ. ఖనిజసంపద అధికం. దేశం చాలా భాగ్యవంతమైనది. ఇక్కడపండే ముఖ్యపంటలు, కాఫీ, మొక్కజొన్న. పంచదార, బియ్యం, ప్రత్తి మొదలైనవి. పశువుల పెంపకంకూడా, ప్రజల ముఖ్యవృత్తులలో ఒకటి. బంగారం. వెండి, ఇనుము, వజ్రములు మొదలైన ఖనిజములు విస్తారంగా దొరుకుతవి. ప్రెసిడెంట్. జనరల్ దుత్రా; రాజధాని. రియోడిజనీరో.

**బల్గేరియా :**

యూరప్ ఖండంలోని స్వతంత్ర ప్రజారాజ్యం. యుద్ధంవల్ల కొంత భూభాగాన్ని, జనాన్ని కోల్పోయిన దేశాలలో యిది ఒకటి. వైశాల్యం, 42,808 చ. మైళ్ళు. జనాభా; 65,49,664. జనాభాలో ముప్పాతిక వంతులు. చిన్నచిన్న భూములలో సేద్యంమీద ఆధారపడి జీవించేవారు. గోధుమ, బార్లీ, ఓట్లు, మొక్కజొన్న, పొగాకు, చెరకు, పళ్ళు, కూరగాయలు మొదలైనవి పండిస్తారు. బొగ్గు విస్తారంగా దొరుకుతుంది. రాగి, సీసము, ఇనుము, మెంగనీసు మొదలైన ఖనిజములు కూడా ఎక్కువగా వున్నాయి. గతయుద్ధానంతరం, రాజరికానికి స్వస్తిచెప్పిన రాజ్యాలలో ఇది ఒకటి. ప్రెసిడెంట్, వాసిలి కోలారాఫ్; ప్రధానమంత్రి : జార్జి డిమిట్రావ్; రాజధాని: సొఫియా.

**బెల్జియం :**

గత ప్రపంచయుద్ధంలో జర్మనుల ఆక్రమణలోవుండి, విశేషంగా కష్టనష్టాలకు గురి అయిన యూరపియను రాజ్యాలలో ఒకటి. దేశం శత్రువుల ఆక్రమణలోవుండగా, శత్రువులతో సహకారంచేసినట్లు రాజు పట్ల అనుమానం కలిగినందున, ఈ దేశస్థులు రాజును మళ్ళీ సింహాసనం

ఎక్కనివ్వలేదు. రాజుమీద ఆరోపణలు ఇదమిత్థం తేలేదాకా, రాజు తరపున రాజుతమ్ముడు రాజ్యాధికారం సాగిస్తున్నాడు. దేశం వైశాల్యం 11,750 చ. మైళ్ళు. జనాభా, 84,00,000. ప్రజల ప్రధానవృత్తులు, వ్యవసాయము, అడవులలో కలపకోత. పరిశ్రమలుకూడా విస్తారంగా అభివృద్ధికి వచ్చినదేశం. బట్టలు, అద్దములు, లేసు, పంచదార, పలక రాళ్ళు మొదలైనవి ఎక్కువగా ఎగుమతి అవుతవి. రాజు, లియోపాల్డ్; రీజెంట్: ప్రిన్స్‌ఛార్లెస్: ప్రధానమంత్రి: పాల్ హెన్రిస్పాక్; రాజధాని, బ్రస్సెల్స్.

బొలీవియా :

దక్షిణ అమెరికాలోని స్వతంత్ర రాజ్యము. వైశాల్యం. 5,37,792 చ. మైళ్లు. జనాభా, 35,95,700. వ్యవసాయం, గనులను, త్రవ్వడం, ఇక్కడిప్రజల ప్రధానవృత్తులు. బంగారము, తగరము, రాగి, గంధకము మొదలైన ఖనిజములు ఎక్కువగా త్రవ్వితీస్తారు. ఈదేశపు పంటలలో ముఖ్యమైనవి: బియ్యం, బార్లీ, మొక్కజొన్న, ప్రత్తి, బంగాళాదుంపలు, కోకో, నీలిమందు మొదలైనవి. ప్రెసిడెంట్: హెర్‌జాగ్; రాజధాని, లాపాజ్.

భూటాన్ :

భారతదేశానికి యీశాన్యదిక్కున, హిమాలయపర్వతాల పాదాల వద్దనున్న స్వతంత్రరాజ్యం. అయితే, 1910 లో జరిగిన ఒడంబడికను అనుసరించి, విదేశవ్యవహారాలవిషయంలో బ్రిటిష్‌ప్రభుత్వంవారి సలహా ప్రకారం నడచుకోవడానికి భూటాన్ ప్రభుత్వం అంగీకరించింది. ఈదేశపు వ్యాపారమంతా, భారతదేశంతోనే జరుగుతుంది. వైశాల్యం, సుమారు 17,750 చ. మైళ్లు. జనాభా సుమారు 3 లక్షలు, రాజు, మహారాజా వాంగ్ చుక్; రాజధాని, పునఖ.

## మలయా :

ఆసియాఖండములో, సయాంకు దక్షిణంగా హిందూ మహాసముద్రంలోవున్న ద్వీపకల్పం. దీనిలో కొంతభాగం, బ్రిటీషువారి పరిపాలనలోనేవుంది. కొంతభాగం బ్రిటిషువారి అధికారాన్ని ఒప్పుకొని, పరిపాలన సాగించుకొనే సుల్తానుల చేతిలోవుంది. ఈ మలయా అంతటి వైశాల్యం, 53,243 చ. మైళ్లు. జనాభా 48,67,401. గత యుద్ధంలో మలయానంతటినీ జపానువారు ఆక్రమించుకున్నారు. వీరి దౌర్జన్యాల ఫలితంగా విశేష జననష్టాన్నీ, ధననష్టాన్నీ పొందిన దేశాలలో యిది ఒకటి. యుద్ధానంతరం, యీ దేశాన్నంతటినీ యూనియన్ ఆఫ్ మలయా అనే పేరుతో, ఒక గవర్నరు జనరల్ పరిపాలనలోకి తీసుకొని రావాలని బ్రిటిష్‌ప్రభుత్వమువారు నిశ్చయించారు. ఇలా చేసినట్లయితే, తమ అధికారం యింకా తగ్గిపోతుందని మలయా సుల్తానులు కొందరు యీ ఏర్పాటుకు అంగీకరించడంలేదు. మలయాలో రబ్బరు విశేషంగా ఉత్పత్తి అవుతుంది. మనదేశంనుంచి చాలామంది యీ రబ్బరుతోటలలో పని చెయ్యడానికి మలయా వెళ్ళి, అక్కడవున్నారు; రాజధాని, కోలాలంపూర్.

మలయా దక్షిణాగ్రంలో సింగపూరు అనే దీవి వుంది. హిందూ మహాసముద్రంలో ఒక నౌకాకేంద్రంగా, సింగపూరు చాలా ప్రధాన స్థానాన్ని పొందింది, సింగపూరు ప్రత్యేకం ఒక గవర్నరు పరిపాలనలో సింగపూరు గవర్నరు: సర్ ఫ్రాంక్లిన్ గింప్సన్.

## మాల్టా :

మెడిటరేనియన్ సముద్రంలోని ఒక దీవి. బ్రిటిషువారి అధీనంలో వుంది. వైశాల్యం, 91½ చ. మైళ్ళు. జనాభా సుమారు రెండున్నర లక్షలు. గత యుద్ధంలో, యీ దీవిని ఆక్రమించుకోడానికి జర్మనులు విశ్వప్రయత్నం చేశారు. ఈ దీవిమీద చేసినన్ని విమాన దాడులు, జర్మనులు మరెక్కడా చెయ్యలేదు. గవర్నరు: లెఫ్టినెంట్ జనరల్ సర్ ఎడ్మండ్ ష్క్రైబర్; రాజధాని, వేలెట్టా.

**మెక్సికో :**

ఉత్తరఅమెరికా దక్షిణాగ్రంలోవున్న ప్రజారాజ్యం. వైశాల్యం, 763,944 చ. మైళ్ళు. జనాభా, 2,51,78,490. ఈ దేశంలో పెట్రోలు విస్తారంగా దొరుకుతుంది. బంగారము, వెండి, రాగి, సీసము, ఇనుము, బొగ్గుమొదలైన ఖనిజ సంపత్తికూడా చాలా హెచ్చు. మొక్కజొన్న. గోధుమ, పంచదార, కాఫీ, మొదలైనవి ముఖ్యపంటలు. దేశంలో అనేకమైన పురాతన కట్టడములు భూగర్భంలో వున్నాయి. ఇటీవల, వాటిని వెలువరించడంలో చాలా కృషి జరుగుతున్నది. ప్రెసిడెంట్ : డాన్ మైగల్ ఆలెమన్; రాజధాని, మెక్సికో.

**మెడగాస్కర్ :**

ఆఫ్రికాకు ఆగ్నేయంగావున్న పెద్దదీవి. ఫ్రెంచివారి పరిపాలనలో వుంది. వైశాల్యం 2,28,000 చ. మైళ్ళు. జనాభా సుమారు 38 లక్షల మంది. వ్యవసాయము, పశువుల పెంపకము, ప్రజల ముఖ్యవృత్తులు. బంగారము, వెండి, తోళ్ళు, బియ్యము, కలప, రబ్బరు హెచ్చుగా ఎగుమతి అవుతవి. గవర్నర్-జనరల్ : డి. సెంట్ మార్ట్; రాజధాని, టననరివ్.

**మొనాకో :**

యూరప్ ఖండంలో, మెడిటరేనియన్ తీరంలో, ఫ్రాన్సుదేశాన్ని ఆనుకునివున్న ఒక చిన్న రాజ్యం. ఇది మూడుమైళ్ళుపొడవు, 1½ మైళ్ళు వెడల్పుగల భూభాగం. జనాభా, 25,000. ఈ చిన్న రాజ్యమంతా, ఇళ్ళమయం అవడంచేత, ఎక్కడా వ్యవసాయం ఏమీ జరుగదు. సంవత్సరానికి దాదాపు 20 లక్షలమంది విదేశస్థులు ఇక్కడకువచ్చి కొంతకాలం వుండిపోతూవుంటారు. పన్నెండుమంది సభ్యులుగల శాసనసభ, ముగ్గురు మంత్రులు వున్నారు. రాజు. లూయిస్.

**మొరాకో :**

ఆఫ్రికా పశ్చిమోత్తర భాగంలో వున్నదేశం. వైశాల్యం, 1,72,104, చ. మైళ్ళు. జనాభా. సుమారు 90 లక్షలు. ఈ దేశం ఫ్రెంచివారి పర్యవేక్షణ క్రిందవున్నభాగం కొంత, స్పెయిను పర్యవేక్షణ క్రిందవున్నభాగం కొంత, ఇతర యూరపియను రాజ్యాల పర్యవేక్షణ

క్రిందవున్నభాగం కొంత. దేశానికంతకూ ఒక సుల్తాన్ వున్నాడు. ఆయనతరఫున, ఫ్రెంచిప్రభుత్వం అత్యధికంగా అధికారాన్ని చెలాయిస్తుంది. విదేశవ్యవహారాలన్నీ ఫ్రాన్సుచేతిమీదగానే పరిష్కారం అవాలి. సుల్తాన్: సిది మహమ్మద్.

**యుగోస్లావియా:**

1939-45 యుద్ధఫలితంగా, ప్రజారాజ్యమైంది. 1946 ప్రజలు, రాజరాజ్యాన్ని నిరసించి, ప్రజారాజ్యాన్ని నెలకొల్పారు. వైశాల్యం: 96,265 చ. మైళ్ళు. జనాభా, 1,39,34,000. దేశంలోని ప్రజలలో నూటికి 75 వంతులమంది వ్యవసాయంమీద ఆధారపడి జీవించే వారు. ప్రెసిడెంట్; డాక్టర్ ఇవాన్ రిబార్: ప్రధానమంత్రి; మార్షల్ జోసిఫ్ టైటో; రాజధాని, బెల్‌గ్రేడ్.

**యునైటెడ్ స్టేట్స్:**

ఉత్తర అమెరికాలోని స్వతంత్ర ప్రజారాజ్యం. విస్తారంగా, పరిశ్రమలవల్లను, ఇతరదేశీయ సంపదవల్లను ప్రపంచంలోని గొప్పరాజ్యాలలో ఒకటిగా పరిగణింపబడుతున్నది. ప్రపంచంలోని అన్నిదేశాలలోకి భాగ్యవంతమైనదేశం ఇదే. వైశాల్యం, 30,22,387 చ. మైళ్ళు. జనాభా (1946)—14,12,88,693. దేశంమొత్తం 48 రాష్ట్రాల సమాఖ్య. ప్రతిరాష్ట్రమూ, ప్రజలచే ఎన్నుకోబడిన గవర్నరుల పరిపాలనలోవుంది. దేశమంతటి పరిపాలనా, నాలుగేసి సంవత్సరాల కొకసారి ప్రజలచే ఎన్నుకోబడిన ప్రెసిడెంటు చేతిలోవుంది. తన మంత్రులను యీ ప్రెసిడెంటే నియమించుకుంటాడు. ఈ మంత్రుల నియామకం, శాసనసభ (సెనేట్) అంగీకారంమీదనే జరుగుతుంది. విదేశ వ్యవహారాలుకూడా, సెనేట్ అంగీకరించిన సూత్రాలమీదనే, ప్రెసిడెంట్ నిర్వహిస్తాడు. శాసనసభలు (సెనేట్, హౌస్ ఆఫ్ రిప్రజెంటేటివ్స్ కలిసి, కాంగ్రెసు) ఆమోదించిన శాసనాలను ప్రెసిడెంట్ అంగీకరించక పోవచ్చును. ఒకసారి ప్రెసిడెంట్ అంగీకరించని శాసనాన్ని రెండు సభలూ, మూడింట రెండువంతుల మెజారిటీతో ఆమోదించినట్లయితే, ప్రెసిడెంటు అంగీకారంలేకపోయినా ఆ శాసనం అమలులోకి వస్తుంది. ప్రెసిడెంటు: హారీ ఎస్. ట్రూమన్; ప్రధానమంత్రి: డీన్ ఏచిసన్; రాజధాని, వాషింగ్టన్.

రష్యా :

కొంతభాగం యూరప్ ఖండంలోనూ, కొంతభాగం ఆసియాలోనూ వున్న విస్తారమైన, సోషలిస్టు ప్రజారాజ్యం. వైశాల్యం 83,90,490 చ. మైళ్ళు. జనాభా, 19,69,63,180. యుద్ధంవల్ల విశేష జననష్టాన్ని పొందినప్పటికీ, భూభాగాన్ని ఎక్కువగా కలుపుకున్నది. దేశమంతా, పది స్వపరిపాలనగల రాష్ట్రాలుగా విభజింపబడింది. ప్రెసిడెంట్ : నికొలాయ్ ష్వెర్నిక్; ప్రధానమంత్రి: జోసెఫ్ స్టాలిన్; రాజధాని, మాస్కో.

రుమేనియా :

యూరప్ ఆగ్నేయభాగంలో వున్న స్వతంత్ర ప్రజారాజ్యం. రెండవ ప్రపంచయుద్ధంలో, యీ దేశంలోని కొంతభాగాన్ని రష్యా కలుపుకున్నది. 1947 డిసెంబరు 30 తేదిన, రాజు రాజరికపరిత్యాగం చేశాడు. వైశాల్యం 91,934 చ. మైళ్ళు. జనాభా, 1,56,86,150. యుద్ధంవల్ల జనాన్నీ, భూమినీ ఎక్కువగా కోల్పోయిన దేశాలలో ఇది ఒకటి. ప్రధానమంత్రి, పెట్రి గ్రోజియా; రాజధాని, బుఖారెస్టు.

లక్సెంబర్గు :

యూరప్‌లో, జర్మనీ, బెల్జియం, ఫ్రాన్సుదేశాల నడుమనున్న చిన్నరాజ్యం. వైశాల్యం, 994 చ. మైళ్లు. జనాభా, 301,000. రాజ్యాధికారం, గ్రాండ్ డచెస్ అనే బిరుదుగల రాణి చేతిలో వుంది. 54 సభ్యులుగల శాసనసభవుంది. మంత్రుల సలహాప్రకారం, గ్రాండ్ డచెస్ పరిపాలన సాగిస్తుంది. ఈ దేశంలో, ఇనుము విస్తారంగా దొరుకుతుంది. గ్రాండ్ డచెస్—షార్లొట్, ప్రధానమంత్రి—పియర్ డుపాంగ్; రాజధాని, లక్సెంబర్గు.

లైక్‌టెన్‌స్టైన్ :

యూరప్‌లో, ఆస్ట్రియా, స్విట్జర్లెండ్ దేశాలకు మధ్యనున్న చిన్నరాజ్యం. వైశాల్యం, 65 చ. మైళ్ళు. జనాభా, 11,138. రాజ్యాధికారం, ప్రిన్సు అనే బిరుదుగల రాజు చేతిలోవుంది. పాలకుడు—ప్రిన్సు ఫ్రాన్సిస్ జోసెఫ్; రాజధాని, వాడుజ్.

లైబీరియా :

అమెరికాలోని స్వతంత్ర నీగ్రో ప్రజారాజ్యం; పార్లమెంటువుంది. పరిపాలనకు అధిపతి ప్రెసిడెంట్: వైశాల్యం: 43,000 చ. మైళ్ళు; జనాభా: 20,00,000. ప్రెసిడెంటు: విలియం వకనారాట్ షాద్రాక్ టబ్‌మన్; ప్రధానమంత్రి: గేబ్రియర్ ఎల్. డెనిస్; రాజధాని, మన్రోవియా.

వాటికన్ :

క్రైస్తవమత (రోమన్ కాథలిక్) పీఠాధిపతి పోప్ పరిపాలనలో వున్న ప్రాంతం. ఇదంతా రోంనగరంలోని 'వాటికన్' అనే పేరుగల ప్రత్యేకనగరం. వైశాల్యం, 108 ఎకరాలు. జనాభా, 1,100. ఈ నగరంలో సర్వాధికారమూ, పోప్‌దే. పోప్: పయస్ XII.

వెనిజులా :

దక్షిణ అమెరికాలోని ఉత్తరభాగంలోవున్న ప్రజారాజ్యం. వైశాల్యం, 3, 52,170 చ. మైళ్ళు. జనాభా, 38,39,747. ఏడుసంవత్సరాల కొకసారి శాసనసభచేత ఎన్నుకోబడే ప్రెసిడెంట్, పరిపాలన సాగిస్తాడు. పెట్రోలు . యీ దేశంలో ఎక్కువగా దొరుకుతుంది. పెట్రోలు, బంగారము, వీటిని త్రవ్వితియ్యడం తరువాత చెప్పదగిన పరిశ్రమ వ్యవసాయం. ప్రెసిడెంట్ · రాములో జెటన్‌కోర్ట్; రాజధాని, కరకాస్.

శాన్ మారినో :

యూరప్‌లో, ఇటలీ సమీపంలోవున్న ఒక చిన్న ప్రజారాజ్యం. దేశపరిపాలన 60 మంది కౌన్సిలు సభ్యులచేత ఎన్నుకోబడిన యిద్దరు రీజెంట్లు సాగిస్తారు. ఈ రీజెంట్ల ఎన్నిక ప్రతి ఆరుమాసాలకు ఒకసారి జరుగుతూవుంటుంది. ఒకసారి రీజెంటుగా వున్నవారు, మళ్లీ మూడు సంవత్సరాలదాకా ఆ పదవికి రాకూడదు. దేశం వైశాల్యం, 38 చ. మైళ్ళు. జనాభా, 15,000.

శాల్వెడార్ :

మధ్యఅమెరికాలోని స్వతంత్ర ప్రజా రాజ్యం. వైశాల్యం, 13,176 చ. మైళ్ళు. జనాభా, 18,96,160. ప్రెసిడెంటును ప్రజలు ఎన్నుకుంటారు. ప్రెసిడెంటుకు బాధ్యులైన మంత్రులు పరిపాలన నిర్వహిస్తారు. కాఫీ, చెరకు, మొక్కజొన్న యీదేశపు ముఖ్యపంటలు. ప్రెసిడెంట్ : జనరల్ కాస్టెనెడా కాస్ట్రో; రాజధాని, శాన్ శాల్వెడార్.

సయాం :

ఆసియాఖండంలోని స్వతంత్రరాజ్యం. బర్మాకు చైనాకు మధ్య ఉన్నది. వైశాల్యం, 1,98,247 చ. మైళ్లు. జనాభా, 1,44,64,489. ప్రజలలో అధికసంఖ్యాకులు బౌద్ధమతస్థులు. 1932 వరకూ, ఈ దేశపు రాజు నిరంకుశాధికారిగా వుండేవాడు. కాని, తరువాత, మంత్రుల సలహాప్రకారం రాజు పరిపాలన సాగించడానికీ, 150 మంది సభ్యులు గల శాసనసభను నెలకొల్పడానికీ ఏర్పాటు జరిగింది. దేశంలో ప్రధానపంట బియ్యం. చాలాభాగం ఎగుమతి అవుతుంది. బియ్యంకాక, తగరం, టేకు, కలప, రబ్బరుకూడా విస్తారంగా ఎగుమతి అవుతాయి. రాజు : భూమిఫణ అతులిత : ప్రధానమంత్రి : మార్షల్ పిబుల్ సంగ్రాం; రాజధాని : బాంకాక్.

సావుది అరేబియా :

ఆసియాలోని ఒక స్వతంత్ర ముస్లిందేశం. రాజుగల రాజ్యం. రాజు నిరంకుశాధికారి. ఆయనకు ఇష్టంవచ్చిన మంత్రులను నియమించుకొని పరిపాలన నిర్వహిస్తాడు. వైశాల్యం: 9,13,000 చ. మైళ్ళు: జనాభా సుమారు. 60,00,000. ముస్లిములకు అతిపవిత్రములైన మక్కా, మదీనాపట్టణాలు ఈ దేశంలోనే వున్నాయి. రాజు. అబ్దుల్ అజీజ్ ఇబిన్ ఇబ్దుల్ రహమన్ అల్ ఫైజల్ అల్ సావూద్: ప్రధాన మంత్రి, సర్వసైన్యాధ్యక్షుడు యువరాజు అమీర్ సావుద్.

సింహళము :

సింహళద్వీపం ఇండియాకు దిగువను ఇండియన్ సముద్రంలో వున్నది. ఈదీవి 1948 ఫిబ్రవరి 4 తేది వరకు బ్రిటిషు ప్రభుత్వపు అధీనంలో వలసదేశంగా వుండేది. 1948 ఫిబ్రవరి 4 నుంచి డొమినియన్ రాజ్యప్

హోదాను పొందింది. ఈదీవి వైశాల్యం 25,332 చ. మైళ్లు. జనాభా (1946 లో) 66,58,999. దేశంలోని పంటలలో ముఖ్యమైనవి: బియ్యం, కోకో, తేయాకు, కొబ్బరి, రబ్బరు. ఈదేశంనంచి కోకో, దాల్చినచెక్క, కొబ్బరిపీచు, కొబ్బరికాయలు, తేయాకు, రబ్బరు, ఎక్కువగా ఎగుమతి అవుతవి. వస్త్రములు, బియ్యము, బొగ్గు, పంచదార, ఎరువు, మొదలైన వాటిని ఈద్వీపం దిగుమతి చేసుకుంటుంది. ఈద్వీపంలో, రబ్బరుతోటలలో పనిచెయ్యడానికి తమిళదేశంనుంచి వలసపోయిన జనాభా చాలా ఎక్కువ మంది ఉన్నారు. గవర్నర్ జనరల్: సర్ హెన్రీ మంక్ మేసన్ మూర్; ప్రధానమంత్రి: డి. ఎస్. సేనానాయక; రాజధాని, కొలంబో.

## సిరియా, లెబనాన్ :

ఆసియాలో, ఫ్రెంచి మాండేట్ లో వున్న రెండుదేశాలు. రెండూ కూడా ప్రజారాజ్యాలక్రిందనే లెక్క. రెండుదేశాలకూ శాసనసభలు వున్నాయి. పరిపాలనకు ప్రెసిడెంట్లు అధిపతులు. కాని, రాజకార్యాలన్నీ ఫ్రెంచి హైకమిషనరు నడుపుతాడు. రెండుదేశాల వైశాల్యము, 57,900 చ. మైళ్ళు. సిరియా: పార్లమెంటులో మెజారిటీ పార్టీవారే మంత్రిమండలిని ఏర్పాటుచేస్తారు. లెబనాన్: పార్లమెంటులో మెజారిటీ పార్టీనాయకుడు, తాను ప్రధానిగా మంత్రిమండలిని ఏర్పాటు చేస్తాడు. జనాభా: 42,65,700. సిరియా ప్రెసిడెంటు. షుక్రి శౌకువాట్లి (1946 ఆగస్టు) ప్రధానమంత్రి, ఖలీద్ ఎల్ అజం; లెబనాన్ ప్రెసిడెంటు: షేక్ బిషారత్ ఖోరి; ప్రధానమంత్రి సాదిమాల్హా.

## స్విట్జర్లెండు :

యూరప్ మధ్యభాగంలోని ఒక ప్రజారాజ్యం. వైశాల్య, 17,737 చ. మైళ్ళు. జనాభా, 42,65,703. ప్రజలు, జర్మన్, ఫ్రెంచి, ఇటాలియను జాతులకు చెందినవారు. యూరప్‌లోని ఏ దేశంలోను, స్విట్జర్లెండులో వున్నన్ని పర్వతాలులేవు. పరిపాలన, శాసనసభచే ఎన్నుకోబడిన ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు చేతిలోవుంది. ఈ కౌన్సిలుకు అధ్యక్షుడు ప్రతిసంవత్సరమూ ఎన్నుకోబడుతారు. 1948 డిసెంబరు 16 న, ఎర్నెస్ట్ నాబ్స్, అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. రాజధాని, బెర్ని.

స్వీడన్ :

యూరప్ ఈశాన్యభాగాన ఉన్న స్వతంత్రరాజ్యం. వైశాల్యం, 1,78,315 చ. మైళ్ళు. జనాభా, 66,73,956. మంత్రులు శాసనసభకు బాధ్యులు. ప్రజలలో నూటికి 35 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవిస్తున్నారు. ఈ దేశంనుంచి కలప, కాగితము, వెన్న, పందిమాంసము, అగ్గిపెట్టెలు విస్తారంగా ఎగుమతి అవుతాయి. రాజు—గుస్టావ్; ప్రధాన మంత్రి—ఎర్లాండర్; రాజధాని, స్టాక్‌హోం.

స్పెయిన్ :

యూరప్‌లోని నియంతృత్వరాజ్యం. పరిపాలన, కేవలం నియంత యిష్టప్రకారం, ఫాసిస్టు సూత్రాలపై జరుగుతున్నది. వైశాల్యం, 1,96,607 చ. మైళ్ళు. జనాభా, 2,67,61,902. నియంత పరిపాలనను తొలగించడానికి, రిపబ్లికనులు ప్రయత్నాలు చేస్తున్నారు. యునైటెడ్ నేషన్సు, యీ దేశంలో నియంతపరిపాలన వున్నంతకాలమూ, మిత్ర రాజ్యాలవారెవరూ దీనితో సంబంధం పెట్టుకోవద్దని నిర్ణయించాయి. నియంత: జనరల్ ఫ్రాన్సిస్కో ఫ్రాంకో; రాజధాని, మాడ్రిడ్.

హంగరీ :

యూరప్‌లోని ఒక స్వతంత్రప్రజారాజ్యం. యుద్ధానికి పూర్వం, సింహాసనంగల రాజ్యంగా వుండేది. రీజెంటు అనే బిరుదంతో, రాజ్యాధికారాలు పూర్తిగాగల పాలకుడు పరిపాలనచేసేవాడు. యుద్ధానంతరం, ప్రజారాజ్యమైంది. యుద్ధంవల్ల కొంతభూభాగాన్ని, జనాభాను నష్టపడిన దేశాలలో యిది ఒకటి. వైశాల్యం, 35,875 చ. మైళ్ళు. జనాభా, 91,06,250. దేశంలో ముఖ్యంగా లభించేవస్తువులు కలప, పెట్రోలు. ప్రెసిడెంట్, ఆర్పాడ్ సాకసితా; ప్రధానమంత్రి, ఇస్త్వాన్ దోబి; రాజధాని, బుడాపెస్టు.

హాలెండు :

యూరప్‌లో ఒకదేశం. రాణిగలరాజ్యం. పార్లమెంటు వుంది. మంత్రులు పార్లమెంటుకు బాధ్యులుగా వుండాలి. వైశాల్యం, 12,862 చ. మైళ్ళు; జనాభా 90,91,000. రాణి : జూలియానా; ప్రధానమంత్రి డాక్టర్ విల్లెం డ్రీస్.

హైతి :

అమెరికాఖండానికి పశ్చిమంగా వున్న హిస్పానియోలా దీవిలోని పశ్చిమభాగం. ప్రజారాజ్యం. వైశాల్యం, 10,204 చ. మైళ్ళు. జనాభా సుమారు 30 లక్షలు. కాఫీ, కోకో, ప్రత్తి, తోళ్ళు, పంచదార, తేనె మొదలైన పదార్థాలు ఎక్కువగా యిక్కడనుంచి ఎగుమతి అవుతాయి. బట్టలు, గోనెసంచులు, ఇనుపపనిముట్లు, మొదలైనసరకు దిగుమతి అవుతుంది. దేశపరిపాలన ప్రెసిడెంటుచేతిలో వుంటుంది.

హాండురాస

మధ్య అమెరికాలోని ఒక స్వతంత్రప్రజారాజ్యం. వైశాల్యం, 44,275 చ. మైళ్ళు. జనాభా, సుమారు లక్షమంది. అరటిపళ్ళు ఇక్కడ విస్తారంగా పండుతవి. ఇవికాక, కాఫీ, కొబ్బరికాయలు, పొగాకు ముఖ్యమైన పంటలు. ఈ దేశపు వ్యాపారం మువ్వాతిక వంతులు యునైటెడ్ స్టేట్సుతోనే జరుగుతుంది. దేశపరిపాలన ప్రెసిడెంట్ చేతిలోవుంది.

* * *

మొట్టమొదట ఆకాశంలో విమానం నడిపినవ్యక్తి, అమెరికా దేశీయుడు ఆర్విల్ రైట్. ఇది 1903 డిసెంబరు 17 న జరిగింది.

* * *

అమెరికా యునైటెడ్‌స్టేట్సు అధ్యక్షుని జీతం ఏడాదికి రు. 2,50,000.

* * *

ఆరోగ్యవంతుని శరీరంలో వేడి సాధారణంగా 98·4 (ఫారెన్ హీట్) డిగ్రీలు వుంటుంది. 98·4 డిగ్రీలకు ఎక్కువగాని, 97·3 డిగ్రీలకు తక్కువగాని చాలారోజులు వున్నట్లయితే, అది జబ్బుక్రిందనే పరిగణించాలి.

* * *

21 సంవత్సరాల పైబడిన ఆరోగ్యవంతుని నాడి ఒకనిమిషానికి 75 మొదలు 79 సార్లు కొట్టుకుంటుంది.

భారతదేశంలో వున్నన్ని రకరకాల జాతుల ప్రజలు, ఒక్క రష్యాలో తప్ప ప్రపంచంలో మరే దేశంలోనూ లేరు.

# భరతఖండ చరిత్రలో ప్రధాన ఘట్టములు

క్రీస్తుపూర్వం :

3000 (సంవత్సరాలకు పూర్వం) ఆర్యుల ఆగమనానికి పూర్వపు
మొహెంజొదారో నాగరికత

1600—గంగాతీర ప్రాంతాలలో ఆర్యుల ప్రథమనివాసం

1000—500—వేదరచన (ఊహ)

800—500—ఉపనిషత్తుల రచన

569—527—జైనమతస్థాపకుడు, మహావీరునిజీవితం

543—బుద్ధుని మరణం

326—అలెగ్జాండర్ దండయాత్ర

321—చంద్రగుప్తమౌర్యుని పాలన

269—అశోకునిపాలన

క్రీస్తు తరువాత :

320—530—గుప్తరాజ్యపాలన

333—సముద్రగుప్త పరిపాలన

375—చంద్రగుప్త విక్రమాదిత్యుడు

—కాళిదాసు

820—శంకరాచార్య మృతి

1005—గజనీమహమద్ దండయాత్ర

1192—పృధ్వీరాజు ఓటమి; ఘోరీ విజయం

1206—ఢిల్లీలో సుల్తానుల పరిపాలన

1336—విజయనగర రాజ్యస్థాపన

1409—శిఖ్ మతస్థాపకుడు గురునానక్ జననం

1498—కాలికట్‌కు వాస్కోడిగామా ఆగమనం

1526—బాబర్ విజయం

1556—1605 అక్బర్ రాజ్యం

1565—విజయనగరరాజ్య పతనం

1600—ఈస్టిండియా కంపెనీ స్థాపన

1628—5వ షాజహాన్ రాజ్యం

1630—శివాజీ జననం

1645—తాజమహల్ నిర్మాణం పూర్తి అయింది

1661—బొంబాయి ఇంగ్లీషువారికి చెందుట

1707—ఔరంగజేబ్ మరణం

1757—ప్లాసీ యుద్ధఫలితంగా బెంగాల్‌లో బ్రిటిషువారి పాలన ఆరంభం.

1774—మొట్టమొదటి గవర్నర్-జనరల్ గా వారన్ హేస్టింగ్స్ నియామకం

1780—మొట్టమొదటి ఇంగ్లీషుపత్రిక, హిక్కీస్ గెజెట్ స్థాపన

1828—బ్రహ్మసమాజ స్థాపన

1829—సహగమనం నిషేధింపబడింది

1836—శ్రీ రామకృష్ణ పరమహంస జననం, ఫిబ్రవరి 18

1854—టెలిగ్రాఫ్‌ల స్థాపన (మార్చి 23)
మొట్టమొదటి లెజిస్లేటివ్ కౌన్సిలు

1857—మొదటి స్వాతంత్ర్య యుద్ధం

1858—భారతదేశ పరిపాలన ఈస్టిండియాకంపెనీ చేతినుంచి, బ్రిటిషు పార్లమెంటుచేతిలోకి మార్చబడింది

1863—జనవరి 12 శ్రీ వివేకానందస్వామి జననం

1869—అక్టోబరు 2: గాంధీజీ జననం

1877—విక్టోరియారాణి భారతదేశానికి సామ్రాజ్ఞిగా ప్రకటింపబడింది

1885—డిసెంబరు 28 న, కాంగ్రెసు మహాసభ స్థాపన

1912—భారతదేశపు రాజధాని కలకత్తానుంచి ఢిల్లీకిమార్చబడింది

1914—1వ-ప్రపంచయుద్ధం

1917—భారతదేశానికి స్వపరిపాలన ఇవ్వబడుతుందని ఇండియా మంత్రిప్రకటన

1920—ఆగస్టు 1 న సహాయనిరాకరణోద్యమ ప్రారంభం

1922—గాంధిమహాత్ముని అరెస్టు
1929—లాహోరు కాంగ్రెసులో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం
1930—ఏప్రిల్ 1. శాసనోల్లంఘ నోద్యమము
—నవంబరు 12. మొదటి రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు
1931—మార్చి 4. గాంధి ఇర్విన్ ఒడంబడిక; రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు
1932—కాంగ్రెసుపై నిషేధం. పూనా ఒడంబడిక
1935—గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టం ప్యాసయింది
1937—రాష్ట్రీయపరిపాలన అమలులోకి వచ్చింది; కాంగ్రెసు వారు మంత్రి పదవులను వహించారు
1939—సెప్టెంబరు 2. రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభం
—కాంగ్రెసువారు పదవులకు రాజీనామా ఇచ్చారు
1942—క్రిప్సు రాయబారం
—అగస్టు 8. 'క్విట్ ఇండియా' తీర్మానం. కాంగ్రెసు నాయకుల అరెస్టు
విశాఖపట్టణం, కాకినాడమీద (ఏప్రిల్ 6) జపాను విమానదాడి
1944—గాంధిజీ విడుదల, కస్తూరిబా గాంధి మరణం
1945—యుద్ధం ముగింపు; కాంగ్రెసునాయకుల విడుదల; కేంద్ర శాసనసభకు ఎన్నికలు
1946—రాష్ట్రాలలో ఎన్నికలు; కాంగ్రెసు ప్రభుత్వాల స్థాపన బ్రిటిషు మంత్రుల రాయబారం; కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ స్థాపన (డిసెంబరు 10 సమావేశం); కేంద్ర ప్రభుత్వంలో కాంగ్రెసు, లీగు నాయకుల ప్రవేశం
1947—జనవరి 20, భారతదేశంనుండి 1948 జూన్ లోపున వెళ్ళిపోతామని బ్రిటిషు ప్రధాని ప్రకటన
—రాజప్రతినిధిగా లార్డ్ మౌంట్ బాటన్ నియామకం
—జూన్ 3. భారతదేశ విభజన ప్రణాళిక; కాంగ్రెసు, లీగ్ నాయకుల ఆమోదం

—జూలై 15—భారతదేశ విభజన, డొమినియన్ స్టేటసు అమలులోకి తెచ్చే బిల్లు కామన్సుసభలో ప్యాసయింది

—ఆగస్టు 15—భారతదేశం. ఇండియా, పాకిస్తాన్ అనే పేర్లతో, రెండు డొమినియను రాజ్యాలు అయింది

1948—జనవరి 30: గాంధిమహాత్ముని హత్య

జూన్ 21: మౌంట్‌బాటెన్ వీడ్కోలు

జూన్ 21: ప్రథమభారతీయ గవర్నర్ జనరల్ శ్రీ సి. రాజగోపాలాచారి పదవీ స్వీకరణ

సెప్టెంబరు 11: జిన్నా మరణం

## బ్రిటనులో ఇండియా మంత్రులు

భారతదేశపు వ్యవహారాలను సరిచూడడానికి బ్రిటిషు ప్రభుత్వంలో, ఒక ప్రత్యేక మంత్రిని నియమించడం 1858 లో జరిగింది. అప్పటినుంచి, యీ క్రిందివారు, వరుసగా మంత్రులయారు.

స్టాన్లీ ప్రభువు 1858; సర్ చార్లెస్ వుడ్ 1859; రిపన్ ప్రభువు 1866; క్రాన్ బోర్న్ ప్రభువు 1866; సర్ ఎస్. నార్త్‌కోట్ 1876; ఆర్గిల్ ప్రభువు 1868; శాలిస్‌బరీ ప్రభువు 1874; క్రాన్‌బ్రూక్ ప్రభువు 1878; హార్టింగ్టన్ ప్రభువు 1880; కింబర్లే ప్రభువు 1882; చర్చిల్ ప్రభువు 1885; కింబర్లే ప్రభువు 1886; క్రాస్ ప్రభువు 1886; హెచ్. హెచ్. ఫౌలర్ 1894; జార్జిహామిల్టన్ ప్రభువు 1895; సెంట్‌జాన్ బ్రాడ్రిక్ 1903; జాన్‌మోర్లే 1910; క్రూ ప్రభువు 1911; మోర్లే ప్రభువు 1911; క్రూ ప్రభువు 1915; ఆస్టెన్ ఛాంబర్లేన్ 1917; ఇ. ఎస్. మోంటాగు 1922; పీల్ ప్రభువు; 1922; ఆలివర్ ప్రభువు 1924; బర్కెన్‌హెడ్ ప్రభువు 1924; పీల్ ప్రభువు 1925; వెడ్జ్‌వుడ్‌బెన్ 1926; సర్ శామ్యూల్ హోర్ 1931; జెట్లండ్ ప్రభువు 1935; ఎల్. ఎస్. అమెరీ 1939; ఫెథిక్ లారెన్సు ప్రభువు 1945; లిస్టోవెల్ ప్రభువు 1947.

# భరతఖండం

ఆసియా ఖండంలోని పెద్ద దేశాలలో ఒకటి భరతఖండం. రష్యా మినహాగా యూరప్ ఖండం వైశాల్య ఎంతో, భరతఖండం వైశాల్యం కూడా దాదాపు అంతే.

1947 ఆగస్టు 15 తేదీవరకు భరతఖండం అంతా, ఏకదేశంగానే వుండె. ఆగస్టు 15 తేదిన రాజకీయంగా స్వాతంత్ర్యి చేకూరడంతో పాటు, భరతఖండం ఇండియా, పాకిస్తాన్ అనే పేర్లతో రెండుదేశా లయింది. 'ప్రపంచదర్శిని'లో భరతఖండం అన్న ప్రస్తావించబడినప్పుడు, ఆ ప్రస్తావన ఇండియా-పాకిస్తానులకు రెండింటికి కలిపి చేసిన ప్రస్తావనగా గ్రహించవలసిందని పాఠకులకు మనవి.

## వైశాల్యం

ఈ ఖండం మొత్తం వైశాల్యం 15,81,410 చ మైళ్ళు. దీనిలో అధికభాగం ప్రజాప్రభుత్వాల పరిపాలనలోనూ, మిగతాది, స్వదేశ రాజుల పరిపాలనలోనూవుంది. కొద్దిభాగం, ఫ్రెంచి, పోర్చుగీసు దేశాల అధీనంలో వుంది. ప్రజాప్రభుత్వాల పరిపాలనలో వున్నభాగం వైశాల్యం: 8,65,446 చ. మైళ్ళు. సంస్థానాధీశుల పరిపాలనలోవున్న భాగం; 7,15,964 చ. మైళ్ళు.

భరతఖండం విస్తారంగా పల్లెటూళ్ళదేశం. ఈ ఖండమంతటిలోనూ వున్న జనపదాలు . 6,58,595 వీటిలో నగరాలు 2,703; పల్లెటూళ్ళు 6,55,892.

నగరాలు : 2,703 :

రాష్ట్రాలలో · 1,724. వీటి జనాభా : 3,75,46,830. సంస్థానాలలో: 978. వీటి జనాభా: 1,21,49,223.

పల్లెటూళ్లు: 6,55,892:

రాష్ట్రాలలో: 4,59,391. వీటి జనాభా: 25,82,61,892. సంస్థానాలలో: 1,96,501. వీటి జనాభా: 3,10,40,010.

విభజనానంతరం:

ఇండియాగా వైశాల్యం 12,50,000 చ. మైళ్ళు; పాకిస్తాన్ వైశాల్యం: 3,30,000 చ. మైళ్ళు.

## జనాభా

1945 లో, భరతఖండంలో జననాలు, 1941 నుంచి 1944 వరకూ ప్రతిసంవత్సరమూ పెరిగిన దానికన్న కొంచెం ఎక్కువగా పెరిగినట్లు ప్రభుత్వపు అంచనావల్ల తెలుస్తోంది. 1941 లో జననాలు, ఖండంలోవున్న జనాభాలో ప్రతి 1,900 మందికీ 29 చొప్పున పెరిగాయి. తరువాత మూడు సంవత్సరాలలోనూ, సగటున వెయ్యిమందికీ, ఏడాదికి 26 జననాలు లెఖ తేలాయి. అయితే, యీసంవత్సరాలలోనే, మరణాలు అంతకు పూర్వంకంటె కొంచెం ఎక్కువగానే సంభవించాయి.

ప్రతిసంవత్సరమూ. భరతఖండపు జనాభా దాదాపు 50 లక్షలు పెరుగుతూవున్నదని లెఖలవల్ల తేలింది.

1941 లో మొత్తం జనాభా: 38,89,97,955. వీటిలో సంస్థానాలలో ఉన్నవారు 9,31,89,233 మందిపోగా, రాష్ట్రాలలోని జనాభా: 29,58,08,622.

భరతఖండంలోని జనాభాలో పురుషులు, 20,10,25,726; స్త్రీలు, 18,79,27,299. జనాభాలో, 4,96,96,053, మంది పట్టణాలలోనూ, 33,93,01,902 మంది పల్లెలలోనూ నివసిస్తున్నట్లు 1941 లెఖల ప్రకారం తేలింది. కాని, యిటీవల నగరాలలో జనాభా చాలా ఎక్కువ అయింది.

విభజనానంతరం, ఇండియా జనాభా, దాదాపు 33,18,00,000 అని, వీరిలో 17,14,00,000 మంది పురుషులూ, 16,03,00,000 మంది స్త్రీలూ అని అంచనా. పెరుగుతున్న జనాభానుబట్టి, 1948 లో ఇండియా జనసంఖ్య 33 కోట్ల 70 లక్షలు వుంటుందని అంచనా.

## నగరముల జనాభా (1941)

| | | | |
|---|---|---|---|
| కలకత్తా | 24.88,083 | పూనా | 258,197 |
| బొంబాయి | 14.89,883 | కాశీ | 262,100 |
| మదరాసు | 7,77,481 | మధుర | 239,144 |
| హైదరాబాదు | 7,39,159 | తిరుచినాపల్లి | 159,566 |
| ఢిల్లీ | 5,21,848 | మైసూరు | 150,540 |
| బెంగుళూరు | 406,760 | సేలం | 129,702 |

## మతములవారిగా భరతఖండపు జనాభా (1941)

| మతము | సంఖ్య |
|---|---|
| హిందువులు | 25,49,30,506 |
| వీరిలో హరిజనులు | 4,88,13,190 |
| ముస్లిములు | 9,43,89,423 |
| క్రైస్తవులు | 63,16,549 |
| సిక్కులు | 56,91,447 |
| జైనులు | 14,49,286 |
| పార్శీలు | 1.14,890 |
| బౌద్ధులు | 2,32,003 |
| యూదులు | 22,480 |
| కొండజాతులు | 2,54,41,489 |
| ఇతరులు | 4,09,877 |

వీరిలో రాష్ట్రాలలో, హిందువులు 10,08,10,953 మంది; ముస్లిములు, 7,93,98,503 మంది; సంస్థానాలలోవున్న హిందువులు, 6,41,14,553; ముస్లిములు, 1,49,90,925.

భరతఖండపు మొత్తపు జనాభాలో ప్రతినూటికి 66 మంది హిందువులు, 24 మంది ముస్లిములు, ఆరుగురు కొండజాతులవారు; మిగతావారు తక్కిన అన్ని మతాలకు చెందినవారు.

## రాష్ట్రాలవారిగా స్త్రీ పురుషుల జనాభా (1941)

| రాష్ట్రం | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| అజ్మీరు-మార్వారు | 3,07,172 | 2,76,521 |
| అస్సాం | 53,82,795 | 48,21,938 |
| ఒరిస్సా | 42,18,121 | 45.10,423 |
| కూర్గు | 92,347 | 76,379 |
| ఢిల్లీ | 5,35,236 | 3,82,703 |
| బీహారు | 1,82.24,428 | 1,81,15,723 |
| బొంబాయి | 1,08,17,333 | 100,32,507 |
| మదరాసు | 2,45,57,143 | 2,47,84,667 |
| యు. పి. | 2,88,60,214 | 2,61,60,403 |
| సి. పి. | 84,30,282 | 83,83,322 |
| హైదరాబాదు | 83,46,775 | 79,91,759 |
| మైసూరు | 37,63,318 | 35,65,822 |
| తిరువాంకూరు | 30,45,102 | 30,24,916 |
| కొచ్చిన్ | 6,96,889 | 7,25,986 |
| బరోడా | 14,72,909 | 13,82,101 |
| కాశ్మీరు | 21,29,872 | 18,91,744 |

## సగటు ఆదాయం

1947 ఇండియాలోని ప్రజలసగటు ఆదాయం తలకు, ఏడాదికి రు. 213 అని అంచనా.

ఇదే లెఖలలో, ఇతరదేశాల ప్రజలసగటు ఆదాయపు అంచనాలు ఇవి :

| | |
|---|---|
| అమెరికా | రు. 4,643 |
| కెనడా | రు. 2,826 |
| డెన్మార్క్ | రు. 2,647 |
| ఇంగ్లండు | రు. 2,356 |
| ఆస్ట్రేలియా | రు. 2,160 |
| సిలోన్ | రు. 300 |
| ఫిలిప్పైన్స్ | రు. 228 |
| పాకిస్తాన్ | రు. 225 |

## సగటు ఆయుర్దాయం

భరతఖండపు ప్రజల ఆయుర్దాయం సగటున చూస్తే పురుషుల ఆయుర్దాయం 23·02 సంవత్సరాలు, స్త్రీల ఆయుర్దాయం 22·8 సంవత్సరాలు వుంటుంది.

సాధారణంగా, ఆయుర్దాయం విషయంలో పురుషులు 27 సంవత్సరాలు, స్త్రీలు 26 సంవత్సరాలే పరిమితి పెట్టుకోవలసిన పరిస్థితి మనది. అంతకుమించి జీవించినవారు, సగటు ఆయుర్దాయాన్ని మించినవారే.

## పసిపిల్లల మరణాలు

ఇతర దేశాలతోపోల్చి చూస్తే, భరతఖండంలో పసిపిల్లల మరణాలు చాలా ఎక్కువ. బిడ్డలపోషణ విషయమై తల్లిదండ్రుల అజ్ఞానము, పుష్టిలేని ఆహారము, దారిద్ర్యము మొదలైన అనేక కారణాలవల్ల పిల్లల మరణం ఈఖండంలో ఎక్కువ. అయినప్పటికీ గత 25 సంవత్సరాలలోనూ, యీమరణాలు క్రమేపీ తగ్గుతూవచ్చాయి.

భరతఖండంలోని ముఖ్యనగరాలలో, 1936 లోనూ 1941 లోనూ ప్రతి వెయ్యిమంది బిడ్డలకూ, ఎంతెంతమంది చనిపోయినదీ, యీ క్రింది పట్టీవలన తెలుసుకోవచ్చును.

| నగరం | 1936 | 1941 |
|---|---|---|
| బొంబాయి | 250 | 211 |
| కలకత్తా | 241 | — |
| మదరాసు | 218 | 208 |
| నాగపూర్ | 283 | 218 |
| ఢిల్లీ | 170 | 185 |
| కరాచి | 167 | 127 |
| హైదరాబాదు | 198 | 220 |

## విదేశాలలో భారతీయులు

విదేశాలలోవున్న భారతీయుల సంఖ్యనుగురించి, 1947 మార్చిలో, కేంద్రశాసనసభలో పండిట్ నెహ్రూ యీ క్రింది ప్రకటనచేశారు.

యూరప్ :

జర్మనీ 44, ఇటలీ 23, ఫ్రాన్సు 10.

ఉత్తర అమెరికా :

యునైటెడ్ స్టేట్సు 5,000. పెనామా 1,000.

దక్షిణ అమెరికా :

బ్రెజిల్ 2,000, బ్రిటిష్‌గయానా 1,57,185, డచ్‌గయానా 54.

ఆఫ్రికా :

బెల్జియన్ కాంగో 1,000; పోర్చుగీసు తూర్పుఆఫ్రికా 4,000; ఈజిప్టు, సుడాన్ 1,025; అబిస్సీనియా 2,000.

ఆసియా :

ఫ్రెంచి ఇండోచైనా 2,000, డచ్చి ఈస్టిండీస్ 24,000; ఫిలిప్పైన్సు 800, సయాం 30,000; జపాన్ 50, పెర్షియా 500, ఇరాక్ 4,500, టర్కీ 37, పాలస్టయిన్ 60, కాష్గరు 400, బర్మా, 10,17,825.

బ్రిటిషు సామ్రాజ్యం :

ఆస్ట్రేలియా 4,544, కెనడా 1,500, న్యూజిలెండ్ 1,200, దక్షిణాఫ్రికా 2,66,016, దక్షిణరొడీషియా 2,547, సిలోన్ 7,50,000 బ్రిటిషుమలయా 7,48,829, హాంగ్ కాంగ్ 4,745, మారిషస్ 2,69,546, సెచిల్లిస్ 503, జిబ్రాల్టరు 80, నైగీరియా 32, కెన్యా 47,000 ఉగాండా 26,972, న్యాసాలాండ్ 1,851, జాంజిబారు 14,000, టాంగనైకా 35,59, జమైకా 26,507, ట్రినిడాడ్ 1,70 396, ఫిజి 1,05,581, ఉత్తర రొడీషియా 427, మాల్డీవ్స్ 550, బ్రిటిష్ ఉత్తర బోర్నియో 1,288, ఏడెన్ 5,594, మాల్టా 44, గ్రెనడా 5,000 సెంట్ లూషియా 2,189, బ్రిటిష్ హాండురాస్ 477, సీరాలోన్ 444, బ్రిటన్ 7,128.

## కాందిశీకులు

1947 ఆగస్టు 15 న దేశవిభజన జరిగినతరువాత, పంజాబ్, సరిహద్దు, సింధురాష్ట్రాలలో దారుణమైన మతకలహాలు, హత్యలు, దోపిడీళ్ళు జరిగాయి. అందుచేత ఆ ప్రాంతాలలోని హిందువులు ఇండియాకు తరలివచ్చేశారు. ఈ ప్రాంతాలనుంచి, 1948 జనవరి 3 తేదినాటికి 45,50,000 మంది హిందువులు ఇండియాకు వచ్చేసినట్లు లెక్కలు తేలాయి. వీరిలో దాదాపు 20 లక్షలమందికి తూర్పు పంజాబ్ రాష్ట్రంలోను, దాదాపు మూడులక్షమందికి సంస్థానాలలోను వసతులు ఏర్పాటు చేయబడినవి. మిగతావారు ఢిల్లీనగరంలోను, కాందిశీకులకు ఏర్పాటు చేయబడిన మకాములలోను వున్నారు. వీరందరినీ వివిధరాష్ట్రాలకు పంపి, అక్కడ వసతులకు ఏర్పాటుచెయ్యడానికి ఇండియా ప్రభుత్వం వారు నిశ్చయించారు.

తూర్పు బెంగాల్ నంచి పశ్చిమ బెంగాల్ కు 1948 డిసెంబరు నాటికి దాదాపు 20 లక్షలమంది హిందువులు వచ్చేశారు.

తూర్పుపంజాబునుంచిన్నీ, ఇండియాలోని ఇతర రాష్ట్రాలనుంచిన్నీ పాకిస్తాన్ కు వెళ్ళిపోయిన ముస్లిములసంఖ్య దాదాపు 45 లక్షలు వుంటుందని అంచనా.

# విద్య

భరతఖండపు ప్రజలలో, విద్యాజ్ఞానం గలవారు పార్సీలలోనూ, యూదులలోనూ అత్యధిక సంఖ్యాకులు వున్నారు. మిగతా జాతుల వారు, విద్యాజ్ఞానంలో చాలా వెనకపడివున్నారు.

| మతము | ప్రతి వెయ్యిమందిలోనూ అక్షరజ్ఞానం కలవారు | ప్రతి 10,000 మందిలోను ఇంగ్లీషు చదవగలవారు. |
|---|---|---|
| హిందువులు | 84 | 113 |
| సిక్కులు | 91 | 151 |
| జైనులు | 353 | 306 |
| పార్శీలు | 791 | 5,041 |
| ముస్లిములు | 64 | 92 |
| క్రైస్తవులు | 279 | 919 |
| యూదులు | 416 | 2,636 |

## 1943 లో భరతఖండంలోవున్న విద్యాసంస్థలు

(స్త్రీలవీ పురుషులవీ, కలిపి)

| విద్యాసంస్థలు | | విద్యార్థులు |
|---|---|---|
| విశ్వకళా పరిషత్తులు | 17 | 11,334 |
| ఆర్ట్సు కాలేజీలు | 354 | 112,716 |
| వృత్తి విద్య కాలేజీలు | 101 | 28,585 |
| హైస్కూళ్లు | 4,164 | 13,39,846 |
| మిడల్ స్కూళ్ళు | 11,227 | 13,92,931 |
| ప్రైమరీ స్కూళ్లు | 176,034 | 1,15,94,358 |
| స్పెషల్ స్కూళ్ళు | 11,780 | 4,33,165 |
| రికగ్నిషన్‌పొందని స్కూళ్ళు | 15,682 | 4,64,693 |
| మొత్తం విద్యా సంస్థలు | 2,19,357 | 1,53,73,727 |

## విశ్వకళాపరిషత్తులు

1949 జనవరి నాటికి ఇండియాలో 21 విశ్వకళాపరిషత్తులు వున్నాయి. వాటిపేర్లు, వైస్‌ఛాన్సెలర్ల పేర్లు యీ క్రింద యివ్వబడినవి:

| పేరు | ఉన్ననగరం | వైస్-ఛాన్సెలర్ |
|---|---|---|
| అన్నామలై | చిదంబరం | డా. ఎస్. జి. మనవాళరామానుజం |
| అలహాబాద్ | అలహాబాద్ | డాక్టర్ డి. ఆర్. భట్టాచార్య |
| అలీఘర్ | అలీఘర్ | డాక్టర్ జకిర్‌హుసేన్ |
| ఆగ్రా | ఆగ్రా | డాకర్ ఎన్. పి. ఆస్థానా |
| ఆంధ్ర | వాల్తేర్ | డాక్టర్ సి. ఆర్. రెడ్డి |
| ఉత్కళ | కటక్ | చింతామణి ఆచార్య |
| ఉస్మానియా | హైదరాబాద్ | నవాబ్ అలియవర్‌జంగ్ |
| కలకత్తా | కలకత్తా | డాక్టర్ పి. ఎన్. బెనర్జి |
| ఢిల్లి | ఢిల్లి | సర్ మారిస్‌గ్వయర్ |
| తిరువాన్కూర్ | త్రివేంద్రం | హెచ్. సి. పాప్‌వర్త్ |
| తూర్పుపంజాబ్ | అంబాలా | జస్టిస్ తేజసింగ్ |
| నాగపూర్ | నాగపూర్ | పండిత కుంజిలాల్ దుబే |
| పాట్నా | పాట్నా | సర్ సి. పి. ఎన్. సింగ్ |
| పూనా | పూనా | డాక్టర్ ఎం. ఆర్ జయకర్ |
| బొంబాయి | బొంబాయి | డాక్టర్ పి. వి. కానె |
| మదరాస్ | మదరాస్ | సర్ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్ |
| మైసూర్ | మైసూర్ | ఆర్. కస్తూరిరాజచెట్టి |
| రాజపుటానా | జయపూర్ | డాక్టర్ జి. ఎస్. మహాజని |
| లక్నో | లక్నో | ఆచార్య నరేంద్రదేవ |
| సాగర్ | సాగర్ | సర్ హరిసింగ్‌గౌర్ |
| హిందు | కాశీ | పండిత గోవిందమాలవీయ |

వీటిలో మొట్టమొదట స్థాపింపబడినవి, మదరాసు, కలకత్తా, బొంబాయి పరిషత్తులు—1857.

# ఆహార ధాన్యాల పంట

ప్రస్తుతం ఇండియాలో 33 కోట్లపైగా జనాభా వుంది. మనిషికి రోజుకు 18 అవున్సుల లెఖన, ఏడాదికి 4,80,00,000 టన్నుల ఆహార ధాన్యాలు మనకు కావాలి.

మామూలుగా, ఇండియాలో పండే ధాన్యాలలో నూటికి 10 వంతులు, మాత్రమే అమ్మకానికి బజారుకివచ్చేది. మిగతాది. రైతులూ, భూస్వాములూ తమ స్వంతవాడకానికి వుంచుకొనేది.

కాని, యుద్ధకాలంలో దిగుమతులుతగ్గి, ఈ ఖండంలోని పంట, ప్రజలకూ, సైన్యాలకూ చాలక ఇబ్బందిపడుతూవున్న సందర్భంలో, కొందరు స్వలాభపరులు, సరకును తమదగ్గర దాచిపెట్టుకొని, ఎక్కువ ధరకు అమ్మడం, ధర యివ్వలేనివారికి అమ్మకపోవడం జరిగింది. అందువల్ల, రైతుదగ్గర పంటను ప్రభుత్వంవారేకొని, రేషను పద్ధతిలో అందరికీ అందుబాటులోకి తీసుకొనివచ్చే పద్ధతి 1943 లో ప్రారంభమైంది. ఈ పనికి, ఏరాష్ట్రంలో ఆరాష్ట్రంలోని ప్రభుత్వమే పూనుకున్నది.

ప్రభుత్వం ఇలా కొన్న ధాన్యం 1944-45 లో 34,27,000 టన్నులు. 1945-46 లో 38,65,000 టన్నులు; 1946-47 లో 40,13,000 టన్నులు.

## వ్యవసాయ భూమి

ఇండియాలో వ్యవసాయములో వున్న భూమి, అడవి, వ్యవసాయానికి రాని భూమి, యెంతవున్నదీ ప్రక్క పేజిలోని పట్టీనిబట్టి తెలుసుకోవచ్చును. (భూమి కొలత యకరాలలో యివ్వబడినది)

| భూమి వివరం | 1945—46 |
|---|---|
| సర్వేవల్ల తేలిన లెఖ | 40,36,48,000 |
| గ్రామ దస్తావేజులవల్ల తేలిన లెఖ | 40,30,44,000 |
| అడవి | 6,24,91,000 |
| వ్యవసాయానికి రానిది | 6,24,13,000 |

| | |
|---|---|
| వ్యవసాయం చెయ్యకుండా వున్నది | 6,85,56,000 |
| వాగుల మధ్య చిక్కుపడి వ్యవసాయంలేకుండా వున్నది | 3,79,37,000 |
| పంటవేసిన భూమి | 17,08,08,000 |
| పంటవేసినదానిలో, నీటి పారుదలవున్న భూమి | 3,9?,28,000 |

## భూమి వివరము

1945-46 లో వేసిన లెఖలప్రకారం, ఇండియాలోని రాష్ట్రాల లోని భూమి వివరం ఇది.

| రాష్ట్రం | సర్వేప్రకారం (వేల ఎకరాలలో) | గ్రామ దస్తావేజులప్రకారం (వేల ఎకరాలలో) |
|---|---|---|
| అజ్మీర్ మర్వార | 15,61 | 1,561 |
| అస్సాం | 3,34,62 | 3,34,62 |
| ఒరిస్సా | 2,06,55 | 2,06,55 |
| కూర్గ్ | 10,12 | 10,12 |
| ఢిల్లి | 3,68 | 3,68 |
| తూర్పు పంజాబ్ | 2,38,55 | 2,30,82 |
| పశ్చిమ బెంగాల్ | 1,88,97 | 1,88,97 |
| బీహార్ | 4,43,27 | 4,43,27 |
| బొంబాయి | 4,86,61 | 4,86,61 |
| మదరాసు | 7,99,14 | 7,99,30 |
| యు. పి. | 6,78 49 | 6,79,96 |
| సి. పి. బీరార్ | 6.30,87 | 6,30,93 |

## పంటవేసినభూమి, పంటలు:

1947-48 లో ఇండియాలో ఏఏపంటక్రింద ఎంత భూమివున్నదీ, ఏపంట ఎంతపండినదీ వివరాలు ప్రక్కపేజీలో ఇవ్వబడినవి.

| ధాన్యం | భూమి (వేల ఎకరాలలో) | పంట (వేలటన్నులలో) |
|---|---|---|
| బియ్యం | 5,96,56 | 1,87,65 |
| గోధుమ | 2,02,07 | 53,46 |
| జొన్న | 3,56,65 | 57,30 |
| సజ్జ | 1,96,27 | 25,25 |
| రాగులు | 51,08 | 13,91 |
| వేరుశనగ | 99,74 | 34,54 |
| తేయాకు | 7,30 | 2,25 |
| చెరకు | 37,84 | బెల్లం 52,69 |
| జనపనార | 6,46 | 16,58 (బేళ్లు) |
| ప్రత్తి | 1,09,32 | 21,16 (బేళ్లు) |

## బియ్యం మిల్లులు

1942 నాటి లెఖలప్రకారం, విభజనానంతరం ఇండియాలో వున్న బియ్యంమిల్లుల సంఖ్య ఇది.

| రాష్ట్రం | మిల్లులు |
|---|---|
| మదరాసు | 444 |
| పశ్చిమబెంగాల్ | 325 |
| బీహార్ | 76 |
| సి. పి. బీరార్ | 53 |
| ఒరిస్సా | 52 |
| తిరువాన్కూర్, కొచ్చిన్ | 23 |
| హైదరాబాద్ | 22 |
| అస్సాం | 22 |
| మైసూర్ | 12 |
| యు. పి. | 10 |
| బొంబాయి | 7 |
| తూర్పుపంజాబ్ | 2 |
| మొత్తం ఇండియాలో | 1048 |

ఇవన్నీ, ఫాక్టరీ చట్టంక్రింద రిజిష్టరు చేయబడినవి. ఇవికాక చాలా చిన్నమిల్లులువున్నాయి. అన్నీకలిసి దాదాపు 10,000 మిల్లు వుంటాయని అంచనా. వీటిలో దాదాపు 1,000 మదరాసు రాష్ట్రం లోనే వున్నాయి.

1946-47 లో 3,94,23,000 టన్నుల ఆహారధాన్యాలూ, 1947-48 లో 4,04,19,000 టన్నుల ఆహారధాన్యాలూ పండినట్టు అంచనా. 1946 లో 20 లక్షల టన్నులూ, 1947 లో 23 లక్షల టన్నులూ, 1948 లో 29 లక్షల టన్నులూ, ఆహారపదార్థాలను ఇండియా దిగుమతి చేసుకున్నది. 1949 లో అధమం 30 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవలసివుంటుందని, దానికి సుమారు నూరుకోట్లరూపాయలు వ్యయం అవుతుందని అంచనా.

ప్రపంచంలోని అన్నిదేశాలలోనూ 1948 లో ఉత్పత్తి అయిన ధాన్యం, యుద్ధకాలానికి పూర్వం ప్రతి ఏడాది అయే ఉత్పత్తికి సమానంగా వుందని అంచనా. తమకు కావలసినదానికంటె ఎక్కువ పండే దేశాలనుంచి, తక్కువ పండే దేశాలవారు 1949 లో ఎంత బియ్యాన్ని దిగుమతి చేసుకోవచ్చుననే విషయంలో అంతర్జాతీయం ఆహారసంస్థవారు, ఇండియాకు 1949 మొదటి ఆరుమాసాలకూ 4,50,100 టన్నుల బియ్యానికి అనుమతి ఇచ్చారు.

1947-48 లో ఇండియాకు దిగుమతి చేసిన ధాన్యం వివరాలు:

| ధాన్యం | వేల టన్నులలో |
|---|---|
| బియ్యం | 593 |
| గోధుమ | 740 |
| గోధుమపిండి | 219 |
| జొన్నలు | 22 |
| మొక్కజొన్న | 414 |
| బార్లీ | 196 |

# పంట కాలువలు

భరతఖండంలోని పొలాలకు నీటిని అందిచ్చే కాలువల మొత్తం పొడవు 75,380 మైళ్లు వుంటుంది. ఇంత ఎక్కువగా పంట కాలువలు, ప్రపంచములోని మరే దేశంలోను లేవు. అయినప్పటికీ, ఇంకా ఎక్కువ పంటకాలువలను త్రవ్వించి, ఎంతో ఎక్కువ భూమికి నీటిని అందచెయ్యవలసిన అవసరం, ఈ ఖండంలో ఎక్కువగా వుంది. అలా చేసినట్లయితే, ఇంకా ఎంతో ఎక్కువపంట పండుతుంది. ప్రస్తుతం బీడుగా వున్న భూమిలో చాలాభాగం, నీటిపారుదల వుంటే, వ్యవసాయానికి అక్కరకు వస్తుంది.

ప్రస్తుతం వున్న కాలువలలో ఒకరోజుకు సుమారు 26,000 కోట్ల గాలనుల నీరు ప్రవహిస్తుందని అంచనా.

పంటకాలువలు ఎక్కువగా వున్న రాష్ట్రాలలో మొదటిస్థానం పంజాబ్‌ది. తరువాత లెక్కకువచ్చేవి, సింధు, మదరాసు, సరిహద్దు రాష్ట్రం, యునైటెడ్ ప్రావిన్సెస్, బీహార్, ఒరిస్సారాష్ట్రాలు. పంట కాలువలు త్రవ్వించడంలో క్రమేపీ అభివృద్ధి కనపడుతూవున్నది.

1920-21 లో, పంటకాలువల నీటివల్ల సాగుచేయబడిన భూమి 47,783 వేల ఎకరాలు, 1939-40 లో 54,945 ఎకరాలు.

ఇంకా ప్రస్తుతం వృధాగా సముద్రంలోకి పోతున్న నదుల నీటికి ఆనకట్టలుకట్టి, బ్రహ్మాండమైన చెరువులుకట్టి, వాటిలో యీ నీటిని నిలవచేసి, ఎక్కువగా పొలాలకు నీటిని అందించడానికి ప్రభుత్వంవారు కొన్ని స్కీములను తయారుచేశారు, వీటిలో మదరాసు రాష్ట్రానికి సంబంధించిన స్కీముల వివరాలు, మదరాసు రాష్ట్రాన్నిగురించిన వివరాలు యిచ్చిన భాగంలో, యీ గ్రంథంలో చూసి తెలుసుకోవచ్చును.

# వ్యాపారము - పరిశ్రమలు

భరతఖండపు వ్యాపారం ఎక్కువగా ముడిసరకులను విదేశాలకు ఎగుమతిచెయ్యడం, యంత్రాలలో తయారైన వస్తువులను విదేశాలనుంచి దిగుమతి చేసుకోవడంతో నిండివుంది. యుద్ధకాలంలో దిగుమతులుచాలా తగ్గిపోయినందున, కొన్ని పరిశ్రమలు భరతఖండంలో చాలా అభివృద్ధికి వచ్చాయి.

వ్యాపారం విషయంలో యీ క్రింది విషయాలు ముఖ్యంగా గమనించవలసినవి: ప్రత్తి, టీ, తోళ్ళు ఈ ఖండంనుంచి ఎగుమతి అయే సరకుల మొత్తంలో సగానికిపైగా వుంటాయి. ఎగుమతి సరకులలో ప్రధానమైనది ప్రత్తి. దిగుమతి అయే సరకుల మొత్తంలో ముప్పాతిక వంతులు, యంత్రాలలో తయారైన వస్తువులే. వీటిలో సుమారు సగభాగం ఇంగ్లండునుంచి దిగుమతి అవుతాయి.

భరతఖండపు పరిశ్రమలలో ప్రధానమైనవాటిని గురించిన వివరాలు యీ క్రింద తెలుపబడివి.

## ప్రత్తి

1948 లో ప్రపంచంలోని వివిధదేశాలలో పండించిన ప్రత్తి మొత్తం, 2 కోట్ల 95 లక్షల బేళ్ళు వుంటుందని, యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వ వ్యవసాయశాఖవారి అంచనా. 1947 లో ప్రపంచంలో పండిన ప్రత్తిపంట 2 కోట్ల 51 లక్షల బేళ్ళు అని అంచనా.

1948 మార్చినెలతో అంతమయే సంవత్సరంలో ఇండియాలోని బట్టలమిల్లులు 37,349 లక్షల గజాల గుడ్డను ఉత్పత్తిచేశాయి. 1947 మార్చితో అంతమయే సంవత్సరంలో ఉత్పత్తి: 3,86,40 లక్షల గజాలు.

ఇండియాలో 1946-47 లో 1,16,000 ఎకరాలలోను, 1947-48 లో 1,09,32,000 ఎకరాలలోను ప్రత్తి సాగుచెయ్యబడింది. 1946 జనవరి 1 నాటి లెఖలప్రకారం, ఇండియన్ యూనియన్‌లో వున్న బట్టల మిల్లులసంఖ్య: నూలు, బట్టలు తయారుచేసేవి: 265; నూలు తయారుచేసేవి: 90.

1947-48 లో ఇండియాలో సుమారు 1,09,32,000 ఎకరాల భూమిలో ప్రత్తిపంట వెయ్యబడింది. ఈ భూమిలో సుమారు 22 లక్షల బేళ్ళ ప్రత్తిపండిందని అంచనా. దీనిలో దాదాపు 11 లక్షల బేళ్ళు విదేశాలకు ఎగుమతి చేయబడిందని అంచనా.

ఇండియాలో వున్న బట్టలమిల్లులు పనిచెయ్యడానికి కావలసినంత ప్రత్తి, ఇండియాలో పండదు. అంచేత పాకిస్తాన్, ఈజిప్టులనుంచి ఇండియా ప్రత్తిని దిగుమతి చేసుకుంటుంది. ఈజిప్టుకు, పొడుగు పింజ ప్రత్తిని ఎగుమతిచేసి, ఈజిప్టునుంచి పొట్టి పింజప్రత్తి దిగుమతిచేసుకుంటుంది.

## జ న ప నా ర

ఈ పైరుకూడా, ప్రధానంగా గంగా—బ్రహ్మపుత్ర నదీ డెల్టాల లోనే వేయబడుతున్నది. జనపనార ఎక్కువగా పండే తూర్పు, పశ్చిమ బెంగాలు, బీహారు, అస్సాంరాష్ట్రాలలో, భరతఖండ మంతటిలోనూ పైరయే జనపనారలో నూటికి 80 వంతులు ఒక్క తూర్పు బెంగాలు లోనే పైరవుతున్నది. ప్రపంచంలోని అన్నిదేశాలూ జనపనారకు భరత ఖండంమీదనే ఆధారపడివున్నాయి.

భరతఖండంలో 113 జనపనార మిల్లులు వున్నాయి. మనదేశంలో మొట్టమొదటి జనపనార మిల్లు 1855 లో బెంగాల్ లో రిష్రావద్ద స్థాపింపబడింది. వీటిలో ఒకటి ఒక స్వదేశ సంస్థానంలోను, 112 ఇండియాలోను వున్నాయి. విభజననాటికి పాకిస్తానులో ఒక జనపనార మిల్లుకూడా లేదు.

1945-46 లో భరతఖండంలో మొత్తం 18,80,010 ఎకరాలలో జనపనార పంట వేయబడింది. 79,90,000 బేళ్లు (బేలు 400 పౌనులు) పైరయింది. విభజనానంతరం యీపరిస్థితి మారిపోయింది.

1947-48 లో ఇండియాలో 6,45,685 ఎకరాలలో జనపనార వెయ్యబడింది. 16,95,970 బేళ్లు పడింది, 1948-49 లో 7,65,605 ఎకరాలలో జనపనార వెయ్యగా, 20,26,575 బేళ్లు పండుతుందని అంచనా.

## పంచదార

పంచదార శరీరానికి సత్తువనిచ్చే ఆహారపదార్థాలలో ముఖ్యమైన వాట్లలో ఒకటి. అంచేత ఇది ప్రతివారికీ కావలసిందే. కాని యుద్ధ కాలంలో దీనితయారు చాల తగ్గిపోయింది. యుద్ధానికి పూర్వం, ప్రపంచంలోని అన్నిదేశాలలోనూ ఏడాదికి మూడుకోట్ల టన్నుల పంచదార తయారయేది. 1946-47 లో 2,60,00,000 టన్నుల పంచదార మాత్రమే తయారయింది.

ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ తయారయే పంచదారలో నూడింట రెండువంతులు చెరకునుంచి తయారుచేసేది. ఒకవంతు 'బీట్' నుంచి తయారుచేసేది. ప్రపంచమంతటా చెరకుపంటవేసే భూమిలో నూటికి 35 వంతులు భరతఖండంలోనే. అయితే భరతఖండంలో చెరకు పండించేభూమి అసలు పంటలన్నీవేసేభూమిలో నూటికి రెండువంతులే.

ఇండియాలో 155 పంచదార ఫ్యాక్టరీలు వున్నాయి.
1945-46లో 92,29,000 టన్నులు, 1946-47 లో 90,11.000 టన్నులు, 1947-48 లో 1,07,48,000 టన్నులు పంచదార తయారయింది.

1946-47 లో 35,28,000 ఎకరాలలో చెరకుపంట వెయ్యబడింది. 49,13,000 టన్నుల బెల్లం పండింది. 1947-48 లో 37,84,000 ఎకరాలలో చెరకువేసినట్టూ, 52,69,007 టన్నుల బెల్లం పండినట్టూ అంచనా.

ఇండియాలో ఏడాది 160 లక్షల టన్నుల పంచదార ఉత్పత్తి అయేటట్టు చూడాలని ప్రభుత్వ ఆశయం. దీనికిగాను, ఇంకా 45 పంచదార ఫ్యాక్టరీలను స్థాపించడానికి నిశ్చయింపబడింది.

## ప్రపంచంలో అన్ని దేశాలలోను పంచదార ఉత్పత్తి

(పెద్దటన్నులలో: ఒక పెద్దటన్ను, 2240 పౌనులు)

| సంవత్సరం | ఉత్పత్తి |
|---|---|
| 1940—41 | 3,04,98,000 |
| 1944—45 | 1,94,43,000 |
| 1946—47 | 3,20,00,000 |
| 1947—48 | 3,32,95,000 |

ప్రపంచంలోని వివిధదేశాలలోని ప్రజలు, సగటున ఒకొక్కరు ఏడాదికి ఎన్ని పౌనులు పంచదారను తినేదీ, యీ పట్టికవలన తెలుసుకో వచ్చును.

| | | |
|---|---|---|
| ఇంగ్లండు | ... | 106 |
| ఆస్ట్రేలియా | ... | 116 |
| అమెరికా | ... | 97 |
| ఫ్రాన్సు | ... | 52 |
| హాలెండు | ... | 64 |
| జావా | ... | 11 |
| భరతఖండం | ... | 6 |

భరతఖండంలో సగటున 6 పౌనులు పంచదారకాక, సగటున ప్రతిమనిషి ఏడాదికి 24 పౌనుల బెల్లంకూడా తింటున్నట్టు లెక్కల వల్ల తేలింది.

## సిమెంటు

సిమెంటును తయారుచెయ్యడానికి భరతఖండంలో మొట్టమొదట 1904 లో మదరాసులో ఒక చిన్న ఫ్యాక్టరీ స్థాపింపబడింది. తరువాత క్రమంగా దేశంలో చాలా ఫ్యాక్టరీలు ఏర్పడి, ఉత్పత్తి చాలా ఎక్కువ అయి, ధరలు తగ్గిపోవడం జరిగింది. అప్పుడు సిమెంటు కంపెనీల యజమానులంతా, ఒక సంఘంగా ఏర్పడి, అందరూ నిర్ణీతపు వంతులలో

సిమెంటును ఉత్పత్తిచేసి, ధరలు నిలబడేటట్టు చూడడానికి ప్రయత్నాలు చేశారు. సిమెంటు ఉపయోగాలను ప్రజలకు బోధించి, సిమెంటు అమ్మకం బాగా జరిగేటట్టు చూడడానికి సిమెంటు మార్కెటింగ్ కంపెనీ ఏర్పడింది. ప్రస్తుతం భరతఖండంలో 20 సిమెంటు ఫ్యాక్టరీలు వున్నాయి.

విభజనానంతరం, ఇండియాలో 18, పాకిస్తాన్‌లో మూడు, సిమెంటు ఫ్యాక్టరీలు వున్నాయి.

యుద్ధకాలంలో, ఇండియాలో సిమెంటు ఉత్పత్తి ఏడాదికి సుమారు 16 లక్షల టన్నులు వుండేది. 1947 లో 14,41,335 టన్నులు మాత్రమే ఉత్పత్తి అయింది. 1948 లో సిమెంటు ఉత్పత్తి 14,61,600 టన్నులు వుంటుందని అంచనా.

## టీ

ఇండియా పంటలలో వ్యాపారపు ప్రాధాన్యంగల సరకులలో టీ ఒకటి. ఇది ఎక్కువగా అస్సాంరాష్ట్రంలోను, బెంగాలు, మదరాసు రాష్ట్రాలలో కొంతవరకును, పంజాబ్, యు. పి., బీహారు, కూర్గు రాష్ట్రాలలో స్వల్పంగాను పైరవుతున్నది.

పంట: 1947 లో 54,56,00,000 పౌనులు

1948 లో 53,20,00,000 పౌనుయి.

ఇండియాలో, టీ తోటలువేసిన భూమి వైశాల్యం దాదాపు 6,50,000 ఎకరాలు.

ఇండియాలో పండే టీ లో విశేషభాగం విదేశాలకు ఎగుమతి అవుతున్నది. ఈ ఎగుమతిలలో ఎక్కువభాగం ఇంగ్లండుకే. 1947-48 లో 26 కోట్ల పౌనుల టీ ఇంగ్లండుకి ఎగుమతి అయింది. 1948-49 లో 29 కోట్ల పౌనుల టీని ఎగుమతి చెయ్యడానికి నిర్ణయింపబడింది.

## కాగితము

కాగితం చెయ్యడం వెయ్యి సంవత్సరాలకు ముందు మొట్టమొదట కనిపెట్టినవారు, చైనాదేశీయులు. కాని, ఈపరిశ్రమ చాలాకాలంవరకూ ప్రపంచంలోని ఇతరదేశాలలో ఏర్పడలేదు. యంత్రస్థాపన జరిగి విదేశాలలో కాగితపు ఉత్పత్తి బాగా జరుగుతూనేవున్నా, కాగితాల మిల్లులు ఇండియాలో 1867 సంవత్సరం వరకూ ఏర్పడలేదు. 1867 లో హుగ్లీ నదీతీరాన, బెంగాల్‌లో సిరాంపూర్‌లో మొట్టమొదటి కాగితాల మిల్లు స్థాపించబడింది. ప్రస్తుతం ఇండియాలో 15 మిల్లులు వున్నాయి. ఈ మిల్లులన్నీ కూడా తెల్లకాగితం, మామూలు వాడుకకు కావలసిన పీచుకాగితం మాత్రమే తయారుచేస్తున్నాయి. వార్తాపత్రికలు అచ్చువేసే కాగితం ఇండియాలో తయారుకావడంలేదు. ఈ కాగితాన్ని మనం ప్రస్తుతం కెనడా, నార్వే, స్వీడను దేశాలనుంచి తెప్పించుకుంటున్నాము.

### ఇండియాలో కాగితపు ఉత్పత్తి

| | | |
|---|---|---|
| యుద్ధానికి పూర్వ ఏడాదికి | 54,000 | టన్నులు |
| 1944 | 1,03,783 | ,, |
| 1946-47 | 1,06,000 | ,, |
| 1947-48 | 93,277 | ,, |

1951-52 నాటికి ఏడాదికి 2,64,000 టన్నులు, 1956-57 నాటికి ఏడాదికి 4,71,000 టన్నులూ, కాగితం ఇండియాలో ఉత్పత్తి అయేటట్టు చూడాలని ప్రభుత్వఆశయం.

## లక్క

లక్క, ఒకజాతి పురుగు విడిచే మలం. దీనిని శుద్ధిచేసి, కొన్ని వస్తువులను తయారుచెయ్యడానికి ఉపయోగిస్తారు. శుద్ధిచేసిన లక్కను షెల్లాక్ అంటారు. భరతఖండంలో లక్క బీహారురాష్ట్రంలోని, ఛోటా

నాగపూర్ డివిజన్‌లో విశేషంగా ఉత్పత్తి అవుతున్నది. గ్రామఫోను రికార్డులు, రంగులు, వార్నిషులు, ఎలక్ట్రిక్ సామానులు తయారుచెయ్యడానికి లక్క విశేషంగా ఉపయోగింపబడుతుంది. భారతదేశంలో తయారయే లక్కలో విశేషభాగం యునైటెట్ స్టేట్సుకు ఎగుమతి చేయబడతుంది. 1940-41 లో 44,888 టన్నుల లక్క ఉత్పత్తి అయింది. దీనిలో 29,724 టన్నులు ఎగుమతి చేయబడింది.

## వేరుశెనగ

ప్రపంచంలో వేరుశెనగ అత్యధికంగా పండే దేశాలలో ఇండియా ఒకటి. దీనిలో చాలాభాగం ఎగుమతి అవుతుంది. 1946-47 లో 1,02,97,000 ఎకరాలలోను, 1947-48 లో 99,74,000 ఎకరాలలోను వేరుశెనగ పంట వెయ్యబడింది. 1946-47 లో 35,88,000 టన్నులూ, 1947-48 లో 34,54,000 టన్నులూ పండింది.

## కాఫీ

కాఫీ మొట్టమొదట భరతఖండానికి మెక్కానుంచి 16 వ శతాబ్దంలో తీసుకురాబడిందని వదంతి. మొట్టమొదటి కాఫీతోట 1840 లో వెయ్యబడిందట. కాని, ఈ నూరు సంవత్సరాలలోనూ కాఫీవాడుక, ముఖ్యంగా దక్షిణదేశంలో, విస్తారంగా ప్రబలింది. కాఫీ పంటకూడా ఒరిస్సా రాష్ట్రంలో కొద్దిగాతప్ప, ముఖ్యంగా దక్షిణదేశంలోనే అవుతున్నది. ఇండియాలో పండే కాఫీలో నూటికి 40 వంతులు మైసూరు సంస్థానంలోనే పండుతున్నది. 1939-40 లో ఇండియాలో 1,82,938 ఎకరాలు కాఫీ పంటలోవుంటే, 1945-46 లో 2,14,824 ఎకరాలలో యీపంట వెయ్యబడింది.

కాఫీ ఎగుమతుల వివరాలివి :

| సంవత్సరం | ఎగుమతి (టన్నులు) | విలువ |
|---|---|---|
| 1943-44 | 3000 | రు. 69 లక్షలు |
| 1944-45 | 1292 | రు. 25 లక్షలు |
| 1945-46 | 1937 | రు. 26 లక్షలు |

## పొగాకు

పొగాకు ఉత్పత్తిలో, ప్రపంచంలోని అన్నిదేశాలలోను, యునైటెడ్ స్టేట్సు తరువాత అగ్రస్థానం భరతఖండానిదే. పొగాకు పెంపకము భరతఖండంలో ప్రధానంగా అయిదుప్రాంతాలలో జరుగుతున్నది. ఉత్తరబెంగాల్, గుంటూరు — కృష్ణా, ఉత్తరబీహార్, గుజరాత్, బెల్గాం — సతారా ప్రాంతాలు.

భరతఖండంనుంచి ఎగుమతి అయే పొగాకులో ఎక్కువభాగం ఇంగ్లండు, జపాను, చైనాదేశాలకు వెళ్ళేది.

## తోళ్లు

ప్రపంచంలోని అన్నిదేశాలకన్న ఎక్కువగా తోళ్ళు ఎగుమతి చేసేది, ఇండియా.

ఇండియాలో, ఏడాదికి సుమారు మూడుకోట్ల 92½ లక్షల తోళ్లు (మేకలవీ గొర్రెలవీ) దొరుకుతున్నాయనీ, వీటిలో దాదాపు రెండు కోట్ల 33 లక్షల తోళ్లు, ఇండియాలోని ఫ్యాక్టరీలలో వూనబడుతున్నవనీ, సుమారు 160 లక్షల తోళ్ళు వూనకుండానే విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నవనీ అంచనా.

తోళ్లను వూనడానికి పెద్ద ఫ్యాక్టరీలు కాన్పూర్, ఆగ్రా, కలకత్తా, మదరాసునగరాలలో వున్నాయి.

## రబ్బరు

రబ్బరు ఉత్పత్తి పూర్తిగా దక్షిణదేశంలోనే జరుగుతున్నది. దీనిలో కూడా ముఖ్యాతికవంతులు, తిరువాంకూరు సంస్థానంలో జరుగుతున్నది. సగటున ఏడాదికి సుమారు 1,25,000 ఎకరాల భూమిలో సగటున ఏడాదికి మూడుకోట్ల పౌనుల రబ్బరు ఉత్పత్తి అవుతున్నది.

## నౌకానిర్మాణం

రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం, ఇండియాలో నౌకానిర్మాణ పరిశ్రమ లేనేలేదు. యుద్ధకాలంలో, ఇండియాలో నౌకానిర్మాణ పరిశ్రమ ప్రారంభించబడింది. అయిదేళ్ళలోపల, ఇండియాలో మొత్తం రెండులక్షల టన్నుల బరువు మొయ్యగల నావలు నిర్మింపబడినవి. కాని, అది భారతీయ పరిశ్రమగా పరిగణించడానికి వీలులేదు.

యుద్ధానంతరం, విశాఖపట్టణంలోని నౌకానిర్మాణాశ్రయంలో భారతీయ యాజమాన్యన నౌకానిర్మాణం ప్రారంభమైంది.

## పశుసంపద

ప్రపంచం అంతటాకలిపి మొత్తం 6,59,952 వేల గోపశువులు, 76,421 వేల మహిషపశువులు వున్నాయని అంచనా. వీటిలో అత్యధిక సంఖ్య ఇండియాలో వున్నాయి. సరియైన లెఖల ప్రకారం, భరతఖండంలో వున్నన్ని పశువులు, మరేదేశంలోనూ లేవు. అయినప్పటికీ, మనకు తగినంత పాలుగాని, తినేవారికి తగినంత మాంసంగాని లభించడం లేదు. దానికి కారణం పశుపోషణ సరిగా లేకపోవడం.

భరతఖండంలోని ఉత్తమజాతి ఆవులు, సింధు, పంజాబ్, కథియవాడ్, మదరాసు (ఒంగోలు) రాష్ట్రాలలో వున్నాయి.

ముసలి పశువులూ, ఆహారం సరిగాలేక చిక్కి శల్యాలయిన పశువులూ ఎక్కువగా మనకు కనపడుతూ వుంటాయి. సరియైన ఆహారాన్ని వాటికపెట్టి, కొత్తజాతి పశువులతో కలపడంవల్ల మిశ్రమజాతి పశువులు పుట్టేటట్లుచేసి పశుసంపదను సరిగా వుపయోగించుకుంటే, ప్రజలు ఎంతో ఆరోగ్యంగా వుండడానికి ఇండియాలో ఎంతో అవకాశం వున్నది.

1945 లో తీసిన లెఖల ప్రకారం, ఇండియాలో పశుసంపద వివరాలివి.

| | | |
|---|---|---|
| గోపశువులు (ఆవులు, ఎద్దులు, పెయ్యలు) | | 13,63,73,000 |
| మహిషపశువులు (గేదెలు, దున్నలు, దూడలు) | | 40,61,80,000 |
| గొర్రెలు | — | 3,77,34,000 |
| మేకలు | — | 4,44,69,000 |

## పాడి

పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, వీటిని తియ్యడం అమ్మడం, భరతఖండంలో యిప్పుడు గృహపరిశ్రమగానే వుంది. పశువులు వున్న గ్రామీణ గృహస్థులు, పాడిని చాలావరకు అమ్ముకోనరు. కొంతమంది మాత్రమే అమ్ముతున్నారు. సరియైన పద్ధతిలో పాడిని వ్యాపారంలోకి తెచ్చినట్లయితే, గ్రామస్థులకు మంచి ఆదాయం రావడానికి అవకాశం వుంది. దీనికి, గ్రామాలనుంచి పట్టణాలకు మంచిరోడ్లు, బస్సు, లారీల సదుపాయం వుండాలి. భరతఖండంలో ప్రజలు, మామూలుగా మనిషికి అవసరమైనతంగా పాలు, పెరుగు, వెన్నలను తినడంలేదు. దానికి కారణం, పట్టణాలలో వీటి ఖరీదు ఎక్కువగా వుండటము; పల్లెలలో దిగువతరగతివారికి వీటి ఉపయోగం తెలియకపోవడం. పశుపోషణ, రక్షణ సరియైనపద్ధతిలో జరిగిననాడు, ఎక్కువపాడి లభ్యమై ప్రజలందరూ వీటిని తినడానికి వీలుకలుగుతుంది.

## అటవీ సంపద

సంస్థానాలు మినహా భరతఖండంలోని మొత్తంభూమిలో పదవవంతుకంటె కొంచెంపైగా అడవి. ఈ అడవిలో, పంచాయితీశాఖవారి పాలనలోవున్న కొద్దిభాగం తప్ప, మిగతా అడవిఅంతా ప్రభుత్వంవారి అటవీశాఖవారి పాలనలోవున్నది. 1941 లెఖల ప్రకారం, అటవీశాఖవారి పాలనలోవున్న అడవి వైశాల్యం 98,258 చ. మైళ్ళు. అదే సంవత్సరంలో యీ అటవీశాఖ కొరకు 2,37,63,614 రూపాయలు వ్యయం అయింది. అడవులవల్ల ప్రభుత్వానికి 3,71,05,052 రూపాయలు ఆదాయం వచ్చింది.

## కోఆపరేటివ్ సొసైటీలు

### 1942-43 లో ఇండియాలోవున్న సొసైటీల సంఖ్య

| రాష్ట్రం | వ్యవసాయదారులవి | ఇతరమైనవి | మొత్తం |
|---|---|---|---|
| మదరాసు | 11,837 | 2,937 | 15,063 |
| బొంబాయి | 4,356 | 1,109 | 5,603 |
| బెంగాల్ | 33,198 | 2,930 | 41,258 |
| బీహారు | 8,612 | 203 | 8,863 |
| ఒరిస్సా | 2,576 | 260 | 2,851 |
| యు. పి. | 14,803 | 969 | 15,840 |
| సి. పి. బీరార్ | 4,869 | 375 | 5,286 |
| అస్సాం | 1,186 | 229 | 1,435 |
| కూర్గ్ | 253 | 48 | 320 |
| అజ్మీర్ - మార్వార | 587 | 172 | 766 |
| సికందరాబాద | × | 17 | 18 |
| ఢిల్లీ | 269 | 135 | 405 |
| ఇండియాలో మొత్తం | 110,261 | 15,528 | 126,680 |
| మైసూరు | 1,524 | 561 | 2,089 |
| హైదరాబాద్ | 4,516 | 721 | 5,284 |
| తిరువాన్కూరు | 1,086 | 359 | 1,473 |
| కొచ్చిన్ | 108 | 200 | 309 |
| సంస్థానాలలో మొత్తం | 14,044 | 3,291 | 19,480 |
| దేశంలో మొత్తం | 126,305 | 18.819 | 146,160 |

# ఖనిజ సంపద

ఖనిజసంపదలో భరతఖండం ప్రపంచంలోని ఏ యితర దేశానికీ తీసిపోదు. అయితే, యీ సంపద భూగర్భంలో ఎక్కడెక్కడ వున్నదో పరిశోధన చెయ్యడంలోనూ, దానిని వెలువరించి ఉపయోగంలోకి తీసుకొని రావడంలోనూ ఆధునిక పద్ధతులలో ఇటీవలివరకు తగినంత కృషి జరగలేదు, ఇప్పుడిప్పుడే యీ విషయములో కొంత కృషి జరుగుతోంది. ఖనిజసంపదను బాగా పైకితీసి, ఉపయోగంలోకి తేవడానికి ప్రభుత్వం వారు ఒక ప్రణాళికను తయారుచేశారు.

ఒక్క పెట్రోలుమాత్రం భరతఖండంలో తగినంత దొరకడంలేదు. సింధురాష్ట్రంలో పెట్రోలు దొరుకుతుందేమో పరిశోధన చెయ్యడానికి, ఆ రాష్ట్ర ప్రభుత్వపు ఆహ్వానంమీద అమెరికన్ నిపుణులు కొంతమంది పనిచేస్తున్నారు.

భరతఖండంలో దొరికే ఖనిజాలలో ముఖ్యమైనవాటిని గురించిన వివరాలు యీ క్రింద యివ్వబడినవి.

## ఇనుము

ఇండియాలో దొరికినంత ఇనుము మరేదేశంలోను దొరకడం లేదనే చెప్పవచ్చును. భూమిలోనుంచి త్రవ్వితీసిన లోహాన్ని పనిముట్ల రూపంలోనూ, ఉక్కుగానూ తయారుచెయ్యడంలో, భరతఖండంలో పెద్ద పరిశ్రమ ఏర్పడింది.

ఇనుము యెక్కువగా బీహారు రాష్ట్రంలోనూ, ఒరిస్సా సంస్థానాలలోను దొరుకుతున్నది.

దేశ విభజనానంతరం, ఇండియాలో ఏడాదికి దాదాపు 14,21,700 టన్నుల ఇనుము లభిస్తుందనీ, పాకిస్తాన్‌లో ఏమీ దొరకదనీ అంచనా. 1947 లో ఇనుము త్రవ్వడానికి గనులలో పనిచేసిన వారిసంఖ్య, 6,665.

ఇండియాలో 1947 లో 8,68,580 టన్నులు, 1948 లో 8,25,000 టన్నులు ఉక్కు తయారయిందని అంచనా. 1947 లో 30,000 టన్నులు, 1948 లో 2,50,000 టన్నులు ఉక్కు విదేశాల నుంచి ఇండియాకు దిగుమతి చేయబడింది.

## బంగారం

ఇండియాలో దొరికే ఖనిజములలో, మూడవ ప్రధానస్థానం బంగారానిది. ఎక్కువ విలువగల యీ ఖనిజం, దేశంలో దొరికే మొత్తంలో నూటికి 95 పాళ్లు మైసూరు సంస్థానంలోని కోలార్ గనులలో దొరుకుతున్నది. ప్రపంచం మొత్తంలో దొరికే బంగారంలో, భరతఖండంలో దొరికేది నూటికి ఒకవంతు మాత్రమే.

1945 లో ఇండియాలో దొరికిన బంగారం మొత్తం 168,336 ఔన్సులు.

## రాక్షసిబొగ్గు

భూమిలోనుంచి త్రవ్వితీసే బొగ్గును, రాక్షసిబొగ్గు అనీ, నేలబొగ్గు అనీ అంటారు. ఈ బొగ్గును భరతఖండంలో ముఖ్యంగా, రైళ్ళను నడప డానికీ, ఫాక్టరీలను పనిచేయించడానికి ఉపయోగిస్తున్నారు.

బొగ్గును నేలలోనుంచి త్రవ్వించడం, దానిని కావలసిన వారికి సప్లయి చేయడం, ఈదేశంలో పెద్దపరిశ్రమలలో ఒకటిగా ఏర్పడింది.

ప్రస్తుతం భరతఖండంలో 910 గనులనుంచి బొగ్గు తీయబడు తున్నది. వీటిలో చాలావరకు బెంగాలు, బీహారు, సెంట్రల్ ప్రావిన్సెసు రాష్ట్రాలలో వున్నాయి. ఈ పరిశ్రమలలో సుమారు 2,50,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు.

బొగ్గును అత్యధికంగా ఉత్పత్తిచేసే దేశాలవరుసలో భరతఖండం యెనిమిదో స్థానాన్ని పొందుతుంది. ఈదేశపు ఖనిజసంపదలో ప్రధాన స్థానం బొగ్గుది.

దేశంలో ఉత్పత్తిఅయే బొగ్గులో నూటికి 72 పాళ్లు ఝరియా, రాణిగంజ్ బొగ్గుగనులలో దొరుకుతున్నది. వీటిలో మంచిరకపు బొగ్గు ఝరియా గనులలో దొరుకుతున్నది.

1945 లో భరతఖండంలోని గనులనుంచి త్రవ్వితీసిన బొగ్గు 2,89,72,548 టన్నులు. దేశవిభజనానంతరం, ఇండియాలో ఏడాదికి 2,50,79,800 టన్నుల బొగ్గు లభిస్తుందనీ, పాకిస్తాన్‌లో 1,98,500 టన్నుల బొగ్గు లభిస్తుందనీ అంచనా.

1947 లో ఇండియాలోని బొగ్గుగనులలో పనిచేసిన వారిసంఖ్య, 3,21,537.

1947 ఆగస్టునుంచి 1948 సెప్టెంబరు అంతానికి ఇండియాలో 3,06,71,000 టన్నుల బొగ్గు త్రవ్వబడింది.

## మెంగనీస్

ఇది ఉక్కును తయారుచెయ్యడానికీ, రసాయనద్రవ్యాలను, బ్యాటరీలను తయారు చెయ్యడానికి ఉపయోగించే ఖనిజం.

రష్యా తరువాత, భరతఖండంలో దొరకినంతగా ఈ ఖనిజం ప్రస్తుతం మరేదేశంలోను దొరకడంలేదు. 1939 నుంచి 1943 వరకు సగటున ఏడాదికి 8,00,000 టన్నుల మెంగనీస్ భరతఖండంలో త్రవ్వితీశారు. ప్రతిఏటా దొరకిన మెంగనీసు విలువ, పదిలక్షల రూపాయలు వుంటుంది. దీనిలో చాలభాగం యెగుమతిచేయబడింది.

దీనిని సెంట్రల్ ప్రావిన్స్, బొంబాయి, బీహారు, మదరాసు, సాందూరు (సంస్థానం) మైసూరులలో ప్రస్తుతం యెక్కువగా త్రవ్వితీస్తున్నారు. మొట్టమొదట యీ ఖనిజాన్ని ఈ దేశంలో విశాఖపట్టణం జిల్లాలో 1892 లో త్రవ్వడం ప్రారంభించారు. అయితే గత అయిదు సంవత్సరాలలోనూ ఈ దేశంలో త్రవ్విన మెంగనీసులో నూటికి 76 పాళ్లు సి. పి. రాష్ట్రంలోనే దొరకింది.

1945 లో భరతఖండంలో మొత్తం 2,10,280 టన్నుల మెంగనీస్ త్రవ్వబడింది. 1943 లో 5,95,347 టన్నులు త్రవ్వబడింది. దీనినిబట్టి, యీ ఖనిజపు ఉత్పత్తి క్రమంగా తగ్గుతున్నట్టు స్పష్టమవుతోంది.

1944 లో మదరాసు రాష్ట్రంలో ఉత్పత్తి

| జిల్లా : | ఉత్పత్తి : టన్నులు | పనివారు : | వారిలో స్త్రీలు : |
|---|---|---|---|
| బళ్లారి | 73 | 23 | 15 |
| విశాఖపట్టణం | 3,203 | 451 | 148 |

దేశవిభజనానంతరం ఇండియాలో ఏడాదికి సుమారు 7,66,350 టన్నుల మెంగనీసు లభిస్తుందనీ, పాకిస్తానులో ఏమీ లేదనీ అంచనా.

1947 లో, యీ పరిశ్రమలో పనిచేసినవారి సంఖ్య : 15,092.

## అభ్రకము

భరతఖండంలో విస్తారంగా దొరికే ఖనిజములలో అభ్రకము ఒకటి. ప్రపంచం మొత్తంలో దొరికే అభ్రకములో, ముప్పాతిక ఈ దేశంలో త్రవ్వితీసేదే. దీనిలో నూటికి 80 వంతులు బీహారులోనూ, 20 వంతులు మదరాసు రాష్ట్రంలోని నెల్లూరు జిల్లాలోను దొరుకుతున్నది. ఈ ఖనిజం, విద్యుచ్ఛక్తి పరిశ్రమకు చాలా ముఖ్యమైనది.

జిల్లాలవారీగా ఉత్పత్తి : (హండ్రెడు వెయిట్లలో)

| జిల్లా : | ఉత్పత్తి | కుంపులు | పనివారు |
|---|---|---|---|
| నెల్లూరు | 22,150 | 10,481 | 9,545 |
| కోయంబత్తూరు | 27 | 21 | 130 |
| నీలగిరి | 75 | 8 | 86 |
| సేలం | 350 | 240 | 114 |

నెల్లూరు జిల్లాలో పనిచేసిన 9,545 మందిలో 3,225 మంది స్త్రీలు. దేశవిభజనానంతరం, ఇండియాలో ఏడాదికి 108,850 హండ్రెడు వెయిట్ల అభ్రకం లభిస్తుందని, పాకిస్తాన్‌లో ఏమీ లేదనీ లెక్కలు తేలాయి.

1947 లో ఇండియాలో యీ పరిశ్రమలో పనిచేసినవారి సంఖ్య: 31,656.

## బాక్సైటు

అల్యూమినియం తయారుచెయ్యడానికి కావలసిన ప్రధానలోహం బాక్సైట్. బాక్సైట్‌ను అల్యూమినియంగా తయారుచేసే యంత్రసామగ్రి భరతఖండంలో లేనందున, దానిని విదేశాలకుపంపి, అల్యూమినియంగా తయారుచేసిన తరువాత ఈ దేశానికి తెప్పించుకొని, దానిని పాత్రలుగా తయారుచెయ్యడం జరుగుతోంది. బాక్సైట్ ఈ దేశంలో చాలా ఎక్కువగా దొరుకుతున్నది. ఇదిదొరకే ప్రదేశాలలో ముఖ్యమైనవి: బొంబాయి, సి. పి, బీహారు రాష్ట్రాలు.

1945 లో 13,893 టన్నుల బాక్సైట్ మనదేశంలో దొరికింది.

## రాగి

భరతఖండంలో దొరికే రాగి ప్రపంచపు ఉత్పత్తిలో చాలా తక్కువ అని చెప్పవచ్చును.

1945 లో భరతఖండంలో 3,29,325 టన్నుల రాగి త్రవ్వబడింది. దీనిలో ఎక్కువభాగము, బీహారులోని సింగభూమిలో దొరికింది. మదరాసు రాష్ట్రంలో, నెల్లూరు జిల్లాలో అతిస్వల్పంగా దొరుకుతున్నది. దేశవిభజనానంతరం, పాకిస్తాన్‌లో రాగి దొరికే గనులు ఏమీ లేవని తేలింది.

1947 లో యీ పరిశ్రమలో పనిచేసినవారి సంఖ్య: 3,961.

## వెండి

1944 లో భరతఖండంలో దొరికిన వెండి, 16,268 ఔన్సులు. దీని విలువ 47,902 రూపాయలు.

## ఉప్పు

మానవశరీరానికి చాలా ముఖ్యమైన లవణము ఉప్పు. ఇది మూడు విధాలుగా దొరుకుతున్నది. సముద్రతీరములలో సముద్రపు నీరుకు కట్టలుకట్టి యెండబెట్టడం వల్లను, దేశ మధ్యభాగంలోవున్న ఉప్పు నీటి సరస్సుల నీటిని యెండబెట్టడం వల్లనూ, కొండలను త్రవ్వి తియ్యడం వల్లను. మామూలుగా ఉప్పువలె ఉపయోగించడానికే కాక, కొండ ఉప్పుకు ఔషధ ప్రయోజనాలుకూడా వున్నవి.

మదరాసురాష్ట్రంలో, ఉప్పు తయారుచేసే కొఠారులు మొత్తం 50 ఉన్నాయి. ఈ 50 కొఠారులలోను మొత్తం 65 ఉప్పు ఫ్యాక్టరీలు వున్నాయి. ఉప్పును తయారు చేసేటందుకు, సముద్రపునీరు పట్టేస్థలం మొత్తం 13,000 ఎకరాలు వుంటుంది. మదరాసురాష్ట్రంలో దాదాపు 130 లక్షల మణుగుల ఉప్పు తయారవుతోంది. దీనిలో నూటికి 15 వంతులు ఇతరరాష్ట్రాలకు పంపబడుతోంది. అయితే, రాష్ట్రంలో తయారయే ఉప్పు, రాష్ట్రంలోని వాడుకకు చాలనందున, ఏడాదికి దాదాపు 16 లక్షల మణుగుల ఉప్పును బొంబాయిరాష్ట్రంనుంచి మదరాసుకు దిగుమతి చేయవలసివస్తున్నది.

ఇండియాలో, ఏడాదికి 5 కోట్ల మణుగుల ఉప్పు కావలసి వుంటుంది. కాని, ఇండియాలో ప్రస్తుతం తయారయేది 440 లక్షల మణుగుల ఉప్పు మాత్రమే. తక్కిన ఉప్పును మనం ఏడెన్, ఏడెన్ మొదలైన ప్రదేశాలనుంచి దిగుమతిచేసుకుంటున్నాము. 1948 లో 75 లక్షల ఉప్పును విదేశాలనుంచి దిగుమతి చేసుకున్నాము.

## కి ర స నా యి లు

కిరసనాయిలు కోసం మనం యెక్కువగా విదేశాలమీద ఆధారపడాలి. యుద్ధానికి పూర్వం, మనదేశంలో ఏడాదికి 7,00,000 టన్నుల కిరసనాయిలు వాడుక జరిగేది. యుద్ధకాలంలో మనదేశానికి దిగుమతులు చాలా తగ్గిపోయాయి, అందుచేత రేషనింగు చెయ్యవలసి వచ్చింది.

| సంవత్సరం | (దిగుమతి టన్నులు) |
|---|---|
| 1942-43 | 3,41,561 |
| 1943-44 | 2,81,941 |
| 1944-45 | 4,28,237 |
| 1945-46 | 5,78,465 |

దిగుమతి కాక, మనదేశంలో యుద్ధానికి పూర్వం ఏడాదికి 1,10,000 టన్నుల కిరసనాయిలు ఉత్పత్తి అయేది. 1946-47 లో 53,545 టన్నులు దొరికింది, 1947-48 లో 46,716 టన్నులు మాత్రమే ఉత్పత్తి అవుతుందని అంచనా వేయబడింది.

## పెట్రోలు

భరతఖండంలోదొరికే ప్రధానఖనిజములలో అయిదవస్థానాన్ని పొందేది పెట్రోలు. ఇది ఎక్కువగా అస్సాంరాష్ట్రంలోని దిగ్బాయ్ వద్దనూ పంజాబులోని ఖోర్, ఖాలియన్‌లవద్దను దొరకుతోంది. మన దేశంలో దొరికే పెట్రోలు, ప్రపంచపు మొత్తపు ఉత్పత్తిలో నూటికి 1.1 వంతు మాత్రమే. ఇది ఈదేశపు వాడకమునకు కావలసినదానిలో నూటికి 15 వంతులు మాత్రమే అవుతుంది.

1938 లో భరతఖండంలో దొరకిన పెట్రోలు 8,70,82,771 గాలనులు. దేశవిభజనానంతరం తేలిన లెఖలనుబట్టి ఇండియాలో ఏడాదికి 6,59,69,000 గాలనుల పెట్రోలు లభిస్తుందనీ, పాకిస్థాన్‌లో 2,11,13,400 గాలనుల పెట్రోలు లభిస్తుందనీ అంచనా.

యుద్ధానికి పూర్వం, మనదేశంలో ఏడాదికి 59,600 టన్నుల పెట్రోలు వాడుక అయేది. 1945-46 లో 67,732 టన్నులు మాత్రమే వాడుకకు లభించింది. 1946-47 లో 65,000 టన్నులు మాత్రమే.

ఇండియాకు ఏడాదికి 26 కోట్ల గాలనుల పెట్రోలు కావాలి. కాని, ప్రస్తుతం 15 కోట్ల గాలనులుమాత్రమే దిగుమతి అవుతున్నది.

# వార్తాపత్రికలు

భరతఖండంలో మొట్టమొదటి వార్తాపత్రిక, కలకత్తాలో ఇంగ్లీషులో 1780 సంవత్సరములో స్థాపించబడినది. అప్పటినుంచీ, యీ 169 సంవత్సరాలలోనూ, దేశంలో వార్తాపత్రికలు చాలా ఎక్కువగానే వెలువడ్డాయి. అన్ని రాష్ట్రాలలోనూ, అన్ని భాషలలోను దినపత్రికలు వున్నాయి. అంతేగాక, ప్రతి భాషారాష్ట్రానికి చెందిన పెట్టుబడిదారులూ, ఇంగ్లీషులోకూడా దినపత్రికలను చాలా ఎక్కువగా స్థాపించారు. మదరాసు రాష్ట్రంలోని కొన్ని ప్రధాన పత్రికలు ఇవి :

| ఇంగ్లీషు దినపత్రికలు : | సంపాదకులు |
| --- | --- |
| మెయిల్ | ఎ. ఎ. హేల్స్ |
| హిందు | కె. శ్రీనివాసన్ |
| ఇండియన్ ఎక్స్‌ప్రెస్ | రామనాథ గోయెంకా |
| ఇండియన్ రిపబ్లిక్ | సి. వి. హెచ్. రావు |
| **తెలుగు దినపత్రికలు :** | |
| ఆంధ్ర ప్రభ | నార్ల వెంకటేశ్వరరావు |
| ఆంధ్ర పత్రిక | శివలెంక శంభుప్రసాద్ |
| **తెలుగు వారపత్రికలు :** | |
| ఆనందవాణి | ఉప్పలూరి కాళిదాసు |
| ప్రజామిత్ర (బెజవాడ) | జి. రామకృష్ణశాస్త్రి |
| కృష్ణాపత్రిక (బందరు) | కాటూరి వెంకటేశ్వరరావు |
| జమీన్ రైతు (నెల్లూరు) | ఎన్. వెంకటరామానాయుడు |
| చేనేత (నిడుబ్రోలు) | దామర్ల రమాకాంతరావు |

## తూనిక కొలతలు

మనదేశంలో, వివిధసాంప్రదాయాలుగల భాషా ప్రాంతాలు ఎక్కువగా వున్నందుననూ, మొదటినుంచీ దేశమంతటికీ ఒక కేంద్ర ప్రభుత్వం లేనందువల్లనూ, ఒకొక్క ప్రాంతం, ఒకొక్క పద్ధతిలో తూనిక కొలతలను వాడుకలోకి తెచ్చుకున్నారు.

బ్రిటిషు ప్రభుత్వంవచ్చి, దేశానికి కేంద్ర ప్రభుత్వమంటూ ఒకటి ఏర్పడినతరువాత, దేశమంతటా వాడుకలోవుండే పద్ధతిలో, తూనిక రాళ్ళను, కొలమానికలను నిర్ణయించవలసిందని చాలా వర్గాలవారు

కోరారు. ఒకేపద్ధతిలో తూనికలు, కొలతలు దేశమంతటా వాడుకలో లేనందువల్ల వ్యాపారస్తులకు చాలా యిబ్బందికలగడమే కాక, కొన్ని సందర్భాలలో పేచీలుకూడా వస్తూవుండేవి.

సరియైన తూనికలను, కొలతలను వాడుకలోకి తెచ్చే బాధ్యత ప్రభుత్వానిది. ఈ విషయంలో ఒక్క బొంబాయి ప్రభుత్వంవారుమాత్రం 1932 లో శాసనరూపంలో, రాష్ట్రమంతటా వాడుకలో వుండవలసిన తూనికలను, కొలమానికలను నిర్ణయించారు. మిగతా రాష్ట్రాల ప్రభుత్వాలు యీ విషయంలో శ్రద్ధచూపలేదు. కేంద్ర ప్రభుత్వంకూడా ఈ విషయంలో జోక్యం కలిగించుకొనలేదు.

అంచేత, దేశమంతటా వాడుకలోవున్న తూనికలు, కొలమానికలు యింకా ఏర్పడలేదు.

రైల్వేతూకం దేశమంతటా ఒకేపద్ధతిలో అమలులో వున్నప్పటికీ, ఏ ప్రాంతంలోవున్నవారు అనాదిగా ఆ ప్రాంతంలో వాడుకలోవున్న తూనికలనే యిప్పటికీ పాటిస్తున్నారు. దేశం అంతటాకూడా, కొలతకూ, తూకానికికూడా, శేరును అందరూ వాడుకచేస్తూ వున్నప్పటికీ, ఆ శేరు బరువుగాని, కొలతగాని ఒకొక్క ప్రాంతానికి ఒకొక్క విధంగావుంది.

ఖరారుగా దేశమంతటా వాడుకలోకి తేవడానికి వీలుకలిగి, ప్రస్తుతం బొంబాయి రాష్ట్రంలో అమలులోవున్న తూకపు కొలతలు ఇవి :

| | |
|---|---|
| తులం | 180 గ్రైనులు |
| శేరు | 80 తులములు |
| మణుగు | 40 శేర్లు |

దేశమంతటా రైల్వేవారు వాడుకచేసే తూనిక :

| | |
|---|---|
| తులం | 180 గ్రైనులు |
| శేరు | 80 తులములు |
| మణుగు | 40 శేర్లు |

పొడవు, వెడల్పుల కొలతలలో, ఆంధ్రదేశంలో బెత్త, జాన, మూర అనేవి పల్లెటూళ్ళలో వాడుకలో కనపడుతూ వున్నప్పటికీ, ప్రధానంగా వీటిని ఎవరూ పాటించడంలేదు. ఈ విషయంలో దేశమంతటా వాడుకలోవున్న కొలతలు ఇవి.

| | |
|---|---|
| అంగుళం | సుమారు రెండువ్రేళ్ల వెడల్పు |
| అడుగు | 12 అంగుళములు |
| గజం | 3 అడుగులు |
| ఫర్లాంగు | 220 గజములు |
| మైలు | 8 ఫర్లాంగులు |

తెలుగు జిల్లాలలో సాధారణంగా అర్థగజాన్ని మూర అంటారు. రెండు బెత్తలు ఒకజాన; రెండు జానలు ఒకమూర. రెండుమైళ్ళ దూరాన్ని ఒక క్రోశెడు దూరం అనికూడా వాడుకచేస్తారు.

చదరపు కొలతలుకూడా ప్రస్తుతం దేశమంతటా అడుగులు, గజాలలోనే వాడుకలో వున్నాయి.

| | |
|---|---|
| 144 చదరపు అంగుళములు | ఒక చదరపు అడుగు |
| 9 చదరపు అడుగులు | ఒక చదరపు గజం |

అంటే ఒక గజము పొడవు, ఒక గజము వెడల్పుగల స్థలము ఒక చదరపు గజము అవుతుంది.

ఈ పద్ధతిలోనే, ఒక గజము పొడవు, ఒకగజము వెడల్పు ఒక గజము ఎత్తుగల వస్తువుగాని, స్థలముగాని, ఘనపు గజము అని కొలత చెయ్యబడుతుంది.

| | |
|---|---|
| ఘనపు గజము | 27 ఘనపు అడుగులు |
| ఘనపు అడుగు | 1728 ఘనపు అంగుళములు |
| ఘనపు అంగుళము | ఒక అంగుళముపొడవు, ఒక అంగుళము వెడల్పు, ఒక అంగుళముఎత్తు |

ఎకరపు కొలత: దేశమంతటా, భూమికొలతను చదరంలో చెప్పేటప్పుడు ఎకరపు లెఖలోనే చెప్తారు.

4,840 చదరపు గజములు ఒక ఎకరం
640 ఎకరములు చదరపు మైలు.
ఎకరంకన్న తక్కువవున్న భాలాన్ని సెంట్లలెక్కలో చెప్తారు.
100 సెంట్లు ఒక ఎకరం.
ప్రస్తుతం మన రాష్ట్రమంతటా, చాలావరకు వాడుకలో వున్న తూనికలు.

24 తులములు ఒక శేరు
48 శేర్లు ఒక మణుగు.

తెలుగు జిల్లాలలో ఎక్కువగా వాడుకలోవున్న తూనికలు:

3 తులములు ఒక పలం
8 పలములు శేరు
5 శేర్లు వీశె
8 వీశెలు మణుగు
20 మణుగులు పుట్టి

ధాన్యపు కొలతల విషయంలో, మన రాష్ట్రంలో వివిధ మానికలు వున్నాయి.

| | | |
|---|---|---|
| గుంటూరు మానిక | దాదాపు | 42 ఔన్సులు |
| కృష్ణాజిల్లా మానిక | దాదాపు | 51 ఔన్సులు |
| నెల్లూరు మానిక | దాదాపు | 72 ఔన్సులు |
| విశాఖపట్నం మానిక | దాదాపు | 32 ఔన్సులు |

# కార్మికులబలం

పారిశ్రామికంగా ప్రపంచంలో ప్రధాన స్థానాన్ని పొందిన ఎనిమిదిదేశాలలో, ఇండియాను ఒకటిగా పరిగణించి, ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గానిజేషన్ (అంతర్జాతీయ కార్మికసంస్థవారు) ఆ సంస్థ పరిపాలనను నిర్వహించే కమిటీలో భరతఖండానికి ఒక శాశ్వతస్థానాన్ని యిచ్చారు. ఈ సంస్థతరపున ఢిల్లీలో ఒక ఆఫీసు (ఇండియా బ్రాంచి) వుంది. దాని డైరెక్టర్ డాక్టర్ పి. పి. పిళ్లె; డిప్యూటీ డైరక్టర్ కె. ఇ. మెత్యూ.

భరతఖండంలోని వివిధ ఫాక్టరీలలో పనిచేసే కార్మికుల సంఖ్య యిటీవల క్రమేపీ పెరుగుతూవచ్చింది. 1939 నాటి సంఖ్యతో 1946 నాటి సంఖ్యను పోల్చిచూస్తే ఫ్యాక్టరీ కార్మికుల సంఖ్య ఎంత పెరిగిందీ తెలుస్తుంది. ఈ క్రింది అంకెలు, విభజనకుపూర్వం ఇండియాకు చెందినవి. ఫాక్టరీ వివరము రోజుకు ఎంతమంది పనిచేసేదీ సగటు లెఖ.

| | 1939 | 1946 |
|---|---|---|
| గవర్నమెంటు, స్థానిక సంస్థల అధీనంలోవున్నవి | | |
| (1) ఎప్పుడూ పనిచేసేవి | 1,31,066 | 17,57,000 |
| (2) కొన్ని రుతువులలో పనిచేసేవి. | 13,80 | 2,52,000 |
| ఎప్పుడూ పనిచేసే ఇతర ఫాక్టరీలు | | |
| బట్టల మిల్లులు | 8,38,985 | 9,82,000 |
| ఇంజనీరింగ్ | 1,43,257 | 2,15,000 |
| లోహములు, ఖనిజములు | 51,746 | 84,000 |
| సారాయి, పొగాకు | 87,005 | 1,51,000 |
| రంగులు, రసాయనిక ద్రవ్యములు | 55,118 | 96,000 |
| కాగితము, అచ్చు | 42,053 | 55,000 |
| కలప, రాయి, అద్దములు | 46,264 | 91,000 |
| గిన్నింగ్ మిల్లులు | 26,504 | 17,000 |
| తోళ్లు | 11,710 | 30,000 |
| ఇతర ఫాక్టరీలు | 18,324 | 36,000 |

## గనులలో పనిచేసే కార్మికులు

భరతఖండంలోని గనులలో పనిచేసే కార్మికులసంఖ్య 1938 నుంచి 1943 నాటికి ఎంతవరకు పెరిగినదీ యీ క్రింది పట్టీవలన తెలుసుకొనవచ్చును.

| రాష్ట్రం | 1938 | 1943 |
|---|---|---|
| అస్సాం | 2,361 | 2,539 |
| బెలూచిస్తాన్ | 829 | 2,518 |
| బెంగాల్ | 60,661 | 60,507 |
| బీహార్ | 1,67,248 | 2,06,922 |
| సి. పి. | 46,661 | 43,792 |
| బొంబాయి | 4,226 | 2,304 |
| రాజపుటానా | 668 | 3,870 |
| యు. పి. | 1,275 | 1,436 |
| ఒరిస్సా | 365 | 1,097 |
| పంజాబ్ | 5,851 | 5,311 |
| సింధు | 157 | 648 |
| మదరాస్ | 12,746 | 17,603 |
| ఢిల్లీ | 193 | 755 |
| సరిహద్దు రాష్ట్రం | — | 24 |

## ట్రేడ్ యూనియన్లు

భరతఖండంలో కార్మికుల సంఘాలు ఎలా అభివృద్ధిపొందినదీ యీ క్రింది పట్టీవలన తెలుసుకోవచ్చును.

| సంవత్సరం | రిజిస్టరు చేయబడిన ట్రేడ్ యూనియన్ల సంఖ్య | లెఖలు చూపించిన ట్రేడ్ యూనియన్ల | | |
|---|---|---|---|---|
| | | సంఖ్య | సభ్యులసంఖ్య | ఆదాయం రూపాయలు |
| 1928-29 | 75 | 65 | 1,81,077 | 3,17,000 |
| 1938-39 | 562 | 394 | 3,99,159 | 8,90,000 |
| 1941-42 | 774 | 455 | 5,73,620 | 17,67,000 |
| 1942-43 | 693 | 489 | 6,85,299 | 15,97,000 |

## పరిశ్రమలవారీగా

1942-43 లో తమ యూనియనుకు లెఖలను చూపెట్టిన ట్రేడ్ యూనియనులు, ఏ పరిశ్రమకు ఎన్నెన్ని వున్నదీ, వాటి సభ్యత్వము, యీ క్రింది పట్టీవలన తెలుస్తుంది.

| పరిశ్రమ | సంఖ్య | సభ్యులసంఖ్య |
|---|---|---|
| రైల్వేలు | 80 | 2,54,510 |
| ట్రాంవేలు | 6 | 7,400 |
| బట్టల మిల్లులు | 98 | 1,61,133 |
| అచ్చు ఆఫీసులు | 27 | 6,973 |
| మ్యునిసిపల్ కార్మికులు | 36 | 27,701 |
| నావికులు | 11 | 72,826 |
| రేవులలో పనివాళ్లు | 21 | 17,754 |
| ఇతర పనులు | 170 | 99,786 |

కార్మికులు సమ్మెకట్టినందున, ఒకొక సంవత్సరంలో, ఒక కార్మికునకు ఒకరోజు చొప్పున, ఎన్నిరోజుల పని నష్టమైనదీ యీ క్రింది అంకెలవల్ల తెలుస్తుంది:

| | |
|---|---|
| 1943 | 23,42,000 |
| 1944 | 34,47,000 |
| 1945 | 40,54,000 |
| 1946 | 122,85,000 |

# ప్రజారోగ్యము

ప్రజారోగ్యము విషయంలో ప్రభుత్వంవారు శ్రద్ధతీసుకొని, దీని కొరకు ఒక ప్రత్యేక డిపార్టుమెంటును స్థాపించడం జరిగి యిప్పటికి సుమారు 72 ఏండ్లు అయింది. నగరములు పరిశుద్ధముగా వుండేటట్లు చూడడంలోనూ, అంటువ్యాధులు వ్యాపించకుండా చూడడంలోనూ, వ్యాధి చికిత్సకు ఉచితంగా సదుపాయాలు కలిగించడంలోనూ చాలా

అభివృద్ధి జరిగింది. కాని ఇప్పటివరకు మనదేశంలో జరిగిన కృషి అంతా కూడా, జరుగవలసినదానిలో పదవవంతు కూడా కాదన్నమాట వాస్తవం.

మనదేశం, ప్రజారోగ్యం విషయంలో, ప్రపంచంలోని యితర దేశాలతో పోలిస్తే, చాలా వెనకపడి వున్నది. ఇంగ్లండు, జర్మనీ దేశాలలో సగటున ఒకమనిషి ఆయుర్దాయం 63 సంవత్సరాలూ, ఆస్ట్రేలియాలో 67 సంవత్సరాలూ అయితే, మనదేశంలో ప్రజల సగటు ఆయుర్దాయం 31 సంవత్సరాలు మాత్రమే అని లెఖ తేలింది.

మనదేశంలో గవర్నమెంటు పరీక్షలు ప్యాసయిన వైద్యులు మొత్తం 42,000. అంటే సగటున ప్రతి 6,000 మంది ప్రజలకీ ఒక డాక్టరు ఉన్నాడన్నమాట. ఇదేలెఖలో ఇంగ్లండులో చూస్తే ప్రతి 700 మంది ప్రజలకీ ఒక డాక్టరువున్నాడు. మనదేశమంతటా సుమారు 5,000 మంది నర్సులు వున్నారు.

అయితే, డాక్టర్లలోనూ, నర్సులలోనూ నూటికి 90 వంతుల మంది పట్టణాలలోనే వున్నారు. పట్టణాలలోవుండే ప్రజలు, దేశపు జనాభాలో పదవవంతుమాత్రమే. అంచేత, నేడు మనగ్రామస్తులకు బొత్తిగా సరియైన వైద్యసహాయమే లేదన్నమాట.

ఇక, మనదేశంలో అత్యధికసంఖ్యాకులు పడేజబ్బులు ఏమిటంటే, మలేరియా, టైఫాయిడ్, రక్తగ్రహణి, కలరా, క్షయ, స్ఫోటకము, ఆహారలోపమువల్ల వచ్చే జబ్బులు.

అన్నిజబ్బులలోనూ, ఎక్కువమంది ప్రాణాలను హరిస్తున్నది మలేరియా. ఈజబ్బు ఏడాదికి పదికోట్లమందికి వస్తోందనీ, ఏడాదికి $12\frac{1}{2}$ లక్షల మంది చచ్చిపోతున్నారనీ తెలుస్తోంది.

రెండవప్రమాదకరమైనజబ్బు క్షయ. ఈజబ్బువల్ల ఏడాదికి సుమారు అయిదులక్షలమంది చనిపోతున్నారనీ, దాదాపు 25 లక్షలమంది యీజబ్బుతో అవస్థపడుతున్నారనీ అంచనా.

ఇండియాలో క్షయరోగుల చికిత్సకు దాదాపు 150 ఆస్పత్రులు మాత్రమే వున్నాయి. ఈరోగ చికిత్సకు సరియైన ప్రయత్నం జరగాలంటే అథమం 4000 ఆస్పత్రులు, సుమారు అయిదులక్షల రోగులు వుండటానికి వసతితో, స్థాపించబడాలని అంచనా.

మనదేశంలో స్ఫోటకంవల్ల చనిపోయినవారిలో అత్యధిక సంఖ్యాకులు, పదిసంవత్సరాలలోపు పిల్లలు.

మలేరియాజ్వరాలు, గత సంవత్సరాలకంటె ఎక్కువగాలేవు.

భరతఖండంలో సుమారు పదిలక్షలమంది కుష్ఠరోగులున్నారు.

# ఆరోగ్యము: ఆహారము

మనదేశంలోని ప్రజలకు పెద్దలోపం ఏమిటంటే, విద్యావిహీనత్వంతోపాటు, సరియైన ఆహారంకూడా లేకపోవడం. ఇటీవల మనదేశంలోని ప్రజల ఆహారస్థితిని, పరిశీలించిన ఒక కమిషనువారు, దేశంలోని జనాభాలో నూటికి ముప్ఫయివంతులమంది, శరీరాన్ని రోగాల పాలపడకుండా తగినదార్ఢ్యత యివ్వవలసిన దానికంటె, చాలా తక్కువ ఆహారాన్ని తింటున్నారని తేల్చారు.

ఆహారం సరియైనది లేకపోవడంవల్ల మనిషికి అనేకజబ్బులు వస్తాయి. సరియైన ఆహారం తినగలిగిన శక్తిగలవారుకూడా, అనేకమంది దేహపుష్టికి కావలసిన ఆహారం ఏమిటో తెలియక, కొన్ని పదార్థాలను ఎక్కువగానూ, కొన్ని పదార్థాలను తక్కువగానూ తినడం జరుగుతోంది. అందువల్ల, దేహానికి సమపుష్టి కలిగించవలసిన పద్ధతిలో ఆహారం సమపాళ్ళలో అందక, అనేకమంది వ్యాధుల పాలబడుతున్నారు.

ప్రతిమనిషికీ తనపని తాను చేసుకోవడానికి శక్తికావాలికదా. ఈ శక్తికి తగినపుష్టిని యిచ్చే ఆహారాన్ని తినాలి. ఈ శక్తికి, శాస్త్రజ్ఞులు 'కాలరీ' అనే పేరుపెట్టారు. మనం తినే ఆహారపుకొలత, యీకేలరీలలో సూచిస్తారు. వివిధవృత్తులలో వున్నవారికి, వివిధపరిమాణంలో కొన్ని

కేలరీలశక్తిగల ఆహారం కావాలి. ఈవిషయంలో శాస్త్రజ్ఞులు, యీక్రింది పట్టీప్రకారం ఆహారపు కేలరీల విలువవుండాలని సూచించారు.

| వృత్తి | ఆహారపు కేలరీలు |
|---|---|
| గుమస్తా | 2,600 |
| డాక్టరు | 2,760 |
| టైపిస్టు | 2,800 |
| గృహిణి | 2,800 |
| సైనికుడు | 3,150 |
| వడ్రంగి | 3,190 |
| కూలిపనివాడు | 3,610 |
| కమ్మరి | 4,120 |
| కట్టెలుకొట్టేవాడు | 5,500 |

మామూలుగా పురుషుడు చేసేపనినే చేసే స్త్రీ, పురుషుడు తినే ఆహారంలో అయిదింట నాలుగువంతులు తింటుందని అంచనా.

మనదేశంలో ప్రతివ్యక్తి రోజుకు 2,500 కేలరీలశక్తినియిచ్చే ఆహారాన్ని తినాలని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అయితే, మనదేశంలో చాలామంది తినే ఆహారం, రోజుకు 1,200 కేలరీలలోపలే వుంటున్నది కాని అంతకు మించడంలేదని పరిశోధనలవల్ల తేలింది.

రోజుకి శరీరానికి 2,600 కేలరీలశక్తిని యివ్వడానికి యీ క్రింది లెఖలో ఆహారం తినాలని శాస్త్రజ్ఞులు సూచించారు.

| | |
|---|---|
| ధాన్యములు | 16 ఔన్సులు |
| పప్పుదినుసులు | 3 ఔన్సులు |
| చక్కెర | 2 ఔన్సులు |
| కూరగాయలు | 6 ఔన్సులు |
| పండ్లు | 2 ఔన్సులు |
| నూనెలు | 2 ఔన్సులు |
| పాలు | 8 ఔన్సులు |

పైనచెప్పిన కొలతలో ఆహారం తినేవారికి, ఆహారలోప సంబంధమైనజబ్బు లేమీ రావడానికి అవకాశంలేదు. అయితే, యీ ఆహారం తీసు

కోవడంలో, కూరగాయల విషయంలో ప్రత్యేకశ్రద్ధ కనపరచాలి. వివిధములైన విటమినులుగల కూరగాయలను, ప్రతిరోజూ మారుస్తూ తింటూవుండాలి. లేనట్లయితే, విటమిన్ల లోపంవల్ల వచ్చే జబ్బులు వస్తాయి.

## విటమినులు

మనిషికి జీవశక్తిని యిచ్చే ఆహారపదార్థాలను విటమినులు అంటారు. ప్రతిమనిషీ, తన ఆహారంలో యీ విటమినులన్నీ వుండేటట్లు చూసుకోవాలి. ఈ విటమినులు ఏమిటో అవి లోపిస్తే ఏమి జబ్బులువస్తాయో, అవి ఏ ఆహారంలో వున్నాయో మొదలైన వివరాలన్నీ యీ క్రింద యివ్వబడినవి.

విటమిన్ 'ఏ'—ఇది శరీరానికి దార్ఢ్యాన్నియిచ్చి, రోగక్రిములను ఎదుర్కొనేశక్తిని దేహానికి యిస్తుంది. విటమిను 'ఏ' లోపించిన వారికి నీరసము, శ్వాసావయవములకు సంబంధించిన జబ్బులు, కంటి జబ్బులు, సరిగా యెదగకపోవడం, రేచీకటి, మొదలైనజబ్బులు కలుగుతాయి. ఈ విటమిన్ లోపించకుండా వుండాలంటే, ఆకుపచ్చని కూరగాయలు, చేపలు, చేపనూనె, పాలు, వెన్న, మీగడ, పెరుగు, నెయ్యి, గ్రుడ్లు, మొదలైనవి తినాలి.

విటమిన్ 'బి' 1—ఇది జీర్ణశక్తిని కాపాడే విటమిన్. ఇది ఆహారంలో లోపించినట్లయితే, మనిషికి అన్నంమీద ఏవగింపుపుట్టడం, తూకం తగ్గిపోవడం, జీర్ణశక్తి మందగించడం, గుండెజబ్బులు, అలసట, నరముల బలహీనత, నరములకంపము; వంటికి నీరుపట్టడం మొదలైన జబ్బులు వస్తాయి. ఈ విటమిను ఎక్కువగా మజ్జిగలోనూ, మొక్కగట్టిన ధాన్యాలలోను, బటాణీలలోనూ, ఆకుకూరలలోను, కోడిగ్రుడ్లలోను, వెన్నలోను మేకకాలేయములోను, యీస్టులోనువుంది.

విటమిన్ 'బి' 2—ఇది శరీరపు ఎదుగుదలకు అవసరమైనది. ఇది ఆహారంలో లోపించినట్లయితే, చర్మరోగాలు, నాలుకపూత, నోటిపూత, కడుపులోపుండ్లు, కడుపునొప్పి, అజీర్ణము, కళ్ళజబ్బులు వస్తాయి. ఇది ఎక్కువగావుండే ఆహారపదార్థాలు ఏమిటంటే, ఈస్టు, పాలు, ఆకుకూరలు, మాంసము, మేకకాలేయము, పప్పుదినుసులు.

విటమిన్ 'సి'—దీనిని సరిపడినంతగా తినకపోతే, 'స్కర్వీ' అనే జబ్బువస్తుంది. జీర్ణశక్తి సరిగావుండదు. ఈవిటమిను చాలా ఎక్కువగా ఉసిరికాయలోను, టొమటోపండ్లలోను వుంది. మామిడి, నారింజ, బత్తాయి మొదలైన పండ్లలోకూడ తగినంతగా వుంది.

విటమిన్ 'డి'...శరీర దార్ఢ్యానికి ప్రధానమైనది. చిన్నపిల్లల ఆహారంలో యీ విటమిను లోపించినట్లయితే, వారికి దొడ్డికాళ్లుపడడం, ఎముకలు గట్టిగావుండక మెత్తపడటం మొదలైన జబ్బులువస్తాయి. గర్భిణి స్త్రీలు ముఖ్యంగా, యీ విటమినును ఎక్కువగా తినాలి. ఇది ఎక్కువగావుండే పదార్థాలు ఏమిటంటే: పాలు, వెన్న, నెయ్యి, పంచదార, చేపనూనె మొదలైనవి. అంతేగాక, కొంచెంసేపు ఎండలో నిలబడితే, శరీరంలో విటమిన్ 'డి' వుత్పత్తి అవుతుంది.

పైనచెప్పిన విటమినులుకాక, శరీరరక్షణకు ప్రొటీనుపదార్థములు, శరీరదార్ఢ్యానికి పిండిపదార్థములు, ఎముకలగట్టితనానికి కాల్షియం (సున్నం), రక్తవృద్ధికి లోహము (ఇనుము), కూడా తగినంతగా ఆహారంలో వుండేటట్లు చూసుకోవాలి.

ప్రొటీను పదార్థములు: పాలు, మాంసము, చేపలు, పప్పుదినుసులు.

పిండిపదార్థములు: బియ్యము, గోధుమలు మొదలైన ధాన్యములు, అరటిపండ్లు.

కాల్షియం: ప్రధానంగా పాలు, ఆకుకూరలు, తమలపాకులలో వేసుకునే సున్నం.

లోహం: ఆకుకూరలు.

# పోస్టు, టెలిగ్రాఫ్, టెలిఫోన్ సదుపాయాలు

ఉత్తరాల రవాణాపద్ధతి భరతఖండంలో అక్బరు చక్రవర్తి కాలంనాటికే అమలులో వున్నప్పటికీ, సరియైన మార్గంలో యీ పద్ధతి 1766 లో అమలు జరుపబడింది. అప్పుడు కేవలం ప్రభుత్వపు ఉత్తరాలే రవాణా అవుతూ వుండేవి. కాని ప్రజలందరికీ ఉపయోగకరమైన,

పోస్టేజిస్టాంపులు, కవర్లు, కార్డులు రవాణా సౌకర్యాలూ 1854 లో అమలులోకి వచ్చాయి.

టెలిగ్రాములు పంపించే సదుపాయం 1856 లో ఏర్పాటు చేయబడింది. టెలిఫోనులో ఒకచోటనుంచి మరొక చోటికి మాట్లాడే సదుపాయం 67 సంవత్సరాల క్రితం ఏర్పాటు చేయబడినా, 1913 లోనే ప్రజోపయోగార్థం టెలిఫోనులను స్థాపించడం జరిగింది.

1947 ఆగస్టు 15 తరువాత, 1948 జూన్ వరకు ఇండియాలో 183 కొత్త సబ్ పోస్టుఆఫీసులు, 1,155 బ్రాంచిఆఫీసులు తెరువబడినవి. వీటితో, 1948 జూన్ నాటికి ఇండియాలోవున్న పోస్టాఫీసులసంఖ్య: నగరాలలో, 3,731; గ్రామాలలో, 18,149.

# పోస్టల్ రేట్లు

మనదేశంలో ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి ఎంతదూరమైనాసరే ఉత్తరాలను, పార్సెళ్లను, టెలిగ్రాములను పంపడానికి అయే ఖర్చు వివరాలు యివి·

కార్డు :

పోస్టాఫీసులలో అమ్మే కార్డును ముక్కాని పెట్టి కొనుక్కొని, దానిమీద సంగతులు వ్రాసుకోవచ్చును. లేదా విడిగా బజారులలో అమ్మే వివిధరంగుల కార్డులనుకొని, వాటికి ముక్కానిబిళ్ళనుకొని అంటించి పోస్టులో వెయ్యవచ్చును. ఈ కార్డులపొడవు 5 1/8 అంగుళాలకు, వెడల్పు 4 1/8 అంగుళాలకు మించి ఉండకూడదు; 4 అంగుళాల పొడవుకు, రెండు అంగుళాల వెడల్పుకు తక్కువ వుండకూడదు.

కవరు :

కార్డుమీద వ్రాసేదానికన్న ఎక్కువ విషయాలను వ్రాయవలసివస్తేగాని, యితరులెవరూ చూడగూడని విషయాలను వ్రాయవలసివస్తే

గాని, వ్రాసిన ఉత్తరాన్ని కవరులోపెట్టి, పైన అడ్రసు వ్రాసి పోస్టులో పడవెయ్యవచ్చును. ఈ కవరుమీద అంటించవలసిన పోస్టు బిళ్లల విలువ, కవరు బరువునుబట్టి వుంటుంది. కవరు బరువు ఒక తులం గాని, ఒక తులానికి లోపుగాని వుంటే, కవరుమీద వేడ విలువగల పోస్టు బిళ్ళలను అంటించాలి. ఒకతులం తరువాత, ఆపైన ప్రతి తులం బరువుకూ, అదనంగా ఒక్కొక్క అణాబిళ్ళ చొప్పున అంటించాలి.

## ఎక్స్‌ప్రెస్ డెలివరీ :

పోస్టాఫీసు ఉన్న ప్రతి ఊళ్ళోనూ, పోస్టు బంట్రోతులు, ఉత్తరాలు ఒక్కొక్క యింటికీ వరసగా యిచ్చుకుంటూ పోతారు. అలా కాక, ఉత్తరం పోస్టాఫీసుకు అందినవెంటనే చిరునామాదారునికి అందజెయ్యడానికికూడా ఏర్పాటువుంది. ఈ ఏర్పాటును ఎక్స్‌ప్రెస్ డెలివరీ అంటారు. దీనికి, అలా అందజెయ్యవలసిన ఉత్తరంమీద, దాని మామూలుచార్జీలు కాక, అదనంగా రెండణాల బిళ్లలను అంటించి, స్పష్టంగా కనపడే అక్షరాలలో 'ఎక్స్‌ప్రెస్ డెలివరీ' అని వ్రాయాలి. లేదా, పోస్టాఫీసులలో ఉచితంగా ఇచ్చే 'ఎక్స్‌ప్రెస్ డెలివరీ' అని వ్రాసిన చిన్న, ఎర్రటి కాగితపు ముక్కను అంటించాలి. అలా చేసి నట్లయితే, ఆ వుత్తరాన్ని పోస్టాఫీసుకు అయిదుమైళ్ళలోపున వున్న ఏ అడ్రసుకు అయినా, వెంటనే అందజేస్తారు. ఈ పద్ధతిలో, పోస్టుకార్డులను, కవరులను, రిజిస్టరు చెయ్యని పాకెట్టులను పంపవచ్చును.

## బుక్ పోస్టు :

అచ్చువేసిన నోటీసులు, ఉత్తరాలు కాకుండా అందరూ చదువుకోడానికి వీలున్న పత్రాలు, తక్కువ చార్జీలకు, పోస్టుద్వారా పంపవచ్చును. ఇలాటివాటికి ప్రతి $2\frac{1}{2}$ తులాల బరువుకీ, మూడుకానుల పోస్టు బిళ్ళలను అంటించాలి.

### రిజిస్ట్రేషన్ :

ఎవరికైనా ఉత్తరాలు పంపినప్పుడు, అవి ఆ చిరునామాదారునికే అందేటట్లూ, అందిన దాఖలా వుండేటట్లూ ఉత్తరాలు పంపడాన్ని రిజిస్ట్రేషన్ అంటారు. రిజిస్టర్ చేసే ఉత్తరాలకు, మామూలుగా వాటికి అంటించే పోస్టుబిళ్ళలుకాక, అదనంగా నాలుగణాల బిళ్ళలు అంటించాలి. చిరునామాదారు సంతకంపెట్టిన రసీదు, ఉత్తరం పంపినవారికి కావాలంటే, ఐదణాల బిళ్ళలు అంటించాలి.

### ఇన్సూరెన్సు :

పోస్టుద్వారా విలువగల వస్తువులను పంపేటప్పుడు, ఒకవేళ ఆ వస్తువులుపోతే, ఆ వస్తువుల ఖరీదును రాబట్టుకోడానికి చేసుకొనే ఏర్పాటు. ఈ ఏర్పాటుద్వారా, రిజిస్టర్ ఉత్తరాలనూ, బంగారు నగలనూ, విలువగల దస్తావేజులనూ ఒకచోటినుంచి మరొకచోటికి పంపవచ్చును. ఈ వస్తువులను; వాటి అసలైన విలువకుమించిన మొత్తానికి ఇన్సూరు చెయ్యకూడదు. ఇలా ఇన్సూరుచేసే వస్తువుల విలువ బ్రాంచి పోస్టాఫీసుల ద్వారా ఐతే రు. 600 లకూ, అంతకన్న పెద్ద పోస్టాఫీసుల ద్వారా అయితే రు. 3000 లకూ, మించరాదు.

ఇలా ఇన్సూరు చెయ్యడానికి, ఆ వస్తువులు పెట్టిన కవరుగాని, పెట్టెగాని దాని బరువునుబట్టి చెల్లించవలసిన ఛార్జీ, రిజిస్ట్రేషను ఛార్జీ కాకఅదనంగా, యీక్రింది రేటులో ఛార్జీలు యిచ్చుకోవాలి.

| | |
|---|---|
| నూరు రూపాయల విలువకు మించని ఇన్సూరెన్సుకు | నాలుగణాలు |
| రు. 100 కు పైబడి, 200 లకు మించని దానికి | $5\frac{1}{2}$ అణాలు |
| రు. 200 కు పైబడి, 300 లకు మించని దానికి | 8 అణాలు |
| ఆ పైన వెయ్యిరూపాయల దాకా, ప్రతి నూటికీ | రెండేసి అణాలు |
| వెయ్యి పైన ప్రతి నూటికీ | ఒక్కొక్క అణా. |

### మనీ ఆర్డరు:

దూరాన వున్నవారికి ఎవరికైనా, నమ్మకంగా చేరేలాగున డబ్బు పోస్టాఫీసులద్వారా పంపవచ్చును. ఇలా పంపే డబ్బుకు ప్రతి పది రూపాయలకూ, రెండేసి అణాల చార్జీ యివ్వాలి.

టెలిగ్రాఫ్ మని ఆర్డరు:

అతి స్వల్ప వ్యవధిలో, దూరాన వున్నవారికి డబ్బు పంపాలంటే, టెలిగ్రాంద్వారా పంపవచ్చును. దీనికి చార్జీ, మామూలు మని ఆర్డరు చార్జీ కాక, చిరునామాకూ, అతనికి తెలియపరచే విషయాలకూ టెలిగ్రాం చార్జీ ఎంత అవుతుందో, అదికూడా యివ్వాలి.

టెలిగ్రాములు.

అత్యవసరంగా ఒకచోటనుంచి మరొక చోటికి కబురు అందజెయ్యడానికి టెలిగ్రాం మంచి సౌకర్యం. టెలిగ్రాములు ఇంగ్లీషులోనే పంపాలి. చెప్పే సంగతులకూ, టెలిగ్రాము ఎవరికి పంపుతామో వారి చిరునామాకూ ఎన్నిమాటలు వుంటాయో వాటినిబట్టి చార్జీ యివ్వాలి. టెలిగ్రాము రెండురకాలు. మామూలు టెలిగ్రాములు, యిచ్చేచోట అందుకున్న వరుసలో పంపేవి; అర్జెంటు టెలిగ్రాములు, అందుకోగానే పంపేవి.

మామూలు టెలిగ్రాములకు చార్జీ: మొదటి ఎనిమిది మాటలకుగాని, అంతకు తక్కువకుగాని 13 అణాలు; ఎనిమిదిపైన ప్రతిమాటకూ ఒక అణా అదనం.

అర్జెంటు టెలిగ్రాములకు చార్జీ: మొదటి ఎనిమిది మాటలకుగాని అంతకు తక్కువకుగాని రు. 1-10-0; ఎనిమిదిపైన ప్రతిమాటకూ, రెండేసి అణాలు అదనం.

ఈ పోస్టు చార్జీలు, టెలిగ్రాము చార్జీలు, ఇండియాలో ఒక చోటనుంచి మరొక చోటికే. విదేశాలకు చార్జీలు వేరు.

1947 డిసెంబరు 1 తేదినుంచి పాకిస్తాన్‌లోని ఏప్రదేశానికైనా ఇండియానుంచి పంపే టెలిగ్రాముల చార్జీలు యీ క్రిందివిధంగా నిర్ణయింపబడినవి.

ఎనిమిదిమాటల మామూలు టెలిగ్రాం: రు. 1-6-0
అదనంగా ప్రతిమాటకూ రెండేసి అణాలు.

అర్జెంటు టెలిగ్రాములకు చార్జీలు, మామూలు టెలిగ్రాం చార్జీలకు రెట్టింపు.

పాకిస్తాన్‌లో ఏవూరికైనా టెలిగ్రాం పంపించేవారు. టెలిగ్రాఫ్ ఫారంలో, ఆవూరిపేరు తరువాత పాకిస్తాన్ అనే మాటను వ్రాయాలి. ఈ మాటకు చార్జి వసూలుచెయ్యరు. అలా వ్రాయకపోతే, మాత్రం, టెలిగ్రాంను బట్వాడా చెయ్యరు.

**విదేశాలకు :**

విదేశాలకువ్రాసే కార్డు వెల రెండణాలు; కవరు వెల, ఒక ఔన్సు బరువుకు మించనిది $3\frac{1}{2}$ అణాలు; ఆపైన ప్రతిఔన్సుకీ రెండేసి అణాలు.

విమాన టపాద్వారా విదేశాలకు లెటర్ : ఆరణాలు.

అమెరికా, కెనడాలకు ఎనిమిదణాలు.

**కేబిల్‌గ్రాం :**

సముద్రాంతరంలోవున్న దేశాలకు పంపించే టెలిగ్రాములను కేబిల్‌గ్రాం అంటారు.

ఇండియానుంచి ఇంగ్లండు, అమెరికాలకు కేబిల్‌గ్రాం పంపితే అయే చార్జీలు ఇవి :

ఇంగ్లండు : ప్రతిమాటకు 13 అణాలు.

అమెరికా : ప్రతిమాటకు ఒకరూపాయి.

చాలా ఉత్తరాలు సరియైన అడ్రసు వ్రాయనందున, ఎవరికి అందాలో, వారికి అందక 'డెడ్ లెటర్' ఆఫీసుకు పోతాయి. అందుచేత ప్రతి ఉత్తరం మీద సరియైన అడ్రసు వ్రాయడం ముఖ్యం.

## విమాన సదుపాయాలు

యుద్ధానంతరం, మునుపటికన్న మనదేశంలో విమాన ప్రయాణాలు చాలా ఎక్కువగా సాగుతున్నాయి, మనదేశంనుంచి విదేశాలకు వెళ్ళడానికే కాక, దేశంలోనే ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి చాలామంది విమానాలలోనే ప్రయాణం చేస్తున్నారు.

విమానప్రయాణం అభివృద్ధిపొందుతూ వున్నందున ఢిల్లి, కలకత్తా, బొంబాయి, మదరాసు, అలహాబాదు, గయా, లక్నో, నాగపూర్, అహమదాబాద్, భువనేశ్వర్, విశాఖపట్టణములలో విమానాశ్రయాలను బాగా అభివృద్ధిపరచడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు.

అంతేగాక, అజ్మీరు, అలీఘర్, బరంపుర, కాలికట్, కడలూర్, డేరాదూన్, హుబ్లి, మెంగుళూర్, నెల్లూరు, ఉదకమండలము, సేలం, రత్నగిరి, సాగర్, సూరత్ నగరాలలో విమానాశ్రయాలను నిర్మించడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు.

విదేశాలకు ప్రయాణికులను తీసుకొని వెళ్ళడానికి బ్రిటిష్ ఓవర్సీస్ ఏర్వేస్ కార్పొరేషన్ అనే బ్రిటిషు విమాన సర్వీసు, కె. ఎల్. ఎం. అనే డచ్చి విమాన సర్వీసు ప్రస్తుతం పనిచేస్తున్నాయి.

1947 ఫిబ్రవరి నాటికి మనదేశంలో, విమానాలను నడిపించి ప్రయాణ సౌకర్యాలను ఏర్పాటుచేయడానికి 22 కంపెనీలు ఏర్పడ్డాయి. నాటిలో అయిదుమాత్రమే ఆనాటికి విమానాలను నడుపుతున్నాయి. వాటిలో మూడు మాత్రమే చెన్నపట్టణంగుండా వాటి ప్రయాణమార్గాన్ని కలిగివున్నాయి. ఆ కంపెనీల ప్రయాణమార్గాలు ఇవి :

ఏర్-ఇండియా లిమిటెడ్ (టాటా కంపెనీ)

కొలంబో—బొంబాయి సర్వీసు :

మదరాసు—బొంబాయి సర్వీసు; మదరాసు—త్రివేంద్రం సర్వీసు:

ఏర్వేస్ ఇండియా లిమిటెడ్ :

బెంగుళూరు—కలకత్తా సర్వీసు :

డెక్కన్ ఏర్వేస్ :

మదరాసు—ఢిల్లీ సర్వీసు :

విశాఖపట్టణం—హైదరాబాదు సర్వీసు :

విమాన ప్రయాణ సౌకర్యాల విషయమై యీకంపెనీల చర్యలను, ఏర్పాట్లను పరిశీలించి, తగిన పద్ధతులలో వీరు ప్రయాణ సౌకర్యాలను

కలిగిస్తున్నారో లేదో చూడడానికి కేంద్ర ప్రభుత్వంవారు డైరక్టర్ జనరల్ ఆఫ్ సివిల్ ఏవియేషన్ అనే హోదాతో ఒక ఉద్యోగిని నియమించారు. ప్రస్తుతం, యీ పదవిలో టి. ఒ. భల్లా ఉన్నారు.

# బ్రాడ్‌కాస్టింగ్

రేడియో బ్రాడ్‌కాస్టింగ్ భారతదేశంలో మొట్టమొదట 1924 లో మదరాసులో రేడియోక్లబ్ ఒకటి స్థాపింపబడటంలో ప్రారంభమైంది. కాని, ఇండియన్ బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీ అనే పేరుతో ఒక కంపెనీ ఏర్పడి, 1927 జులై 23 తేదిన బొంబాయిలో ఒక స్టేషనును, 1927 ఆగస్టు 26 తేదిన కలకత్తాలో ఒక స్టేషనున్ను స్థాపించడంతో, బ్రాడ్‌కాస్టింగ్ సర్వీసు ప్రారంభమైంది. అయితే, యీ కంపెనీకి లాభాలు ఏమీ కిట్టక, 1930 మార్చిలో దివాలా తీసింది. 1930 ఏప్రిల్ 1 తేదినుంచి కేంద్ర ప్రభుత్వంవారే, బ్రాడ్‌కాస్టింగ్‌ను తమ అధికారంలోకి తీసుకున్నారు. 1932 దాకా ప్రభుత్వంవారుకూడా దీని విషయంలో తగుశ్రద్ధ చూపలేదు.

1930 లో మనదేశంలో సుమారు 7,700 మంది మాత్రమే రేడియోలను కలిగివున్నారు. కాని యీనాడు రెండు లక్షలకుపైగా రేడియోలు పనిచేస్తున్నాయి. రేడియో సెట్టు వున్న ప్రతివారు, ఆ సర్కిల్ పోస్టుమాస్టరు జనరల్ దగ్గరనుంచి లైసెన్సు తీసుకోవాలి. దీనికి ఫీజు ఏడాదికి పది రూపాయలు.

ప్రస్తుతం మనదేశంలో 15 రేడియోస్టేషనులు ఉన్నాయి. వీటిలో కొత్తగా స్థాపింపబడినవి: విజయవాడ, 1948 డిసెంబరు 1; అలహాబాదు, 1949 ఫిబ్రవరి 1.

మదరాసుస్టేషను 1933 జూన్ 16 తేదిన స్థాపింపబడింది.

ప్రస్తుతంవున్న రేడియోస్టేషనులు ఇవి: ఢిల్లి, బొంబాయి, కలకత్తా, జలంధర్, నాగపూర్, బరోడా, కటక్, షిల్లాంగ్, గౌహాతి, లక్నో, పాట్నా, అలహాబాద్, మదరాసు, తిరుచినాపల్లి, విజయవాడ

రేడియో సెట్లు యింటిలో వుంచుకున్నందుకు లైసెన్సులు తీసుకున్న వారి సంఖ్య 1930 నుంచీ క్రమేపీ ఎలా పెరిగినదీ, యీ క్రింది అంకెల వల్ల తెలుస్తుంది:

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1930 | — | 7,719 | 1944 | — | 1,80,660 |
| 1940 | — | 97,537 | 1945 | — | 1,99,589 |
| 1941 | — | 1,25,347 | 1946 | — | 2,05,130 |
| 1942 | — | 1,55,733 | 1947 | — | 2,30,025 |
| 1943 | — | 1,67,123 | | | |

ఇండియాలో బ్రాడ్‌కాస్టింగ్ విస్తరింపచెయ్యడానికి, కేంద్ర ప్రభుత్వంవారు ఒక అష్టవర్ష ప్రణాళికను తయారుచేశారు. దీని ప్రకారం ప్రత్యేక భాషాప్రాంతాలలో రేడియోస్టేషనులు లేని కొరతలను తీర్చడం; వివిధరాష్ట్రాలలో బ్రాడ్‌కాస్టింగ్‌ను విస్తరింపచెయ్యడం, ముఖ్యమైన కార్యక్రమం.

మదరాసులోను, కలకత్తాలోను బ్రాడ్‌కాస్టింగ్ స్టూడియోలు నిర్మించడం; బొంబాయిలో రెండు, కలకత్తాలో రెండు, మదరాసులో రెండు, ఢిల్లీలో రెండు, మీడియంవేవ్ ట్రాన్స్మిటర్‌లు నెలకొల్పడం; గ్రామస్తుల ప్రోగ్రాములకొరకు, బొంబాయి, కలకత్తా, మదరాసు నగరాలలో మీడియంవేవ్ ట్రాన్స్మిటర్‌లను నెలకొల్పడం.

# ఇన్సూరెన్సు

ప్రతి వ్యక్తీ కూడా, తన జీవితానికి కొంత విలువ కట్టుకోడానికీ, వృద్ధాప్యానికి కొంతడబ్బు దాచుకోడానికి ఉత్తమమైన మార్గం ఇన్సూరెన్సు. ఎన్నో కొన్ని సంవత్సరాలకు, ప్రతి సంవత్సరమూ (మూడేసి, ఆరేసి నెలల కొకసారి వాయిదాలలో) ఒక కొంత సొమ్మును కట్టడానికీ, నియమిత సంవత్సరాల తరువాత, తన సొమ్మును తిరిగి పుచ్చుకోవడానికి

చేసుకొనే ఏర్పాటు—ఇన్సూరెన్సు. నియమిత సంవత్సరాలలోపున, ఆ వ్యక్తి చనిపోయినట్లయితే, అసలు ఎంత మొత్తంకొరకు అతడు ఏడాదికొకసారి కొంతసొమ్మును కట్టుకుంటున్నాడో, అంత మొత్తాన్ని, ఇన్సూరెన్సు కంపెనీవారు ఆ వ్యక్తి కుటుంబానికి, ఆ వ్యక్తి కట్టినడబ్బు ఎంత తక్కువైనాసరే, చెల్లిస్తారు. ముఖ్యమైన షరతు ఏమిటంటే, మూడు నెలలకో, ఆరు నెలలకో, ఏడాదికో ఎంతడబ్బు కడతానని ఒప్పుకున్నాడో, అంతాకూడా, ఒక్కసారికూడా తప్పకుండా, ఆ వ్యక్తి ప్రతివాయిదాకూ కట్టితీరాలి.

తెలుగువారిలో చాలామందికి, చదువుకున్నవారికికూడా వున్న ఒక దురభిప్రాయం ఏమిటంటే, ఇన్సూరెన్సు కట్టడం అంటే చచ్చిపోయిన తరువాత తన కుటుంబంకోసం, డబ్బుకట్టడమని. అది పొరపాటు. ఇన్సూరెన్సు చేసినవ్యక్తి, నియమిత సంవత్సరాలలో, కాలకర్మంవల్ల చనిపోతే ఆ డబ్బు కుటుంబానికి వెళుతుందికాని, లేకపోతే అతనే అందుకుని, వృద్ధాప్యంలో సుఖంగావుంటాడు. ఇన్సూరెన్సుకు సంబంధించిన వివరాలన్నీ ఏ ఇన్సూరెన్సు ఏజెంటును అడిగినా చెపుతాడు. కాని ప్రతివారూ గమనించవలసిన ముఖ్యాంశాలు ఏమిటంటే:

తన జీవితంమీద ఎంతోకొంత విలువవుండడంకోసం, తనశక్తినిబట్టి, కనీసం వెయ్యిరూపాయలకైనా ఇన్సూరు చెయ్యాలి.

తాను ఇన్సూరుచేసే కంపెనీ సమర్థంగా నడుపబడుతున్నదో లేదో విచారించి మరీ, ఆ కంపెనీలో ఇన్సూరు చెయ్యాలి.

వీలైనంతవరకూ, మనదేశంలో, తనకు సమీపంలోవున్న కంపెనీలోనే ఇన్సూరు చెయ్యాలి.

అలవాటు తప్పకుండా నియమితకాలానికి, తాను చెల్లించవలసిన డబ్బును చెల్లించాలి.

ఇన్సూరు చేసినవెంటనే, తన వయస్సును గురించిన దాఖలాను కంపెనీకి పంపి, ఆ విషయంలో సందేహంలేకుండా చూసుకోవాలి.

కర్మంచాలక తాను, పరిమిత కాలంలో చనిపోయినట్లయితే, తన ఇన్సూరెన్సు డబ్బును తన కుటుంబంలో ఎవరికి యియ్యాలో కంపెనీ వారికి ముందుగానే తెలియపరచుకోవాలి.

ప్రతివ్యక్తీ, తన సంపాదనలో ఆరవవంతును ఇన్సూరెన్సు ప్రీమియంక్రింద ప్రతిఏడాదీ కట్టవచ్చును. ఇలా కట్టిన డబ్బుమీద, రాబడి పన్ను లేదు.

1948 సెప్టెంబరు 30 తేదినాటికి, ఇండియాలో 339 కంపెనీలు ఇన్సూరెన్సు వ్యాపారం చేస్తున్నవి. వీటిలో, 232 మనదేశంలో స్థాపించబడినవి. 107, విదేశివి.

మనదేశపు కంపెనీలు 232 లోనూ, 144 కంపెనీలు జీవితభీమా వ్యాపారం చేస్తున్నవి. 47 కంపెనీలు, జీవితభీమా, ఇతర భీమాలుకూడా చేస్తున్నవి. 41 కంపెనీలు కేవలం ఇతర భీమాలనే (మనుష్యుల జీవితానికి సంబంధించినవి) చేస్తున్నవి.

1947 లో మనదేశపు ఇన్సూరెన్సు కంపెనీలు, సుమారు 5,24,000 పాలసీలమీద, 1,14,06,00,000 రూపాయల విలువగల ఇన్సూరెన్సు చేసినవి. ఈ పాలసీలమీద, ఏడాదికి 6,22,00,000 రూపాయలు ప్రీమియం క్రింద కట్టబడుతుంది.

ఇదే సంవత్సరంలో, విదేశీకంపెనీలు మనదేశంలో 20,000 పాలసీలమీద, 12,34,00,000 రూపాయలకు ఇన్సూరు చేశాయి.

1947 సంవత్సరాంతానికి, మనదేశంలో ఇన్సూరెన్సు చేసినవారు తీసుకున్న పాలసీల సంఖ్య : 29,36,000. వీటివిలువ, 6,49,07,00,000 రూపాయలు, వీటిలో విదేశీ కంపెనీల పాలసీలు : 2,29,000. వీటి విలువ : 1,01,90,00,000 రూపాయలు.

1947 లో మనదేశంలోని ఇన్సూరెన్సు ఏజెంట్ల సంఖ్య, 1,74,169. 1943 లో 65,921 మంది ఏజెంట్లువుంటే, 1944 లో 89,902 మంది ఉన్నారు.

(ఒకేవ్యక్తి రెండు మూడు పాలసీలుకూడా తీసుకోవచ్చును)

## ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ:

మన రాష్ట్రంలో స్థాపింపబడి, అభివృద్ధికి వచ్చిన ఇన్సూరెన్సు కంపెనీలలో ముఖ్యమైన వాటిలో ఒకటి:

1925 లో మచిలీపట్టణంలో స్థాపింపబడినది. క్రమేపీ చాలా అభివృద్ధిలోకి వచ్చింది. నేడు భారతదేశంలోని పెద్ద ఇన్సూరెన్సు కంపెనీలలో ఇది ఒకటి. సెక్రటరీ, శ్రీ ధూర్జటి సుబ్రహ్మణ్యం; మేనేజింగ్-డైరక్టర్, శ్రీ పిళ్ళారిసెట్టి పార్థసారధినాయుడు; 1948 ప్రారంభంలో ఈ కంపెనీ జీవితనిధి, రు. 92,04,245. జీవితభీమా ప్రీమియముల ఆదాయం, రు. 25,15,705. కంపెనీ ఖర్చు, ప్రీమియం రాబడిలో నూటికి 10 వంతులు మాత్రమే. కంపెనీ పెట్టుబడులపైన సంపాదించిన వడ్డీరేటు, నూటికి 3.3. 1946 లో యీ కంపెనీ కేవలం జీవితభీమా మాత్రమే చేసింది, కాని, 1947 నుంచి అగ్ని, మెరైన్, మోటారు భీమాలనుకూడా చేస్తున్నది. వివిధ వయస్సులవారు, 20 సంవత్సరాల తరువాత లాభాలతో తమకుగాని, యీలోపల తాము మరణిస్తే తమ వారసులకుగాని వెయ్యిరూపాయలు చెల్లుబడి కావాలంటే, ఏడాదికి ఎంత ప్రీమియం కట్టవలసింది, వివరాలు: 25 ఏళ్లుగలవారు, రు. 56-11-0; 30 ఏళ్ళవారు, రు. 56-14-0; 35 ఏళ్ళవారు, రు. 58-11-0; 40 ఏళ్ళవారు, 62-0-0.

# ఫిలిం పరిశ్రమ

భారతదేశంలో ఫిలిం పరిశ్రమకు పునాదివేసినవ్యక్తి, డి. జి. ఫల్కే. 1913 సంవత్సరంలో ఇతడు తీసిన 'రాజా హరిశ్చంద్ర' అనేది, మనదేశంలో మొట్టమొదట తయారైన ఫిలిం. తరువాత, ఫిలిం పరిశ్రమను ఇంకా అభివృద్ధిలోకి తెచ్చినవాడు, బాబురావు పెయింటర్.

1913 నుంచీ 1930 వరకు 17 సంవత్సరాలు, మనదేశంలో తయారైన చిత్రాలన్నీ 'మూక' చిత్రాలేగాని, టాకీలు లేవు. టాకీలు తియ్యడం విదేశాలలో 1926 లోనే ప్రారంభమైనప్పటికీ, మనదేశంలో మొట్టమొదటి టాకీ 1930లో గాని, తయారు కాలేదు. ఈ చిత్రం పేరు 'ఆలం ఆరా'. దీనిని అర్దేషిర్ ఇరానీ, కొంత మనదేశంలోనూ, కొంత ఇంగ్లండులోనూ తీశాడు. అప్పటినుంచీ, టాకి ఫిలిములు మనదేశంలో విస్తారంగా తయారవుతూనే వచ్చాయి.

టాకీలు రాకపూర్వం, ఫిలిముల విషయంలో భాషాభేదపు పాటింపులేదు. ఏ ఫిలిమయినా దేశంలో ఎక్కడనైనాసరే ప్రదర్శింప వచ్చును.

టాకీలు రావడంతో, భాషవిషయంలో ప్రత్యేక అభిమానం ఏర్పడి తీరింది. ఒక భాషాప్రాంతంలో, మరొకభాష ఫిలిం ఎక్కువగా జనాన్ని ఆకర్షించలేదు. అంచేత వివిధభాషలలో ఫిలిములు రావడం ఆరంభించాయి,

1931 లో మొట్టమొదటి తెలుగుచిత్రం, ప్రహ్లాద. దీనికి డైరక్టరు హెచ్. ఎం. రెడ్డి. తరువాత, వరుసగా తయారైన చిత్రాలు ఇవి: 1932 పాదుకాపట్టాభిషేకం, శకుంతల. 1933: పృధ్వీపుత్ర, రామదాసు, (రెండు కంపెనీలవారివి, రెండు చిత్రాలు) సావిత్రి (రెండు కంపెనీల వారివి, రెండు చిత్రాలు) చింతామణి. 1934: అహల్య, లవకుశ, సీతా కల్యాణం. 1935: సక్కుబాయి, హరిశ్చంద్ర, కుచేల, కృష్ణతులాభారం, కృష్ణలీల, అనసూయ, ప్రమిలార్జున, భక్తకబీర్. 1936. ధ్రువ-అనసూయ, ప్రేమవిజయం, ద్రౌపదీ వస్త్రాపహరణం, ద్రౌపదీ మానసంరక్షణం, సతీసులోచన, సంపూర్ణరామాయణం, వీరాభిమన్యు, మాయాబజారు, లంకాదహనం. 1937: సారంగధర, దశావతారాలు, కనకతార, రుక్మిణీ కల్యాణం, మోహిని-రుక్మాంగద, నరనారాయణ, విజయదశమి, విప్ర నారాయణ, బాలయోగిని. 1938. తుకారాం, చిత్రనళీయం, సత్య నారాయణవ్రతం, కాసులపేరు, గృహలక్ష్మి, భక్తమార్కండేయ, కచదేవయాని, కృష్ణజరాసంధ, మాలపిల్ల, భక్తజయదేవ, మోహినీ భస్మాసుర, గులేబకావలి. 1939: వెంకటేశ్వరమాహాత్మ్యం, వందే

మాతరం, వరవిక్రయం, జయప్రద, మహానంద, రైతుబిడ్డ, రాధాకృష్ణ, పాశుపతాస్త్రం, అమ్మ, మళ్ళీపెళ్ళి, పాండురంగవిఠల్. 1940: మైరావణ, చండిక, సుమంగళి, కాలచక్రము, భోజ - కాళిదాస, బొండాంపెళ్ళి - చదువుకున్న పెళ్ళాం-బారిస్టర్ పార్వతీశం, ఇల్లాలు, మాలతీమాధవం, జీవనజ్యోతి, ఉషాపరిణయం, భూకైలాస్, మీరా బాయి. 1941: ధర్మపత్ని, తెనాలిరామకృష్ణ, మహాత్మాగాంధి, తారాశశాంకం, దక్షయజ్ఞం, చూడామణి, తల్లిప్రేమ, దేవత, నాజీ భూతం, గజలక్ష్మి, భక్తమాల, హరవిలాసం, అపవాదు, చంద్రహాస, పార్వతీకల్యాణం. 1942: జీవన్ముక్తి, భక్తప్రహ్లాద, ఘరానాదొంగ, పత్ని, శాంత బాలనాగమ్మ, సత్యభామ, దీనబంధు, సుమతి, బాల నాగమ్మ. 1943: పోతన, భాగ్యలక్ష్మి, కృష్ణప్రేమ, పతిభక్తి, గరుడ గర్వభంగం, పంతులమ్మ. 1944: సంసారనారద, సీతారామజననం, తాసిల్దార్, భీష్మ. 1945: పాదుక, స్వర్గసీమ, వాల్మీకి, మాయా మచ్ఛీంద్ర, మాయలోకం. 1946: నారద-నారది, భక్తతులసీదాస్, ముగ్గురుమరాటీలు, గృహప్రవేశం, త్యాగయ్య, వరూధిని, మంగళ సూత్రం, సేతుబంధనం. 1947: యోగివేమన, గొల్లభామ, రత్నమాల, బ్రహ్మరథం, పల్నాటియుద్ధం, రాధిక, బాలరాజు. 1948: శిరియాళ, సువర్ణమాల, మదాలస, వింధ్యరాణి, ద్రోహి, గీతాంజలి. మొత్తం 133.

## సౌత్ ఇండియన్ ఫిలిం ఛేంబర్ :

స్థాపన, 1939. ఫిలిం పరిశ్రమ అభివృద్ధికి, ఆ పరిశ్రమతో సంబంధం వున్నవారంతా కలసి కృషిచేసేటందుకు ఏర్పడిన సంస్థ. ఈ సంస్థతరఫున ఫిలిం సెన్సారు బోర్డులో ఒక సభ్యుడు వుంటాడు. సినిమా ఆపరేటర్సు, ఎగ్జామినర్సు బోర్డులోకూడా, యీ ఛేంబర్‌కు ప్రాతినిధ్యంవుంది.

## ఫిలిం సెన్సార్ బోర్డు :

రాష్ట్రప్రభుత్వంవారు నియమించే సంస్థ. ఈ బోర్డు సర్టిఫికెటు ఇస్తేనేకాని, రాష్ట్రంలో ఏ ఫిలిమునూ ప్రదర్శించకూడదు. ప్రతి ఫిలిమూ, నిర్మాణం పూర్తి అయిన తరువాత, దానిని యీ బోర్డులోని

సభ్యులు యిద్దరు ముందుగా చూస్తారు. ఆ ఫిలిములో అసభ్య సంభాషణలుగాని, సన్నివేశాలుగాని వున్నట్లయితే, ఆ భాగాలను ఎత్తివేస్తేనే గాని, దానిని ప్రదర్శించడానికి అనుమతి యియ్యకూడదని ఆ సభ్యులు సూచిస్తారు. ఇలాటి సెన్సారు బోర్డులు ప్రతిరాష్ట్రంలోనూ వున్నాయి.

1948 డిసెంబరు 8 తేదినుంచి ఒక ఏడాదికి, యీ క్రిందివారు సెన్సారుబోర్డు సభ్యులుగా నియమించబడినారు: మదరాసునగర పోలీసు కమిషనర్; ఇన్‌ఫర్మేషన్ శాఖ డైరక్టర్; స్టేషన్ స్టాఫ్ ఆఫీసర్, మదరాసు కోట; జనాబ్ ఎస్. ఏ. షఫీమహమ్మద్; డాక్టర్ యు. కృష్ణారావు; శ్రీ పి. సంబంధమొదలియార్; శ్రీ ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్; శ్రీ మోటూరి సత్యనారాయణ; శ్రీ పి. బాలసుబ్రహ్మణ్య మొదలియార్; శ్రీ వి. అయ్యాస్వామినాయుడు; శ్రీ నార్ల వెంకటేశ్వరరావు; శ్రీ పసల సూర్యచంద్రం; శ్రీ ఎం. ఆర్. విట్టల్; ప్రొఫెసర్ కె. స్వామినాథన్; శ్రీ మోహన్‌లాల్ మెహత; శ్రీ ఎం. వరదరాజన్; శ్రీమతి ఎస్. మంజుభాషిణి; శ్రీమతి సావిత్రిరాజన్; శ్రీమతి సరోజిని వరదప్పన్; శ్రీమతి పారిజాతం నాయుడు; శ్రీమతి సి. కె. విజయరాఘవన్; శ్రీమతి పి. ఎస్. కైలాసం; శ్రీమతి కృష్ణారావు; శ్రీమతి జ్యోతి వెంకటాచలం; శ్రీమతి రాజం భారతి; శ్రీమతి ఇ. జ్ఞానాధికం; శ్రీ పి. వి. కృష్ణయ్య; జనాబ్ ఎం. ఎ. రహమన్.

ఫిలిం సెన్సారుబోర్డువారు, ఫిలిములను సెన్సారుచేసేటప్పుడు యీ క్రిందివిషయాలను మనస్సులో వుంచుకోవాలని ప్రభుత్వంవారు సూచించారు: చూసేవారి నైతికప్రవర్తనను పాడుచేసే ఫిలిములను ప్రదర్శించనివ్వరాదు. దుష్ప్రవర్తన, నేరములు, పాపము, అసభ్యప్రవర్తనలపట్ల సానుభూతికలిగించే ఫిలిములను ప్రదర్శింపనివ్వరాదు. సృష్టిన్యాయాన్నీ మానవులు పరిగణించే చట్టాలనూ అపహసించేఫిలిములను ప్రదర్శించనివ్వరాదు. ఏ కులానికిచెందిన ప్రజలకూ అవమానంకలిగించే ఫిలిములను ప్రదర్శించనివ్వరాదు.

1949 మార్చి 1 తేది తరువాత, మదరాసు రాష్ట్రంలో ఏ సినిమాహాలులోను ఒక ప్రదర్శనం మూడు గంటలకు మించివుండరాదనీ, ఏ ఒక్క చిత్రపుపొడవూ 13,000 అడుగులకు మించివుండరాదనీ ప్రభుత్వం ఉత్తరువుచేశారు.

ప్రతిసంవత్సరమూ తయారయిన ఫిలిములలో ఉత్తమ చిత్రానికి బహుమతినివ్వడాన్ని గురించి ప్రతిపాదనలను ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారని, విద్యాశాఖామంత్రి టి. ఎస్. అవినాశలింగం చెట్టియార్ 1948 డిసెంబర్ 20 తేదిన ప్రకటించారు.

# విదేశీయుల అధీనంలోవున్న ప్రాంతాలు

భారతదేశంలో ఫ్రాన్సు, పోర్చుగల్ దేశాల ఆక్రమణలో కొంత భూభాగం వుంది. మూడుశతాబ్దాలనాడు, వర్తకానికి భారతదేశానికి వచ్చి, దేశీయ రాజకీయ వ్యవహారాలలో జోక్యం కలిగించుకొని, ఫ్రాన్సు, పోర్చుగల్ దేశాలు కొంత దేశాన్ని తమ పరిపాలనలోకి తెచ్చుకున్నవి. తరువాత వచ్చిన బ్రిటిష్‌వారితో పోరాటఫలితంగా, ఈ రెండు దేశాల పలుకుబడి, వాటి పాలనలోవున్న భూభాగమూ చాలావరకు తగ్గిపోయాయి. నేడు ఈ రెండుదేశాల పాలనలోనూవున్న ప్రదేశాలను సెటిల్మెంట్లు అని వాడుకలో అంటూరు. ఈ ప్రదేశాలలో యిటీవల స్వాతంత్ర్యోద్యమం ప్రబలుతూవుంది. ఈ రెండు సెటిల్మెంట్లలోనూవున్న ప్రజానాయకులు, ఈరెండు సెటిల్మెంట్లనూ, భారతదేశంలోని యితరప్రాంతాలలో కలిపివెయ్యాలని కోరుతున్నారు. ఆ సెటిల్మెంట్ల వివరాలివి.

## ఫ్రెంచి సెటిల్మెంట్లు

వీటి వైశాల్యం మొత్తం 203 చదరపు మైళ్ళు. ఈ సెటిల్మెంట్లు మొత్తం అయిదు. అవి, పుదుచ్చేరి, చంద్రనగర్, కరికాల్, మాహి, యానాం అనే వూళ్ళు, వాటి పరిసర ప్రదేశాలు. వీటన్నిటిలోనూ

మొత్తం జనాభా, 1941 లెఖల ప్రకారం, 3,23,295. వీరిలో 1,62,916 మంది పురుషులు. 1,69,379 మంది స్త్రీలు. వీటన్నిటి పరిపాలన నిర్వహించడానికి, ఒక గవర్నరు ఉన్నాడు. ఆయన వుండేస్థలం పుదుచ్చేరి. ఇదే, యీ ఫ్రెంచి సెటిల్మెంటుకు రాజధాని. గవర్నర్: ఛార్లెస్ కామోలి.

## పుదుచ్చేరి:

ఈనగరం, భారతదేశపు తూర్పుతీరంలో మదరాసుకు దక్షిణంగా 105 మైళ్ళ దూరంలోవుంది. ఈ నగరమూ, దీని పరిసర ప్రదేశాలూ, మొత్తం ఫ్రెంచివారి అధీనంలోవున్నభూమి, 115 చ. మైళ్ళు. జనాభా, 1941 లెఖల ప్రకారం 2,04,653.

## చంద్రనగర్:

ఈ పట్టణం బెంగాల్ రాష్ట్రంలో, హుగ్లీనదీ తీరానవుంది. 1941 లో దీని జనాభా, 38,284. కలకత్తాకు యిది 22 మైళ్ళ దూరంలో వుంది. చంద్రనగర్ మునిసిపల్ అసెంబ్లీ, ఆ నగరాన్ని ఇండియాలో 1949 మార్చి 31 లోగా కలిపివెయ్యమని ఫ్రెంచిప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం 1948 డిసెంబరు 16 న చేసింది.

## కరికాల్:

ఇదికూడా మదరాసుకు దక్షిణంగా, సముద్రతీరాన తంజావూరు జిల్లాలోవుంది. ఈ సెటిల్మెంటులో మొత్తం 110 గ్రామాలు వున్నాయి. వీటి జనాభా 1941 లో 60,555. దీని వైశాల్యం 53 చ. మైళ్ళు.

## మాహీ:

ఇది భారతదేశపు పశ్చిమతీరాన, మలబారులోవుంది.

## యానాం:

ఇది తూర్పు గోదావరిజిల్లాలో, గోదావరి బంగాళా ఖాతంలో పడే చోటికి సమీపంలో, కాకినాడకు సుమారు 18 మైళ్ళ దూరంలో వున్నది. దీని జనాభా 1941 లో 5,711.

## పోర్చుగీసు సెటిల్మెంట్లు

పోర్చుగీసువారు మొట్టమొదట (1510 లో) భారతదేశంలో ఆక్రమించుకున్న ప్రదేశం గోవా. ఇప్పటికీ ఇది వారి పాలనలోనేవుంది. నేడు దేశంలో పోర్చుగీసువారి అధీనంలోవున్న ప్రాంతం మొత్తం 3,983 కిలోమీటర్లు. ఈ ప్రాంతమంతా బొంబాయి రాష్ట్రంలో మూడు విడివిడి ప్రదేశాలుగావుంది. అవేమిటంటే, గోవా, డయ్యూ, డామన్. వీటన్నిటికీ రాజధాని నోవాగోవా. ఇది, పశ్చిమతీరంలోవున్న మర్మగోవాకు, 6 మైళ్ళదూరంలో నూతనంగా నిర్మింపబడింది. పోర్చుగీసు సెటిల్మెంట్ల గవర్నర్‌జనరల్ ఇక్కడేవుంటాడు. డయ్యూ, డామన్‌లలో ఒక్కొక్క లెఫ్టినెంటు గవర్నర్ ఉంటాడు. పోర్చుగీసు సెటిల్మెంట్ల మొత్తంలో 1931 లో 5,79,970 మంది ప్రజలున్నారు. తరువాత జనాభా లెఖలు తీసుకోలేదు. ఈ సెటిల్మెంట్ల మొత్తంలో నాలుగు పట్టణాలు, మూడు నగరాలు, సుమారు 600 గ్రామాలు వున్నాయి.

### మర్మగోవా :

నోవాగోవా, మర్మగోవా పట్టణాలూ, పరిసరప్రాంతాలూ కలిపి గోవాజిల్లా అని వాడుకలో వున్నాయి. నోవాగోవా, పోర్చుగీసు సెటిల్మెంటుకు రాజధాని అయినప్పటికీ, రేవుపట్టణం మర్మగోవా. ఇది బొంబాయికి దక్షిణంగా 225 మైళ్ళదూరంలోవుంది.

### డామన్ :

ఈ జిల్లా, బొంబాయికి ఉత్తరంగా సుమారు 100 మైళ్ళ దూరంలో, సముద్రతీరానవుంది. ఈ జిల్లా వైశాల్యం 86 చ. మైళ్ళు.

### డయ్యూ :

ఈ జిల్లా, భారతదేశపు పశ్చిమతీరాన, కథియవాడ్‌కు, దక్షిణంగా వున్న చిన్నద్వీపం. దీనివైశాల్యం సుమారు 20 చ. మైళ్ళు. ఒకప్పుడు ఇది గొప్ప వ్యాపారకేంద్రంగా వుండేదిగాని, ప్రస్తుతం అనామక స్థితిలోవుంది.

గవర్నర్-జనరల్ :—కమాండర్ క్వింటానిలా మెండోకా డయస్

# రాజకీయ పక్షాలు

కాంగ్రెస్ : అఖిలభారత కాంగ్రెసు మహాసభ 1885 లో స్థాపింపబడింది. అప్పుడు కేవలం మితవాదపక్షంగా ఏర్పడినా, క్రమేపీ, దేశ స్వాతంత్ర్య సంపాదనకు పూనుకున్న ప్రధాన సంస్థ ఇదే. దీనిలో చేరి, అనేక కష్టనష్టాలకు గురియై, ఎంతోమంది స్వాతంత్ర్య వీరులు, స్వాతంత్ర్యసమరంలో తమ ప్రాణాలనుకూడా అర్పించారు. ఈనాడు, అఖిలభారత జాతీయ సంస్థగా, కాంగ్రెసు పక్షం, దేశంలోని రాజకీయ కక్షలలో ప్రధాన స్థానాన్ని పొందింది.

కాంగ్రెసు మహాసభ ప్రాతినిధ్యం, భాషాప్రయుక్త రాష్ట్ర విధానంమీద ఆధారపడివున్నది.

కాంగ్రెసు మహాసభ అధ్యక్షుడు : డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య.

ప్రస్తుతం 23 రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు ఉన్నాయి. అజ్మీరు, అస్సాం, ఆంధ్ర, ఉత్కళ్, కర్నాటక, కేరళ, గుజరాత్, ఢిల్లి, తమిళ నాడు, నాగపూర్, పంజాబ్, పాటియాల తూర్పు పంజాబ్ సంస్థానాల యూనియన్, బీహార్, బెంగాల్, బొంబాయి, మధ్యభారత్, మహాకోసల, మహారాష్ట్ర, యునైటెడ్ ప్రావిన్సెసు, రాజపుటానా, విదర్భ (బీరార్), వింధ్యప్రదేశ్, హిమాచల ప్రదేశ్.

## కాంగ్రెసు వర్కింగుకమిటి

1949 సంవత్సరానికి తమ వర్కింగుకమిటికి, కాంగ్రెసు అధ్యక్షులు, యీక్రిందివారిని సభ్యులుగా నియమించారు :

1. పండిత జవహర్‌లాల్ నెహ్రూ; 2. సర్దార్ వల్లభభాయ్ పటేల్; 3. మౌలానా అబుల్‌కలాం ఆజద్; 4. రఫీ అహమద్ కిద్వాయ్; 5. జగజీవనరాం; 6. పండిత గోవిందవల్లభ పంత్; 7. సర్దార్ ప్రతాపసింగ్; 8. డాక్టర్ రాజేంద్రప్రసాద్; 9. డాక్టర్ ప్రఫుల్లచంద్రఘోష్; 10. శంకరరావ్ దేవ్; 11. శ్రీమతి సుచేత

కృపలాని; 12. కళా వెంకటరావు; 13. ఎస్. కె. పటిల్; 14. ఆచార్య ఎన్. జి. రంగ; 15. కె. కామరాజనాడార్; 16. దేవేశ్వర శర్మ; 17. ఎస్. నిజలింగప్ప; 18. గోకులభాయ్ భట్; 19. రామ సహాయ్.

వీరిలో, సర్దార్ పటేల్ కాంగ్రెస్ కోశాధిపతిగాను, కళా వెంకటరావు, శంకరరావ్ దేవ్‌గార్లు ప్రధాన కార్యదర్శులుగాను వుంటారు.

రాష్ట్రకాంగ్రెసు సంఘాల అధ్యక్షులు: అజ్మీర్, ముకుట విహారి లాల్ భార్గవ; ఆంధ్ర, ఆచార్య రంగ; అస్సాం, దేవేశ్వర్ శర్మ; ఉత్కళ, విశ్వనాధదాస్; కర్నాటక, ఎస్. నిజలింగప్ప; కేరళ, కె. కేలప్పన్; గుజరాత్, కన్యాలాల్ నానాభాయ్‌దేశాయ్; ఢిల్లి, రాధారమణ్; తమిళనాడు, కె. కామరాజనాడార్; నాగపూర్, ఎం. ఎస్. కన్నమ్వార్; పంజాబ్, జ్ఞాని గురుముఖ్ సింగ్ ముసాఫిర్; పాటియాల, తూర్పు సంస్థానాల యూనియన్, బ్రిష్‌భాన్; బీహార్, పండిత ప్రజాపతిమిశ్ర; బెంగాల్, సురేశచంద్ర బెనర్జి; బొంబాయి, ఎస్. కె. పటిల్; మధ్యభాగత్, గోపీకృష్ణ విజయ వర్గీయ; మహా కోసల, సేట్ గోవిందదాస్; మహారాష్ట్ర, బి. ఎస్. హిరే; యునైటెడ్ ప్రావిన్సెస్, బాబు పురుషోత్తమదాస్ టాండన్; రాజపుటానా, గోకులభాయ్ భట్; విదర్భ (బీరార్), డాక్టర్ గోపాల్‌రావ్ ఖేదాకర్; హిమాచలప్రదేశ్, డాక్టర్ వై. ఎస్. పరమార్.

## అఖిలభారత కాంగ్రెసు కమిటి

అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులసంఖ్య 376. వీరిలో ఆంధ్రరాష్ట్రంనుంచి ఎన్నుకొన బడినవారు, 24. వారి పేర్లు ఇవి:

గౌతు లచ్చన్న, బారువ; జొన్నల కృష్ణమూర్తి, బరంపురం; మల్లిమడుగుల జగన్నాథం, విశాఖ పట్టణం; డాక్టర్ కోరుకొండ సుబ్బరాజు, అనకాపల్లి; పి. మాధవ వర్మ, జొన్నవలస; మల్లిపూడి పళ్ళంరాజు, కాకినాడ; కళా వెంకటరావు, మదరాసు; చల్లా అప్పారావు, పెద్దాపురం; తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి, పిప్పర; దుగ్గిరాల

బలరామ కృష్ణయ్య, బెజవాడ; డాక్టర్ బి. పట్టాభి సీతారామయ్య, ఢిల్లి; అయ్యదేవర కాళేశ్వరరావు, బెజవాడ; ఆచార్య ఎన్. జి. రంగ, నిడుబ్రోలు; వంగల్లు కోదండరామరెడ్డి, తోటపల్లి గూడూరు; టంగుటూరి ప్రకాశం, మదరాసు; ఎన్. వి. ఆర్. నాయుడు, పాకాల; సి. ఎల్. నరసింహారెడ్డి, కడప; కాసు బ్రహ్మానందరెడ్డి, నరసరావుపేట; కె. కోటిరెడ్డి, కడప; నీలం సంజీవరెడ్డి, ఇల్లూర్; ఎస్. శంకర రెడ్డి, కర్నూలు; పి. రంగారెడ్డి, అనుమలమాడు; అల్లూరి సత్యనారాయణరాజు, జున్నూరు; ఎ. సి. సుబ్బారెడ్డి, నెల్లూరు.

## ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటి

అధ్యక్షుడు: ఆచార్య ఎన్. జి. రంగ

ఉపాధ్యక్షుడు: పి. తిమ్మారెడ్డి

ప్రధానకార్యదర్శి: కందుల ఓబులరెడ్డి

సంయుక్త కార్యదర్శులు: గౌతు లచ్చన్న

: దుగ్గిరాల బలరామకృష్ణయ్య

సభ్యులు : టంగుటూరి ప్రకాశం (మదరాసు)

బి. మునిరత్నం (చిత్తూరు)

బత్తిన రామకృష్ణారెడ్డి (నెల్లూరు)

వల్లూరి రాజయ్య (గుంటూరు)

అన్నె అంజయ్య (పశ్చిమకృష్ణా)

బులుసు విశ్వేశ్వరరావు (తూర్పుకృష్ణ)

గొట్టిముక్కల రామచంద్రరాజు (పశ్చిమగోదా॥ ?)

మల్లిపూడి పళ్ళంరాజు (తూర్పుగోదావరి)

ఓ. మాధవవర్మ (దక్షిణ వైజాగ్)

కిల్లి అప్పలనాయుడు (ఉత్తర వైజాగ్)

ఓ. చిన్నశివరెడ్డి (కర్నూలు)

ఎస్. రామిరెడ్డి (బళ్ళారి)

రంగప్పనాయుడు (అనంతపురం)

1947 ఆగస్టు 15 న ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందడంతో, అంతవరకు స్వాతంత్ర్య సంపాదనే ప్రధాన ఆశయంగా పెట్టుకున్న కాంగ్రెసు, తన కార్యక్రమాన్ని నూతన పరిస్థితులకు అనుగుణంగా మార్చుకోవలసివచ్చింది. ఈ విషయమై నాయకులంతా తీవ్రంగా ఆలోచనలు జరిపారు. తన హత్యకుపూర్వం గాంధిమహాత్ముడు కొన్ని సూచనలనుకూడా చేశారు. ఆ సూచనలను దృష్టిలో పెట్టుకొని, కాంగ్రెసు వర్కింగు కమిటీవారు కాంగ్రెసు విధానాన్నిగురించి ఒక తీర్మానాన్ని తయారుచేశారు. ఆ తీర్మానాన్ని, 1948 ఏప్రిల్‌లో అఖిలభారత కాంగ్రెసుకమిటీవారు ఆమోదించారు. ఆ తీర్మానంప్రకారం, కాంగ్రెసు నిర్మాణం, నిర్వహణ యీ క్రిందిపద్ధతులలో జరుగుతుంది.

"అందరు వ్యక్తులకూ సమానమైన సాంఘిక, రాజకీయ, ఆర్థిక హక్కులువుండే సహకార ప్రభుత్వవిధానాన్ని ఇండియాలో స్థాపించడమూ, ఇండియాప్రజల స్థితిగతులను చక్కబరచడమూ, ప్రపంచశాంతికీ, అన్యోన్యతకూ పాటుపడటమూ కాంగ్రెసు ఆశయం.

"21 సంవత్సరాలు వయసునిండి, కాంగ్రెసు ఆశయాన్ని అంగీకరించే ఏ వ్యక్తిఅయినా ప్రాథమిక కాంగ్రెసు పంచాయితీని ఎన్నుకోడానికి ఓటు కలిగివుంటాడు.

"ఒక గ్రామానికిగాని, కొన్ని గ్రామాలసమూహానికిగాని, నగరంలో ఒక భాగానికిగాని, ప్రతి 2,500 మంది ఓటర్లకు ఒకొక్క ప్రాథమిక కాంగ్రెసు పంచాయతీ ఏర్పాటు చేయబడుతుంది. ఏ పంచాయతీలోను ముగ్గురు సభ్యులకు తక్కువ, పదిమందికి ఎక్కువ సభ్యులు వుండరు.

"ప్రాథమిక పంచాయతీకి సభ్యుడుగా ఎన్నిక కాదలచిన వ్యక్తి యీ క్రింది నిబంధనలకు లోబడివుండాలి.

"అతడు చేతితో వడికిన నూలుతో నేసిన ఖద్దరునే సర్వదా ధరించాలి. మద్యపానీయాలను వాడకూడదు. అస్పృశ్యతను అన్నివిధాల

నిరసించాలి. కులసామరస్యంపట్ల విశ్వాసం కలిగివుండాలి. అన్నిమతాల పట్ల గౌరవం కలిగివుండాలి. జాతి, మత, స్త్రీ పురుష వివక్షతలేకుండా అందరుప్రజలూ సమానహక్కులు, సమాన సదుపాయాలు కలిగివుండా లనే విశ్వాసాన్ని కలిగివుండాలి.

"ప్రాథమిక పంచాయతీలలోని సభ్యులందరూ ఏడాది కొక రూపాయి చందా కట్టాలి.

"ప్రతి రాష్ట్రంకూడా, ఆ రాష్ట్రంలోని జనాభానుబట్టి ప్రతి లక్షమంది ప్రజలకు ఒక సభ్యుడు చొప్పున అఖిలభారత కాంగ్రెసుకు ప్రతినిధులను ఎన్నుకోవడానికి హక్కు కలిగివుంటుంది.

"కాంగ్రెసు మహాసభ ప్రతిసంవత్సరమూ జరగాలి".

ముస్లింలీగ్ :

ముస్లిములకు ప్రత్యేక సౌకర్యాలను సంపాదించడానికి 1906 లో స్థాపింపబడినది. దేశంలో ముస్లిములతరఫున ప్రధాన ప్రాతినిధ్యంగల సంస్థ. కాంగ్రెసుకు ప్రతికక్షిగా నిలచి, దేశంలో ముస్లిములు అధిక సంఖ్యాకులుగాగల ప్రాంతాలనన్నిటినీ ఒక ప్రత్యేక భాగంగా విభజించి, ముస్లిము పరిపాలనకు, పాకిస్తాన్ అనే పేరుతో అప్పజెప్పాలని కోరింది.

1947 డిసెంబరు 15 న కరాచీలో, ఆల్ యిండియా ముస్లింలీగు సమావేశమైంది, దేశవిభజన తరువాత మొట్టమొదట జరిగిన యీ సమావేశంలో, యికముందు ఇండియాకువేరు, పాకిస్తాన్‌కువేరు ముస్లింలీగు లను స్థాపించడానికి నిర్ణయించబడింది. పాకిస్తాన్ ముస్లింలీగు స్థాపన ఏర్పాటుచెయ్యడానికి లియాకత్ అలి ఖాన్, ఇండియా ముస్లింలీగు స్థాపన ఏర్పాటుచెయ్యడానికి మహమద్ ఇస్మాయిల్‌గార్లు ఎన్నుకో బడినారు.

**హిందూమహాసభ:**

హిందువుల ప్రత్యేకహక్కులను కాపాడడానికి ఏర్పడిన సంస్థ. దేశవిభజనను తీవ్రంగా ప్రతిఘటిస్తున్నది.

అధ్యక్షుడు: ఎల్. బి. భోపట్కార్.

**సోషలిస్టుపార్టీ:**

ఇన్నాళ్ళూ కాంగ్రెసులోనే ఒకపక్షంగావుండి దేశంలో సోషలిస్టు పద్ధతిలో పరిపాలన ఏర్పడాలని కోరేపక్షం. దేశమంతటా, యీ పార్టీకి సభ్యులు వున్నారు.

ప్రధానకార్యదర్శి: జయప్రకాశ్ నారాయణ్.

**కమ్యూనిస్టుపార్టీ:**

కార్మికుల ఆధ్వర్యాన ఏర్పడే పరిపాలనను దేశంలో స్థాపించి, ధనస్వామిత్వాన్ని నిర్మూలనంచేసి, వర్గభేదంలేని సంఘాన్ని స్థాపించడం ప్రధానాశయంగాగల సంస్థ.

ప్రధానకార్యదర్శి: బి. టి. రణదేవ్.

# సాయుధబలాలు

ఇప్పుడు ఇండియాలోవున్న సైన్యదళానికి పునాది, ఈస్టిండియా కంపెనీవారు తమ ఫ్యాక్టరీల రక్షణకు పదిహేడవశతాబ్దంలో ఏర్పాటు చేసుకున్న చిన్నచిన్న కాపలాదళాలు. క్రమేపి, యీ దళాలసంఖ్య హెచ్చుచేయబడింది. ఈస్టిండియాకంపెనీవారు, దేశీయవ్యవహారాలలో జోక్యంకలిగించుకొని, దేశీయరాజుల పరస్పరకలహాలలో, ఎవరికో ఒకరికి సహాయపడటమూ, క్రమేపి తాముకూడా ఇండియాలో రాజ్యాన్ని సంపాదించుకోవడమూ జరగడంతో, తమసైన్యాన్ని విస్తరింపజెయ్యడమూ, సైనికులకు మంచి తర్ఫీదు ఇవ్వడమూ జరిగింది. బ్రిటిషువారు

తయారుచేసిన యీ సైన్యంలోవున్న బ్రిటిషుసైనికులకు సోల్జర్లనీ, భారతీయసైనికులకు సిపాయిలనీ వ్యవహార నామం ఉండేది.

1857 లో సిపాయిలు సాగించిన మొదటి భారతీయ స్వాతంత్ర్య సమరఫలితంగా, ఇండియా పరిపాలనను ఈస్టిండియాకంపెనీ చేతినుండి బ్రిటిషుప్రభుత్వం తీసుకున్నది. అప్పుడు ఇండియాలోని సైన్యం, బొంబాయి, మదరాసు, బెంగాల్ రాష్ట్రపు సైన్యాలుగా, మూడు భాగాలు చెయ్యబడింది.

ఆనాటికి ఇండియాలోని సైన్యంలో 65,000 మంది బ్రిటిషు సైనికులు, 1,40,000 భారతీయసైనికులూ వుండేవారు. 1895లో సైన్యశాఖ నిర్వహణవిషయంలో మార్పుజరిగింది. సైన్యబలాలు నాలుగు కేంద్రాలక్రింద విభజించబడినవి. 1904 లో, మళ్లీ మూడుకేంద్రాలుగా ఏర్పాటు చేయబడినవి. 1920 లో మళ్లీ నాలుగు కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి.

బ్రిటిషువారు భారతదేశంలో సైన్యాలను సమకూర్చడం ఆరంభించినప్పటినుంచి చాలా కాలందాకా, భారతీయులెవరికీ బాధ్యతగల హోదాలను సైన్యంలో ఇవ్వలేదు. మొట్టమొదటిసారి, 1918 లో భారతీయులకు సైన్యంలో ఆఫీసరుహోదా యివ్వడం జరిగింది. తరువాత, క్రమేపీ కొద్దికొద్దిగా, కింగ్స కమిషన్ (ఆఫీసరు హోదా)లను భారతీయులకు ఇవ్వడం జరిగినా, 1939 నాటికి భారతదేశంలోని సైన్యం అంతటిలోనూ 500 మందికంటె ఎక్కువమంది ఆఫీసర్ల ఉద్యోగాలలో లేరు.

1939 లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైనతరువాత, కొంచెం ఎక్కువగానే భారతీయులకు ఇండియాసైన్యంలో ఆఫీసరు ఉద్యోగాలు యివ్వబడినవి. యుద్ధం ముగిసేటప్పటికి, దాదాపు 8,000 మంది భారతీయులు ఆఫీసరు హోదాలో వున్నారు.

ప్రపంచయుద్ధం ముగిసిన, రెండు సంవత్సరాలలో, రాజకీయ పరిస్థితులు అతివేగంగా మార్పులు చెందటంతో, సైన్యశాఖ పునర్నిర్మాణం విషయమై ఏమీ ఏర్పాట్లు జరుగలేదు. 1947 ఆగస్టు 15 తేన భారతదేశం విభజన జరగడంతో, భారతదేశపు సైన్యంకూడా విభజింపబడింది. ఆనాటికి భారతదేశంలోవున్న సైన్యంలో రెండు భాగాలు ఇండియావంతుకీ, ఒకభాగం పాకిస్తాన్ వంతుకీ వచ్చాయి.

దేశవిభజనతో పాటు, దేశస్వాతంత్ర్యంకూడా లభించినందున, ఇండియాలోని బ్రిటిషు సైనికు లందరినీ విడుదల చెయ్యడంకూడా జరిగింది. ఇండియాలోని ఆఖరు బ్రిటిషు పటాలం, 1948 ఫిబ్రవరి 28 తేదిన ఇండియానుంచి వెళ్లిపోయింది. అయితే, కొంతమంది బ్రిటిషు వారు ఇంకా ఇండియా సైన్యంలో, ఇండియా ప్రభుత్వం కోరికలపై పనిచేస్తునే వున్నారు. వీరు యుద్ధచర్యలకుగాని, సైన్యనాయకత్వానికిగాని కాక భారతీయ సైనికులకు తర్ఫీదు ఇవ్వడం, సైనికవ్యవహారాలలోని మెళుకువలను నేర్పడంలో నియమితులై వున్నారు. వీరి సంఖ్య చాలాతక్కువ.

ఇండియా సర్వసైన్యాధిపతిగా మొట్టమొదటి భారతీయుని నియామకం, 1948 డిసెంబరులో జరిగింది. ఈ పదవికి నియమింపబడిన జనరల్ కె. ఎం. కరియప్ప, 1949 జనవరి 15 తేదిన పదవీస్వీకారం చేశారు.

## సాయుధబలాల నిర్వహణ

ప్రస్తుతం ఇండియా సాయుధబలాల నిర్వహణ ఎలా జరుగుతుందంటె:

సైన్యాలన్నీ సర్వసైన్యాధిపతికి లోబడివుంటాయి. నౌకాదళాలన్నీ సర్వనౌకాదళాధిపతికి లోబడివుంటాయి. విమానదళాలన్నీ సర్వవిమానదళాధిపతికి లోబడివుంటాయి. ఈ ముగ్గురున్నూ, ప్రభుత్వరక్షణ

శాఖామంత్రికి బాధ్యులై వుంటారు. సైన్య నిర్వహణ విషయంలో ఏయే విధానాలు అవలంబించాలో, యుద్ధచర్యలలో ఏయే విధానాలు అవలంబించాలో మొదలైనవాటిని ప్రభుత్వమంత్రిమండలి నిర్ణయించి, వాటిని మంత్రిమండలిలో ఏర్పాటుచేయబడిన డిఫెన్సు కమిటీద్వారా రక్షణశాఖామంత్రికి తెలియజేస్తారు. రక్షణశాఖామంత్రి, యీ విధానాలను తన కార్యాలయంద్వారా వివిధబలాల అధిపతులకు తెలియజేసి, అవి అమలుజరిగేటట్టు చూస్తాడు.

## సైన్యం

ఇండియాసైన్యం అనేకభాగాలుగా విభజింపబడివుంది. అవేమిటంటె: కవచదళాలు; ఫిరంగి దళాలు; సైనిక ఇంజనీరు దళాలు; కాల్బలము; మోటారు దళాలు; వైద్యసహాయ దళాలు; గుమస్తా దళాలు;

## నేషనల్ కేడెట్ కోర్

ఇండియాలోని యువకులకు సైనికశిక్షణను యివ్వడానికీ, అలా శిక్షణపొందినవారిలో అర్హులైనవారికి సైన్యంలో ఉద్యోగాలు యివ్వడానికీ ఒక పథకం తయారుచేయబడింది. ఈ పథకంప్రకారం ఇండియాలో నేషనల్ కేడెట్ కోర్ స్థాపింపబడుతుంది. కేడెట్ అంటె సైనికశిక్షణ పొందే యువకుడని అర్థం. కోర్ అంటె దళం అని అర్థం. ఇలాటి నేషనల్ కేడెట్ కోర్‌ను స్థాపించడానికి కేంద్రప్రభుత్వంవారి పథకానికి అన్నిరాష్ట్రాల ప్రభుత్వాలవారూ అంగీకరించారు.

ఈ పథకం ఏమిటంటే: ఈ దళం రెండుభాగాలుగా వుంటుంది. భాగానికి డివిజన్ అని పేరు. సీనియర్ డివిజన్, అంటే కాలేజి విద్యార్థుల దళం; జూనియర్ డివిజన్ అంటే హైస్కూలు విద్యార్థుల దళం. ట్రెయినింగు ఆరంభించిన నాలుగు సంవత్సరాలలో, అంటె 1948 నుంచి 1952 నాటికి, సీనియర్ దళంలో 32,500 మందికీ, జూనియర్ దళంలో 1,35,000 మందికీ సైనికశిక్షణ యివ్వబడుతుంది.

మొదటిసంవత్సరంలో, అంటే 1948 ఆగస్టునుంచి ఒక ఏడాదిలోపల సీనియర్ డివిజన్‌లో 15,000 మందికీ, జూనియర్ డివిజన్‌లో 30,000 మందికీ తర్ఫీదు యివ్వడానికి నిశ్చయింపబడింది. అదేప్రకారం ఏర్పాట్లు కూడా ప్రారంభమైనవి.

నేషనల్ కేడెట్ కోర్‌లో ప్రతివిద్యార్థీ చేరాలని నిర్బంధం లేదు. ఇష్టంవచ్చినవారే చేరవచ్చును. ఇలాచేరి, తర్ఫీదుపొందినవారు తప్పనిసరిగా సైన్యంలోచేరి యుద్ధకార్యాలలో పాల్గొనాలనే నిర్బంధం కూడా ఏమీలేదు. ఈ తర్ఫీదు కేవలమూ, యువకులకు సైనికశిక్షణను యిచ్చి, వారు ప్రయోజకులుగా తయారయేటట్లు చెయ్యడానికే ఉద్దేశింపబడింది.

జూనియర్ డివిజన్‌లో చేర్చుకొనబడే కేడెట్ వయస్సు 13 ఏండ్లకులోపు వుండకూడదు; 17 ఏండ్లకు మించకూడదు.

## ప్రాంతీయసైన్యదళాలు
## (Territorial Army)

సైన్యంలో చేరి పనిచేస్తున్న వారికేగాక, దేశంలోని యువకులందరికీ సైనికశిక్షణ యివ్వవలసిందనీ, అవసరంవచ్చినప్పుడు దేశరక్షణ కార్యాలలో సైన్యానికి చేదోడుగావుండేటట్లు ప్రాంతీయ సైన్యదళాలను ఏర్పాటు చేయవలసిందనీ, చాలామంది నాయకులు కోరారు. ఈ కోరికను అనుసరించి, ఇండియా ప్రభుత్వంవారు ప్రాంతీయ సైన్యదళాలను ఏర్పాటు చెయ్యడానికి నిశ్చయించారు.

ప్రథమంలో, యీ ప్రాంతీయసైన్యం సంఖ్య 1,30,000 వుంటుంది. ఇది ఎనిమిది దళాలుగా విభజింపబడి వుంటుంది. ఒకొక్కదళానికి ఒకొకప్రాంతం నిర్ణీతమై వుంటుంది. ఆ ప్రాంతాలు ఏవంటే:

(1) తూర్పు పంజాబ్‌రాష్ట్రం; తూర్పుపంజాబ్ సంస్థానాల యూనియన్; ఢిల్లీ. (2) యునైటెడ్ ప్రావిన్సెస్ (3) సెంట్రల్

ప్రావిన్సెసు, తూర్పు సంస్థానాలు. (4) బొంబాయి, కథియవాడ్. (5) మదరాసు; మైసూర్, తిరువాంకూరు సంస్థానాలు. (6) బీహార్; ఒరిస్సా. (7) పశ్చిమ బెంగాల్; కూచ్ బీహార్. (8) అస్సాం; త్రిపుర, మణిపుర్ సంస్థానాలు.

ఈ దళాలుచేసే పనిఏమిటంటే: యుద్ధపరిస్థితులు ఏర్పడినపుడు, సైన్యానికి తగినవారు లభించేటట్లు సహాయకరంగావుండటం; సైన్యం యుద్ధకార్యాలలో నిమగ్నమైవున్నందున, ఆంతరంగిక దేశరక్షణ కార్యాలలో పోలీసువారికి సహాయపడుతూ అల్లరులు, కల్లోలాలు జరుగ కుండా శాంతిభద్రతలను కాపాడడం: తీరరక్షణ, విమానదాడి ప్రతి ఘటన మొదలైన పనులలో పాల్గొనడం. అవసరమైనప్పుడు దేశ రక్షణలో పాల్గొని, దేశస్వాతంత్ర్యాన్ని కాపాడడానికి సహాయపడా లనే ఉత్సాహం గలవారంతా, యీదళంలోచేరి సైనికశిక్షణను పొంద వచ్చును.

## నేషనల్ వార్ ఎకడెమీ

ఇండియాలోని సైన్య, నౌకా, విమాన దళాలలోని ఆఫీసరు ఉద్యోగాలకు భారతీయులను తయారు చెయ్యడానికి ఒక కళాశాల (మిలిటరీ ఎకడెమీ) ని స్థాపించడానికి ఇండియా ప్రభుత్వంవారు నిశ్చ యించారు. ఈ కళాశాల, రెండవ ప్రపంచ యుద్ధంలో భారతీయ సైన్యాలు చూపిన ప్రతిభకు చిహ్నంగా పరిగణింప బడుతుందనికూడా ప్రకటింపబడింది. అదే వుద్దేశంతో, దీనికి నేషనల్ వార్ ఎకడెమీ అనేపేరు పెట్టబడింది.

ఈ కళాశాలను ఎక్కడ స్థాపించాలో, దానికి ఏపేరుపెట్టాలో, శిక్షణ పద్ధతులు ఎలా వుండాలో, విద్యార్థుల వయస్సు, అర్హతలు ఎలా వుండాలో నిర్ణయించడానికి ప్రభుత్వంవారు ఒక కమిటీని నియమిం చారు. ఆ కమిటీచేసిన సలహాలను ఆమోదిస్తూ, 1948 మే 2 తేదిన ఇండియా ప్రభుత్వం చేసిన ప్రకటనను బట్టి, యీ ఎకడెమీస్థాపన పథకం ఇది:

నేషనల్ వార్ ఎకడెమీ, పూనావద్దనున్న ఖరకవస్లవద్ద స్థాపింప బడుతుంది. ఇండియా సైన్య, నౌకా, విమాన దళాలకు ఆఫీసర్లను తర్ఫీదు చెయ్యడానికి ఇది ఉద్దేశింపబడింది. దీనిలో చేర్చుకొనబడే విద్యార్థులు, కేవలం అర్హతలనుబట్టే ఎన్నుకోబడుతారు. వారివయస్సు 15 ఏండ్లకుపైన 19 ఏండ్లకులోపు వుండాలి. దీనిలో చేరడానికి ముందు వారు మెట్రిక్యులేషన్ గాని, దానితో సమానమైన పరీక్షగాని చదివి వుండాలి. దీనిలో చేర్చుకొనబడిన విద్యార్థులకు తర్ఫీదు, భోజనవసతి, దుస్తులు ఉచితంగా యివ్వబడుతవి. ఇక్కడ తర్ఫీదు మూడేళ్లు వుంటుంది. నౌకాశాఖలో చేరదలచిన విద్యార్థులు మాత్రం, 15 ఏటనే చేరాలి. సైన్యశాఖలో చేరదలచిన యువకులు, మూడేళ్ల తర్ఫీదు అయిన తరువాత, మరొక ఏడాది యిక్కడవుండి యితర సైన్య శాఖలనుగురించి నేర్చుకోవాలి.

ఖరకవస్లలో, యీ కళాశాలకు కావలసిన భవన నిర్మాణం జరిగే వరకు, యీ కళాశాల డేరాడూన్‌లో నిర్వహింప బడుతుంది. ఈ శిక్షణకు ఎన్నుకోబడే విద్యార్థుల మొదటి జట్టుకు తర్ఫీదు 1949 జనవరిలో ప్రారంభమాతుంది.

దీనిలో ప్రతిసంవత్సరమూ 600 లేక 700 మంది విద్యార్థులు చేర్చుకొన బడుతారు.

## నౌకాదళం

ఈనాటి ఇండియా నౌకాదళపు పుట్టుక, 1612 లో జరిగిందని చెప్పవచ్చును. ఆ రోజులలో డచ్చివారు పోర్చుగీసువారు తమ నౌకలను ఆటంకపరచకుండానూ, సముద్రపుదొంగలు తమ నౌకలను దోచుకోకుండానూ, తమ నౌకలలో సాయుధ నావికదళాలను వుంచుకోడానికి నిశ్చయించి, ఈస్టిండియాకంపెనీవారు రెండు సాయుధనౌకలను ఏర్పాటు చేసుకున్నారు. క్రమేపీ, యీ నౌకలసంఖ్య పెరిగి, ఇండియాప్రభుత్వాధిపత్యంలో పెద్దనౌకాదళమే ఏర్పడింది.

1947 ఆగస్టులో భారతదేశవిభజనతోపాటు, నౌకాదళవిభజన కూడా జరిగింది. ఆనాటి నౌకాదళంలో మూడింట రెండువంతులు ఇండియావంతుకు వచ్చింది. ఇండియావంతుకు వచ్చిన నౌకలు ఏమిటంటే

స్లూప్స్: సట్లెజ్, యమున, కృష్ణ, కావేరి.

ఫ్రిగేట్స్: తీర్, కుక్రి.

మైన్‌స్వీపర్స్: ఒరిస్సా, డెక్కన్, బీహార్, కుమయూన్, ఖైబర్, రోహిల్‌ఖండ్, కర్నాటిక్, రాజపుటానా, కొంకణ్, బొంబాయి, బెంగాల్, మదరాస్.

కార్వెట్: అస్సాం.

సర్వేనౌక: ఇన్వెస్టిగేటర్.

ట్రాలర్స్: కలకత్తా, కొచ్చిన్, అమృతసర్.

ఇవికాక, నాలుగు మోటారుమైన్‌స్వీపర్లు, హార్బర్లరక్షణకు ఉపయోగపడే నాలుగు మోటారులాంచిలు, భారతనౌకాదళంలో వున్న రేవుపడవలుకూడా ఇండియావంతుకు వచ్చాయి.

ఇండియా నౌకాదళాన్ని వృద్ధిచేసే ఉద్దేశంతో, ప్రభుత్వం బ్రిటనునుంచి 'ఏచిల్లిస్' అనే 7030 టన్నుల క్రూయిజరును కొన్నారు. 'ఢిల్లి' అనే పేరుతో ఇది, ఇండియా నౌకాదళ అగ్రనౌకగా ఇండియాకు 1948 జులై 5 తేదిన అప్పగించబడింది.

ఇండియాతీరం చాలా పొడవైనది కనుక, ప్రస్తుతంవున్న నౌకాదళం, తీరరక్షణకు చాలదు. పదేళ్ళలో, ఇండియా నౌకాదళాన్ని తగినంతగా విస్తరింపచెయ్యడానికి ప్రభుత్వం ఒక పథకాన్ని తయారుచేశారు. నౌకాదళంలో పనిచేసే నావికసైనికులు (రేటింగ్స్)కు

ట్రైయినింగు బొంబాయి, విశాఖపట్టణములలో ఇవ్వబడుతున్నది. నౌకాదళంలో ఆఫీసర్లుగా తర్ఫీదు పొందడానికి 47 మంది ఇంగ్లండు పంపబడినారు.

ఎక్కువమంది యువకులు నౌకాదళంలో చేరి, అతిముఖ్యమైన యీ దేశరక్షణ సేవలో పాల్గొనవలసిన అవసరం ఎంతేనావుంది.

## విమానదళం

భారతదేశంలో మొట్టమొదటి విమానదళం, 1933 ఏప్రిల్‌లో ఏర్పాటుచేయబడింది. ఆ విమానదళపు బలపుసంఖ్య ఎంతంటే: మూడు విమానాలు; అరుగురు వైమానికులు. ఇంత స్వల్పబలంతో ఆరంభమైన విమానదళం, రెండవ ప్రపంచయుద్ధం ముగిసేటప్పటికి పది స్క్వాడ్రనుల బలంగా తయారయింది. వీటిలో ఎనిమిది యుద్ధచర్యలలో పాల్గొనే విమానాలుగల స్క్వాడ్రనులు, రెండు యుద్ధసామగ్రిని సరఫరా చేసేవి.

1947 ఆగస్టులో దేశవిభజనతోపాటు విమానదళ విభజనకూడా జరిగింది. యుద్ధచర్యలలో పాల్గొనే విమానాలుగల స్క్వాడ్రనులు ఏడు, యుద్ధసామగ్రిని సరఫరాచేసే విమానాలుగల స్క్వాడ్రను ఒకటి ఇండియావంతుకు వచ్చాయి.

ఇండియా వైశాల్యం, ఇండియాకుగల ప్రాముఖ్యతనుబట్టి, ప్రస్తుతంవున్న విమానదళపు బలం చాలదు. ఈ దళాన్ని బాగా విస్తరింపచెయ్యడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు.

ఇండియా విమానదళంలో బాంబరు స్క్వాడ్రనులు, జెట్ విమాన స్క్వాడ్రనులుకూడా ఏర్పాటుచేయబడుతవి. అయిదుసంవత్సరాలలో, విమానదళపు బలం మొత్తం 15 స్క్వాడ్రనులు చెయ్యడం ప్రభుత్వం సంకల్పం.

ప్రస్తుతం కోయంబత్తూరు, జోధ్ పూర్, అంబాల, బెంగుళూరు, మదరాసులలో వైమానికులకు తర్ఫీదునిచ్చే కేంద్రాలువున్నాయి. ఇండియాలో తర్ఫీదుపొందిన వైమానికులలో కొందరిని ప్రతిఏటా ఇంగ్లండు పంపి, ఉత్తమశిక్షణను యిప్పించడానికికూడా ఏర్పాట్లుచేయబడినవి.

## వీ ర స త్కా ర ం

ఇండియా సైన్య, నౌకా, విమానదళాలలో అసాధారణమైన ధైర్య స్థైర్యాలను ప్రదర్శించిన వీరులను సత్కరించడానికి, ఇకముందు యీ క్రింది బిరుదములను ఇవ్వడానికి కేంద్రప్రభుత్వంవారు నిశ్చయించారు.

ప్రథమ సత్కారం: పరమ వీర చక్ర
ద్వితీయ సత్కారం: మహా వీర చక్ర
తృతీయ సత్కారం: వీర చక్ర.

పరమ వీర చక్ర పతకసత్కారం, ఇంతకుపూర్వం బ్రిటీషు ప్రభుత్వం యిచ్చే విక్టోరియా క్రాస్ పతకంతో సమానమైన హోదాగలది.

## వి క్టో రి యా క్రా స్

విక్టోరియా క్రాస్ పతక బహుమానం, 1856 జనవరి 29 తేదీన, విక్టోరియారాణి ఉత్తరువు ననుసరించి అమలులోకి వచ్చింది. ఈ పతాకాన్ని క్లుప్తంగా వి. సి. అంటారు.

యుద్ధంలో అసమానమైన సాహసాన్ని ప్రదర్శించినవారికి యీ పతకం యివ్వబడుతుంది. అలాటివారు, ఆ సాహసకార్యాలను చెయ్యడంలో తమ ప్రాణాలను పోగొట్టుకున్నట్లయితే, వారి వారసులకు యివ్వబడుతుంది. ఒకసారి వి. సి. పతకాన్ని పొందిన వ్యక్తి, ఆతరువాత మళ్ళీ గొప్ప సాహసకార్యాన్ని చేసినట్లయితే, వి. సి. బార్ యివ్వబడుతుంది.

వి. సి. పతకాన్ని పొందిన వ్యక్తికి, ఏడాదికి 10 పౌనులు బహుమతి యివ్వబడుతుంది. వి. సి. తోపాటు బార్‌నుకూడా పొందిన వారికి, ప్రతిబార్‌కూ అదనంగా ఏడాదికి అయిదేసి పౌనులు యివ్వబడుతుంది. వి. సి. ని పొందినవ్యక్తి సైన్యంలోనుంచి విడుదల పొందిన తరువాత ఏమీ ఉద్యోగం సంపాదించుకోలేక, మనుగడకు యిబ్బంది పడేటట్లయితే, అతనికి యిచ్చే వార్షిక బహుమతి 75 పౌనులవరకూ ఎక్కువ చేయబడుతుంది,

1911 వరకూ యీ పతకం బ్రిటిషు సైనికులకు మాత్రమే యివ్వబడేది. ఆ తరువాత భారతీయ సైనికులకుకూడా యీ పతకాన్ని యివ్వవచ్చునని నిర్ణయం జరిగింది.

1920 లో సైన్యంలో పనిచేసే నర్సులకూ, హాస్పిటల్సులో పనిచేసేవారికీ, సైన్య, నౌకా, విమాన శాఖలవారి అధ్వర్యంలో, ఆశాఖలలో ఉద్యోగం లేకపోయినా పనిచేసే స్త్రీ పురుషులకూ కూడా, గొప్ప సాహసకార్యాలను చేసినప్పుడు యీ పతకాన్ని యివ్వడానికి నిర్ణయింపబడింది.

## వి. సి. ని పొందిన భారతీయులు

సిపాయి ఛటాసింగ్, నాయక్ దర్వాన్‌సింక్ నేగి, డఫాదార్ గోవిందసింగ్, లెఫ్టినెంట్ ఇషార్‌సింగ్, నాయక్ కర్ణ బహదూర్ రాణా, నాయక్ ఖుదాదాద్‌ఖాన్, కులవీర్‌థపా, నాయక్ షామద్ ఖాన్, లెఫ్టినెంట్ ప్రేమేంద్రసింగ్ భగత్, సుబేదార్ రిచ్‌పాల్ రాం, హావల్దార్ ప్రకాశశింగ్, లాల్‌బహదూర్‌థపా, హవిల్దార్ ఛేలురాం, జమేదార్ గజఘాలె, నాయక్ నందసింక్, సిపాయి కమల రాం, గంజూలామా, అగన్‌సింగ్‌రాజ్, నేత్ర బహదూర్‌థపా,

జమేదార్ అబ్దుల్ హఫీజ్, నాయక్ యశ్వంత గాడ్గే, తుల్ బహదూర్ పుణ్, లెఫ్టినెంట్ కరంజిత్ సింగ్, సిపాయి నామదేవ్ జాధవ్, సిపాయి అలిహైదర్, జమాదార్ రామసరూప్ సింగ్, సిపాయి భండారిరాం, జమేదార్ ప్రకాశసింగ్, లాన్స్‌నాయక్ షేర్‌షా, నాయక్ జ్ఞాన్‌సింగ్, నాయక్ ఫజల్‌దీన్, హవిల్దార్ ఉమ్రావ్‌సింగ్, షేర్‌బహదూర్‌థపా, థమన్‌గురుంగ్, షేర్‌షా, భన్‌భక్త గురుంగ్, లక్ష్మన్ గురుంగ్.

## జార్జి క్రాస్

జార్జిక్రాస్ పతాకాన్ని, యుద్ధకాలంలో, సైనికులుకాని యితరులు, గొప్పధైర్యం ప్రదర్శించవలసిన కార్యాలను చేసినప్పుడు వారికి యివ్వవలసిందని జార్జిరాజు 1940 సెప్టెంబరు 24 వ తేదిన ఉత్తరువుచేశారు.

ఈ పతకాన్ని ఒక్క విక్టోరియాక్రాసుకు తప్ప మిగతా పత్రకాలన్నిటికీ అగ్రభాగాన ఎడమరొమ్ముమీద ధరించాలి.

సైనికులకుకూడా గొప్పధైర్యాన్ని ప్రదర్శించినప్పుడు, వేరే సైనిక గౌరవము వారికి యివ్వనప్పుడు, జార్జిక్రాస్ యివ్వబడుతుంది. స్త్రీలుకూడా, యీ పతాకాన్ని పొందడానికి అర్హులే.

## జార్జిక్రాసును పొందిన భారతీయులు

హవల్దార్ అబ్దుల్ రహమన్, హవిల్దార్ సేజర్‌యార్ అహమద్, బల్దేవ్‌సింగ్, చౌధురి భీమసింగ్ యాదవ, లాన్స్‌నాయక్ మతాదీన్, చిత్రబహదూర్ గురుంగ్, నాయక్ కృపారాం, కెప్టెన్ మహమద్‌ఖాన్ దురాని, జమాదార్ బద్రాస్గర్‌షేర్‌ఖాన్, బాబు భూపేంద్రనారాయణ్ సింగ్, బాబు రంజిత్ సింగ్, నాయక్ బర్కత్ సింగ్, సుబేదార్ సుబ్రహ్మణ్యం, నాయక్ నందలాల్ థపా, సవార్ జిట్టోరాం.

# రైళ్ళు

భరతఖండంలో విభజనకు పూర్వం రైలుదారి అంతా, మొత్తం 40,509 మైళ్ళ పొడవు వుంది. మొట్టమొదట ఈ దేశంలో 1853 లో బొంబాయినుంచి కల్యాణ్ వరకు 21¾ మైళ్ళు, కలకత్తానుంచి మిర్జాపూర్ వరకు సుమారు 100 మైళ్ళు, రైలుదారివెయ్యడం జరిగింది. తరువాత అక్కడక్కడ కొద్దిగా రైలుదార్లు పడినప్పటికీ 1880 వరకు యీ విషయంలో పెద్ద ప్రయత్నం ఏమీ జరగలేదు. 1878 లో వచ్చిన కరువు (ధాతకరువు) తరువాత, కరవును నివారించడానికి నియమించబడిన కమిషనువారు, దేశంలో రైలుదార్లు విస్తారంగావుంటే, ఆహారధాన్యాలను కరువువచ్చిన ప్రదేశాలకు పంపడానికి ఎక్కువ సదుపాయం వుంటుందని సూచించారు. అప్పటినుంచీ, రైలుదార్లు ఎక్కువగా వెయ్యడం జరిగింది.

ఆ తరువాత, దేశంలో వ్యాపారం బాగా వృద్ధిపొందడమూ, ప్రజలు ప్రయాణాలను ఎక్కువగా చేస్తూవుండటమూ రైల్వేల ఆదాయాన్ని వృద్ధిపొందించాయి. కంపెనీల యాజయాన్యంలోవున్న రైల్వేలు, లాభం హెచ్చినకొద్దీ, రైలుదార్లను ఎక్కువగా వేశాయి.

ఇటీవలివరకు, మనదేశంలో చాలా రైలుదారులు ప్రత్యేకంగా అనేక కంపెనీల యాజమాన్యంలోనే వుంటూవచ్చాయి. కాని, ఇండియా గవర్నమెంటు, యీ కంపెనీలనుంచి రైలుదార్లన్నిటినీ కొనివేశారు. ఇప్పుడు దేశంలోవున్న రైలుదార్లన్నీ, సంస్థానాలలో వున్నవి కాక, కేంద్ర ప్రభుత్వపరిపాలనలో వున్నాయి.

రైల్వే వ్యవహారాల నన్నిటినీ చూడడానికి, కేంద్ర ప్రభుత్వంలో ఒక మంత్రి వున్నాడు. ఆయనకు సలహాలు యివ్వడానికి రైల్వేబోర్డు వుంది. ఈ బోర్డుకు అధ్యక్షుడు ఛీఫ్ కమిషనర్. రైల్వేల పరిపాలన అంతా ఈయనద్వారానే జరుగుతుంది.

దేశవిభజన తరువాత, ఇండియాలోవున్న రైలుదారి పొడవు మొత్తం 33,984 మైళ్లు అని తేలింది. దీనిలో, 1010 మైళ్ళ దూరంలో రెండు జతల పట్టాలు, అంటే రెండురైళ్ళు ఒకేసారి ఎదురెదురు దిక్కులలో నడవడానికి వీలుగా, వేయబడినవి. దేశవిభజన తరువాత 1948 ఏప్రిల్ 1-వ తేదినాటికి ఇండియాలోని రైళ్వేల వివరాలివి,

| | |
|---|---|
| మొత్తం మైళ్ళు : | 33,984 |
| ఇంజనులు : | 7,565 |
| ప్యాసెంజరు పెట్టెలు: | 15,000 |
| గుడ్సు పెట్టెలు : | 1,93,020 |
| పనివారు : | 10,00,000 |

## తరగతులు

ఇండియాలోని రైళ్వేల నన్నిటినీ మూడు తరగతులుగా విభజించారు. సంవత్సరానికి 50 లక్షల రూపాయలకు పైబడిన ఆదాయం వచ్చేవి, మొదటితరగతి రైళ్వేలు. రు. 50 లక్షలలోపు, రు. 10 లక్షల పైన ఆదాయంగలవి రెండవతరగతి. పదిలక్షలలోపు ఆదాయంకలవి, మూడవతరగతి.

మొదటితరగతి రైళ్వేలు ఇవి: అస్సాం, బెంగాల్ నాగపూర్, బొంబాయి బరోడా అండ్ సెంట్రల్ ఇండియా, ఈస్టు ఇండియన్, గ్రేట్ ఇండియన్ పెనిన్సులా, మదరాస్ అండ్ సదరన్ మహారాటా, తూర్పు పంజాబ్, ఔధ్ తిర్హుత్, సౌత్ ఇండియన్, బికనీర్ స్టేట్, జోధపూర్, మైసూర్ స్టేట్, నైజాంస్టేట్ రేళ్వేలు.

## రైలుదారి వెడల్పు

దీనినే గాజ్ అంటారు. ఇండియాలో రైలుదార్లు రెండు గాజ్ లలో వున్నాయి: బ్రాడ్ గాజ్, మీటర్ గాజ్. బ్రాడ్ గాజ్ వెడల్పు, $5\frac{1}{2}$ అడుగులు; మీటర్ గాజ్ వెడల్పు, 3 అడుగుల $3\frac{3}{8}$ అంగుళాలు.

# భారతదేశపు రైల్వేలు

ప్రయాణీక మహాశయులారా, మీ సుఖంకోసం యీ క్రింది నియమములను పాటించండి.

* వీలైనంత ముందుగా స్టేషనుకు రండి.
* అందరితోపాటు, వంతుగా మీ టిక్కెట్టు కొనండి.
* మీ ప్రక్క నుండనక్కరలేని సామానును, బ్రేక్ వాన్‌లో వెయ్యండి.
* లైసెన్సు కూలీలచేతనే మీ సామానును మోయించండి.
* వారికి, నిర్ణీతపుకూలినే ఇవ్వండి.
* దిగేవారు దిగినతరువాతనే మీరు ఎక్కండి.
* కదిలేరైలు ఎక్కబోయి, ప్రాణానికి మోసం తెచ్చుకోవద్దు.
* కూచునేజాగాలో సామానులు పెట్టవద్దు.
* తలుపులు తెరచి గుమ్మంవద్ద నిలబడవద్దు.
* కిటికీలలోనుంచి తొంగిచూడవద్దు.
* టిక్కెట్ లేకుండా ప్రయాణంచేసేవారిని అధికార్లకు చూపండి.
* రైల్వే పెట్టెలలో ఉమ్మరాదు.
* నిప్పుతో అజాగ్రత్త, నలుగురుండేచోట పనికిరాదు.
* ఉద్యోగుల తప్పులను ఎన్నడంలో, విచక్షణ చూపండి.
* నిబంధనలు మీకు విసుగు కలిగించవచ్చును, అవి మీ క్షేమానికే.

ఎం. ఎస్. ఎం., ఎస్. ఐ. రైల్వేల పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరు గారిచే ప్రకటించబడినది.

మదరాసు—2.

## రైల్వేపెట్టెల తరగతులు

ఇటీవలివరకు ఇండియాలోని రైల్వే ట్రెయినులలో ఫస్టుక్లాసు, సెకండ్‌క్లాసు, ఇంటర్‌క్లాసు, థర్డ్‌క్లాసు అనే నాలుగు రకాలపెట్టెలు వుండేవి. 1949 జనవరి 1 తేదినుంచి, యీ నాలుగు రకాలపెట్టెలకు బదులుగా, ఒకటవ, రెండవ, మూడవ క్లాసులనే పేరుతో మూడు రకాల పెట్టెలనే నడుపుతున్నారు. అంటే, పూర్వపు సెకండుక్లాసును తీసివేసి, పూర్వపు ఇంటరు తరగతి పెట్టెలను ఇప్పుడు సెకండ్‌క్లాసు పెట్టెలుగా మార్చివేశారు. తదనుగుణ్యంగా, రైల్వే చార్జిలుకూడా మార్చబడినవి.

## రైల్వే చార్జీలు

దేశంలోని రైల్వేలనన్నిటినీ ప్రభుత్వం స్వాధీనంలోకి తీసుకోవడంతో, రైల్వేలలో ప్రయాణికుల పెట్టెల తరగతులను దేశమంతటా ఒకేవిధంగా మార్చడంతో రైల్వే ప్రయాణికులవద్దనుంచి వసూలుచేసే చార్జీలనుకూడా, దేశమంతటా ఒకేపద్ధతిలో అమలుజరుపడానికి ప్రభుత్వం నిశ్చయించారు. 1949 జనవరి 1 నుంచి కొత్తరేట్లు అమలులోనికి వచ్చాయి. ప్రయాణికుడు ఎంతదూరం ప్రయాణంచేసినా, తాను ప్రయాణంచేసే తరగతినిబట్టి, మైలుకి ఇంత అని నిర్ణీతచార్జీ యిచ్చుకోవాలి. ఆచార్జీలు ఇవి:

ఒకటవక్లాసు: మైలుకి 24 పైసలు.

రెండవక్లాసు: మెయిలు, ఎక్స్‌ప్రెసు ట్రెయినులలో మైలుకి 9 పైసలు;
ప్యాసెంజరు ట్రెయినులలో మైలుకి $7\frac{1}{2}$ పైసలు.

మూడవక్లాసు: మెయిలు, ఎక్స్‌ప్రెసు ట్రెయినులలో మైలుకు 5 పైసలు.
ప్యాసెంజరు ట్రెయినులలో మైలుకి 4 పైసలు.

రెండవక్లాసులో ప్రయాణంచేసేవారు, చాలాదూరం ప్రయాణం చేస్తూన్నట్లయితే, పడకకు సీటు రిజర్వుచేసుకోవచ్చు.

ఆసీటుకి చార్జీలు ఇవి:

బ్రాడ్ గాజ్ పెట్టెలో అయితే, టిక్కట్టు ఖరీదుమీద అదనంగా ఒకరాత్రికి పది రూపాయలు; ఒక రాత్రికి అర్ధరూపాయ చొప్పున రిజర్వు చేయించుకోడానికి చార్జి.

మీటర్ గాజ్ పెట్టెలలో, మెయిలు, ఎక్స్ప్రెస్ ట్రెయినులలో అయితే, టిక్కట్టు ఖరీదుమీద అదనంగా ఒకరాత్రికి ఎనిమిదిరూపాలు; రిజర్వుచేసుకొనే చార్జి ఎనిమిదణాలు.

మీటర్ గాజ్ పెట్టెలలో, ప్యాసెంజర్ ట్రెయినులలో అయితే, టిక్కట్టు ఖరీదుమీద అదనంగా ఒకరాత్రికి ఆరురూపాయలు; రిజర్వు చేసుకొనేచార్జి ఎనిమిదణాలు.

## కొన్ని ముఖ్య నగరాల దూరం

దూర ప్రయాణం చెయ్యగోరేవారికి, ఆయానగరాలు మదరాసు, బెజవాడలనుంచి ఎంతదూరాన వున్నదీ వివరాలు యీ క్రింద యివ్వబడినవి. ఆ దూరాన్నిబట్టి, తాము ఏక్లాసులో ప్రయాణంచేస్తారో, ఆక్లాసుకు మైలుకు అయే చార్జినిబట్టి, టిక్కట్టు ఖరీదు ఎంత అవుతుందో లెక్క కట్టుకోనచ్చును.

| నగరం | మదరాసునుంచి మైళ్ళు | బెజవాడనుంచి మైళ్ళు |
|---|---|---|
| అలహాబాద్ | 1250 | 982 |
| బొంబాయి | 794 | 714 |
| కాశీ | 1334 | 1066 |
| కలకత్తా | 1032 | 764 |
| కాన్పూర్ | 1243 | 975 |
| కటక్ | 778 | 510 |
| ఢిల్లి | 1361 | 1093 |
| లక్నో | 1288 | 1020 |
| నాగపూర్ | 682 | 414 |

## 1949-50 బడ్జెటు

ఇండియా ప్రభుత్వ రైల్వే మంత్రి ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ 1949-50 రైల్వే బడ్జెటును, ఇండియా పార్లమెంటులో 1949 ఫిబ్రవరి 15 న ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి:

| | |
|---|---|
| మొత్తం ఆదాయం అంచనా : | రు. 210,00,00,000 |
| మొత్తం ఖర్చు అంచనా: | రు. 177,68,00,000 |
| పెట్టుబడిమీద వడ్డీ చార్జీలు : | రు. 22,88,00,000 |
| మిగులు (అంచనా): | రు. 9,44,00,000 |

అసలు ప్రయాణీకులవలననూ గుడ్స్‌చార్జిలవల్లనూ దాదాపు 205 కోట్ల 85 లక్షల రూపాయలు ఆదాయం వస్తుందనీ, రైల్వేలను నడపడానికి మొత్తం 159 కోట్ల, మూడులక్షల రూపాయలు అవుతుందనీ అంచనా.

## ఎం. ఎస్. ఎం. రైల్వే

ఒక్క విశాఖపట్నంజిల్లాలో కొంతభాగంలో తప్ప, మిగతా తెలుగుజిల్లా లన్నిటిలోనూ రాకపోకల సదుపాయాలను కలిగించేది, యీ రైల్వే ఒక్కటే. ఈ రైలుదారి మొత్తం, మదరాసురాష్ట్రంలోనూ బొంబాయిరాష్ట్రంలోను వున్న భాగాలన్నీ కలిపి, 2938.47 మైళ్ళు.

1947-48 సంవత్సరానికి యీ రైల్వేకి సంబంధించిన వివరాలు ఇవి:

| | |
|---|---|
| పెట్టుబడి మొత్తం : | రు. 56 కోట్ల 58 లక్షలు. |
| ఖర్చులు : | రు. 13 కోట్ల 67 లక్షలు. |
| ఆదాయం (1947-48) : | రు. 18 కోట్ల 59 లక్షలు. |
| మూడవతరగతిలో ప్రయాణం చేసినవారిసంఖ్య : | 8 కోట్ల 41 లక్షలు. |
| మూడవరతరగతి ప్రయాణీకుల వల్ల వచ్చిన ఆదాయం : | రు. 6 కోట్ల 19 లక్షలు. |
| రైల్వేలో పనిలో వున్నవారు : | 77,539 |
| రైల్వే ప్రమాదాలు: | 1712 |
| ప్రమాదాలలో చనిపోయినవారు: | 5 |
| ప్రమాదాలవల్ల గాయపడినవారు: | 42 |

# రోడ్లు

రోడ్ల నిర్మాణం విషయంలో, భరతఖండం ఇతర దేశాలతో పోల్చిచూస్తే చాలా వెనకపడివున్నదని చెప్పవచ్చును. చాలా గ్రామాలు, రోడ్లతో సంబంధంలేకుండా వున్నాయి. ఎన్నో గ్రామాలకు, రోడ్డు ప్రక్కనే వున్న ఏ చిన్న బస్తీలోనో దిగి డొంకదారులలో నడిచి చేరుకోవాలి. సరియైనరోడ్లు లేకపోవడంచేత గ్రామస్థులకు పట్టణాలనుంచి సరకులను తెప్పించుకోవడానికిగాని, గ్రామాలలో దొరికే పండ్లు, కూరగాయలు, పాలు, పట్టణాలకి పంపించడానికి వీలులేకపోతున్నది.

బ్రిటనులో ప్రతి 100 చదరపుమైళ్ళ దేశానికి 200 మైళ్ళ రోడ్లూ, అమెరికాలో ప్రతి 100 చదరపుమైళ్ళ దేశానికి 100 మైళ్ళ రోడ్లూవుంటే, మనదేశంలో 100 చదరపుమైళ్ళ దేశానికి 35 మైళ్ళ రోడ్లు వున్నాయి. ఈ రోడ్లుకూడా పక్కా రోడ్లుకావు.

ప్రస్తుతం భరతఖండంలో నాలుగు ట్రంకురోడ్లు వున్నాయి. ఖైబర్ కనుమనుంచి కలకత్తాకు ఒకటి, కలకత్తానుంచి మదరాసుకు ఒకటి, మదరాసునుంచి బొంబాయికి ఒకటి, బొంబాయినుంచి ఢిల్లీకి మరొకటి. ఈ నాలుగు ట్రంకురోడ్ల పొడవు సుమారు 5,000 మైళ్లు. ట్రంకురోడ్లు కాక, ట్రంకురోడ్లను జిల్లానగరాలకు కలిపే రోడ్లూ, జిల్లానగరాలనుంచి తాలూకా పట్టణాలను కలిపేరోడ్లూ అక్కడనుంచి కొన్ని పెద్దగ్రామాలకు వెళ్ళేరోడ్లూ కూడా వున్నాయి.

1940 మార్చి 31 తేదినాటి కొలతప్రకారం, భరతఖండంలో సిమెంటుతోగాని, తారుతోగాని వేసినరోడ్లు 64,070 మైళ్లు. కంకరతో వేసినరోడ్లు 19,542 మైళ్లు. మామూలుగా గ్రామాలకువేసిన రోడ్లు (కంకర లేకుండా, వానలులేని కాలంలో మోటారు వెళ్ళడానికి వీలుగావున్నవి) 102,554 మైళ్ళు. మోటార్లు ఎప్పుడూ వెళ్ళడానికి

వీలులేని పల్లెటూరిరోడ్లు 99,147 మైళ్లు. (దేశం మొత్తంమీద అన్నిరకాల రోడ్లూ కలిపి 285,313 మైళ్ళు ఉన్నట్లు తేలింది, ఈ మొత్తం రోడ్లలో, 40,473 మైళ్ల రోడ్లు పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటువారి పరిపాలనలో వున్నాయి. మిగతావి, లోకల్ బోర్డుల పరిపాలనలో వున్నాయి.

రోడ్లను వేయించడము, వాటిని సరిగా వుంచేట్లు చూడటము, ఏ రాష్ట్రంలో ఆ రాష్ట్రపు ప్రభుత్వపు బాధ్యత. 1929 లో కేంద్ర ప్రభుత్వంవారు సెంట్రల్ రోడ్ డెవలప్‌మెంట్ ఫండు అని ఒక నిధిని ఏర్పాటుచేశారు. పెట్రోల్ పన్ను అంతా యీ నిధికి ఆదాయం. వచ్చిన దానిలో నూటికి 15 వంతులు కేంద్రప్రభుత్వంవారు తమ అధీనంలో వుంచుకొని, మిగతా భాగాన్ని రాష్ట్రాలకు పంచిపెడతారు. కేంద్ర ప్రభుత్వ అధీనంలోవున్న డబ్బు, రోడ్ల విషయంలో పరిశోధనలు చేయించడానికి, కేంద్రప్రభుత్వ రోడ్లశాఖకు అయే ఖర్చుకీ వినియోగింపబడుతుంది. ఖర్చులుపోగా. 1939-40 లో యీ నిధి క్రింద 11,93,47,000 రూపాయలు నిలవ తేలింది.

రాష్ట్రాలవారిగా లెఖచూస్తే, విభజనకు పూర్వం అత్యధికంగా రోడ్లువున్న రాష్ట్రం బెంగాల్, ఈ రాష్ట్రంలో 91,192 మైళ్ళ రోడ్లు వున్నాయి. అయితే, దీనిలో సిమెంటు, తారు కలిపి వేసినరోడ్లు 3,887 మైళ్ళే. మదరాసు రాష్ట్రంలో మొత్తం రోడ్లపొడవు 35,717 మైళ్ళే అయినప్పటికీ, దీనిలో సిమెంటు, తారు కలిపి వేసిన రోడ్లు 21,441 మైళ్ళు.

దేశవిభజనవల్ల, 1947 ఆగస్టు 15 నాటికి భరతఖండంలో వున్న మొత్తం 2,96,468 మైళ్ల రోడ్లలోను, 246,605 మైళ్లు ఇండియాలోకి, 49,863 మైళ్లు పాకిస్తాన్‌లోకి వచ్చాయి.

# రిజర్వ్ బ్యాంక్

ఇండియా రిజర్వ్ బ్యాంక్, 1934 లో ప్యాసయిన రిజర్వ్‌బ్యాంకో ఆఫ్ ఇండియా ఆక్టు ననుసరించి 1935 ఏప్రిల్ 1 తేదిన స్థాపించబడింది.

ఒకవాటా నూరేసి రూపాయల చొప్పున, మొత్తం అయిదు కోట్ల రూపాయల మూలధనంతో యీ బ్యాంకి స్థాపించబడింది. వాటా దార్లందరూకూడా, పూర్తిగా తమ వాటా మొత్తములను చెల్లించారు. ఈ వాటాలలో, 2,20,000 రూపాయల వాటాలను కేంద్రప్రభుత్వం కొన్నది. మిగతావన్నీ ప్రత్యేక వ్యక్తులు కొన్నారు. ఈ వాటాదార్లకు పంచిపెట్టే డివిడెండు, నూటికి అయిదురూపాయలకు మించకూడదని నిబంధన చేయబడింది. అయితే, బ్యాంకి ఖర్చులు మొదలైనవన్నీపోగా డివిడెండ్ ఎంత యివ్వాలనేది కేంద్ర ప్రభుత్వం నిర్ణయిస్తారు. గత అయిదు సంవత్సరాలలోనూ, యీ బ్యాంకి వాటాదార్లకు, నూటికి 3½ రూపాయల డివిడెండు యివ్వబడినది.

ఈ బ్యాంకి పరిపాలనను సాగించడానికి, పరిశీలించడానికి ఒక సెంట్రల్‌బోర్డు నియమింపబడుతుంది. దానిలో 16 మంది సభ్యులు. వీరిలో రిజర్వు బ్యాంక్ గవర్నరు ఒకరు, డిప్యూటీ గవర్నరు ఒకరు. కేంద్రప్రభుత్వంచే నామినేట్ చేయబడిన డైరక్టర్లు నలుగురు, వాటా దార్లతరపున ఎన్నుకొనబడిన డైరక్టర్లు ఎనిమిదిమంది, కేంద్రప్రభుత్వం చేత నామినేట్ చేయబడిన ప్రభుత్వోద్యోగి ఒకరు.

1935 ఏప్రిల్ 1 తేదిన, ఇది స్థాపించబడినప్పటినుంచీ, ఇండియాలో కరెన్సీనోట్లను జారీచెయ్యడం, గవర్నమెంటు డబ్బును దాచడం మొదలైనపనులు యీ బ్యాంకికి అప్పగించబడినవి. 1935 జులై 5 తేదిన, ఇండియాలోని షెడ్యూల్డ్ బ్యాంకులన్నీ తమ డిపాజిట్లను రిజర్వ్‌బ్యాంకిలోనే వెయ్యడం జరిగింది.

ఈ బ్యాంకికిగల ఇతర ఆఫీసులు రెండు రకాలు. బ్యాంకింగు శాఖ; కరెన్సీ జారీచేసేశాఖ. బ్యాంకింగుశాఖ ఆఫీసులు ఢిల్లి, బొంబాయి, కలకత్తా, మదరాసులలోను, కరెన్సీ జారీచేసేశాఖ (ఇష్యూడిపార్టు

మెంట్) ఆఫీసులు బొంబాయి, కలకత్తా, మదరాసు, కాన్పూరులలోను ఉన్నాయి. బ్యాంకింగుశాఖ బ్రాంచిఆఫీసు ఒకటి కాన్పూరులోకూడా వుంది. రిజర్వ్‌బ్యాంకి ఆఫీసులు లేనిస్థలాలలో, దీని పనినంతనూ ఇంపీరియల్ బ్యాంకి నిర్వహిస్తుంది.

ఇష్యూ డిపార్టుమెంట్ ద్వారా, ఇండియాలో చెలామణిఅయే కరెన్సీనోట్లు అన్నీ యీ బ్యాంకే జారీచేస్తుంది. ఈ నోట్ల చెలామణీకి కేంద్రప్రభుత్వం హామీ వుంటుంది. ప్రజలకు కావలసిన నోట్లను, నాణెములను తగినంతగా చెలామణీలోకి తేవడానికి, యీ బ్యాంకి ఇష్యూ ఆఫీసులలో అన్నివిలువలలోను నోట్లున్నూ, నాణెములున్నూ నిలవలో వుంచబడినవి.

ప్రధానంగా, రిజర్వ్‌బ్యాంకి ఇండియాకు కేంద్రబ్యాంకి అని చెప్పవచ్చును. ఇది చేసేపనులు ఏమిటంటే: నోట్లను జారీచెయ్యడం; గవర్నమెంటుకు బ్యాంకరుగాను, డబ్బువిషయములలో ఏజెంటుగాను, సలహాదారుగాను పనిచెయ్యడం; ఇండియా తరఫున సంపాదించబడిన విదేశీయకరెన్సీని, విదేశాలలో ఇండియాకుగల డబ్బుకు ఒక కేంద్ర ఆవర్జాను తయారుచెయ్యడం; దేశంలోని అనేకబ్యాంకుల రిజర్వు ధనాన్ని కాపాడడం, అవసరమైతే వాటికి అప్పు ఇవ్వడం.

రిజర్వ్‌బ్యాంకిని, ప్రైవేటు వ్యక్తులవాటా ఆధిపత్యంలోనుంచి ప్రభుత్వ యాజమాన్యంలోకి తీసుకోవాలని (నేషనలైజ్ చెయ్యడం) ఇటీవల ప్రచారం చాలా ఎక్కువగా జరిగింది. ప్రజాభిప్రాయాన్ని అనుసరించి 1948 అంతంలో, యీ బ్యాంకిని నేషనలైజ్ చెయ్యడానికి చట్టాన్ని ప్యాసుచేశారు. 1949 జనవరి 1 నుంచి రిజర్వ్‌బ్యాంకి, ప్రభుత్వసంస్థగా దేశీయమైపోయింది.

## నాణెములు - చెలామణి

ప్రస్తుతము ఇండియాలో డబ్బు వ్యవహారానికి ప్రధాన నాణెము రూపాయి. రూపాయి నాణెరూపములలోను, నోటురూపములోనూ చెలామణీలో వున్నది. రూపాయిని మించిన విలువగల నాణెము ఏమీ చెలామణీలోలేదు.

ఇండియాలో వాడుకలోవున్న నాణెములు. రూపాయి; అర్ధ రూపాయి; పావలా (రూపాయిలో నాల్గవవంతు); బేడ (రూపాయిలో ఎనిమిదవ వంతు); అణా (రూపాయిలో పదహారవ వంతు); అర్ధణా (రూపాయిలో 32 వంతు) కాని (రూపాయిలో 64 వంతు); దమ్మిడీ (రూపాయిలో 192వ వంతు).

మదరాసురాష్ట్రంలో వాడుకలో లేనప్పటికీ, ఒరిస్సా మొదలైన కొన్ని రాష్ట్రాలలో రెండు దమ్మిడీల నాణెంకూడా వాడుకలోవుంది.

గవర్నమెంటు తరఫున రిజర్వు బ్యాంకువారు చెలామణీలోకి తెచ్చిన 1, 2, 5, 10, 50. 100, 1000, 10,000 రూపాయల నోట్లు వుండేవి. కాని, 1945 జనవరి 13 తేదిన కేంద్ర ప్రభుత్వవారు ఒక ఆర్డినెన్సు ప్రకటించి, 500, 1000, 10,000 రూపాయల నోట్లను రద్దు చేశారు.

ఇలా చెయ్యడానికి ప్రభుత్వంవారు చెప్పిన కారణం ఏమిటంటే: చాలమంది వ్యక్తులు యుద్ధకాలంలో చేసిన వ్యాపారంలో, సరకులను వాటి అసలు ఖరీదులకన్న చాలా ఎక్కువలాభాలకు అమ్మి, ఆ లాభపు సొమ్మును తమ పద్దులలో కనపరచకుండా, వెయ్యిరూపాయల నోట్లరూపంలో దాచిపెట్టుకున్నారు. అందువల్ల, వారివద్దనుంచి, ఆ లాభాలమీదకూడా ఇన్‌కంటాక్సు వసూలుచెయ్యడానికి వీలులేక పోయింది. ఈ ఆర్డినెన్సువల్ల, ప్రతివ్యక్తీకూడా తన దగ్గరవున్న పెద్ద నోట్లను బ్యాంకికి తీసుకొనివెళ్ళి, ఆ నోటు తనకు ఎలావచ్చిందో వివరాలన్నీ చెపితేగాని, డానికి చిల్లర యివ్వరు. అలా చెప్పడంలో, ఆ వ్యక్తి ఇన్‌కంటాక్సు ఆఫీసర్లకు దొరికిపోతాడు. బ్యాంకికి వెళ్ళి, ప్రభుత్వం నిర్ణయించిన గడువు, సుమారు ఒకనెల లోపల ఆ నోట్లను మార్చుకోక పోతే, ఆ నోటు ఎందుకూ పనికిరాదు.

ఈ ఆర్డినెన్సువల్ల కలిగినఫలితం ఏమిటంటే—చాటుగా అన్యాయపు ధరలకు వస్తువులను అమ్మి డబ్బు కూడబెట్టినవారు కొందరు నష్ట పడడం: లంచాలు తీసుకొని, ఆ డబ్బును బ్యాంకులలో వేసుకుంటే దొరికిపోతామేమోనని, వెయ్యిరూపాయల నోట్లరూపంగా డబ్బు దాచు

కున్న లంచగొండి వుద్యోగులెవరైనా వుంటే వారు తమ అన్యాయార్జిత విత్తాన్ని కోల్పోవడం.

ఇదివరకు, రూపాయి, అర్ధరూపాయి, పావలా నాణెములు వెండివి చెలామణీలో వుండేవి. యుద్ధకాలంలో తక్కువ వెండితోను, ఎక్కువ నికెల్‌తోను, యీ నాణెములు తయారు చేశారు. కాని, 1946 మే 23 న కేంద్ర ప్రభుత్వంవారు, యికముందు కేవలం నికెల్‌తోనే అర్ధరూపాయలను, పావలాలను తయారుచెయ్యడానికి నిర్ణయించారు.

ప్రపంచంలోని ముఖ్యదేశాలలోని ప్రధాన నాణెములు, వాటికి రూపాయి మారకపు రేటు వివరాలు యీ క్రింద ఇవ్వబడినవి :

| దేశం | నాణెము | మారకంలో రూపాయిలు |
|---|---|---|
| యునైటెడ్ స్టేట్సు | డాలరు | 3·309 |
| కెనడా | డాలరు | 3·309 |
| బ్రజిల్ | క్రూజిరో | 1·709 |
| బెల్జియం | ఫ్రాంక్ | 0·075 |
| ఫ్రాన్సు | ఫ్రాంక్ | 0·015 |
| ఇటలీ | లీరా | 0·006 |
| హాలెండ్ | గిల్డర్ | 1·247 |
| ఇంగ్లండ్ | పౌను | 13·333 |
| జర్మనీ | మార్క్ | 0·333 |
| ఈజిప్టు | పౌను | 13·674 |
| జపాన్ | ఎన్ | 0·222 |
| సిలోన్ | రూపాయి | 1·000 |
| ఆఫ్ఘనిస్తాన్ | రూపాయి | 0·253 |
| ఆస్ట్రేలియా | పౌను | 10·667 |
| పర్షియా | రియల్ | 0·103 |

# ఇన్‌కంటాక్స్

1949 ఫిబ్రవరి 28 తేదిన ప్రతిపాదింపబడిన ఆర్థిక శాసనం ప్రకారం, యీ క్రింద ఉదహరింపబడిన రేట్లలో, ఇన్‌కంటాక్స్ (ఆదాయపు పన్ను) వసూలుచేయబడుతుంది. ఈ ఆదాయం, సంవత్సరం మొత్తానికి (ఏప్రిల్ 1 నుంచి, మార్చి 31 వరకు) వచ్చిన ఆదాయంగా లెఖ్ఖ మాడాలి.

మొత్తం ఆదాయంలో—

(1) మొదటి రు. 1,500 ల మీద — పన్ను లేదు

(2) తరువాతి రు. 3,500 ల మీద — రూపాయికి ముక్కాని

(3) తరువాతి రు. 5,000 ల మీద — రూపాయికి ఏడు కానులు

(4) తరువాతి రు. 5,000 ల మీద — రూపాయికి రెండున్నర అణాలు

(5) తరువాతి మొత్తంమీద — రూపాయికి అయిదణాలు.

అయితే ఎవరిసంపాదన అయినా సంవత్సరానికి రు. 2,500 లకు మించనట్లయితే, వారు పన్ను చెల్లించ నక్కరలేదు.

రు. 2,500 లకు పైగా ఆదాయం వచ్చేవారు, రు. 2,500 లకు పైన తమకు ఎంత ఆదాయం వస్తుందో దానిలో సగాన్ని మించిన పన్నును ఎప్పుడూ కట్టనక్కరలేదు.

ప్రతివ్యక్తికీ, అతని సంపాదనలో అయిదవ వంతు, నాలుగు వేలకు మించకుండా 'ఎరన్డ్ ఇన్‌కం' క్రింద, పన్నునుండి మినహాయించుడానికిగాను, మొత్తం ఆదాయంలో నుంచి తీసివేయబడుతుంది.

పై లెఖ ప్రకారం, ఒక సంవత్సరంలో ౩౦ వేల రూపాయలు సంపాదించిన వ్యక్తి ఎంత పన్ను కట్టాలో యీ క్రింద పట్టీవల్ల తేలుతుంది.

| | | |
|---|---|---|
| అసలు సంపాదన | రు. | 30,000 |
| ఎర్న్డు ఇన్‌కం | రు. | 4,000 |
| పన్ను కట్టవలసిన ఆదాయం | రు. | 26,000 |

| | |
|---|---|
| మొదటి రు. 1,500 లకు పన్ను లేదు | |
| తరువాతి రు. 3,500 లకు రూపాయకు ముక్కాని లెఖన | 164-1-0 |
| తరువాతి రు. 5,000 లకు రూపాయకు 0-1-9 లెఖన | 546-14-0 |
| తరువాతి రు. 5,000 లకు రూపాయకు రెండున్నర అణా లెఖన | 781-4-0 |
| తరువాతి రు. 11,000 లకు రూపాయకు అయిదణాల లెఖన | 3431-4-0 |
| రు. 26,000 మీద చెల్లించవలసిన పన్ను రు. | 4883-7-0 |

ఇదికాక, ఎక్కువ ఆదాయం వచ్చినవారు సూపర్‌టాక్సు మొదలైనవి కూడా యిచ్చుకోవాలి.

## నేషనల్ సేవింగ్సు

ప్రతివ్యక్తీ తాను సంపాదించేదానిలో కొంత డబ్బు, ముందు అవసరానికిగాని, వృద్ధాప్యానికిగాని దాచుకోవడం అలవాటు చేసుకోవాలి. అలా దాచుకున్న డబ్బును, అది వృద్ధిపొందే పద్ధతిలో, అసలుకి నష్టం రాకుండా పెట్టుబడిగా వినియోగించడం, జాగ్రత్త గలవారు చెయ్యవలసినపని. అలా పెట్టుబడి పెట్టడం మూడువిధాలు. మంచి పద్ధతులమీద నడుపబడుతున్న బ్యాంకిలలో దాచుకోవడం; ఇన్సూరెన్సు చెయ్యడం; నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు కొనడం. బ్యాంకిలలో డబ్బు దాచుకోవడం విషయమై వివరాలను ఏ బ్యాంకి మేనేజరును అడిగినా చెపుతాడు. ఇన్సూరెన్సు వివరాలను, ఏ యిన్సూరెన్సు ఏజెంటును అడిగినా చెపుతాడు. నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్ల వివరాలు ఇవి.

నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు కొనడం అంటే, డబ్బును గవర్న మెంటువద్ద దాచుకోవడం అన్నమాట. ఇలా దాచుకున్న డబ్బును, అయిదేళ్ళు దాచుకుంటే నూటికి ఏడాదికి మూడురూపాయల వంతున, ఏడేళ్ళు దాచుకుంటే నూటికి ఏడాదికి మూడున్నరరూపాయల వంతున; 12 సంవత్సరాలకు నూటికి ఏడాదికి 4½ వంతున వడ్డీయిస్తారు. అయితే, యీ సర్టిఫికెట్లను ఎన్ని సంవత్సరాల గడువుకు కొంటే అన్ని సంవత్సరాలూ అలాగే వుంచ నక్కరలేదు. అవసరం కలిగినట్లయితే, గడువు లోపలనే వాటిని మార్చుకోవచ్చును. అప్పటివరకు అయిన వడ్డీతో సహా తమ డబ్బు తాము తీసుకోవచ్చును.

ఈ సర్టిఫికెట్లు రు 5; 10; 100; 1000; 5,000 విలువలలో, సేవింగ్సు బ్యాంకిగల ఏ పోస్టాఫీసులోనైనా దొరుకుతవి.

ఒక వ్యక్తి తన పేరుమీద, 25,000 రూపాయల విలువగల సర్టిఫికెట్లను కొనవచ్చును. ఈ సర్టిఫికెట్లమీద కూడే వడ్డీమీద ఇన్‌కం టాక్సు లేదు,

# రాజ్యాంగ సంస్కరణలు

బ్రిటిషు ప్రభుత్వంవారు ఈస్టిండియాకంపెనీ చేతిలోనుంచి భారత దేశ పరిపాలనాబాధ్యతను, 1858 లో తమ చేతిలోకి తీసుకున్నారు. తరువాత, 1861 లో బెంగాల్, బొంబాయి, మదరాసు, పంజాబ్, సరిహద్దు రాష్ట్రాలలో చిన్న శాసనసభలు ఏర్పాటు చెయ్యడమూ, 1853 లో స్థాపింపబడిన కేంద్రశాసనసభకు, అనధికారసభ్యులను నియమించడమూ జరిగింది. అయితే యీ శాసనసభలకు నిజమైన అధి కారాలు ఏమీ లేవు. 1892 లో, కేంద్రశాసనసభసభ్యులకు, ప్రభుత్వం వారి బడ్జెటునుగురించి చర్చించడానికీ, పరిపాలనా వ్యవహారాలలో కొన్నిటినిగురించి ప్రభుత్వ చర్యలను విమర్శించడానికీ అధికారం యివ్వబడింది.

కాని, కొంతవరకు చెప్పదగిన సంస్కరణలు 1909 లో అమలు జరుపబడినవి. వీటినే, మింటో—మార్లే సంస్కరణలు అంటారు. వీటి వల్ల, శాసనసభాసభ్యులసంఖ్య కొంచం పెంచబడింది. సభలలో అనధికారసభ్యులసంఖ్య, అధికారసభ్యులకన్న ఎక్కువచేయబడింది. కొన్ని నిబంధనలకు లోబడి, శాసనసభ్యుల ఎన్నికకు వీలు కలుగజేయబడింది. మొట్టమొదటసారి, రాజప్రతినిధి కౌన్సిలులో భారతీయుణ్ణి నియమించడం జరిగింది. అంతేకాక, రాష్ట్రీయగవర్నరుల కౌన్సిళ్ళలో కూడా, భారతీయులను నియమించడం జరిగింది. ప్రజాక్షేమానికి సంబంధించిన విషయాలన్నిటినిగురించీ, శాసనసభలలో చర్చించడానికి వీలు కలుగజేయబడింది.

1919 చట్టప్రకారం మళ్ళీ కొత్తసంస్కరణలు అమలులోకి వచ్చాయి. వీటికి మాంటెగు—ఛెమ్సుఫర్డు సంస్కరణలు అని పేరు. ఈ సంస్కరణలవల్ల, రాష్ట్రాలలో ద్వంద్వప్రభుత్వం అమలుజరుపబడింది. శాసనసభలు చర్చించే విషయాలకు సంబంధించిన పరిపాలన సాగించే మంత్రులు వేరు; గవర్నరు, ప్రజల యిష్టానిష్టములతో సంబంధంలేకుండా పరిపాలించే విషయాలలో గవర్నరుకు సలహాలిచ్చి, పరిపాలన సాగించే ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లు వేరు. భారతదేశంలోని అన్నిరాష్ట్రాలలోను శాసనసభలు ఏర్పాటుచేయబడ్డాయి. ఈ 1919 చట్టం 1921 జనవరిలో అమలులోకి వచ్చింది.

తరువాత సైమన్‌కమిషన్ నివేదికను అనుసరించి, 1935 చట్టం, 1937 ఏప్రిల్‌లో భారతదేశంలో అమలుజరుపబడింది. ఈచట్టప్రకారం, రాష్ట్రాలకు స్వపరిపాలనాధికారం ఎక్కువగా యివ్వబడింది. కాని, రాష్ట్రీయ గవర్నరులకు రాష్ట్రీయమంత్రివర్గాల నిర్ణయాలను త్రోసిపుచ్చే ప్రత్యేకాధికారాలు యివ్వబడినవి. అయినప్పటికీ, సాధారణ పరిస్థితులలో గవర్నరులు యీ అధికారాలను ఉపయోగించరనే హామీనిపొంది, ఎన్నికలలో విశేషంగా విజయంపొందిన కాంగ్రెసు వివిధరాష్ట్రాలలో 1937 జులైలో మంత్రివర్గాలను ఏర్పాటుచేసింది.

బ్రిటిషు పరిపాలనలో వున్న రాష్ట్రాలూ, స్వదేశ సంస్థానాలూ కలసిన కేంద్రపరిపాలనా వ్యవస్థను ఫెడరేషన్ అనే పేరుతో స్థాపించడం కూడా 1935 సంవత్సరపు రాజ్యాంగచట్టపు ఉద్దేశం. ఈ విషయంలో, రాజప్రతినిధి వివిధసంస్థానాధిపతులతో రాయబారాలు జరుపుతూ వుండగానే, 1939 సెప్టెంబర్ 1 తేదిన రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది.

ఈ యుద్ధం ప్రారంభం అవడంతోనే, శాసనసభల సమ్మతి తెలుసుకోకుండానే రాజప్రతినిధి భారతదేశంకూడా జర్మనీకి ప్రతికూలంగా యీ యుద్ధంలో పాల్గొంటున్నట్లు ప్రకటించాడు. ఈ చర్యపట్ల నిరసనభావాన్ని తెలియజేస్తూ కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా యిచ్చాయి. కాంగ్రెసుకూడా, యుద్ధకార్యాలతో సహకారం చెయ్యడానికి నిరాకరించింది.

1942 లో జపాను యుద్ధంలో ప్రవేశించగానే, యుద్ధకార్యాలలో భారతదేశపు సంపూర్ణసహకారాన్ని పొందడానికి, బ్రిటిషుప్రభుత్వం వారు నూతనరాజ్యాంగవిధానాన్ని ప్రతిపాదిస్తూ, దీనిపట్ల భారతీయుల ఆమోదాన్ని పొందడానికి బ్రిటిషుమంత్రులలో ఒకడైన సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌ను భారతదేశం పంపించారు. కాని, క్రిప్స్ రాయబారం ఫలించలేదు. సంపూర్ణమైన అధికారం తమచేతికి యివ్వనిదే, యుద్ధకార్యాలపట్ల సంపూర్ణసహకారంతో తాము పనిచెయ్యజాలమని భారతదేశపు రాజకీయపక్షాలవారు స్పష్టపరిచారు. క్రిప్స్ తిరిగి వెళ్ళిపోయారు.

ఒకవంక జపాను విజయం సంపాదిస్తూవుంటే, బ్రిటిషువారు ఎలాగా భారతదేశాన్ని కాపాడలేరని నిశ్చయించుకొని, ప్రజలకు స్వాతంత్ర్యోత్సాహం కలిగితే జపానును ప్రతిఘటించగలరనే ఉద్దేశంతో, కాంగ్రెసు బ్రిటిషుప్రభుత్వంవారిని భారతదేశం విడిచిపొమ్మని కోరుతూ 1942 ఆగస్టు 8 వ తేదీన తీర్మానంచేసింది. ఆ మరునాడే, కాంగ్రెసు నాయకులను ప్రభుత్వం అరెస్టుచేసింది. ఈ అరెస్టులపట్ల అసమ్మతి తెలుపుతూ, దేశమంతటా ప్రజలు విప్లవంచేసినట్టుగా ఎదురుతిరిగారు.

కఠినమార్గాలను అవలంబించి, ప్రభుత్వంవారు యీ తిరుగుబాటును అణచివేశారు. దేశంలో ప్రజలుమాత్రం బ్రిటిషుప్రభుత్వంపట్ల సుముఖతను ప్రకటించలేకపోయారు.

1945 లో యుద్ధం అయినతరువాత, బ్రిటనులో ఎన్నికలలో లేబరుపార్టీ ప్రభుత్వం ఏర్పడినతరువాత, భారతీయనాయకులు విడుదల చేయబడినారు. భారతదేశంలో ఎన్నికలు జరిగాయి. వివిధరాష్ట్రాలలో ప్రజాప్రభుత్వాలు 1946 ప్రారంభంలో ఏర్పడినాయి.

1946 ఏప్రిల్ లో బ్రిటిషుప్రభుత్వం తరఫున ముగ్గురుమంత్రులు, పెథిక్ లారెన్సు ప్రభువు, ఏ. వి. అలెగ్జాండర్, సర్ స్టాఫర్ క్రిప్స్ భారతదేశానికివచ్చి భారతదేశంలో భవిష్యద్రాజ్యాంగ విధానాన్ని గురించి భారతీయనాయకులతో సంప్రతింపులు జరిపారు. వీటిఫలితంగా, 1945 మే 16 వ తేదీన బ్రిటిషుప్రభుత్వం ఒక ప్రకటనచేసింది.

ఆ ప్రకటన సారాంశ మేమిటంటే: వివిధరాష్ట్రీయ శాసనసభలు, ఆ శాసనసభాసభ్యులనుగాని, యితరులనుగాని ఆరాష్ట్రాలలో జనాభాలో పదిలక్షల ప్రజలకు ఒక ప్రతినిధి లెఖలో ఎన్నుకున్న సభ్యులతో ఒక రాజ్యాంగ నిర్మాణసభ ఏర్పాటుచేయబడుతుంది. ఈ లెఖలో బ్రిటిషుపరి పాలనలోవున్న రాష్ట్రాలనుంచి 292 మందీ, స్వదేశ సంస్థానాలనుంచి 93 మందీ, మొత్తం 385 మంది రాజ్యాంగసభకు ఎన్నుకోబడుతారు.

ఈ సభ్యులంతా సమావేశమై ప్రజల హక్కులు, మైనారటీలకు రక్షణ మొదలైన విషయాలనుగురించి నిర్ణయంచేస్తారు.

తరువాత, ఈ సభ్యులు, రాష్ట్రాలవారిగా మూడు (ఏ. బి. సి.) వర్గాలుగా మళ్ళీ సమావేశమౌతారు. ఈ వర్గాలు ఏమిటంటే : ఏ: మద రాసు, బొంబాయి, బీహారు, ఒరిస్సా, యు. పి., సి. పి. రాష్ట్రాలు; బి. పంజాబ్, సింధు, సరిహద్దురాష్ట్రాలు; సి: బెంగాలు, అస్సాం రాష్ట్రాలు.

ఇలా మూడు ప్రత్యేకవర్గాలుగా ఏర్పడిన ప్రతినిధులు ప్రత్యేకంగా తమతమ రాష్ట్రాల పరిపాలనావిధానాలనూ, తమ రాష్ట్రాలు ఆయావర్గాలలో కలిసివుండటమూ, విడివిడిగా వుండటమూ, కలిసివుంటే, ప్రత్యేకంగా తమ వర్గానికి కావలసిన పరిపాలనావిధానం ఏమిటి అనే విషయాలను గురించి నిర్ణయంచేసుకుంటారు. ఇలాటి వర్గాలలో చేరడమూ, మానడమూ అనే విషయాన్ని నిర్ణయించడానికి ప్రతిరాష్ట్రానికి హక్కువుంది.

ఇది జరిగిన తరువాత, వివిధరాష్ట్రాల ప్రతినిధులూ, సంస్థానాల ప్రతినిధులుకూడా కలసి మళ్లీ సమావేశమై, భారతదేశానికంతకూ పరిపాలనా విధానాన్ని తయారుచేస్తారు. అలాటి పరిపాలనావిధానం తయారైన తరువాత, ప్రభుత్వాన్ని పూర్తిగా బ్రిటిషువారు భారతీయులకు అప్పగించివేస్తారు.

ఈ ప్రకటనకు కాంగ్రెసు మొదట అంగీకరించలేదు. కాని తరువాత అంగీకరించింది. ముస్లింలీగు మొదట అంగీకరించింది కాని, తరువాత అంగీకరించలేదు. దేశంలోని అన్ని రాష్ట్రాలలోను యీ రాజ్యాంగ నిర్మాణసభకు (కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీకి) ఎన్నికలు జరిగాయి. 1946 డిసెంబరు 9 వ తేదిన యీ సభాసమావేశం జరిగింది. డాక్టర్ రాజేంద్రప్రసాద్ దీనికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. కాని, ఈ సభలో ముస్లింలీగు పాల్గొనలేదు.

రాజ్యాంగసభలో పాల్గొనే హామీతోనే, కేంద్రప్రభుత్వంలో కాంగ్రెసు నాయకులు 1946 సెప్టెంబరు 2-వ తేదీన, ముస్లింలీగు నాయకులు 1946 అక్టోబరు 26 వ తేదీన, చేరారు.

కాని, రాష్ట్రాలు విడిగా వుండటమూ, వర్గాలలో చేరడమూ అనే విషయాన్ని అవి వర్గాలలో చేరకపూర్వమే నిర్ణయించుకోవచ్చుననే సూచన జరిగినతరువాత, అలా జరిగితే నిర్బంధంగా అస్సామును బెంగాలుతోను, సరిహద్దు రాష్ట్రాన్ని సింధు, పంజాబ్ రాష్ట్రాలతోను కలిపి, పాకిస్తాన్‌ను ఏర్పరచడానికి వీలుండదని, ముస్లింలీగు కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ సమావేశంలో పాల్గొనలేదు.

ఇలా వుంటూవుండగా, 1947 ఫిబ్రవరి 20 వ తేదిన బ్రిటిషు ప్రధాని అట్లీ పార్లమెంటులో ప్రకటనచేస్తూ, 1948 జూన్ నెలలోపున, బ్రిటిషు పరిపాలన భారతదేశంలో విరమించబడుతుందని చెప్పాడు. ఈ లోపున, పరిపాలనను భారతదేశంలో ఎవరికి అప్పగించాటో నిర్ణయించడానికీ, అందుకు తగిన ఏర్పాట్లను చెయ్యడానికీ మౌంట్ బాటెన్ ప్రభువును రాజప్రతినిధిగా భారతదేశం పంపించాడు.

మౌంట్ బాటెన్ ప్రభువు కాంగ్రెసు, ముస్లింలీగు నాయకులతో సంప్రతించి చూశాడు. ముస్లింలీగు నాయకులు, ముస్లింప్రజలు అధిక సంఖ్యాకులుగావున్న ప్రాంతాలను అంటే, సింధు, పంజాబ్, బెంగాల్, సరిహద్దు రాష్ట్రాలను పాకిస్తాన్ అనే పేరుతో, ప్రత్యేకరాజ్యంగా, మిగతారాష్ట్రాలతో సంబంధంలేకుండా ఏర్పాటుచేసితీరాలని పట్టుబట్టారు. దీనికితోడు సుమారు ఏడాదినుంచి దేశంలో బెంగాల్, బీహార్, పంజాబురాష్ట్రాలలో హిందూముస్లిములకు తీవ్రమైన కొట్లాటలుకూడా జరుగుతూవచ్చాయి,

కాంగ్రెసునాయకులు దేశవిభజనకు అంగీకరించలేదు. కాని, ఒకవేళ బ్రిటిషుప్రభుత్వంవారు భారతదేశాన్ని హిందూస్తాన్, పాకిస్తాన్ లగా విభజించడానికి నిశ్చయించినట్లయితే, బెంగాల్, పంజాబ్, రాష్ట్రాలలోకూడా, ముస్లింలు అధికసంఖ్యాకులుగావున్న ప్రాంతాలను, హిందువులు అధికసంఖ్యాకులుగావున్న ప్రాంతాలనుంచి వేరుచెయ్యాలని కోరారు.

ఈ విషయంలో బ్రిటిషు ప్రభుత్వంవారితో ఆలోచించి, వారి నిర్ణయాన్ని తెల్సుకురావడానికి రాజప్రతినిధి, 1947 మే 19 వ తేదిన బయలుదేరి ఇంగ్లండు వెళ్ళేడు. బ్రిటిషు ప్రభుత్వంవారితో సమాలోచనలు జరిపి, మే 29 వ తేదిన ఇంగ్లండులో బయలుదేరి, 30 వ తేదినాటికి ఢిల్లీకి తిరిగి వచ్చివేశాడు.

జూన్ 2 వ తేదీన కాంగ్రెసు తరఫున పండిత జవహర్ లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభభాయి పటేల్, ఆచార్య కృపాలినీలనూ, ముస్లింలీగు తరఫున జిన్నా, లియాకత్ ఆలీఖాన్, అబ్దుర్ రబ్ నిష్టర్ గార్లనూ, శిక్కుల తరఫున సర్దార్ బలదేవసింగునూ సమావేశపరచి రాజ ప్రతినిధి మౌంట్ బాటెన్ ప్రభువు, బ్రిటిషు ప్రభుత్వంవారి ప్రణాళికను తెలియజేశాడు. ఈ ప్రణాళికలోని ముఖ్యాంశాలు ఏమిటంటే: రెండు మూడుమాసాల లోపున బ్రిటిషు ప్రభుత్వంవారు, భారతదేశ పరిపాలనను భారతీయులకు అప్పగించివేస్తారు. అలా అప్పగించేలోపల, భారత దేశంలో ఇప్పటిలాగా ఒకే కేంద్ర ప్రభుత్వంకాక, రెండు కేంద్ర ప్రభుత్వాలు ఏర్పాటుచేయబడుతాయి. హిందువులు అధిక సంఖ్యాకులుగా గల మదరాసు, బొంబాయి, బీహారు, సి. పి., యు. పి., ఒరిస్సా రాష్ట్రాలకూ, అస్సాం రాష్ట్రంలో ముస్లింలు అధికసంఖ్యలోవున్న సిల్హెట్ జిల్లా తప్ప మిగతా ప్రాంతానికీ ఒక కేంద్ర ప్రభుత్వం ఏర్పాటుచేయబడుతుంది. బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో హిందువులు అధిక సంఖ్యలో వున్న ప్రాంతాలను ఆ రాష్ట్రాలలోనుంచి విడదియ్యడం జరుగుతుంది. ఈ ప్రాంతాలు వాటికి యిష్టమతే తక్కిన హిందూ రాష్ట్రాలతోపాటు కలసి, ఒకే కేంద్రప్రభుత్వంలోకి రావచ్చును. ముస్లిములు అధిక సంఖ్యలో వున్న సింధు రాష్ట్రమూ, పంజాబ్, బెంగాలు రాష్ట్రాలలోని భాగాలూ ఒక కేంద్రప్రభుత్వాన్ని కలిగివుంటాయి. ఇది పాకిస్తాన్ అన్నమాట సరిహద్దు రాష్ట్రంలో ప్రత్యేకం, ప్రజాభిప్రాయాన్ని కనుక్కొని ప్రజలకు హిందుస్తాన్లోచేరడం యిష్టమో, పాకిస్తాన్లోచేరడం యిష్టమో తేలిన తరువాత, అలా జరుగుతుంది.

ప్రస్తుతం జరుగుతూవున్న కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీ, హిందూ రాష్ట్రాలకు రాజ్యాంగవిధానాన్ని తయారుచేస్తుంది. ముస్లింరాష్ట్రాలకు రాజ్యాంగవిధానాన్ని తయారుచెయ్యటానికి మరొక కన్సిట్యుయెంట్ అసెంబ్లీ స్థాపించబడుతుంది.

హిందూస్తాన్ కేంద్రప్రభుత్వానికీ, పాకిస్తాన్ కేంద్రప్రభుత్వానికీ బ్రిటిషుప్రభుత్వంవారు కెనడా, ఆస్ట్రేలియా దేశాల ప్రభుత్వాలలాగే సమానప్రతిపత్తి ఇస్తారు. హిందూస్తాన్, పాకిస్తాన్ కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీలు, వాటికి యిష్టమైతే బ్రిటిషు కామన్ వెల్తులో వుండడానికీ, లేదా స్వతంత్ర రాజ్యాలుగా వుండడానికీ రాజ్యాంగవిధానాలను తయారు చేసుకోవచ్చును.

భారతదేశంలోని సంస్థానాలు స్వతంత్రరాజ్యాలు అవుతాయి. ఇవి తమకు యిష్టమైతే ఏ కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీలోనైనా చేరవచ్చును. బ్రిటిషుప్రభుత్వంతో ప్రత్యేకంగా ఒడంబడిక చేసుకోవచ్చును.

ఈ ప్రణాళికను అమలుజరపడానికి రాజప్రతినిధి వెంటనే ఏర్పాట్లు చేస్తాడు.

దీనికి కాంగ్రెసు, ముస్లింలీగు, శిక్కు నాయకులు అంగీకరించారు. తరువాత, బెంగాలు శాసనసభ, పంజాబు శాసనసభలు సమావేశమై ఆ రాష్ట్రాల విభజనకు అంగీకరించాయి.

పై ప్రణాళికను అనుసరించి, బ్రిటిషుప్రభుత్వంవారు, జులై 4 తేదీన పార్లమెంటులో "భారతస్వాతంత్ర్యచట్టా"న్ని ప్రవేశపెట్టారు. (ఆ చట్టం పూర్తిపాఠం 1947-48 ప్రపంచదర్శినిలో ప్రకటింపబడింది). ఆ చట్టప్రకారం భారతదేశం, ఇండియా, పాకిస్తాన్ అనే రెండు స్వతంత్రపరిపాలనగల డొమినియనులుగా ఏర్పడింది.

ఇండియా: మదరాసు, బొంబాయి, సెంట్రల్ ప్రావిన్సెసు, యునైటెడ్ ప్రావిన్సెసు, ఒరిస్సా, తూర్పుపంజాబ్, పశ్చిమబెంగాల్, బీహారు, అస్సాం (సిల్హెట్ జిల్లా మినహాగా) రాష్ట్రాలు. పాకిస్తాన్: సింధు, సరిహద్దురాష్ట్రం, పశ్చిమపంజాబ్, తూర్పుబెంగాల్ (సిల్హెట్ జిల్లాకలిపి) రాష్ట్రాలు.

ఇండియా, పాకిస్తాన్ డొమినియనుల రాజ్యాంగపరిషత్తులకు కొత్తగా ఏర్పడిన తూర్పు, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలనుంచీ, తూర్పు, పశ్చిమ పంజాబ్ రాష్ట్రాలనుంచీ ఎన్నికలు జరిగాయి.

ఇండియాకు రాజధాని ఢిల్లీయే. పాకిస్తాన్‌కు కరాచి రాజధానిగా నిర్ణయింపబడింది.

ఇండియా రాజ్యాంగ పరిషత్తు ప్రథమ సమావేశం 1946 డిసెంబరు 9 తేదీన జరిగింది. అప్పటినుంచి జరుగుతు నేవుంది. పాకిస్తాన్ రాజ్యాంగ పరిషత్తు ప్రథమ సమావేశం 1937 ఆగస్టు 10 తేదీన జరిగింది.

ఈ విధంగా భరతఖండ విభజన పూర్తి అయింది.

# రాజకుటుంబము

జార్జి రాజు: గ్రేట్ బ్రిటన్ (ఇంగ్లండు, స్కాట్లండు), ఐర్లెండు, బ్రిటీషు డొమినియనులకు రాజు. ఐదవ జార్జిరాజు రెండవకుమారుడు, జననం. 1895, డిసెంబరు 14. ఎలిజబెత్ ప్రభ్వితో వివాహం 1923, ఏప్రిల్ 23. అగ్రసోదరుడు ఎనిమిదవ ఎడ్వర్డురాజు రాజత్యాగం చెయ్యగా రాజరికస్వీకారం 1936, డిసెంబరు 11. పట్టాభిషేకం 1937, మే 12.

ఎలిజబెత్ రాణి: స్ట్రాత్‌మోర్ ప్రభువుకుమార్తె. జననం 1900, ఆగస్టు 4. జార్జిరాజు యార్కుప్రభువు హోదాతో నుండగా వివాహం. ఆయన ఆరవజార్జిగా రాజరికము వహించుటతో రాణిహోదా.

ఎలిజబెత్ రాకుమారి: జార్జిరాజు, ఎలిజబెత్ రాణుల ప్రథమ సంతానము. జననం, 1926 ఏప్రిల్ 21. ఇంగ్లండు సింహాసనమునకు వారసురాలు. గ్రీసు రాజకుటుంబానికి చెందిన ప్రిన్స్ ఫిలిప్‌కూ, యీమెకూ వివాహం 1947 నవంబరు, 20 న జరిగినది.

మార్గరెట్ రోజ్ రాకుమారి : జార్జిరాజు, ఎలిజబెత్ రాణుల రెండవసంతానము. జననం. 1930, ఆగస్టు 21.

మేరిరాణి: అయిదవజార్జిరాజు భార్య. జననం, 1867 మే 26. వివాహం 1793, జూలై 6. భర్త రాజరికమును పొందుటతో, 1910, మే 6, న రాణిహోదా. భర్తృమరణము 1936 జనవరి 20.

విండ్సరుప్రభువు: అయిదవజార్జిరాజు, మేరిరాణిల జ్యేష్ఠ పుత్రుడు. జననం 1894, జూన్ 23. తండ్రి జీవితకాలములో వేల్సు యువరాజు హోదా. రాజరికస్వీకారము 1936 జనవరి 20. రాజ్యత్యాగము 1936 డిసెంబరు 11. అప్పటినుంచీ విండ్సరుప్రభువు అని వ్యవహారిక నామము. వివాహం: వాలిస్ వార్ఫీల్డ్ సతితో, 1937 జూన్ 3. రాజ్యత్యాగానికి కారణం, ఆమెను వివాహం చేసుకోదలచుటమే. బహామాస్ దీవులకు గవర్నరుపదవి, 1940 ఆగస్టు నుంచి 1945 మే వరకు. ప్రస్తుతం ఫ్రాన్సులో నివాసము.

గ్లస్టర్ ప్రభువు: అయిదవజార్జిరాజు, మేరిరాణిల మూడవ కుమారుడు. జననం 1900, మార్చి 31, వివాహం ఎలైస్ ప్రభ్వితో, 1935 నవంబరు 6. ఆస్ట్రేలియాగవర్నరుగా పదవిస్వీకారము 30 జనవరి 1945. పదవిత్యాగం: 1946.

విక్టోరియా రాకుమారి: జార్జిరాజు, మేరి రాణిల కుమార్తె. జననం 1897 ఏప్రిల్ 25; వివాహం, హేర్‌వుడ్ ప్రభువుతో, 1922 ఫిబ్రవరి 28.

## సివిల్ లిస్టు

రాజుకీ ఆయనకుటుంబానికీ, ప్రతిసంవత్సరమూ గవర్నమెంటు యిచ్చే డబ్బును 'సివిల్ లిస్టు' అంటారు.

| | |
|---|---|
| రాజుకి (ఆయనపరివారానికీ, రాజభవన పరిచారికులకు జీతాలూ, ఆయన యివ్వదలచుకు సేవిరాశాలూ కలిపి) | 4,10,000 పౌనులు |
| మేరి రాణి | 70,000 పౌనులు |
| ఎలిజబెత్ రాకుమారి | 40,000 పౌనులు |
| గ్లస్టరు ప్రభువు | 35,000 పౌనులు |
| విక్టోరియా రాకుమారి | 6,000 పౌనులు |

ఇండియా, పాకిస్తాన్‌లు రెండూ డొమినియనులుగా వున్నంత వరకూ, యీ రెండు డొమినియనులకూ బ్రిటిషురాజే, రాజుగా వుంటారు.

బ్రిటను తరఫున ఇప్పటివరకూ మనదేశానికి గవర్నర్సు-జనరలుగా వున్నవారు.

క్లైవ్ ప్రభువు 1765
హారీ వెరెల్స్ 1767
జాన్ కార్టర్ 1769
వారన్ హేస్టింగ్స్ 1774
సర్ జాన్ మెక్ఫర్సన్ 1785
కార్న్‌వాలిస్ ప్రభువు 1786
సర్ జాన్ షోర్ 1793
వెలస్లీ ప్రభువు 1798
సర్ జార్జ్ బార్లో 1805
మింటో ప్రభువు 1807
హేస్టింగ్స్ ప్రభువు 1813
ఆమ్‌రెస్ట్ ప్రభువు 1823
విలియం బెంటింక్ 1828
సర్ ఛార్లెస్ మెట్కాఫ్ 1835
ఆక్లండ్ ప్రభువు 1836
ఎలెన్‌బరో ప్రభువు 1842
హార్డింజ్ ప్రభువు 1844
డల్హౌసీ ప్రభువు 1848
కానింగ్ ప్రభువు 1856
ఎల్గిన్ ప్రభువు 1862
సర్ విలియం డెనిసన్ 1863
సర్ జాన్ లారెన్స్ 1864
మేయో ప్రభువు 1869
లార్డ్ నార్త్ బ్రూక్ 1872
లార్డ్ లిట్టన్ 1876
లార్డ్ రిపన్ 1880
లార్డ్ డఫరిన్ 1884
లార్డ్ లాన్స్ డౌన్ 1888
లార్డ్ ఎల్గిన్ 1894
లార్డ్ కర్జన్ 1899
లార్డ్ ఏంప్తిల్ 1904
లార్డ్ కర్జన్ 1904
లార్డ్ మింటో 1905
లార్డ్ హార్డింజ్ 1919
లార్డ్ ఛెమ్స్‌ఫర్డ్ 1916
లార్డ్ రీడింగ్ 1921
లార్డ్ ఇర్విన్ 1926
లార్డ్ విల్లింగ్డన్ 1931
లార్డ్ లిన్‌లిత్‌గో 1936
లార్డ్ వేవెల్ 1943
లార్డ్ మౌంట్ బాటెన్ 1947

# భారత జాతీయగీతము

## [జన గణ మన]

జన గణ మన అధినాయక జయహే భారత భాగ్యవిధాతా।
పంజాబ సింధు గుజరాత మరాటా ద్రావిడ ఉత్కళ వంగ।
వింధ్య హిమాచల యమునా గంగా ఉచ్ఛల జలధితరంగ।
తవశుభ నామే జాగే తవశుభ ఆశిష మాగే
గాహే తవ జయ గాథా
జన గణ మంగళ దాయక జయహే భారత భాగ్యవిధాతా
జయ జయహే జయహే జయజయ జయహే
అహరహతన ఆహ్వాన ప్రచారిత శునితవ ఉదారవాణీ
హిందు బౌద్ధ సిఖ జైన పారసిక ముసల్మాన క్రిస్టానీ
పూరబ పశ్చిమ ఆసే తవ సింహాసన పాసే
ప్రేమ హార హయ గాథా
జన గణ ఐక్య విధాయక జయహే భారత భాగ్యవిధాతా
పతన అభ్యుదయ బంధుర పంథాయుగయుగ ధావితయాత్రీ
తుమి చిర సారథి తవరథ చక్రే ముఖరిత పథ దినరాత్రీ
దారుణ విప్లవ మాఝే తన శంఖధ్వనిబాజే సంకట దుఃఖత్రాతా
జనగణపథపరిచాయక జయహే భారత భాగ్యవిధాతా
ఘోర తిమిర ఘన నిబిడనిశీథే పీడిత మూర్ఛిత దేశే
జాగ్రత ఛిలతవ అవిచల మంగళ నతనయనే అనిమేషే
దుఃస్వప్నే ఆతంకే రక్షాకరిలే అంకే
స్నేహమయీతుమి మాతా
జనగణ దుఃఖత్రాయక జయహే భారత భాగ్యవిధాతా
రాత్రి ప్రభాతిల ఉదిలరవిచ్ఛవి పూర్వ ఉదయగిరి భాలే
గాహే విహంగమ పుణ్యసమీరణ సజీవనరసఢాలే
తవకరుణారుణ రాగేనిద్రిత భారత జాగే తవచరణేనతమాథా
జయజయజయహే జయ రాజేశ్వర భారత
భాగ్యవిధాతా జయహే

— రవీంద్రనాథ ఠాకూర్.

# వందే మాతరం

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం ।
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥

సప్తకోటీ కంఠ కలకల నినాద కరాళే
ద్విసప్తకోటీ-భుజైర్ధృత ఖరకరవాళే
కేబలే మా తుమి అబలే !
బహుబల ధారిణీం నమామి తారిణీం
రిపుదల వారిణీం మాతరం ॥

తుమివిద్యా తుమిధర్మ,
తుమి హృది తుమి మర్మ,
త్వం హి ప్రాణాః శరీరే ।
బాహుతే తుమి మా శక్తి,
హృదయే తుమి మా భక్తి,
తోమారయి ప్రతిమాగడి
మందిరే మందిరే ।

త్వంహి దుర్గా దశప్రహరణ ధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ నమామి త్వాం
నమామి కమలాం అమలాం అతులాం
సుజలాం సుఫలాం మాతరం, వందే మాతరం
శ్యామలాం సరళాం సుస్మితాం భూషితాం
ధరణీం భరణీం మాతరం ॥

—బంకించంద్ర ఛటర్జీ

# ఇండియా ప్రభుత్వం

గవర్నర్-జనరల్ : శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి

పదవీ స్వీకారం: 1948 జూన్ 21:

జీతం నెలకు రు: 5,500 (ఇన్‌కంటాక్సు లేకుండా)

సెక్రటరి : హావాక్స్ ఎ. లాల్

ప్రైవేట్ సెక్రటరి : ఎస్. కృష్ణమూర్తి

మిలిటరి సెక్రటరి : కర్నల్ బి. ఛటర్జి

డిప్యూటి మిలిటరి సెక్రటరి : స్క్వాడ్రన్ లీడర్ డి. ఎస్. ప్రకాశ్, ఆర్. ఐ. ఎ. ఎఫ్.

రాజప్రాసాధాధికారి : మేజర్ ఎ. ఎస్. విల్సన్

అంగరక్షకులు : లెఫ్టినెంట్ పరాశర్ (నౌకాదళం)

కెప్టెన్ మునవర్ జి. ఎస్. బెడి (సైన్యం)

కెప్టెన్ దేవేంద్రసింగ్ (సైన్యం)

కెప్టెన్ యూనస్‌ఖాన్ (సైన్యం)

ప్రెస్ అటాచి: టి. ఆర్. వి. చారి

మంత్రిమండలి: పదవీస్వీకారం—ఆగస్టు 15, 1947.

జీతాలు, ఒక్కొక్కరికి—రు. 3,000

అలవెన్సు— రు. 500

ప్రధానమంత్రి, విదేశవ్యవహారాలు, వైజ్ఞానిక పరిశోధన — పండిత జవహర్‌లాల్ నెహ్రూ

హోం, ప్రచురణ, బ్రాడ్‌కాస్టింగ్, సంస్థానాలు — సర్దార్ వల్లభభాయ్ పటేల్

| | |
|---|---|
| విద్య : | మౌలానా అబుల్ కలాం అజాద్ |
| రక్షణ : | సర్దార్ బలదేవసింగ్ |
| కార్మికులు : | జగజీవనరాం |
| వ్యాపారము : | కె. సి. నియోగి |
| పోస్టు, టెలిగ్రాఫ్ : | రఫీ అహమ్మద్ కిద్వాయ్ |
| ఆరోగ్యం : | రాజకుమారి అమృతకార్ |
| శాసననిర్మాణం : | డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ |
| ఆర్థిక శాఖ : | డాక్టర్ జాన్ మత్తయ్ |
| పరిశ్రమలు : | డాక్టర్ శ్యామప్రసాదముఖర్జి |
| గనులు, వర్క్సు : | ఎన్. వి. గాడ్గిల్ |
| రైల్వేలు : | ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ |
| ఆహారము : వ్యవసాయము | జయరాందాస్ దౌలత్ రాం |
| కాందిశీకులు : | మోహన్‌లాల్ శాక్సినా |
| రైల్వేశాఖ ఉపమంత్రి : | కె. సంతానం |
| ప్రధానమంత్రికి డిప్యూటీ | ఖుర్షిద్ లాల్ |
| ప్రధానమంత్రి ఉపమంత్రి : | సత్యనారాయణసింహ |
| ప్రచురణ, బ్రాడ్ కాస్టింగ్ శాఖ ఉపమంత్రి | ఆర్. ఆర్. దివాకర్ |
| విదేశ వ్యవహారాలు : ఉపమంత్రి | బి. వి. కేస్కార్ |

ఉపమంత్రులకు జీతాలు నెలకు రు. 3,000. వేరే అలవెన్సులు ఏమీ లేవు.

# ఇండియా రాజ్యాంగ పరిషత్తు

అధ్యక్షుడు : డాక్టర్ రాజేంద్రప్రసాద్ (జీతం : రు. 3,000 అలవెన్సు రు. 500).

డిప్యూటీప్రెసిడెంట్లు : వి. టి. కృష్ణమాచారి, డాక్టర్ హెచ్, సి. ముఖర్జి.

సెక్రటరీ : హెచ్. వి, ఆర్. అయ్యంగార్
జాయింట్ సెక్రటరీ : ఎస్. ఎన్. ముఖర్జీ
రాజ్యాంగసలహాదారు : సర్. బి. ఎన్. రావు

## సభ్యులు (రాష్ట్రాలవారిగా)

అజ్మీర్-మార్వార : (ఒకసభ్యుడు). పండితముకుట బిహారి లాల్ భార్గవ.

అస్సాం : మొత్తం సభ్యులు ఎనిమది. వారిలో ఇద్దరు ముస్లింములు. ఆర్గురు ఇతరులు.

జనరల్ : ప్రొఫెసర్ నివారణ చంద్రలాస్కర్; ధరణీధర వసుమతారి; గోపీనాథ బార్డొలాయ్; రెవరెండ్ జె. జె. ఎం. నికొల్స్ రాయ్; కులాధర్ చేలీహ; రోహిణి కుమార చౌధురి.

ముస్లిం : సయ్యద్ మహమ్మద్ సాదుల్లా; సయ్యద్ అబ్దుల్ రవూఫ్.

ఒరిస్సా : మొత్తం సభ్యులు తొమ్మిదిమంది. ఈ రాష్ట్రంలో ముస్లిములకు ప్రత్యేక స్థానంలేదు.

జనరల్ : బి. దాస్; విశ్వనాథదాస్; పర్లాకిమిడి మహారాజా; హరకృష్ణ మెహతబ్; లక్ష్మీనారాయణసాహు; లోకనాథమిశ్ర; నందకిశోరదాస్; రాజకృష్ణబోస్; సంతాను కుమారదాస్.

కూర్గ్ : (ఒక సభ్యుడు) సి. ఎం. పూనచ.

ఢిల్లీ : (ఒక సభ్యుడు), దేశబంధుగుప్త.

తూర్పు పంజాబ్: మొత్తం సభ్యులు—16: ముస్లిములు నలుగురు; శిక్కులు నలుగురు; ఇతరులు 8.

జనరల్: డాక్టర్ బక్షి టేక్‌చంద్; జయరాందాస్ దౌలత్‌రాం; పండిత ఠాకూర్‌దాస్ భార్గవ; ప్రొఫెసర్ యశ్వంతరాయ్; విక్రమలాల్ సోంధి; చౌధురి రణవీరసింగ్; లాలా అచింత్‌రాం; మాస్టర్ నందలాల్.

ముస్లిములు: షేక్ మహబూబ్ ఇలాహి; సుఫీఅబ్దుల్ హమీద్ ఖాన్; మౌలానా దావూద్ ఘజనవి; (ఒక స్థానం ఖాళీ).

శిక్కులు; సర్దార్ బలదేవ్‌సింగ్; జ్ఞాని గురుముఖ్‌సింగ్ ముసాఫర్; సర్దార్ భూపేంద్రసింగ్‌మాన్; సర్దార్ హుకుంసింగ్.

పశ్చిమబెంగాల్: మొత్తం సభ్యులు 21. ముస్లిములు 5; ఇతరులు 16.

జనరల్: డాక్టర్ మనోమోహనదాస్; అరుణచంద్రగుహ; మిహిర్‌లాల్ ఛటోపాధ్యాయ; పండిత లక్ష్మీకాంత మైత్ర; సతీశచంద్ర సామంత; సురేశచంద్ర మజుందార్; ఉపేంద్రనాథ బర్మన్; శ్రీ ప్రభుదయాళ్ హిమత్‌సింగ్‌క; వసంతకుమారదాస్; శ్రీమతి రేణుకరే; డాక్టర్ హెచ్. సి. ముఖర్జి; సురేంద్ర మోహన్‌ఘోష్; డాక్టర్ శ్యామప్రసాదముఖర్జి; అరిబహదుర్‌గురుంగ్; ఆర్. ఇ. ప్లాటెల్; కె. సి. నియోగి.

ముస్లిములు: రఫీబ్‌అహసాన్; జసీముద్దీన్ అహమద్; నజీరుద్దీన్ అహమద్; అబ్దుల్ హమీద్; సర్ అబ్దుల్ హలీం ఘజనవి.

బీహార్: మొత్తం సభ్యులు, 36. ముస్లిములు అయిదుగురు; ఇతరులు 31.

జనరల్: అమియకుమార్‌ఘోష్; అనుగ్రహనారాయణసింహ; బనారసిప్రసాద్ ఝుంఝుంవాలా; భగవత్ ప్రసాద్; బానిఫేస్‌లాక్రా; వ్రజేశ్వర్ ప్రసాద్; చంద్రికారాం; ప్రొఫెసర్ కె. టి. షా; దేవేంద్రనాథ సామంత; దీపనారాయణసింహ; గుప్తనాథ సింగ్; యదువంశ సహాయ్; జగత్‌నారాయణలాల్; జగజీవనరాం; జయపాలసింగ్; మహారాజాధిరాజ కామేశ్వరసింగ్ (దర్భాంగ మహారాజు); కమలేశ్వర

ప్రసాద్ యాదవ్; మహేశప్రసాద్ సింహ; కృష్ణవల్లభసహాయ్; డాక్టర్ రఘునందన్ ప్రసాద్; డాక్టర్ రాజేంద్రప్రసాద్; రామేశ్వర్ ప్రసాద్ సింహ; రామనారాయణసింగ్; డాక్టర్ సచ్చిదానంద సింహ; సారంగధర సింహ; సత్యనారాయణ సింహ; డాక్టర్ పి. కె. సేన్, శ్రీకృష్ణసింహ, శ్రీ నారాయణ మెహత, శ్యామనందన సహాయ్.

ముస్లిములు: హుసేన్ ఇమాం; సయ్యద్ జాఫర్ ఇమాం; సర్దార్ మహమ్మద్ లతీఫుర్ రహమన్; మహమద్ తహీర్; తాజముల్ హుసేన్.

బొంబాయి: మొత్తం సభ్యులు 21. ముస్లిములు ఇద్దరు. మిగతా వారు, 19.

జనరల్: బాలచంద్ర మహేశ్వర్‌గుప్త; శ్రీమతి హంసమెహతా; హరివినాయక పటాస్కర్; డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్; డాక్టర్ జోసెఫ్ ఆల్బన్ డి'సూజా; కన్యాలాల్ నానాభాయ్ దేశాయ్; కేశవ రావు మారుతిరావు జేధ; కండూభాయ్ కసాంజీ దేశాయ్; బాలగంగాధర ఖేర్; సర్ హెచ్. పి. మోడీ; కె. ఎం. మున్షి; నరహర్ విష్ణు గాడ్గిల్; ఎస్. నిజలింగప్ప; ఎస్. కె. పటిల్; రామచంద్ర మనోహర్ నలవాడె; రంగనాథ్ రామచంద్ర దివాకర్; శంకర్ దత్తాత్రేయ దేవ్; జి. వి. మవలాంకర్; సర్దార్ వల్లభభాయ్ పటేల్,

ముస్లిములు: అబ్దుల్ ఖాదర్ మహమద్ షేక్, అబ్దుల్ ఖాదర్ అబ్దుల్ అజీజ్ ఖాన్.

మదరాసు: మొత్తం సభ్యులు 49. వారిలో ముస్లిములకు, ప్రత్యేకించబడిన స్థానాలు నాలుగు. జనరల్ స్థానాలు, 45

జనరల్: ఓ. వి. అలగేశన్; శ్రీమతి అమ్ముస్వామినాథన్; ఎం, అనంతశయనం అయ్యంగార్; మోటూరి సత్యనారాయణ; శ్రీమతి దాక్షాయణి వేలాయుధన్, శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయి, కళా వెంకటరావు, ఎన్. గోపాలస్వామి అయ్యంగార్, డి. గోవిందదాస్, రెవరెండ్

జెరోం డి సూజా; పి. కొక్రన్; కె. కామరాజనాడార్; వి. సి. కేశవ రావు; టి. కృష్ణమాచారి; అల్లాడి కృష్ణస్వామయ్య; ఎల్. కృష్ణస్వామి భారతి; పి. కుణిరామన్; ఎం. తిరుమలరావు; వి. ఐ. మునిస్వామి పిళ్లై; రాజా సర్ ఎం. ఏ. ముత్తయ్య చెట్టియార్; వి. నాడిముత్తు పిళ్ళై, ఎస్. నాగప్ప, పి. ఎల్. నరసింహరాజు, డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య, సి. పెరుమాళ్ళస్వామి రెడ్డి; టంగుటూరి ప్రకాశం; ఎస్. హెచ్. ప్రేటర్; బొబ్బిలి రాజా; ఆర్. కె. షణ్ముఖ చెట్టియార్; టి. ఎ. రామలింగం చెట్టియార్; రామనాథ గొయెంకా; ఓ. పి. రామస్వామి రెడ్డియారు; ఆచార్య ఎన్. జి. రంగా; ఎన్. సంజీవరెడ్డి; కె. సంతానం; బి. శివరావు; కల్లూరు సుబ్బా రావు; యూ. శ్రీనివాస మల్లయ్య; డాక్టర్ పి. సుబ్బరాయన్; పి. సుబ్రమణ్యం; డాక్టర్ వి. సుబ్రహ్మణ్యం; ఎం సి. వీరబాహు పిళ్ళై; పి. ఎం. వేలాయుధపాణి, ఎ. కరుణాకర మీనన్; టి. జె. ఎం. విల్సన్.

ముస్లిములు : మహమ్మద్ ఇస్మాయెల్; కె. టి. ఎం, అహమద్ ఇబ్రాహిం సాహెబ్ బహదుర్; మహబూద్ అలిబేగ్ సాహేబ్ బహదూర్; బి. పోకర్ సాహెబ్ బహదూర్.

యునైటెడ్ ప్రావిన్సెసు : మొత్తం సభ్యులు, 55. ముస్లిములు, 8; ఇతరులు, 47.

జనరల్ : అజిత ప్రసాద జెయిన్; అల్గురాయ్ శాస్త్రి; బాలకృష్ణ శర్మ; వంశీధర మిశ్ర; భగవాన్ దిన్; దామోదర స్వరూప్ సేట్; దయాల్ దాస్ భగవత్; ఎ. ధరందాస్; డాక్టర్ ధరంప్రకాష్; ఆర్. వి. ధులేకార్; ఫెరోజ్ గాంధి; గోపాలనారాయణ్; కృష్ణచంద్రశర్మ, పండిత గోవిందవల్లభపంత్; పండిత గోవిందమాలవీయ; హరిగోవింద పంత్; హరిహరనాథ్ శాస్త్రి; పండిత హృదయనాథకుంజ్రూ; రాజ జగన్నాథబక్ష్ సింగ్; జస్పత్‌రాయ్ కపూర్; పండిత జవహరలాల్ నెహ్రూ; సర్దార్ జోగేంద్రసింగ్; ఆచార్య జుగల్‌కిశోర్; జ్వాలా

ప్రసాద్ శ్రీవత్సవ; డాక్టర్ బి. వి. కేస్కర్; శ్రీమతి కమలచౌధురి; కమలాపతి తివారి; ఖుర్షీద్‌లాల్; ఆచార్య జె. బి. కృపలాని; మహావీర్ త్యాగి; మసూరియా దిన్; మోహనలాల్ శాక్సెనా; సర్ పదంపత్ సింఘానియా; ఫూల్ సింగ్; ప్రాగిలాల్; శ్రీమతి పూర్ణిమ బెనర్జి; పురుషోత్తమదాస్ టాండన్; సర్వేపల్లి రాధాకృష్ణ; రామచంద్ర గుప్త; శివన్‌లాల్ శాక్సెనా; సతీశ చంద్ర; డాక్టర్ జాన్‌మత్తయ్; శ్రీమతి సుచేత కృపలాని, సుందర్‌లాల్; వెంకటేశ నారాయణ తివారి; మోహనలాల్ గౌతమ్; విశ్వంభర్ దయాల్ త్రిపాఠి.

ముస్లిములు: బీగం అయిజాజ్ రసూల్; జస్. హెచ్. లారి అజీజ్ అహమద్‌ఖాన్; మౌలానా హజరత్ మొహానీ; మౌలానా అబుల్‌కలాం ఆజద్; నవాబ్ మహమ్మద్ ఇస్మాయెల్‌ఖాన్; రఫీ అహమ్మద్ కిద్వాయ్; ఎస్. ఎం. రిజ్వాన్ అల్లా.

సెంట్రల్ ప్రావిన్సెసు, బీరారు: మొత్తం సభ్యులు, 17, ఒక ముస్లిము, ఇతరులు 16.

జనరల్: డాక్టర్ రఘువీర; రాజకుమారి అమృతకౌర్; భగవంతరావ్ అన్నాభూమండలాయ్; వ్రజలాల్ నందలాల్ బియాని; ఠాకూర్ ఛెడిలాల్; సేట్ గోవిందదాస్; డాక్టర్ హరిసింగ్ గౌర్; హరి విష్ణు కామత్; హేమచంద్ర జగోబాజి ఖండేకార్; ఘన శ్యామసింగ్ గుప్త; లక్ష్మణ్ శ్రావణ్ భట్కార్; డాక్టర్ పంజాబ్‌రావు దేశముఖ్; పండిత రవిశంకర శుక్ల, రుస్తుం ఖుర్షీద్‌జి సిధ్వా; శంకర్ త్ర్యంబక్ ధర్మాధికారి; ఫ్రాంక్ ఆంథోనీ;

ముస్లిం: కాజీ సయ్యద్ కరీముద్దీన్.

## స్వదేశ సంస్థానాలు: 93 స్థానాలు

మైసూర్: (7) సర్ ఎ. రామస్వామి మొదలియార్, టి. సిద్దలింగయ్య; హెచ్. ఆర్. గురువారెడ్డి; ఎస్. వి. కృష్ణమూర్తిరావు, కె. హనుమంతయ్య; టి. చెన్నయ్య.

బరోడా: (3) డాక్టర్ జీవరాజ ఎన్. మెహత్; దర్బార్ గోపాలదాస్ ఎ. దేశాయ్; ప్రాణలాల్ పి. మున్షి.

తిరువాంకూర్: (6) పట్టం ఎ. తానుపిళ్లై; ఆర్. శంకర్; పి. ఎస్. నటరాజపిళ్లై; కె. ఎ. మహామ్మద్; ఇ. జాన్ ఫిలిపోస్; మిస్ ఆని మెస్కారీన్.

కొచ్చిన్: (1) పి. గోవిందమీనన్.

జయపూర్: (3) వి. టి. కృష్ణమాచారి; పండిత హీరాలాల్ శాస్త్రి; రాజా సర్దార్ సింగ్ జీ బహదుర్.

జోధ్ పూర్: (2) పి. ఎస్. రావు; జయనారాయణవ్యాస్.

బికనీర్: (1) రావుబహదూర్ కన్వర్ జస్వంత్ సింగ్ జీ.

కొల్హాపూర్: (1) ఎ. బి. లాథె.

మయూరభంజ్: (1) లాల్ మోహన్ పతి.

సిక్కిం, కూచ్ బేహార్ వర్గం: (1) హిమ్మత్ సింగ్ కె. మహేశ్వరి.

త్రిపుర, మణిపూర్; ఖాశివర్గం; (1) జి. ఎస్. గుహ.

రాంపూర్ బెనారస్: (1) కర్నల్ బి. హెచ్. జైడి.

ఒరిస్సా సంస్థానాలు : (4) ఎన్. మాధవరావు; లాలారాజ్ కన్వార్; సారంగధరదాస్; యుధిష్ఠిర్ మిశ్ర.

సి. పి. బీరార్ సంస్థానాలు : (3) ఆర్. ఎల్. మాలవీయి; కిశోరిమోహన్ త్రిపాఠి; రామప్రసాద్ పోటాయ్.

మదరాసు సంస్థానాలు : (1) వి. రామయ్య.

బొంబాయి సంస్థానాలు : (4) వినాయకర్ రావు బాలశంకర్ వైద్య; బి. ఎన్. మునవల్లి; గోకులభాయ్ దౌలత్ రాం భట్.

హిమాచల ప్రదేశ్ : (1) డాక్టర్ వై. ఎస్. పరమార్.

సౌరాష్ట్ర : (4) బలవంతరాయ్ గోపాల్ జీ మెహత; జై సుఖ లాల్ హాథి; అమృత్ లాల్ విఠల్ దాస్ థక్కర్; చిమన్ లాల్ చకూ భాయ్ షా.

మత్స్య : (2) రామచంద్ర ఉపాధ్యాయ; రాజబహదుర్.

రాజస్థాన్ : (4) మాణిక్యలాల్ వర్మ; గోకలాల్ ఆసవ; బల వంత్ సింగ్ మెహత; దలేల్ సింగ్ జీ.

వింధ్యప్రదేశ్ : (4) ఇంకా ఎన్నికలు జరగలేదు.

మధ్యభారత్ : (7) వి. ఎస్. సర్వాటె; లెఫ్టినెంట్ కర్నల్ బ్రజ్ నారాయణ్; గోపీకృష్ణ విజయవార్గీయ; రామసహాయ్; సీతారాం జాజూ; (రెండుస్థానాలు ఖాళీ)

పాటియాల, తూర్పు పంజాబ్ సంస్థానాలు : (3) సర్దార్ జయ దేవసింగ్; (రెండు స్థానాలు ఖాళీ)

కచ్ : భవాన్ జీ అర్జన్ ఖింజీ.

జూనఘడ్ : (1) శ్యామలదాస్ లక్ష్మీదాస్ గాంధి

టెహ్రీ, గార్వాల్ : (1) ఠాకూర్ కృష్ణసింగ్.

## ఇండియా శాసనసభ

1947 ఆగస్టు 15 న ఇండియా డొమినియన్ రాజ్యం అవడంతో, అప్పటివరకు దేశంలోవున్న కేంద్ర శాసనసభ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్ రద్దు అయిపోయినవి. ఇండియాకు రాజ్యాంగమును నిర్మించడానికి ఏర్పడిన రాజ్యాంగసభ (కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ) మాత్రం నిలబడింది. కొత్త రాజ్యాంగం తయారై, అమలులోకి వచ్చినదాకా, రాజ్యాంగసభే

శాసనసభగాకూడా పనిచేస్తుందనీ, శాసనసభా వ్యవహారాలు జరపడానికి ప్రత్యేకంగా సమావేశం అవుతుందనీ ప్రభుత్వం ప్రకటించారు. ఆ విధంగా, ఇండియా శాసనభ ప్రథమసమావేశం, 1947 నవంబరు 17 తేదిన జరిగింది.

ఈ శాసనసభకు అధ్యక్షుడుగా పూర్వం కేంద్రశాసనసభకు అధ్యక్షుడుగావున్న జి. వి. మవలంకార్ ఎన్నుకోబడినారు. (జీతం, రు. 3,000. అలవెన్సు రు. 500).

డిప్యూటీ స్పీకరు: ఎం. అనంతశయనం అయ్యంగార్

ఈ సభనే ఇండియా పార్లమెంటు అనీ, కేంద్ర శాసనసభ అనీ ప్రస్తుతం వ్యవహరిస్తున్నారు.

## సభ్యుల వివరాలు: 1949 మార్చి 1 నాటికి

| | | |
|---|---|---|
| మొత్తం సభ్యులు | ... | 303 |
| వివిధరాష్ట్రాల ప్రధానమంత్రులు | ... | 7 |
| వివిధరాష్ట్రాలలో మంత్రులు | ... | 3 |
| వివిధరాష్ట్రాల శాసనసభ్యులు | ... | 89 |
| రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులు | ... | 11 |
| స్త్రీలు | ... | 7 |

ఇండియా శాసనసభ ప్రథమసమావేశం 1947 నవంబరు 17 న జరిగింది. అప్పటినుంచి 1948 లోపల మూడు సమావేశాలు జరిగినవి. ఈ మూడు సమావేశాలలోను, శాసనసభ జరిగిన రోజులు మొత్తం 95. ఈ సమావేశాలలో, శాసనసభ ప్యాసుచేసిన కొత్త చట్టాలయితే నేం, పాతచట్టాలకు సవరణచట్టాలయితేనేం మొత్తం 84.

## విదేశాలలో భారతదేశ ప్రతినిధులు

| | | | |
|---|---|---|---|
| ఇంగ్లండ్ : | హైకమిషనర్ | వి. కె. కృష్ణమీనన్ | (రు. 5500) |
| అమెరికా : | రాయబారి | సర్. బి. రామారావు | (రు. 8,700) |
| రష్యా : | రాయబారి | శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ | (రు. 12,500) |
| చైనా : | రాయబారి | సర్దార్ కె.ఎం. పణిక్కర్ | (రు.6000) |
| యునైటెడ్ నేషన్స్ : | రాయబారి | సర్ బి. ఎన్. రావ్ | |
| కెనడా : | హైకమిషనర్ | సర్దార్ హెచ్. ఎస్. మాలిక్ | (రు. 2250) |
| ఆస్ట్రేలియా : | హైకమిషనర్ | లెఫ్టినెంట్ కర్నల్ దయాసింగ్ బెడి | |
| పెర్షియా : | రాయబారి | సయ్యద్ అలి జహీర్ | (రు. 5000) |
| ఆఫ్ఘనిస్తాన్ : | రాయబారి | వింగ్ కమాండర్ రూప చంద్ | (రు. 5000) |
| ఫ్రాన్సు : | ఛార్జిడి ఎఫేర్స్ | సర్ ఎన్ రాఘవన్ పిళ్లై | (రు. 6500 |
| నేపాల్ : | రాయబారి | సర్దార్ సర్జిత్ సింగ్ మజీథియా | (రు. 3000) |
| స్విట్జర్లెండ్, వాటికన్ : | రాయబారి | ధీరుభాయ్ బి. దేశాయ్ | (రు. 5250) |
| పుదుచ్చేరి : | కౌన్సల్-జనరల్ | రషీద్ అలిబేగ్ | |
| బటేవియా : | కౌన్సల్-జనరల్ | డాక్టర్ ఎస్. సి. అలగప్పన్ | |
| చెకోస్లోవేకియా : | రాయబారి | ఎన్. రాఘవన్ | |
| మలయా : | రిప్రెజెంటేటివ్ | ఎఫ్. ఎ. తివీ | (రు. 3375) |
| సింహళము : | హైకమిషనర్ | వి. వి. గిరి | (రు. 2750) |
| బర్మా : | రాయబారి | ఎం. ఎ. రవూఫ్ | (రు. 4050) |
| జపాన్ : | రిప్రెజెంటేటివ్ | బి. ఎన్. చక్రవర్తి | |
| సయాం : | రాయబారి | భగవతీ దయాళ్ | (రు. 2667) |
| పాకిస్తాన్ : | హైకమిషనర్ | డాక్టర్ సీతారాం | (రు. 3000) |
| ఇండో-చైనా : | కౌన్సల్ | అశోకనందలాల్ మెహత | |

| | | |
|---|---|---|
| బ్రజిల్ : | రాయబారి | మీనూ ఆర్. మసాని (రు. 5500) |
| టర్కీ : | రాయబారి | దివాన్ చమన్‌లాల్ (రు. 5000) |
| మారిషస్ : | హైకమిషనర్ | ధర్మ యశదేవ్ |
| గోవా : | కౌన్సల్ | పి. ఎస్. డ్రైకర్ |
| బ్రిటిష్ తూర్పు ఆఫ్రికా : | కమిషనర్ | అప్పాసాహెబ్ బి. పంత్ |
| బెల్జియం : | రాయబారి | బి. ఎఫ్. హెచ్. బి. త్యాబ్జి (రు. 5000) |
| వెస్టిండీస్ : | కమిషనర్ | సత్యచరణ్ (రు. 2050) |
| హాలెండ్ : | రాయబారి | డాక్టర్ మోహన్ సింగ్ మెహతా |
| ఇటలీ : | చార్జ్ డి ఎఫైర్స్ | ఆర్. ఎస్. మణి |

## భారతదేశంలో విదేశ ప్రతినిధులు

| | | |
|---|---|---|
| బ్రిటన్ : | హైకమిషనర్ | సర్ ఆర్చిబాల్డ్ నై |
| ఆస్ట్రేలియా : | హైకమిషనర్ | హెచ్. రాయ్ గొల్లాన్ |
| ఫ్రాన్సు : | రాయబారి | డానియల్ లెవి |
| అమెరికా : | రాయబారి | లాయ్ హెండర్సన్ |
| చైనా : | రాయబారి | డాక్టర్ లో చియా లున్ |
| ఇటలీ : | రాయబారి | డాక్టర్ మేరియో ఆర్సిని రాటో |
| పెర్షియా : | రాయబారి | నూరి ఇస్ఫాండారి |
| కెనడా : | హైకమిషనర్ | జాన్ డి. కెర్నీ |
| హాలెండ్ : | రాయబారి | ఆర్నాల్డ్ లాంపింగ్ |
| పాకిస్తాన్ : | హైకమిషనర్ : | మహమద్ ఇస్మాయిల్ |
| సయాం : | ఛార్జిడి ఎఫేర్స్ : | ధనత్ ఖోమన్ |
| నేపాల్ : | రాయబారి | శ్రీ సింగ్ షంషేర్ జంగ్ బహదర్ రాణా |
| సింహళం : | హైకమిషనర్ | ఎం. డబ్ల్యు. ఆర్. డి సిల్వ |
| రష్యా : | రాయబారి | కె. వి. నోవికోవ్ |
| బర్మా : | రాయబారి | సర్ మాంగ్ గ్యీ |

| | | |
|---|---|---|
| చెకొస్లొవేకియా : | ఛార్జిడి ఎఫేర్స్ | ఆల్ఫ్రెడ్ ఎఫ్. బిహాలర్ |
| స్విట్జర్లెండ్ : | రాయబారి | ఆర్మిన్ దయేన్కర్ |
| బెల్జియం : | రాయబారి | ప్రిన్స్ యూజీన్ డిలిన్ |
| ఆఫ్ఘనిస్తాన్ : | రాయబారి | సర్దార్ నజీబుల్లాఖాన్ |
| వాటికన్ : | రాయబారి | రివరెండ్ డాక్టర్ వియో పి. కీర్కెల్స్ |
| బ్రజిల్ : | రాయబారి | జె. క్రేన్ డి. అలెంకార్ |
| ఈజిప్టు : | రాయబారి | ఇస్మాయెల్ కమల్ బే |
| స్వీడన్ : | రాయబారి | గన్నర్ వాల్ఫ్రిడ్ జారింగ్ |
| పోర్చుగల్ : | రాయబారి | డాక్టర్ వాస్కోగోరిన్ |

## ఇండియా సాయుధ దళాధిపతులు

సైన్యాధిపతి: జనరల్ కె. ఎం. కరియప్ప
నౌకాదళాధిపతి: వైస్ అడ్మిరలు డబ్ల్యు. ఇ. పారీ
విమానదళాధిపతి ఏర్ మార్షలు సర్ థామస్ ఎల్ముహార్స్ట్

## మంత్రివర్గాల కార్యదర్శులు

| | |
|---|---|
| విద్య : | ఇ. ఆర్. తారాచంద్ |
| సంస్థానాలు : | ఎం. కె. వెల్లోడి |
| ప్రచురణ బ్రాడ్ కాస్టింగ్ : | పి. సి. ఛౌదురి |
| విదేశ వ్యవహారాలు : | కె. పి. ఎస్. మీనన్ |
| ఆహారం : | ఎస్. వై. కృష్ణస్వామి |
| రక్షణశాఖ : | హెచ్. ఎం. పటేల్ |
| కార్మికులు : | ఎస్. లాల్ |
| పరిశ్రమలు : | ఎస్. ఎ. వెంకటరామన్ |
| రవాణా : | వై. ఎస్. సుక్తాంకర్ |
| పోస్టు, టెలిగ్రాఫ్ : | వి. కె. ఆర్. మీనన్ |
| ఆర్థికం : | కె. ఆర్. కె. మీనన్ |
| వ్యవసాయం : | కె. ఎల్. పంజాబి |

| | |
|---|---|
| గనులు : | బి. కె. గోఖలె |
| వాణిజ్యం : | సి. సి. దేశాయ్ |
| కాందిశీకులు : | ధన త్యాగి |
| పోర్టుఫోలియో లేని మంత్రివర్గం | ఎం. కె. వెల్లోడి |
| హోం : | హెచ్. వి. ఆర్. అయ్యంగార్ |
| న్యాయశాఖ : | కె. వి. కె. సుందరం |
| ప్రధానమంత్రి ప్రైవేట్ సెక్రటరీ | ఏ. వి. పాయ్ |
| శాస్త్ర పరిశోధన : | సర్. ఎస్. ఎస్. భట్నగర్ |
| రైల్వేలు : | ఎస్. ఎస్. రామ సుబ్బన్ |
| శాసన సభ | ఎం. ఎన్. కౌల్ |

## ఇండియాప్రభుత్వంలో కొందరు ముఖ్యఉద్యోగులు

| | |
|---|---|
| ఆడిటర్-జనరల్ : | వి. నరహరిరావు (రు. 4000) |
| ఆర్కేలజీ డైరక్టరు జనరల్ : | డాక్టరు ఎన్. పి. చక్రవర్తి |
| ప్రిన్సిపాల్ ఇన్ఫర్మేషను ఆఫీసరు : | బి. ఎల్. శర్మ |
| ఆహారశాఖ డైరక్టరు జనరల్ : | ఆర్. ఎల్. గుప్త |
| మెడికలు సర్వీసెస్ డైరక్టరు జనరల్ : | డాక్టర్ కె. సి. కె. ఇ. రాజా |
| పరిశ్రమలశాఖ డైరెక్టరు జనరల్ : | సర్. జె. సి. ఘోష్ |
| టెక్స్టయిలు కమిషనరు : | టి. శివశంకర్ |
| పోస్టు, టెలిగ్రాఫ్ డైరెక్టరు జనరల్ : | శ్రీ కృష్ణ ప్రసాద్ |
| పశురక్షణశాఖ కమిషనరు : | రాయ్‌బహాదూరు పి. ఎన్. నంద |
| రీసెటిల్మెంట్, ఎంప్లాయ్‌మెంట్ డైరెక్టరు జనరల్ : | డాక్టరు ఎన్. దాస్ |
| ఎవాక్యుయేషన్ డైరెక్టరు జనరల్ : | వై. కె. పూరి |
| రైల్వేల ఛీఫ్ కమిషనరు : | కె. సి. బక్లె |
| రైల్వేల ఫైనాన్షల్ కమిషనరు : | ఎ. కె. చందా |

రాజకీయ సలహాదారు : వి. పి. మీనన్

ఆలిండియా రేడియో డైరెక్టర్-జనరల్ : పి. సి. చౌధురి

డైరక్టర్-జనరల్ ఆఫ్ సివిల్ ఏవియేషన్ : టి. ఒ. భల్లా

## ఫెడరల్ కోర్టు

ప్రధాన న్యాయమూర్తి : సర్ హరిలాలు జెకిసన్‌దాస్ కన్యా (జీతం : రు. 7,000)

జడ్జీలు : సర్ సయ్యద్ ఫజల్ ఆలి (రు. 5,000)
ఎం. పతంజలిశాస్త్రి (రు. 5,000)
మెహర్‌చంద్ మహాజన్ (రు. 5,000)
విజన్‌కుమార్ ముఖర్జీ (రు. 5,000)

## ఇండియా టారిఫ్‌బోర్డ్

ప్రెసిడెంట్ : జి. ఎల్. మెహాత

మెంబర్లు : డాక్టర్ హెచ్. ఎల్. డే.
డాక్టర్ బి. వి. నారాయణస్వామి నాయుడు.
ఎం. ఇ. రహమన్

## బడ్జెటు

1949 ఏప్రిల్ 1 నుంచి 1950 మార్చి 31 వరకు బడ్జెటును, ఇండియా పార్లమెంటులో ఆర్థికశాఖామంత్రి డాక్టర్ జాన్ మత్తయ్ 1949 ఫిబ్రవరి 28 తేదీన ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

ఆదాయం అంచనా: రు. 307 కోట్ల 74 లక్షలు

వ్యయం అంచనా : రు. 322 కోట్ల 53 లక్షలు

లోటు అంచనా : రు. 14 కోట్ల 79 లక్షలు

1948 ఏప్రిల్ 1 నుంచి 1949 మార్చి 31 తో అంతమయే సంవత్సరంలో, కేంద్రప్రభుత్వాదాయం, రు. 338 కోట్ల 32 లక్షలు వుంటుదనీ, వ్యయం రు. 339 కోట్ల 87 లక్షలు వుంటుందనీ అంచనా వేయబడింది.

# స్వతంత్ర సంస్థానాలు

భరతఖండపు మొత్తం వైశాల్య 15,31,410 చదరపు మైళ్ళలోనూ, దాదాపు సగం, 7,15,964 చదరపు మైళ్ళ భూమి 1947 ఆగస్టు 15 నాటికి సంస్థానాధీశుల పరిపాలనలో వుండేది. వీటిలో కొన్ని చాలా పెద్దవి; కొన్ని చాలా చిన్నవి. మొత్తం సంస్థానాలు, 562.

అన్ని సంస్థానాలలోనూ ఎక్కువ వైశాల్యముగలది కాశ్మీర్ (85,885 చ. మైళ్ళు). అన్నిటిలోనూ ఎక్కువ జనాభాగలది హైదరాబాదు (1,63,38,534). అన్ని సంస్థానాలలోనూ చిన్నది, బిల్బారి. దీని జనాభా 27 మంది. సంవత్సరాదాయం, 80 రూపాయలు.

ఈ సంస్థానాలన్నీ, తమ రాజ్యంలో సంపూర్ణస్వతంత్ర పరిపాలన హక్కులుగల రాజుల ఆధీనంలో వుండేవి. వీరిలో కొంతమంది రాజులకు మహారాజు అనీ, కొంతమందికి రాజు అనీ బిరుదులు వున్నాయి. బ్రిటిషు వారు యిచ్చిన హిజ్ హైనెస్ అనే బిరుదుగల రాజులుకూడా కొంత మంది వున్నారు.

ఈ రాజులలో ఎవరిహోదా పెద్దది, ఎవరిహోదాతక్కువది అనే విషయాన్ని వారి గౌరవార్థం కాల్చడానికి నిర్ణయింపబడిన ఫిరంగుల సంఖ్యనుబట్టి నిర్ణయించవచ్చును. ఈ గౌరవం అందరు రాజులకూ జరుగదు. దేశంలోని 562 సంస్థానాలలోనూ, 149 సంస్థానాల రాజులకు మాత్రమే, యీ లాంఛనం జరుగుతుంది. అంటే, వీరు బ్రిటిష్ ఇండియా లోని ఏప్రాంతంలోకైనా వచ్చినట్లయితే, వీరి రాకను తెలియపరచ డానికి వారి హోదానుబట్టి నిర్ణయింపబడినన్నిసార్లు ఫిరంగికాల్పులు జరుగుతాయి. అయితే, యీ ఫిరంగులను కాల్చడానికి అయే ఖర్చును, ఆ సంస్థానాధిపతులే యిచ్చుకోవాలట. ఈ సంస్థానాధీశులలో ఎవరికీ 21 ఫిరంగులకంటె ఎక్కువ కాల్చేహోదా లేదు.

21 ఫిరంగుల లాంఛనంగల సంస్థానాధిపతులు : కాశ్మీర్ మహారాజా, హైదరాబాద్ నైజాం, మైసూరు మహారాజా, బరోడా గాయక్వార్, గ్వాలియరు సింధియా.

19 ఫిరంగులు : భోపాల్ నవాబు, ఇండోరు హోల్కారు, కలాట్ ఖాన్, కొల్హాపూర్ మహారాజా, తిరువాన్కూరు మహారాజా, ఉదయపూరు మహారాణా.

సంస్థానాలలో పరిపాలన, ఆ సంస్థానాధీశుల యిష్టప్రకారం జరుగుతూవుండేది, కొన్ని సంస్థానాలలో శాసనసభలువున్నాయి. కొన్నిటిలో లేవు. శాసనసభలువున్న సంస్థానాలలోకూడా, రాజు యిష్టప్రకారం శాసనసభలతో సంప్రతించకుండా నియమించబడిన దివానులకు పరిపాలనలో సంపూర్ణమైన అధికారం వుండేది.

భరతఖండ విభజనానంతరం, ఇండియా భూఖండంలోపలను, ఇండియాను ఆనుకొనివున్న సంస్థానాలు మొత్తం 544. వీటి వైశాల్యం, 5,87,8·8 చ. మైళ్ళు. జనాభా, దాదాపు 8,88,00,000.

1947 ఆగస్టు 15 వ తేదివరకు, భారతదేశంలోని అన్ని సంస్థానాలూ, బ్రిటీషు రాజు సార్వభౌమత్వాన్ని అంగీకరించాయి. తమతమ రాజ్యాలలో పరిపాలనకు సంపూర్ణాధికారాలు వున్నప్పటికీ, సంస్థానాధీశులు విదేశ వ్యవహారాలు, దేశరక్షణ విషయాలలో బ్రిటీషురాజు నియమించిన రెసిడెంట్ల సలహాప్రకారం ప్రవర్తిస్తూవుండేవారు. పోస్టు, టెలిగ్రాఫ్, రైళ్ళు, రోడ్లు మొదలైన సదుపాయాల విషయంలో భారతదేశపు కేంద్ర ప్రభుత్వంతో ఒడంబడికలు చేసుకొన్నారు. జార్జిరాజు తరఫున సార్వభౌమత్వం చెలాయించే అధికారాలు, రాజప్రతినిధికి వుండేవి. సంస్థానాల వ్యవహారాలను పరిశీలించడానికీ, సంస్థానాధిపతులకు సలహాలను యివ్వడానికీ రాజప్రతినిధి అధికారానికి లోబడిన పొలిటికల్ డిపార్టుమెంటు ఒకటి ఏర్పాటు చేయబడింది.

ఏ సంస్థానాధిపతి అయినా, ప్రజలను మిక్కిలిగా హింసిస్తున్నా, మతిభ్రమణత్వాన్ని పొందినా, బ్రిటీషు రాజు సార్వభౌమత్వాన్ని ధిక్కరించినా, అతణ్ణి పదభ్రష్టుణ్ణిచేసి, అతని వారసుణ్ణి సింహాసన మెక్కించడానికి బ్రిటీషు రాజు తరఫున రాజప్రతినిధికి అధికారంవుండేది. చాలా సందర్భాలలో, రాజప్రతినిధి ఈ అధికారాన్ని చెలాయించాడు కూడాను.

సంస్థానం పెద్దదయితే ఒకొక్కదానికి ఒకడూ, చిన్నదయితే కొన్ని చిన్న సంస్థానాలకు కలిపి ఒకడూ, రెసిడెంటు ఆ సంస్థానాలలో కాపురంవుండేవాడు. అతడి ఉద్యోగం ఏమిటంటే, సంస్థానాధిపతి ప్రవర్తనను ఒక కంట కనిపెడుతూ వుండడం; బ్రిటిషువారి ప్రయోజనాలకు విరుద్ధంగా, ఆ సంస్థానాధిపతి ఏమైనా చెయ్యబోయినట్లయితే, అతణ్ణి హెచ్చరించి, అలాటి పనులు జరగకుండా చూడడం.

1947 ఆగస్టు 15 వ తేదిన భారతదేశానికి స్వాతంత్ర్యం రావడంతో, స్వదేశ సంస్థానాలమీద బ్రిటిషురాజుకు గల సార్వభౌమాధికారంకూడా రద్దయింది.

అయితే, ఈ సంస్థానాలలో ప్రతీదీ సర్వస్వతంత్రమైపోతే, భారతదేశం మరీ విచ్ఛిన్నమైపోవడమేకాక, దేశ రక్షణ, విదేశ వ్యవహారాలు మొదలైన వాట్లలో నానాచిక్కులు, కల్లోల పరిస్థితి ఏర్పడుతుందని గ్రహించి ప్రతి సంస్థానమూకూడా, తనకు సమీపంలో వున్న దానిలో ఏదో ఒక డొమినియను (ఇండియన్ డొమినియన్, పాకిస్తాన్ డొమినియన్)తో ఒడంబడిక చేసుకోవడం మంచిదని బ్రిటిషు ప్రభుత్వం వారూ, గవర్నర్-జనరల్ లార్డ్ మౌంట్‌బాటెన్ పదేపదే హెచ్చరించారు. సంస్థానాల సంబంధాలను నెరపడానికి రెండు డొమినియనుల ప్రభుత్వాలూ, సంస్థానాల డిపార్టుమెంటునుకూడా స్థాపించాయి.

ఇండియన్ డొమినియన్ ప్రభుత్వపు సంస్థానశాఖామంత్రి సర్దార్ వల్లభభాయ్ పటేల్, గవర్నర్-జనరల్ మౌంట్ బాటెన్ ప్రభువు, సంస్థానాధిపతులతో జరిపిన సమాలోచన ఫలితంగా చాలామంది సంస్థానాధీశులు ఇండియన్ డొమినియనుతో ఒడంబడికచేసుకొని, ఒడంబడిక పత్రం (ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ ఎక్సెషన్) మీద సంతకాలు చేశారు.

ఇండియను డొమినియనుతో చేరిన సంస్థానాలలో, వాటి రాజులకు స్వపరిపాలన హక్కులు సంపూర్ణంగానే వుంటాయి. దేశరక్షణ, విదేశ వ్యవహారాలు, రవాణా సౌకర్యాలు——ఈ మూడిటి విషయంలోనూ సంస్థానాల వ్యవహారాలుకూడా, ఇండియన్ డొమినియన్ చూస్తుంది. ఈ వ్యవహారాలకు సంబంధించిన విషయాలలో శాసనం చెయ్యడానికి, డొమినియన్ శాసనసభకు అధికారం ఇవ్వబడుతుంది. ఈ శాసనాలను,

తన సంస్థానంలో అమలుజరిపే బాధ్యత ఇండియన్ డొమినియన్‌తో
కలసిన సంస్థానాధిపతి వహిస్తాడు.

1947 ఆగస్టు 15 తరువాత, అతిశీఘ్రకాలంలోనే, సంస్థానాధీశు
లంతా తమ స్థితిని గ్రహించుకొని, ఏదో ఒక డొమినియన్‌తో దృఢ
సంబంధం పెట్టుకోడానికి ఒడంబడికమీద సంతకంచేశారు. ఏ డొమిని
యనుతోనూ చేరకుండా హైదరాబాదు నైజాము, కాశ్మీరు మహారాజా
మాత్రం జరిపారు. చివరకు కాశ్మీరు మహారాజు 1947 అక్టోబరు 27 న
ఇండియాతో దృఢసంబంధపు ఒడంబడిక చేసుకున్నాడు. (కాశ్మీరు,
హైదరాబాదు సంస్థానాలను గురించి సంపూర్ణ వివరాలకు, ఆసంస్థానాల
పేర్లతోవున్న శీర్షిక క్రింద, ప్రక్క పేజీలలో చూడండి).

హిందువులు అత్యధిక సంఖ్యాకులు గాగల జునగఢ్ సంస్థానాధిపతి,
తాను ముస్లిము అగుటచే, పాకిస్తాన్‌తో ఒడంబడిక చేసుకున్నాడు.
దానిపై ప్రజలు తిరుగుబాటు చెయ్యడమూ, నవాబు అతని దివాను
సంస్థానాన్ని వదలిపోవడమూ, 1948 ఫిబ్రవరిలో సంస్థానంలో జరిపిన
రిఫరెండం ఫలితంగా, సంస్థానంలోని అధిక సంఖ్యాకులైన ప్రజలు
తమ సంస్థానం ఇండియాతోనే దృఢసంబంధం కలిగి వుండాలనే
వాంఛను తెలియపరచడం జరిగింది. తరువాత, సౌరాష్ట్రరాజ్యరాజ్యాంగ
సభ యీ కోర్కెను ఆమోదించడం జరిగింది. 1949 జనవరి 20 తేదిన
జునగఢ్ సౌరాష్ట్ర రాజ్యంలో కలిపివేయబడింది.

చాలామంది సంస్థానాధీశులు, రాజకీయ సంస్కరణలకొరకు తమ
ప్రజలుచేసే ఆందోళనను గమనించీ, పరిపాలనా సౌకర్యానికి తమ సంస్థా
నాలను ప్రక్కనవున్న రాష్ట్రాలలో కలిపివేస్తే కలిగే ప్రయోజనాలను
గమనించీ, తమ సంస్థానాలను ప్రక్కనవున్న రాష్ట్రాలలో కలిపి వెయ్య
డానికి అంగీకరించారు.

ఈ అంగీకారంవల్ల, అఠ్‌గర్, అఠ్‌మలిక్, బమ్రా, బరాంబా,
బుధ్, బోనాయ్, దాస్పాలా, ఢెంకనాల్, గంగపూర్, హిందోళ్, కలా
హండి, కుంజహార్, ఖండపరా, నరసింగ్‌పూర్, నయాఘర్, నీలగిరి,
పాల్ లహారా, పాట్నా, రైరఖోల్, రణపూర్, సోనెపూర్, తల్చేర్,
తిజీరియా అనే 23 సంస్థానాలు ఒరిస్సా రాష్ట్రంతో, 1948 జనవరి 1

తేదిన కలిపివేయబడినవి. ఈ కలయికవల్ల ఒరిస్సా వైశాల్యం, 24,000 చ. మైళ్ళు ఎక్కువయింది. జనాభా సుమారు 40 లక్షలు పెరుగుతుంది. ఈసంస్థానాలన్నీ ఒరిస్సా రాష్ట్రంలో ఆరుజిల్లాలుగా ఏర్పాటు చేయబడినవి. సుమారు 4,000 చ. మైళ్ళ వైశాల్యమూ, 9,90,000 జనాభా గల మయూర్భంజ్ సంస్థానం, ఒరిస్సా రాష్ట్రంలో 1949 జనవరి 1 తేదిన కలిపివేయబడింది.

ఇదేవిధంగా బస్తర్, చంగ్ భాకర్, ఛూయ్‌ఖడన్, జాష్‌పూర్, కంకేర్, కవర్ధా, ఖైరాఘర్, కోరియా, నంద్‌గామ్, రాయ్‌ఘర్, శక్తి, నారంగర్, సుర్గుజా, ఉదయపూర్ అనే 14 సంస్థానాలు సెంట్రల్ ప్రావిన్సెసులో 1948 జనవరి 1 తేదిన కలిపివేయబడినవి. ఈ కలయికవల్ల సెంట్రల్ ప్రావిన్సెసురాష్ట్ర వైశాల్యం, 31,598 చ. మైళ్ళూ, జనాభా, 28,20,000 పెరిగాయి.

మదరాసు రాష్ట్రంలోవున్న బంగనపల్లి సంస్థానం, మదరాసు రాష్ట్రంలోని కర్నూలు జిల్లాలో 1948 ఫిబ్రవరి 22 తేదిన కలిపివేయబడింది. దీనివల్ల రాష్ట్రవైశాల్యం 259 చ. మైళ్ళు ఎక్కువైంది.

మదరాసు రాష్ట్రంలో తిరుచినాపల్లి జిల్లాను ఆనుకొని వున్న పుదుకోట సంస్థానం, 1948 మార్చి 3 తేదిన మదరాసు రాష్ట్రంలో కలిసిపోయింది. దీనివల్ల రాష్ట్రవైశాల్యం, 1185 చ. మైళ్ళు, జనాభా దాదాపు అయిదులక్షలూ పెరుగుతుంది.

158 చ. మైళ్ళ వైశాల్యమూ, 15,600 జనాభాగల సాండూర్ సంస్థానం మదరాసు రాష్ట్రంలో, 1948 జులై 30 తేదిన కలిసిపోయింది. 1,179 చ. మైళ్ళ వైశాల్యమూ, 4,39,000 జనాభాగల పుదుకోట 1948 మార్చి 3 న మదరాసు రాష్ట్రంలో కలిసిపోయింది.

డక్కన్‌లోవున్న, అక్కల్‌కోట, ఔంధ్, భోర్, జాంఖండి, జాత్, కురుంద్వాడ్ (జూనియర్). కురుంద్వాడ్ (సీనియర్), ముధోల్, ఫాల్టాన్, రామదుర్గ్, సాంగ్లి, సావనూర్, సావంతవాడి, వాడి జహాగీర్ అనే సంస్థానాలు 17 మొత్తం 7,651 చ. మైళ్ళ వైశాల్యమూ, 16,93,000 జనాభాగలవి, 1948 మార్చి 8 తేదీన బొంబాయి రాష్ట్రంలో కలిసి పోయాయి.

1948 మే 18 తేదిన, సెరైకెలా, ఖార్‌శ్వాన్ అనే సంస్థానాలు రెండు, 623 చ. మైళ్లు వైశాల్యం, 5,01,000 జనాభాగలవి ఒరిస్సా రాష్ట్రంలో కలిసిపోయాయి.

1948 జూన్ 10 తేదిన, గుజరాత్ సంస్థానాలు అనే పేరుగల 157 సంస్థానాలు, మొత్తం 19,300 చ. మైళ్ళ వైశాల్యమూ, 27,09,000 జనాభాగలవి కూడా బొంబాయి రాష్ట్రంలో కలిసిపోయాయి.

సుమారు 8,235 చ. మైళ్ళ వైశాల్యమూ, దాదాపు 28 లక్షల జనాభాగల బరోడా సంస్థానమూ, 3,219 చ. మైళ్ళ వైశాల్యమూ, దాదాపు 10 లక్షల జనాభాగల కొల్హాపూర్ సంస్థానమూ బొంబాయి రాష్ట్రంలో కలిసిపోవడానికి నిశ్చయించుకున్నట్లు ప్రకటన 1949 జనవరి 31 న జరిగింది. కొల్హాపూర్ కలయిక 1949 మార్చి 1 న జరిగింది. బరోడా కలయిక 1949 మే 1 న జరుగుతుంది. ఈ కలయికవల్ల బొంబాయిరాష్ట్ర వైశాల్యం 1,21,849 చ. మైళ్లు అవుతుంది.

తూర్పు పంజాబ్ రాష్ట్రంలోవున్న చంబ, సుకేత, భాగల్, భగత్, భజ్జి, సాంగ్రి, ధామి, కుమార్సైన్, కుఠార్, ధారోచ్ర అనే సంస్థానాల అధిపతులు, మొత్తం 11,000 చ. మైళ్ళ వైశాల్యమూ, దాదాపు పదిలక్షల జనాభాగల తమ సంస్థానాలను కేంద్ర ప్రభుత్వ పరిపాలనకు అప్పగించివేశారు. ఈ ప్రాంతం అంతా, 'హిమాచల ప్రదేశం' అనే పేరుతో, ఇండియా ప్రభుత్వం నియమించిన లెఫ్టినెంట్ గవర్నర్ పరిపాలనలో వుంటుంది. ఈ ప్రదేశానికి ప్రత్యేకంగా ఒక శాసనసభ ఏర్పాటు చేయబడుతుంది. ఇలా తమ సంస్థానాలను రాష్ట్రాలలో కలిపివేసిన సంస్థానాధీశులకు, వారి ఖర్చుల నిమిత్తం ప్రతి సంవత్సరం కొంతడబ్బు యివ్వబడుతుంది. వారి బిరుదులూ, హోదాలూ, మునుపటిలాగే వుంటాయి. వారికుటుంబ సాంప్రదాయాన్ని అనుసరించి, వారి వారసులకుకూడా యిదే ఏర్పాటు చెయ్యబడుతుంది.

## సౌరాష్ట్ర రాజ్యం

కొన్ని చిన్నసంస్థానాలు రాష్ట్రాలలో కలిసిపోతే, కొన్ని చిన్న సంస్థానాలూ, కొన్ని పెద్ద సంస్థానాలూ కలసి ఒకే సంయుక్తరాజ్యంగా ఏర్పడడానికి నిశ్చయించుకున్నాయి. ఇలా ఏర్పడినవాటిలో మొదటిది సౌరాష్ట్రరాజ్యం.

దీనినే కథియావాడ్ అంటారు. ఈ దేశంలో మొత్తం 217 సంస్థానాలు, చిన్నవీ పెద్దవీకలిపి, ఉన్నాయి. వీటివైశాల్యం దాదాపు, 31,885 చ. మైళ్ళు, జనాభా, దాదాపు 35,22,000. సంవత్సరాదాయం, రు. 8 కోట్లు. ఈ సంస్థానాల అధిపతులందరూ, తమ సంస్థానాల పరిపాలనను, అన్ని సంస్థానాలకూ ఏర్పాటు చేయబడిన ప్రభుత్వానికి అప్పగించడానికి అంగీకరించి. ఒడంబడికపై సంతకాలు చేశారు. ఈ ఒడంబడిక వివరాలు ఏమిటంటే:

ఈ సంస్థానాలన్నిటి పరిపాలనకూ ఒకే కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేయబడుతుంది. వీటిలో పెద్ద హోదాగల సంస్థానాధీశులు ఒక మండలిగా ఏర్పడుతారు. వీరందరూ, అయిదుగురు సభ్యులుగల ఒక అధిపతిమండలిని ఎన్నుకుంటారు. ఈ అయిదుగురిలో ఇద్దరు, నవనగర్, భావనగర్ రాజులు, యీ అధిపతిమండలిలో శాశ్వతంగా సభ్యులుగా వుంటారు. ఈ అధిపతిమండలికి ఒక అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడూ వుంటారు. ఈ సంస్థానాలన్నిటికీ కలిపి సంయుక్త సౌరాష్ట్ర రాజ్యం అని పేరు.

ఈ రాజ్య పరిపాలన విషయంలో అధిపతిమండలి అధ్యక్షునికి సలహా యివ్వడానికి, అయిదుగురు సభ్యులుగలమంత్రి మండలి ఏర్పాటు చేయబడుతుంది. ప్రతి సంస్థానాధిపతీ, తన రాజరికపు హక్కులను, అధిపతిమండలి అధ్యక్షునికి అప్పగించివేస్తాడు. ఈ అధ్యక్షునికి 'రాజప్రముఖ్' అనే హోదా వుంటుంది. రాజ్యపాలన, సైన్యనిర్వహణమొద

లైనవన్నీ, ఇండియా ప్రభుత్వ సూచనల ప్రకారం, యీ రాజప్రముఖుడే నిర్వహిస్తాడు. ఈ రాజ్యానికి, రాజ్యాంగ విధానం తయారు చెయ్యడానికి ఒక కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ ఏర్పాటు చేయబడుతుంది. అంతవరకూ శాసన నిర్మాణాధికారం అంతా రాజప్రముఖుని చేతిలోనే ఉంటుంది.

సంస్థానాధిపతు లందరికీ, తమ సంస్థానపు రాబడిలో నూటికి పదివంతులకు మించకుండా, సంవత్సరానికి కొంత నిర్ణీతపు మొత్తం భృతిగా యివ్వబడుతుంది. ఒకసారి నిర్ణయం జరిగిన తరువాత, యీ మొత్తాన్ని తగ్గించడంగాని, హెచ్చింపడంగాని జరుగదు. ప్రతి సంస్థానాధిపతీ, 1947 ఆగస్టు 15 నాటికి అతడు అనుభవిస్తూవున్న లాంఛనాలు, బిరుదులు, హోదాలు అన్నీ యికముందు కూడా అనుభవిస్తాడు.

ఈ ఏర్పాట్లప్రకారం, సంయుక్త సౌరాష్ట్రరాజ్యం 1948 ఫిబ్రవరి 1 నాటికి అమలులోకి వచ్చింది. నవనగర్ మహారాజు రాజప్రముఖుడుగానూ, భావనగర్ మహారాజు అధిపతి మండలి ఉపాధ్యక్షుడుగాను, ధరంగధర, పాలిటానా, కోటడాసాంగాని సంస్థానాధిపతులు సభ్యులు గాను ఎన్నుకోబడినారు. యు. ఎన్. ఢేబర్, ప్రధానమంత్రి.

## మత్స్యరాజ్యం

ఆల్వార్, భరతపూర్, ధోల్పూర్, కరౌలి అనే నాలుగు సంస్థానాధీశులు తమ సంస్థానాలను సంయుక్త మత్స్యరాజ్యం అనే పేరుతో ఒక రాజ్యంగా స్థాపించారు. మత్స్యరాజ్యపు వైశాల్యం7,536 చ. మైళ్ళు వుంటుందనీ, జనాభా 19 లక్షలనీ, ఆదాయం ఏడాదికి రు. 1,83,06,000 అనీ అంచనా. ఈ సంయుక్త మత్స్యరాజ్యస్థాపన 1948 మార్చి 17 న జరిగింది. ధోల్పూర్ పాలకుడు రాజప్రముఖుడుగా ఎన్నుకోబడినారు.

## వింధ్య ప్రదేశ్

వింధ్యప్రదేశ్ అనే పేరుగల సంస్థానాలకూడలి 1948 ఏప్రిల్ 4 తేదిన ఏర్పాటయింది. ఇది, అజయ్‌ఘర్, బావోని, బారౌంధ, బిజావార్, ఛత్రపూర్, చర్ఖారి, దాటియా, మైహార్, నాగోడ్, ఓర్ఛా, పన్నా, రీవా, సంథార్, అలీపూర్, బంకపహారి, బేరి, భాయిసుంద, బీహాట్, బిజన, ధుర్వాయ్, గౌరిహార్, గరౌలి, జాసో, జిగ్ని, కాంత రాజౌల, ఖానియాదహన, కోఠి, లుగాసి, నైగజాన్-రీబాయ్, సారా, పాల్దేవ్, సరిల, సొహావాల్, తరౌన్, తోరి-ఫతేపూర్ అనే 35 సంస్థానాల కూడలి. దీని వైశాల్యం 24,610 చ. మైళ్ళు. జనాభా, 35,69,000. సంవత్సరాదాయం సుమారు, రు. 2,43,30,000. ఈ సంస్థానాల కూడలికి రాజప్రముఖుడు, రీవా మహారాజు.

## రాజస్థాన్

రాజస్థాన్ అనే పేరుతో, రాజపుటానా సంస్థానాలకూడలి 1948 మే 28 తేదిన ఏర్పాటయింది. ఆ నాటికి, యీ కూడలిలో బన్స్వారా, బూంది, డుంగర్‌పూర్, జలావర్, కిషెన్‌ఘర్, కోటా, ప్రతాప్‌ఘర్, షాపుర, టోంక్, ఉదయపూర్ (మీవార్) అనే పది సంస్థానాలు చేరాయి. ఆనాటికి దాని వైశాల్యం, 29,777 చ. మైళ్ళు. జనాభా, 42,61,000. ఆదాయం, రు. 3,16,67,000. దీనికి రాజప్రముఖుడు, ఉదయపూర్ మహారాణా; ప్రధానమంత్రి : మాణిక్యలాల్ వర్మ.

బికనీర్, జయపూర్, జోధ్‌పూర్, జైసల్మీర్ సంస్థానాధీశులు, తమ సంస్థానాలనుకూడా రాజస్థాన్‌లో కలపడానికి అంగీకరించినట్లు ఇండియా ప్రభుత్వ సంస్థానాలమంత్రి సర్దార్ పటేల్, 1949 జనవరి 14 తేదిన ప్రకటించారు. ఈ సంస్థానాలుకూడా కలిస్తే, రాజస్థాన్ వైశాల్యం 1,20,668 చ. మైళ్ళు, జనాభా 1,16,42,000 వుంటుంది. ఇండియాలోని సంస్థానాల సమాఖ్య లన్నిటిలోకీ ఇదే పెద్దది అవుతుంది.

## మధ్య భారత్

మాళ్వారాజ్యం అనే పేరుగల మధ్యభారత సంస్థానాల కూడలి. సంయుక్త మధ్యభారతరాజ్యం అనేపేరుతో 1948 మే 28 వ ఏర్పాటు చేయబడింది. యీ కూటమిలో, గ్వాలియర్, ఇండూర్ సంస్థానాలున్నూ, 18 మాళవ సంస్థానాలున్నూ చేరాయి. దీనివైశాల్యం, 46,273 చ. మైళ్ళు. జనాభా, 71 లక్షలు. సంవత్సరాదాయం, ఎనిమిది కోట్లు రూపాయలు. దీనికి రాజప్రముఖ్ గా గ్వాలియర్ మహారాజు, ఉపరాజ ప్రముఖ్ గా ఇండూర్ మహారాజు ఎన్నుకోబడినారు. ప్రధానమంత్రి: పండిట్ లీలాధర్ జోషి.

## తూర్పు పంజాబ్ సంస్థానాలు

1948 జూలై 15 తేదీన, పాటియాలాతో సహా తూర్పు పంజాబు లోని కపుర్థలా, నాభా, జింద్, ఫరీద్ కోట, మాలేర్ కోట్ల, నలఘుర్, కాల్సియా అనే ఎనిమిది సంస్థానాలు, పాటియాలా తూర్పు పంజాబ్ సంస్థానాల యూనియన్ అనే పేరుతో ఒక కూడలిగా ఏర్పడినాయి. దీని వైశాల్యం, 10,119 చ. మైళ్ళు, జనాభా, 34,24,000. ఆదాయం, రు. 5 కోట్లు. ఈ యూనియనుకు పాటియాలా మహారాజు రాజప్రముఖుడుగాను, కపుర్థలా మహారాజు ఉపరాజ ప్రముఖుడుగాను వుంటారు.

## ప్రీవీ పర్సు

సంస్థానాధీశుల స్వంత ఖర్చులకోసం సంస్థానాదాయంలోనుంచి ఇచ్చే డబ్బును ప్రీవీపర్సు అంటారు. ప్రస్తుతం సంస్థానాధీశులకు ఇవ్వబడే ప్రివీపర్సు వివరాలనుగురించి, 1949 ఫిబ్రవరి 17 తేదీన కేంద్ర శాసన సభలో సర్దార్ పటేల్ ఇలా చెప్పారు.

ఇండియాలో కలిసిపోయినట్టివిన్నీ, యూనియనులుగా ఏర్పడి నట్టివిన్నీ సంస్థానాల అధిపతులకు, ఆ సంస్థానాల ఆదాయంలో మొదటి లక్షలో నూటికి 15 వంతులున్నూ, తరువాతి నాలుగు లక్షలలో నూటికి 10 వంతులున్నూ, ఆ పైనవచ్చే ఆదాయంలో నూటికి $7\frac{1}{2}$ వంతులున్నూ

ఇవ్వబడుతుంది. అయితే, ఏసంస్థానాధిపతికిన్నీ ఏడాదికి పదిలక్షలకు మించిన ప్రివీపర్స్ ఇవ్వబడదు.

కొంతమంది సంస్థానాధీశుల విషయంలోమాత్రం, పైనిబంధన వర్తించకుండా మినహాయింపు చెయ్యబడింది. అయితే యీ మినహాయింపు ఆయాసంస్థానాలలో ప్రస్తుతం పరిపాలనచేస్తున్న రాజుల జీవితకాలం లోనే వర్తిస్తుంది. వారి తదనంతరం వచ్చేవారికి ఇవ్వబడే ప్రివీపర్స్ను గురించి, యిప్పటివరకు ఏమీ నిర్ణయింపబడలేదు. ప్రస్తుతం, పైనిబంధనకు లోబడకుండా ప్రివీపర్స్ను పొందుతున్న రాజుల వివరాలు ఇవి :

బరోడాగాయక్వార్, రు. 26 లక్షలు; ఇండోర్ మహారాజు, రు. 15 లక్షలు.

## హైదరాబాదు

వైశాల్యం : 82,698 చ. మైళ్ళు : జనాభా, 1, 63,38,534 హిందువులు 1,33,10,045; ముస్లిములు 20,97,475.

బ్రిటీషువారితో ఒడంబడిక చేసుకోనడానికిపూర్వం, హైదరాబాదు పాలకుడు దక్కన్ సుబేదారు అనే హోదాతో, ఢిల్లీలోని మొగల్ చక్రవర్తికి లోబడివుండేవాడు. మొగల్ చక్రవర్తి అధికారం సన్నగిలినకొద్దీ, దక్కన్ సుబేదారు ప్రాబల్యం హెచ్చింది. అయితే. దక్కన్ సుబేదారీలో మొట్టమొదట వున్నంత భూభాగం యిప్పుడు లేదు. కొంతభాగం. మహారాష్ట్రుల వశమైంది. కొంత భాగం, ఇంగ్లీషు వారికి దత్తంచెయ్యబడింది. బ్రిటిషు ప్రభుత్వం, హైదరాబాదు పాలకుణ్ణి, నైజాం అనే హోదాతో "హిజ్ ఎగ్జాల్టెడ్ హైనెస్" అనే బిరుదుతో, స్వతంత్రరాజుగా గుర్తించారు.

హైదరాబాదు పాలకుడు ముస్లిం మతావలంబి అయినప్పటికీ ప్రజలలో నూటికి 86 వంతులు హిందువులు. వీటిలో సుమారు 80 లక్షల మంది ఆంధ్రులు.

ఈ సంస్థానం 17 జిల్లాలుగా విభజింపబడింది. మొత్తం 153 తాలూకాలు వున్నాయి, రాజ్యంలోని ప్రజలు విస్తారంగా తెలుగువారు,

మహారాష్ట్రలు కొట్టి, రాజ్యాన్ని తెలంగాణమనీ, మహారాష్ట్రవాడా అని రెండు భాగాలుగా వ్యవహరిస్తారు.

ఒకప్పుడు నైజాం పరిపాలనలోవున్న బేరారు, యిప్పుడు సెంట్రల్ ప్రావిన్సెసు రాష్ట్రంలో కలిపివెయ్యబడింది. బేరారునుంచి వచ్చే ఆదాయంలో ఏటా 25 లక్షల రూపాయలు నైజాంకు యివ్వబడుతున్నాయి.

సంస్థాన పరిపాలన అంతా, నైజాం యిష్ట ప్రకారం జరుగుతుంది. ప్రజలలో నూటికి పన్నెండు వంతులకు తక్కువగావున్న ముస్లిములకు, హిందువులలో సమాన ప్రాతినిధ్యం యివ్వబడిన శాసనసభ 1947 లో ఏర్పాటుచేయబడింది. ఈ శాసనసభ ప్రథమ సమావేశం 1947 ఫిబ్రవరి 17 వ తేదీన జరిగింది.

సంస్థానంలో సుమారు 8,119 చ. మైళ్ళభూమి నైజాము స్వంత ఎస్టేటు. దీనినే సర్ఫేఖాస్ అంటారు. అసలు సంస్థానం వైశాల్యం అంతటిలోనూ నూటికి 42 వంతులు జాగీర్లు, చిన్న సంస్థానాలుగా వుంది.

సంస్థానంలో తెలంగాణా ప్రాంతం, 41, 41,502 చ. మైళ్ళు. జనాభా, 87,11,176, మహారాష్ట్రప్రాంతం, 27,591 చ. మైళ్ళు. జనాభా, 52,19.528. కర్ణాటకప్రాంతం, 13,605 చ. మైళ్ళు. జనాభా. 20,97,290.

సంస్థానపు రైల్వే పొడవు మొత్తం, 1360 మైళ్ళు.

ఇండియాలోని సంస్థానాలన్నీ, 1947 ఆగస్టు 15 అనంతరం ఇండియా ప్రభుత్వంతో దృఢసంబంధాల ఒడంబడికలను చేసుకున్నప్పటికీ, హైదరాబాదు నైజాం మాత్రం, అలా చెయ్యడానికి అంగీకరించలేదు. తన సంస్థానం. ఇతరసంస్థానాలవలె గాక ప్రత్యేక హోదా గలదనీ, తాను ఇండియాతో స్నేహంగా వుంటానని ఒడంబడిక చేసుకోగలనేగాని, అందరివలెనే ఇండియా ప్రభుత్వానికి లోబడి దృఢసంబంధపు ఒడంబడిక చేసుకొనజాలననీ నైజాం ప్రకటించాడు. ఇండియా ప్రభుత్వానికీ, నైజాం ప్రతినిధులకూ సుమారు నాలుగునెలలపాటు రాయబారాలు జరిగిన తరువాత, 1947 నవంబరు 28 న, యధాతథపు ఒడంబడికపై నైజాం సంతకంపెట్టడం జరిగింది. ఈ ఒడంబడిక ప్రకారం,

హైదరాబాదుకీ, ఇండియా ప్రభుత్వానికీ 1947 ఆగస్టు 15 కు పూర్వం ఏ సంబంధాలు వుండేవో, అవే ఇకముందు ఒక సంవత్సరందాకా వుంటాయి. ఈ సంవత్సరంలోపల శాశ్వతమైన ఒడంబడిక కుదుర్చుకోవటానికి ఉభయులూ ప్రయత్నిస్తారు.

ఈ ఒడంబడిక ప్రకారం, హైదరాబాదులో వున్న ఇండియా సైన్యాలన్నీ 1948 ఫిబ్రవరి మాసాంతంలోపల హైదరాబాదునుంచి రప్పించి వేయబడతవి. అన్నిదేశాలలోను తన ఏజెంట్లను నియమించడానికి నైజాం హక్కు కలిగి వుంటారు. హైదరాబాదులో ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి ఏమైనా ప్రయత్నాలు జరిగితే, వాటిని అణచివెయ్యడానికి తగిన సహాయం ఇండియాప్రభుత్వం ఇస్తుంది.

జనాభాలో నూటికి 15 వంతులే వున్న ముస్లిములకు, హిందువులతో సమానంగా ప్రాతినిధ్యం వున్న శాసనసభను ఏర్పాటుచెయ్యడం అన్యాయమని, ప్రజలందరికీ సమాన హక్కులు, వయోజన ఓటింగు హక్కు, మెజారిటీ పక్షప్రభుత్వము సంస్థానంలో నెలకొల్పవలసిందనీ, సంస్థానం ఇండియాతో దృఢసంబంధపు ఒడంబడికను చేసుకోవాలనీ సంస్థాన కాంగ్రెసు కోరింది. సంస్థానాధిపతి యీ కోరికలను అంగీకరించనందున, కాంగ్రెసు సత్యాగ్రహం జరిపింది.

ఇండియాతో యథాతథపు ఒడంబడికను చేసుకున్న తరువాత, నైజాం అప్పటికివున్న మంత్రిమండలిని తొలగించి, హైదరాబాదులో పెద్దవ్యాపారస్థుడు మీర్ లాయక్ అలీని ప్రధానమంత్రిగా నియమించాడు. ఆయన 1947 డిసెంబరు 16 న ఒక మంత్రిమండలిని ఏర్పాటు చేశాడు. ఈ మంత్రిమండలిలో ఎనిమిదిమంది ముస్లిములు, ఆరుగురు హిందువులు. ముస్లిములు ముఖ్యంగా, హైదరాదులోని ఇత్తెహాద్ ఉల్ ముస్లిమీన్ అనే సంస్థనాయకుడు సయ్యద్ కాశింరజ్వీ సూచనపై నియమింపబడినవారు. ఈ రజ్వీ, హైదరాబాదు స్వతంత్రరాజ్యంగా వుండాలనీ, సంస్థానంలో అల్పసంఖ్యలోవున్న ముస్లిములే పరిపాలన సాగించాలనీ ప్రచారం ఆరంభించి, తనకు ప్రతికూలుర నందరినీ అణచడానికి రజాకార్లు అనే పేరుతో, సైనిక తరిఫీదు పొందిన ముఠా

తయారుచేశాడు. వీరు సంస్థాన ప్రజలపైన, ముఖ్యంగా హిందువులపై చేసిన దౌర్జన్యాలు చెప్పరానివి. అంతేగాక, యీ మూకా, ఇండియా సరిహద్దులపైనకూడా దాడులుజరుప నారంభించింది. ఈ మూకా దౌర్జన్యాలను సహించడమేకాక, వీరికి ప్రోద్బలంయిస్తూ లాయక్ ఆలీ మంత్రివర్గం, సంస్థానసైన్యాలను పెంచడం ఆరంభించింది. దొంగతనంగా ఆయుధాలను దిగుమతిచేసుకోడం సాగించింది. యథాతథపు ఒడంబడిక ప్రకారం, హైదరాబాదులోవున్న ఇండియా సైన్యాలు ఇండియాకు తప్పించివేయబడినందున, యీ దౌర్జన్యచర్యలను అరికట్టేవారే లేకపోయారు. సంస్థానంలోని ఉద్యోగులలో అధికసంఖ్యాకులు ముస్లిములే. వారిలో చాలా మంది రజాకార్లకు ప్రోద్బలంకూడాయివ్వడం ఆరంభించారు.

హైదరాబాదులో శాంతిని ఏర్పరచడానికి, ఇండియా ప్రభుత్వంతో ఒక ఒడంబడికకు వచ్చేటట్లు చెయ్యడానికి, ఇండియా ప్రభుత్వం హైదరాబాదు ప్రతినిధులతో 1948 మార్చిలోనూ, జూన్‌లోనూ ఢిల్లీలో సంప్రతింపులు జరిపారు. కాని, హైదరాబాదు ప్రతినిధులు ఢిల్లీలో ఒక ఒడంబడికకు ఒప్పుకోవడం, హైదరాబాదువెళ్ళి దానిని కాదనడం జరిగింది. ఈలోపల రజాకార్ల దౌర్జన్యాలు చాలా ఎక్కువ అయిపోయాయి. వందలకొలది గ్రామాలపై దాడులు, హిందువులను, తమ హింసాపద్ధతులకు వ్యతిరేకతను చూపిన ముస్లిములను ఘోర హత్యలకు పాల్పరచడము, ఇళ్ళను తగులబెట్టడము, స్త్రీలను అవమానించడము, మొదలైన కృత్యాలు హైదరాబాదు సంస్థానంలోని గ్రామాలలోనేకాక, ఇండియా సరిహద్దు గ్రామాలలోకూడా రజాకార్లు సాగించారు. ఒకవైపున, మీర్ లాయక్ ఆలీ మంత్రివర్గం విమానముల మీద దొంగతనంగా ఆయుధాలను దిగుమతిచేయించి, సైన్యాన్ని ఎక్కువగా పెంచివేస్తున్నది.

ఇదంతా చూసి, ఇక పూరుకుంటే పరిస్థితులు విషమించుతాయని ఇండియాప్రభుత్వం నిశ్చయించి, హైదరాబాదులో శాంతిభద్రతలు, ఇండియా అంతటా శాంతిభద్రతల నిర్వహణకు ప్రధానం కనుక, సంస్థానంలో శాంతిభద్రతలను కాపాడడానికి, ఇండియా సైన్యాలను యథాతథపు ఒడంబడికకు పూర్వంవలెనే సికందరాబాదు, బొలారం, తిరుమల

గిరిలలో వుంచడానికి అనుమతి ఇవ్వవలసిందని నైజామును సెప్టెంబరు 7 వ తేదిన కోరింది. నైజాం యీ కోరికను నిరాకరించాడు. అయినప్పటికీ, ఇండియా సేనలు హైదరాబాదుకు కదలుతాయనీ, సికందరాబాదు, బొలారం, తిరుమలగిరిలలో స్థావరం ఏర్పరచుకుంటాయనీ, హైదరాబాదు సేనలు ప్రతిఘటించేటట్లయితే, ఆ ప్రతిఘటనను అణచివేసి, ఇండియా సేనలు తమ గమ్యస్థానాన్ని చేరుకుంటాయని ఇండియా ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, సెప్టెంబరు 10 తేదిన ప్రకటించారు.

ఇండియా ప్రభుత్వంవారి, యీ నిర్ణయాన్ననుసరించి, ఇండియా సైన్యాలు, సెప్టెంబరు 12 తేది రాత్రి నాలుగుగంటలకు, తెల్లవారితే 13 తేది అనగా, హైదరాబాదు సంస్థానంలోనికి కదలినవి. సంస్థానంలో శాంతి, భద్రతలను నెలకొల్పడానికి ఇండియా ప్రభుత్వం ఉపక్రమించిన యీ చర్యను జయప్రదంగా సాగించడానికీ, సేనలకు నాయకుడు, లెఫ్టినెంట్ జనరల్ మహరాజ్ శ్రీ రాజేంద్రసింహజీ. ఈ చర్య ఆరంభమవడానికి రెండురోజులు ముందుగా, లాయక్ అలీ మంత్రిమండలి, ఇండియాపైన విశ్వరాజ్య భద్రతామండలిలో ఫిర్యాదు చెయ్యడానికి ఒక ప్రతినిధివర్గాన్ని పారిస్ పంపించింది. భద్రతామండలి యీ విషయాన్ని చర్చించడానికి నిశ్చయించింది. కాని, విషయం చర్చకు రాకముందే, సెప్టెంబరు 17 తేదిన హైదరాబాదు, ఇండియాకు లొంగిపోయింది. ఇండియా సేనలు హైదరాబాదుకు 30 మైళ్ళ సమీపంలోకి వచ్చేసరికి, లాయక్ అలి మంత్రివర్గం రాజీనామా యిచ్చింది. నైజాం, ఆ రాజీనామాను అంగీకరించి, ఇండియా సైన్యాలను హైదరాబాదును ఆక్రమించి, శాంతిభద్రతలను నెలకొల్పవలసిందిగా కోరాడు. సెప్టెంబరు 18 తేది సాయంకాలం, ఇండియా సేనలు హైదరాబాదునగరంలో ప్రవేశించాయి. భద్రతామండలిలో ఫిర్యాదును ఉపసంహరించుకోడానికీ, రజాకార్లనుకూడాను తొలగించడానికీ, నిజాంఫర్మానా చేశాడు.

హైదరాబాదులో ఇండియా సేనలు ప్రవేశించేటప్పటికి, సంస్థానం పరిస్థితి అంతా అల్లకల్లోలంగా వుంది. సంస్థానంలో శాంతిని నెలకొల్పడం, ప్రజాపరిషత్తును ఏర్పరచడం, సక్రమపరిపాలనను ఏర్పాటు

చెయ్యడం, ఇండియా ప్రభుత్వ కర్తవ్యమైంది. పరిస్థితులు చక్కబడే దాకా, పరిపాలన సాగించడానికి మేజర్-జనరల్ జె. ఎన్. చౌదరి హైదరాబాదుకు మిలిటరీ గవర్నరుగా నియమింపబడినారు. చీఫ్ సివిల్ అడ్మినిస్ట్రేటర్‌గా డి. ఎస్. భక్లే, అడిషనల్ సివిల్ అడ్మినిస్ట్రేటర్‌గా డి. ఆర్. ప్రధాన్, పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా ఎ. ఐ. నాంజప్పగారు నియమింపబడినారు. సంస్థానంలోని 17 జిల్లాలలోను పరిపాలనను సక్రమమార్గంలోకి తీసుకురావడానికి, ఇండియారాష్ట్రాలనుంచి 17 మంది కలెక్టర్లు, 17 మంది జిల్లా పోలీసు సూపరింటెండెంట్లు హైదరాబాదుకు పంపబడినారు.

హైదరాబాదులో అల్లకల్లోలానికి కారకుడైన కాసిం రజ్వీని, అతని అనుచరులను ఇండియా సేనలు ఖైదుచేసినవి. రజ్వీకి సహాయంగా ప్రవర్తించిన మీర్ లాయక్ అలీని, అతని మంత్రిమండలిలోని మంత్రులను నిర్బంధంలో వుంచారు.

హైదరాబాదు భవిష్యత్తును, సంస్థాన ప్రజలే నిర్ణయించాలనే సూత్రప్రకారం, సంస్థానంలో కాన్స్టిట్యుయెంట్ అసెంబ్లీని స్థాపించడానికి తగిన ఏర్పాట్లను మిలిటరీ ప్రభుత్వంవారు చేస్తున్నారు.

సర్ఫ్‌కాస్ అనే పేరుతో నైజాం స్వంత ఆస్తిగా పరిగణింపబడుతున్న సుమారు 8,110 చ. మైళ్ళ ప్రదేశం 1949 ఫిబ్రవరి 6 తేదీన సంస్థాన ప్రభుత్వ అధీనంలోకి మార్చబడింది. ఈ ప్రాంతాన్ని ప్రభుత్వానికి ఇచ్చివేసినందుకు, నైజాం కోల్పోయిన ఆదాయానికి పరిహారంగా ఏడాదికి కోటిరూపాయలు ఇవ్వబడుతవి.

సంస్థానాధిపతి: హిస్ ఎగ్జాల్టెడ్ హైనెస్ రుస్తుమ్-ఇ-దౌరాన్ అరస్తు-ఇ-జమాన్, లెఫ్టినెంట్ జనరల్ ముజఫర్ ఉల్ ముల్క్ వాల్ మామలిక్ నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహదూర్ ఫతే జంగ్ సిపాహిసాలార్ నిజాముద్దౌలా నిజాముల్ ముల్క్ అసఫ్‌జా.

యువరాజు: హిస్ హైనెస్ నవాబ్ మీర్ హిమాయత్ అలీ ఖాన్ అజం బహదూర్, బీరార్ యువరాజు.

## కాశ్మీర్

వైశాల్యం : 85,885 చ. మైళ్ళు. జనాభా, 40,21,616. హిందువులు, 8,07,548; ముస్లిములు, 30,73,540.

కాశ్మీర సంస్థానం, భారతదేశంలోని సంస్థానాలన్నిటిలోను పెద్దది. అంతేగాక, అతి సుందరమైన ప్రకృతిదృశ్యాలు గలది. సింధు చీనాబ్, జీలం నదులు ఈ రాజ్యంగుండా ప్రవహిస్తున్నాయి. రాజు హిందువు అయినప్పటికీ, ప్రజలలో నూటికి 75 వంతులు ముస్లిములు. షికందరు అనే నవాబు ఈ రాజ్యాన్ని పరిపాలించిన రోజులలో, అంటే 1,400 సంవత్సర ప్రాంతంలో, ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ఇస్లాం మతంలో చేరిపోయారు, ఇది 1337 సంవత్సరంవరకూ హిందూరాజుల పరిపాలనలోనే వుంది. అప్పుడు పారశీక దేశస్థుడొకడు ఈ రాజ్యాన్ని జయించి, ముస్లిం రాజరికంలోకి తీసుకొనివచ్చాడు. కాని, 1586 లో అక్బరు ఈ రాజ్యాన్ని మొగలు సామ్రాజ్యంలో కలిపివేసి ఒక సుబేదారును నియమించినదాకా, స్వతంత్ర రాజుల పాలనలోనేవుంది. మొగలు చక్రవర్తుల బలం సన్నగిలినప్పుడు, ఈ రాజ్యాధిపతి క్రమేపి స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు. 1819 లో మహారాజా రంజిత్ సింగ్ యీ రాజ్యాన్ని జయించి, తన రాజ్యంలో కలిపివేసుకున్నాడు, రంజిత్ సింగ్ మరణానంతరం, ఈ రాజ్యాన్ని జమ్మురాజైన మహారాజా గులాబ్ సింగుకు బ్రిటిషువారు 75 లక్షల రూపాయలకు అమ్మివేశారు.

దేశంలో బాధ్యతాయుత పరిపాలన కావాలని ఆందోళన ఇటీవల ఎక్కువైంది. షేక్ అబ్దుల్లా నాయకత్వాన నేషనలు కాన్ఫరెన్సువారు ఈ ఉద్యమాన్ని సాగించారు.

భరతఖండం విభజనానంతరం, కాశ్మీరును పాకిస్తాన్‌లో కలుపుకోవడానికి ఆ ప్రభుత్వం చాలా ప్రయత్నించింది. కాని, అది సాగలేదు. అంచేత, పశ్చిమోత్తర సరిహద్దులో వున్న కొండజాతులకు ఆయుధసామగ్రిని యిచ్చి, కాశ్మీర్‌మీదకు దండయాత్ర చేయించింది. ఈ కొండదండు కాశ్మీరులో ప్రవేశించి, నానాబీభత్సం చేస్తూవుండగా, 1946 అక్టోబరు 26 న కాశ్మీరు మహారాజు, తన సంస్థానాన్ని ఇండి

యాతో కలుపుకొని తనకూ తన సంస్థానానికీ రక్షణ యివ్వవలసిందని ఇండియా ప్రభుత్వాన్ని కోరాడు. ఆ కోరికను గవర్నర్‌జనరల్ అంగీకరిస్తూ, కాశ్మీర్ భారతదేశంతో చేరడం తాత్కాలికమేనని, కొండ దండులను వెళ్ళగొట్టి సంస్థానంలో శాంతి నెలకొల్పిన తరువాత, ప్రజల యిష్టప్రకారం ఆ సంస్థానాన్ని ఇండియాలో చేర్చుకోవడమో, మాని వెయ్యడమో జరుగుతుందని తెలియపరచాడు. తాత్కాలికంగా యీ సంస్థానం ఇండియాతో కలియడం, 1947 అక్టోబరు 27 న జరిగింది. ఆనాడే, ఇండియానుంచి సైన్యాలు కాశ్మీరుకు పంపబడినవి.

అప్పటినుంచీ, 1949 జనవరి 1 తేదివరకూ, భారతసేనలు కాశ్మీరుపై దండయాత్రజరిపిన సరిహద్దుమూకలతోనూ, వీరికి సహాయం చేస్తున్న పాకిస్తాన్ సైన్యాలతోనూ పోరాటంసాగించుతూ, వీరి ఆక్రమణలోవున్న సంస్థానప్రదేశాన్ని చాలావరకు విడిపించినవి.

కాశ్మీరు సమస్యవల్ల ఇండియా-పాకిస్తానులమధ్య ఏర్పడిన తగాదా మిత్రరాజ్యసమితి సెక్యూరిటీకౌన్సిలువద్దకు విచారణకువచ్చింది. ఈ సమస్యను విచారించి, ఉభయపక్షాలకూ రాజీకుదర్చడానికి సెక్యూరిటీ కౌన్సిలు ఒక ఉపసంఘాన్ని నియమించింది. ఈ ఉపసంఘపుకృషివల్ల, ఉభయులకూ కాశ్మీరు భవిష్యత్తును నిర్ణయించే విషయంలో ఒక ఒడంబడిక కుదిరింది. ఆ ఒడంబడిక కారణంగా కాశ్మీరులో యుద్ధం, 1949 జనవరి 1 తేదిన విరమింపబడింది.

ఈ ఒడంబడిక ప్రకారం, కాశ్మీరును ఇండియాలోచేర్చాలా, పాకిస్తాన్‌తోచేర్చాలా అనే విషయాన్ని నిర్ణయించడానికి ప్రజాభిప్రాయం కనుగొనబడుతుంది. ప్రజాభిప్రాయం కనుగొనడానికి జరిగే ఎన్నికలు, మిత్రరాజ్యసమితి నియమించిన ఒక ప్రత్యేక అధికారి పర్యవేక్షణలో జరుగుతాయి. కాశ్మీరులోని పాకిస్తాన్ సైన్యాలు తరలిపోతాయి.

మహారాజు : [illegible] సర్ హరిసింగ్ బహదూర్

1947 అక్టోబరు 31 న షేక్ అబ్దుల్లా నాయకత్వాన కాశ్మీరుకు తాత్కాలిక జాతీయ ప్రభుత్వం స్థాపింపబడింది. షేక్ అబ్దుల్లా 1948 మార్చి 18 తేదిన తన మంత్రిమండలిని ఏర్పాటు చేశాడు.

## మై సూ ర్

వైశాల్యం, 29,458 చ. మైళ్లు; జనాభా, 73,29,140. హిందువులు, 66,86,630; ముస్లిములు, 4,85,230.

మైసూరు రాజ్యం, ఒక్క ఉత్తరపువైపునతప్ప, తక్కిన అన్ని దిశలలోనూ మదరాసు రాజధానితో ఎల్లలు కలిగివుంది. ఉత్తరపువైపున బొంబాయి రాజధానితో ఎల్ల కలిగివుంది. ఈ రాజ్యం 18 వ శతాబ్దంలో కొన్ని సంవత్సరాలుమాత్రం హైదరాలి, టిప్పుసుల్తాన్ల పాలనలో ముస్లిం ఆధిపత్యంలో వుందిగాని, అంతకు పూర్వము, ఆ తరువాత హిందూ రాజులే మైసూరును పరిపాలించారు. 1799 లో టిప్పుసుల్తానును ఓడించిన ఇంగ్లీషు వారు, మైసూరు రాజ్యాన్ని అంతకుపూర్వపు హిందూ రాజుల వంశీకుడైన కృష్ణరాజ వడయరుకు అప్పగించారు. పారిశ్రామికంగానూ, నీటి సప్లయి, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి మొదలగు విషయాలలోనూ మైసూరురాజ్యం చాలా అభివృద్ధిలోకి వచ్చింది.

మైసూరులో రిప్రెజెంటేటివ్ అసెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిలు అనే పేర్లతో రెండు శాసనసభలు వున్నాయి. పరిపాలన మహారాజుచే నియమించబడిన మంత్రులు సాగిస్తారు.

76 గురు సభ్యులుగల కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీ 1948 ఏప్రెల్ 7 వ తేదీన ఏర్పాటుచెయ్యబడింది.

బాధ్యతాయుత పరిపాలనను సంస్థానంలో నెలకొల్పాలని, సంస్థాన కాంగ్రెసువారు చేసిన ఆందోళన ఫలితంగా, సంస్థానంలో తాత్కాలిక ప్రజా ప్రభుత్వాన్ని నెలకొల్పడానికీ, కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీ సూచించినప్రకారం రాజ్యాంగ విధానాన్ని అమలులోకి తేవడానికి, మహారాజు అంగీకరించారు. ఈ అంగీకార ఫలితంగా, 1947 అక్టోబరు 24 న, సంస్థానంలో తాత్కాలిక మంత్రిమండలి స్థాపించబడింది.

భారతదేశంలో సిల్కును ఎక్కువగా తయారుచేసే ప్రాంతాలలో, ప్రథమ స్థానం మైసూరుది. భద్రావతి దగ్గరవున్న ఉక్కుఫాక్టరీ ఇనుము, ఉక్కు తయారుచేసే ఫ్యాక్టరీలలో చాలా ప్రాధాన్యత

వహించింది. మైసూరు పరిశ్రమలలో ముఖ్యంగా చెప్పవలసినవి ఇవి : చందన తైలము, చందనపు చెక్కడము, పట్టు పరిశ్రమ. భారతదేశంలో కల్లా ఎక్కువగా బంగారం దొరికేది ఈ రాజ్యంలోనే.

మహారాజు : హిజ్ హైనెస్ సర్ శ్రీ జయచామ రాజేంద్ర వడయార్ బహదూర్

మంత్రిమండలి :

ప్రధానమంత్రి
రెవిన్యూ, ఆహారం } కె. చెంగల్వరాయరెడ్డి

ఆర్థికమంత్రి : హెచ్. సి. దాసప్ప
న్యాయమంత్రి : కె. టి. భాష్యం
వ్యవసాయమంత్రి : హెచ్. సిద్ధయ్య
హోంమంత్రి : టి. మరియప్ప
స్థానిక స్వపాలనమంత్రి : ఆర్. చెన్నిగిరామయ్య
ఆరోగ్యమంత్రి : మహమద్ షరీఫ్
విద్యామంత్రి : డి. హెచ్. చంద్రశేఖరయ్య
ముజరాయి శాఖమంత్రి : పి. సుబ్బరామశెట్టి
దివాన్ : సర్ ఎ. రామస్వామి మొదలియార్
ఆర్థికస్థితి : 1948-49 బడ్జెటు ప్రకారం, ఈ సంస్థానపు ఆదాయ వ్యయాల అంచనా లివి :

ఆదాయం : రు. 10,06 లక్షలు.
వ్యయం : రు. 13,72 లక్షలు.
లోటు : రు. 3,66 లక్షలు.

కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ అధ్యక్షుడు: టి. సుబ్రహ్మణ్యం; లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షుడు, హెచ్. బి. గుండప్పగౌడ.

## తిరువాన్కూర్

వైశాల్యం : 7,662 చ. మైళ్ళు. జనాభా. 60,70,013. హిందువులు. 35,42,399.

మహారాజు : ఆనరరీ మేజర్ జనరల్ హిస్ హైనెస్ శ్రీ పద్మనాభ దాస వాంచిపాల సర్ బలరామవర్మ కులశేఖర కిరీటపతి మన్నె సుల్తాన్ మహారాజ రామరాజ బహదూర్ షంషేర్ జంగ్.

భారతదేశము నైరుతి అగ్రంలోవున్న సంస్థానం. ఒకప్పుడు దక్షిణ భారతదేశంలో ప్రబలులై వున్న చేరవంశపురాజుల వంశీకులే ఇప్పటికీ ఈ రాజ్యాన్ని పాలిస్తున్నారు. అయితే, రాజ్యాధికారానికి వారసత్వం, రాజు బిడ్డలకు కాక మేనల్లుళ్ళకు చెందుతుంది. రాజు తల్లికి మహారాణి బిరుదు వుంటుంది. రాజు వివాహంచేసుకున్న యువతికి మహారాణి హోదాలేదు. ప్రస్తుతపు మహారాజు 1931 లో సింహాసనాన్ని అధిష్ఠించారు. 1924 లోనే ఈ మహారాజు సింహాసనాధికారాన్ని పొందినా, మైనారిటీ తీరేవరకూ, ఆయన పెదతల్లి మహారాణి సేతు లక్ష్మీబాయి పరిపాలన సాగించారు. ఈ సంస్థానం, 1936 నుంచీ 1947 ఆగస్టు 19 వ తేదీవరకు సర్. పి. సి. రామస్వామి అయ్యర్ దివానగిరీలో, అర్థికంగా చాలా అభివృద్ధిగాంచింది. ఇక్కడ ప్రజల జీవనాధారానికి ప్రధానమైన వృత్తి వ్యవసాయము. కొబ్బరి, రబ్బరు, టీతోటలు ప్రజలకు ప్రధాన జీవనాధారాలుగా వుంటటమేకాక, ప్రభుత్వానికి విశేష ఆదాయాన్ని చేకూరుస్తున్నాయి,

ఏటంబాంబులు చెయ్యడానికి ఉపయోగపడే థోరియం అనే లోహం ఈ సంస్థానంలో ఎక్కువ లభిస్తుందని భూగర్భపరిశోధకులు కనుక్కున్న తరువాత, ప్రపంచ రాజకీయాలలో ఈ సంస్థానానికి ప్రాధాన్యతకూడా కలిగింది.

మహారాజు చేసిన ప్రకటనను అనుసరించి, సంస్థానానికి రాజ్యాంగ విధానాన్ని తయారుచెయ్యడానికి కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీకి ఎన్నికలు 1948 మార్చిలో ఏర్పాటు చెయ్యబడెను.

1948 మార్చి 20 తేదీన రాజ్యాంగపరిషత్తు సమావేశమైంది. రాజ్యాంగసభ అధ్యక్షుడు: ఆర్. వి. థామస్. 1948 మార్చి 24 తేదీన ప్రజా ప్రతినిధుల ప్రభుత్వం స్థాపించబడింది. దానికి అధిపతి పట్టంతాను పిళ్లై. అతని మంత్రిమండలిపై తమకు విశ్వాసం లేదని సంస్థాన శాసనసభ

కాంగ్రెసు పక్షం ప్రకటించినందున అక్టోబరు 20 తేదీన తాను పదవికి రాజీనామా ఇచ్చారు. వారిస్థానే, పరూర్ టి. కె. నారాయణపిళ్లై ప్రధానిగా ఎన్నుకోబడినారు.

మంత్రిమండలి:

| | |
|---|---|
| ప్రధానమంత్రి, హోం, పరిశ్రమలు : | టి. కె. నారాయణ పిళ్లై |
| ఆర్థికమంత్రి : | ఏ. జె. జాన్ |
| ఆహారమంత్రి | వి. ఒ. మార్కోస్ |
| విద్యామంత్రి : | ఎన్. కుంజురామన్ |
| పబ్లిక్ వర్క్స్ మంత్రి : | కె. ఆర్. ఎలంకాత్ |
| ఆరోగ్యమంత్రి : | డాక్టర్ ఇ. కె. మాధవన్. |

ఆర్థికస్థితి: 1948—49 బడ్జెటు ప్రకారం తిరువాంకూరు సంస్థాన ఆర్థికపరిస్థితి ఇది :

| | |
|---|---|
| ఆదాయం : | 8,55 లక్షలు |
| వ్యయం : | 8,53 లక్షలు |
| మిగులు : | 2 లక్షలు |

## కొచ్చిన్

వైశాల్యం: 1,493 చ. మైళ్ళు; జనాభా, 14,22,875; హిందువులు, 8,96,950; ముస్లిములు, 1,09,188.

ఈ సంస్థానం, తిరువాంకూరుకూ, మదరాసు రాష్ట్రంలోని మలబారు జిల్లాకు మధ్యన, భారతదేశపు నైరుతి తీరానవుంది. ఒకప్పుడు చోళరాజుల ప్రతినిధిగా ప్రస్తుతపు తిరువాంకూరు, మలబారు ప్రాంతానికంతకూ ఏలికగావున్న చేరమన్ పెరుమాళ్ వంశీకులు ఈ రాజ్యాన్ని పాలిస్తున్నారు.

మహారాజు : హిస్ హైనెస్ శ్రీరామవర్మ

సంస్థానంలో లెజిస్లేటివ్ కౌన్సిలువుంది. మైనారిటీవెళ్ళిన స్త్రీ, పురుషు లందరికీ ఓటుచేసే హక్కుతో 1948 సెప్టెంబరులో సంస్థానపు కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీకి ఎన్నికలు జరిగినవి.

ఈ ఎన్నికలలో సంస్థాన ప్రజామండలి గెలుపొందింది. అసెంబ్లీ స్థానాలు మొత్తం 58. వానిలో ఎన్నికస్థానాలు 53. వీటిలో 43 స్థానాలను ప్రజామండలి గెలిచింది. ప్రజామండలినాయకుడు ఇక్కండ వారియర్‌ను మంత్రిమండలిని ఏర్పాటుచెయ్యమని మహారాజు సెప్టెంబరు 19 న కోరారు. ఆయన యీక్రింది మంత్రిమండలిని ఏర్పాటుచేశారు.

ప్రధానమంత్రి<br>ఆహారం, వ్యవసాయం,<br>పోలీసు, సేన } ఇ. ఇక్కండ వారియర్

ఆర్థికము, శాసనము<br>కార్మికులు, ఎక్సైజు<br>ప్రచారము } పి. గోవిందమీనన్

భూమిసన్ను, పబ్లిక్ వర్క్సు: కె. అయ్యప్పన్

విద్య, ప్రజారోగ్యము: సి. ఎ. జోసెఫ్

ఆర్థికస్థితి : 1948—49 సంవత్సరానికి (మలబారు సంవత్సరం 1124 కు) ఈ సంస్థానపు బడ్జెటు అంకాలివి :

| | |
|---|---|
| ఆదాయం : | రు. 4,63,92,800 |
| వ్యయం : | రు. 4,62,16,200 |
| మిగులు : | రు. 1,76,600 |

సంస్థానపు కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ ప్రథమ సమావేశం 1948 అక్టోబరు 29 న జరిగింది.

# రాజవంశీకులకు పింఛనులు

బ్రిటిష్ ప్రభుత్వంవారు లోబరచుకున్న రాజుల వంశీకులకు యీ క్రింది పింఛనులు ఇవ్వబడుచున్నవని 1947 డిసెంబరు 3 తేదిన సర్దార్ వల్లభ్‌భాయ్‌పటేల్ కన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీలో చెప్పారు. ఈ పింఛనులు ఇండియాలో వున్నవారికి ఇండియా ప్రభుత్వంవారూ, పాకిస్తాన్‌లో వున్నవారికి పాకిస్తాన్ ప్రభుత్వంవారూ చెల్లిస్తున్నారు. ఈ ఉభయప్రభుత్వాలూ, యీ విషయంలో ఏదో ఒక ఒడంబడిక చేసుకొనేవరకూ యీ యేర్పాటే జరుగుతుంది.

| | |
|---|---|
| కర్నాటక నవాబు వంశీకులకు: | రు. 1,88,200 |
| (ఆర్కాటు నవాబుకు యిచ్చే | రు. 1,50,000 కలిపి). |
| తంజావూరు రాజా వంశీకులకు: | రు. 19,000 |
| టిప్పు సుల్తాన్ వంశీకులకు: | రు. 1,800 |
| అయోధ్య బేగం వంశీకులకు: | రు. 3,00,000 |
| నాగపూరు రాజు మనుమనికి: | రు. 50,000 |
| ఝాన్సీ రాజ వంశీకులకు : | రు. 81,500 |
| సూరత్ నవాబు వంశీకులకు: | రు. 62,000 |
| సతారా రాజా వంశీకులకు: | రు. 30,000 |
| మూర్షిదాబాదు నవాబుకు: | రు. 2,30,000 |
| అయోధ్యరాజు వంశీకులకు: | రు. 10,000 |
| ఖుర్దా రాజవంశీకులకు : | రు. 25,600 |
| మొగల చక్రవర్తుల వంశీకులకు: | రు. 30,000. |

ఇవన్నీ ఏడాదికొకసారి ఇచ్చే పింఛనులు.

# ఇండియా రాష్ట్రాలు

ఆగస్టు 15 వ తేదీవరకు భరతఖండం ఒకే రాజ్యంగా వున్నంత వరకు, స్వదేశ సంస్థానాలు మినహాగా, బ్రిటిషు పరిపాలనలోవున్న దేశంలో, గవర్నరుల పరిపాలనలోవున్న రాష్ట్రాలు పదకొండూ, కమిషనర్ల పరిపాలనలోవున్న చిన్నరాష్ట్రాలు నాలుగు వుండేవి.

1947 ఆగస్టు 15 వ తేదీన దేశానికి స్వరాజ్యంతో రావడంపాటు, స్వదేశ సంస్థానాలు మినహాగా మిగతా దేశం, ఇండియా, పాకిస్తాన్ అనే పేర్లతో రెండు డొమినియనులుగా ఏర్పడడంతో, తదనుకూలంగా రాష్ట్రవిభజనకూడా జరిగింది.

1945 ఆగస్టు 15 వ తేదీ తరువాత, ఇండియాలో వుండే రాష్ట్రాలు ఇవి:

అజ్మీరు-మార్వారు, అస్సాం, ఒరిస్సా, కూర్గు, ఢిల్లీ, తూర్పు పంజాబ్, పశ్చిమ బెంగాల్, బీహారు, బొంబాయి, మదరాసు, యునైటెడ్ ప్రావిన్సెసు, సెంట్రల్ ప్రావిన్సెసు.

## అస్సాం

బర్మాదేశాన్ని అనుకొని, మనదేశానికి ఈశాన్యదిక్కున ఉన్న రాష్ట్రం. దీని వైశాల్యం, 54,473 చ. మైళ్ళు. జనాభా, 70,88,131. హిందువులు. 22,92,965; ముస్లిములు, 15,50,362. ఈ లెఖలన్నీ 1941 జనాభా లెఖలమీద ఆధారపడిన అంచనాలు. ఈలోపల జన సంఖ్య ఎంత పెరిగినదీ, ఎంత తగ్గినదీ సరిగా చెప్పడానికి ఆధారం ఏమీ లేదు.

1874 వరకు అస్సాం రాష్ట్రం అనే ప్రత్యేక రాష్ట్రం లేదు. ఈ ప్రదేశమంతా కూడా బెంగాలు లెఫ్టినెంట్ గవర్నరు పరిపాలనలో

వుండేది. 1874 లో ఈరాష్ట్రాన్ని ప్రత్యేకించి, ఒక ఛీఫ్ కమిషనర్ పరిపాలనలో వుంచడం జరిగింది. అప్పటినుంచి 1921 వరకు ఇదే ఏర్పాటు అమలులోవుంది. 1921 లో ఈ రాష్ట్రానికి, మిగతా పెద్ద రాష్ట్రాలలో సమానహోదా ఇవ్వబడింది. ప్రత్యేకం ఒక గవర్నరును నియమించడం జరిగింది.

ఈ రాష్ట్రంలో ప్రధానమైన ఆహారపు పంట బియ్యం. 1946-47 లో యీరాష్ట్రంలో దాదాపు 101,000 టన్నుల వరిపంటపండింది. వ్యాపారపు పంటలో ముఖ్యమైనవి: టీ, జనపనార, చెరకు.

రాష్ట్రంలోని కొండప్రాంతాలలో, పొట్టిపింజప్రత్తి పైరుకూడా విరివిగా చేయబడుతున్నది, అస్సాంరాష్ట్రంలో వానలు ఎక్కువ. ఈ రాష్ట్రంలో కురిసినంత వాన, ఇండియాలోని మరొక రాష్ట్రంలో ఎక్కడా కురవదు. చిరపంజి అనే ప్రదేశంలో, సంవత్సరానికి దాదాపు 500 అంగుళాలపైగా వాన కురుస్తుంది. ప్రపంచంలో, నేల తడి ఎప్పుడూ ఆరకుండావుండే ప్రదేశాలలో చిరపంజి ఒకటి.

ఈ రాష్ట్రంలో ప్రవహించే ప్రధానమైన నదులు: బ్రహ్మపుత్ర, సుర్మ.

ఇక్కడ దొరికే ఖనిజాలలో వ్యాపారానికి ప్రస్తుతం త్రవ్వబడు తున్నవి. బొగ్గు. పెట్రోలు. 1946 లో 190 లక్షలు, 1947 లో 170 లక్షలు, 1948 లో 140 లక్షలు గాలనుల పెట్రోలు యీ రాష్ట్రంలో దొరికింది.

నాగపర్వతాలలోను, లక్ష్మీపూర్ జిల్లాలోను వున్న గనులలో నుంచి 1943 లో 222,31 టన్నుల బొగ్గు త్రవ్వబడింది, గారోకొండల ప్రాంతంలోకూడా చాలా బొగ్గు వున్నట్లు పరిశోధనలవల్ల తేలింది. పెట్రోలు లక్ష్మీపూర్, కచార్ జిల్లాలలో తీస్తున్నారు.

ప్రజలలో నూటికి 43 వంతులమంది బెంగాలీ భాషను, 21 వంతులమంది అస్సాం భాషను మాట్లాడుతున్నట్లు, 1941 జనాభా

లెఖలవల్ల తెలుస్తున్నది. మిగతా ప్రజలు, హిందీ, ఒరియా, ముండారి, నేపాళీ భాషలను, తిబెట్-బర్మా భాషల సంకరభాషను మాట్లాడుతున్నారు,

ప్రజలు రాకపోకలకు, వ్యాపారపు సరఫరాకు ఎక్కువగా నదులమీద నే అధారపడతారు. ఇటీవలనే రోడ్లను ఎక్కువగా నిర్మించడానికి కృషిజరుగుతున్నది.

కలకత్తానుంచి షిల్లాంగువరకు ప్రధాన రైలుదారివుంది. ఇది కాక, అస్సాములో రెండు మూడు చిన్న లైనులుకూడా వున్నాయి.

అస్సాంలో సిల్కు, నూలు వస్త్రాల నేతపరిశ్రమ పెద్ద గృహపరిశ్రమలలో ఒకటి. నేత అంతా, ఎక్కువగా స్త్రీలే చేస్తారు, ఇటీవల, మిలుబట్టల దిగుమతివల్ల, చేనేతపరిశ్రమ చాలావరకు దెబ్బతిన్నప్పటికీ, ఈ పరిశ్రమకు తగిన ప్రోత్సాహం ఇవ్వడానికి ప్రభుత్వం తీవ్రకృషి చేస్తున్నది.

పడవలు కట్టడం, ఇత్తడి, మట్టి పాత్రలను తయారుచెయ్యడం కూడా, ఈ రాష్ట్రంలోని ప్రధాన పరిశ్రమలలో చెప్పదగినవే. అయితే రాష్ట్రప్రజలలో నూటికి 39 వంతులు, కేవలం వ్యవసాయం మీద ఆధారపడినవాళ్ళే.

ఈరాష్ట్రానికి లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు(రెండు శాసనసభలు) వుండేవి. కాని, కౌన్సిలు 1947 ఆగస్టు 15 తరువాత రద్దుచేయబడింది.

రాజధాని : షిల్లాంగ్.

గవర్నర్ : శ్రీ ప్రకాశ

పదవిస్వీకారం : 1949 ఫిబ్రవరి 16.

జీతం : రు. 5.500. (ఇన్‌కంటాక్సుపోను రు.3,000)

మంత్రిమండలి : పదవీస్వీకారం : 1946 ఫిబ్రవరి 11
ప్రధానమంత్రి : గోపీనాథ బార్డొలాయ్
ఆర్థికమంత్రి : విష్ణురాం మేధి
సప్లయిమంత్రి : రెవరెండ్ జె. జె. నికొల్స్‌రాయ్
ఆరోగ్యమంత్రి : రామనాథదాస్
స్థానికపాలనమంత్రి: అబ్దుల్ మతిలిబ్ మజుందార్
అడవులమంత్రి : భీమవర దేవ్రి

మంత్రుల జీతాలు; ప్రధానమంత్రి, రు. 1,500; ఇతరులకు రు. 1,000. ఇదికాక అందరికీ, తలకొక రు. 250 ఇంటిఅద్దె, రు. 250 కారు అలవెన్సు ఇవ్వబడుతుంది.

స్పీకరు : లక్ష్మేశ్వర్ బారువ (జీతం రు. 1000)
డిప్యూటీస్పీకరు : బానిలీ ఖాంగ్మన్ సతి (రు. 300)

అసెంబ్లీ సభ్యులు : 108
కాంగ్రెసు ... 60
లీగు ... 31
జమియత్ ఉలేమా ... 3
యూరపియనులు ... 9
స్వతంత్రులు ... 5
శాసనసభ్యుల జీతాలు : నెలకు రు. 150

## బడ్జెటు

1949-50 సంవత్సరానికి బడ్జెటును, శాసనసభలో మార్చి 10 వ తేదిన, ఆర్థికశాఖామంత్రి విష్ణురాం మేధి ప్రవేశపెట్టాడు. ఆ బడ్జెటు వివరాలివి.

1949-50లో వస్తుందని అంచనావేసిన
ఆదాయం ... రు. 8,91,77,000
1944950 లో అవుతుందని అంచనావేసిన
ఖర్చు ... రు. 9,52,35,000
లోటు ... రు. 60,58,000

# ఒరిస్సా

ఒరిస్సారాష్ట్రం నిర్మాణం 1937 ఏప్రిల్ 1 వ తేదిన జరిగింది. అంతకుపూర్వం, ఒరియాభాష మాట్లాడే ప్రజలు గల భాగం కొంత బీహారు రాష్ట్రంలోను, కొంత సెంట్రల్ ప్రావిన్సులలోను, కొంత మదరాసు రాష్ట్రంలోను వుండేది.

ఒరియా ప్రజలు చాలాకాలం ఆందోళన చేసినతరువాత, 1903 లో కేంద్రప్రభుత్వంవారు, ఒరియాభాష మాట్లాడే ప్రజలుగల ప్రాంతాన్ని అంతనూ ఒకే పరిపాలనగలిగి వుండేటట్టు చెయ్యడం ధర్మమేనని అంగీకరించారు. తరువాత 1912లో, బెంగాలు రాష్ట్రంలోని చేరివున్న ఒరియా జిల్లాలను విడదీసి బీహారుతోకలిపి, బీహారు- ఒరిస్సా అనే రాష్ట్రంగా ఏర్పాటుచేయడం జరిగింది. కాని, అప్పటికీ ఒరియా ప్రజలు వూరుకోక, తమ దేశం ఒక స్వపరిపాలనగల రాష్ట్రంగా ఏర్పడాలని ఆందోళన చేస్తూనేవచ్చారు. తరువాత, 1927లో సైమను కమిషన్ వారు వచ్చినప్పుడు ఒరియా నాయకులు, తమకు ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరారు. ఆ తరువాత, రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు జరిగినప్పుడు, ఒరిస్సారాష్ట్ర నిర్మాణం జరగాలని, పర్లాకిమిడి మహారాజా ఒక నివేదికను సమర్పించారు. ఒరిస్సా సరిహద్దులను నిర్ణయించడానికీ, దాని ఆర్థిక సౌష్టవాన్నిగురించి నివేదిక తయారుచెయ్యడానికీ 1931 సెప్టెంబరులో కేంద్రప్రభుత్వంవారు ఓడెనెల్ కమిటీని నియమించారు. ఈ కమిటీ సూచనలప్రకారం, ఒరిస్సారాష్ట్ర నిర్మాణం జరిగింది.

ఒరిస్సారాష్ట్రపువైశాల్యం (ఒరియా సంస్థానాలతోసహా) 32,198 చదరపు మైళ్ళు; జనాభా 87,28,544; రాజధాని కటకం. (జనాభా 79,107) వేసవిలో గవర్నరువుండే నగరం: పూరి (జగన్నాథం)

వ్యవసాయకంగానూ, పారిశ్రామికంగానూ ఒరిస్సా చాలా వెనకబడ్డ రాష్ట్రం. ఒరిస్సాలో ప్రధానమైన వ్యాపారపంటలు: చెరకు, జనప

నారు; చేపలుపట్టడం ఒరిస్సాలో ఒక పెద్ద పరిశ్రమ. చిలకసరస్సు నుంచీ, పూరివద్ద సముద్రంలోనూ, ఏడాదికి 59,000 మణుగుల చేపల్ని పట్టి కలకత్తాకు పంపుతారు. గృహపరిశ్రమలలో, చేనేత, కంచు పాత్రలు చెయ్యడము, ఇత్తడి పాత్రలు చెయ్యడం ముఖ్యమైనవి.

ఒరిస్సాలో దొరికే ముఖ్యమైన ఖనిజములు : ఇనుము, బొగ్గు, సున్నపురాయి, మెంగనీసు, అభ్రకము.

ఒరిస్సాకు ప్రత్యేకంగా హైకోర్టు, 1948 జులై 26 తేదీన స్థాపించబడింది. ఇటీవలనే, (1946 లో) ఒరిస్సాకు ప్రత్యేకంగా ఒక యూనివర్సిటీ స్థాపించబడింది.

ప్రజలలో 68,32,,706 మంది హిందువులు: 1,46,301 మంది ముస్లిములు.

గవర్నరు : అసఫ్ ఆలి

జీతం : రు. 5,500 (ఇన్‌కంటాక్సుపోను రు. 3,000)

పదస్వీకారము : 1948 జూన్ 21

మంత్రులు : పదవీస్వీకారము : 1946 ఏప్రిల్ 23.

హరకృష్ణ మెహతబ్ : ప్రధానమంత్రి, హోం

నిత్యానంద కణుంగో : స్థానిక పరిపాలన

లింగరాజ మిశ్ర : విద్య, ఆరోగ్యము

సదాశివత్రిపాఠి : రెవిన్యూ, సప్లయి,

రాజకృష్ణబోస్ : నిమ్నజాతుల ఉద్ధరణ

లాలా రంజిత్ సింగ్ : పబ్లిక్ వర్క్సు

మంత్రుల జీతాలు : ఒక్కొక్కరికి నెలకు రు. 1,000

| శాసనసభలో పార్టీల బలం | మొత్తం : | 60 |
|---|---|---|
| | కాంగ్రెసు | 46 |
| | స్వతంత్రులు | 5 |
| | ముస్లింలీగు | 4 |
| | కమ్యూనిస్టు | 1 |
| | నామినేటెడ్ | 4 |

స్పీకరు : లాల్ మోహన్ పట్నాయక్; జీతం; రు. 1,000

డిప్యూటీస్పీకరు : శ్రీమతి ఎ. లక్ష్మీబాయి; జీతం: రు. 350

శాసనసభ్యుల జీతాలు : ఒకరికి నెలకు రు. 150.

జీతంకాక, ప్రతి సభ్యునికీ, సభాసమావేశానికి హాజరైన ప్రతి రోజుకీ పదేసి రూపాయల బత్తా ఇవ్వబడుతుంది.

ఈ రాష్ట్రానికి లెజిస్లేటివ్ కౌన్సిలు లేదు.

## బడ్జెటు

1949—50 సంవత్సరానికి బడ్జెటును, 1949 మార్చి 2 వ తేదీన శాసనసభలో ప్రధానమంత్రి హరకృష్ణ మెహతబ్ ప్రవేశపెట్టాడు. ఆ బడ్జెటు వివరాలివి :

1948—49 లో రాగలదని అంచనావేసిన

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రు. 8,90,00,000 |
| వ్యయం (అంచనా) | ... | రు. 8,76,00,000 |
| మిగులు | ... | రు. 14,00,000 |

# తూర్పు పంజాబ్

పంజాబ్ అంటే పంచ నదుల దేశం అని అర్థం జీలం, చీనాబ్, రవి, బియాస్, సట్లెజ్ నదులు అయిదూ ఈప్రాంతాన్ని పరివేష్టించి యీ ప్రాంతంలోంచి ప్రవహిస్తూనూ, ఉన్నాయి. అంచేతనే, దీనికి ఆ పేరు వచ్చింది.

పంజాబ్ రాష్ట్ర వైశాల్యం 1947 ఆగస్టులో జరిగిన విభజనకు పూర్వం. 99,089 చ. మైళ్ళు. జనాభా, 2,84,18,819. వీరిలో సగం మంది ముస్లిములు; మిగతా సగంమందిలోనూ, మూడు వంతులు హిందువులు; ఒక వంతు సిక్కులు. రాష్ట్రంలోని ప్రజలలో సగంమందికి పైగా పంజాబీ భాషను మాట్లాడుతారు. మిగతావారు హిందూస్తానీ, ఉర్దూ, రాజస్థానీ, పుష్టు భాషలను మాట్లాడుతారు.

రాష్ట్రంలోని ప్రజలలో నూటికి 65 వంతులు తమ జీవితానికి, వ్యవసాయంమీద ఆధారపడుతున్నారు. రాష్ట్రంలోని భూమిలో సుమారు 6,000 చ. మైళ్లు అడవి. మిగతా భాగంలో వ్యవసాయం జరుగుతున్నది. ఈ రాష్ట్రంలో పండే పంటలలో ప్రధానమైనది గోధుమ. తరువాత చెప్పదగినవి, బార్లీ, ధాన్యం, రాగులు మొక్కజొన్న, ప్రత్తి, చెరకు.

పంజాబ్‌లోని ప్రధాన పరిశ్రమ, చేనేత. దుప్పట్లు, ఊలుదగ్గులు ఇక్కడ విస్తారంగా తయారుచేయబడుతవి. పట్టు పరిశ్రమకూడా చాలా ఎక్కువగా అభివృద్ధి పొందుతోంది. దూది ఏకేమిల్లులు రాష్ట్రంలో చాలా వున్నాయి.

జనాభాలో, 75,50,372 మంది హిందువులు; 1,62,17,242 మంది ముస్లిములు; సిక్కులు, 37,57,401.

దేశవిభజనతో పాటు 1947 ఆగస్టు 15 వ తేదీనాటి తాత్కాలికంగా రాష్ట్రాన్ని రెండు భాగాలుచేస్తూ, తూర్పు పంజాబ్, పశ్చిమ పంజాబ్ అనే పేర్లతో రెండు రాష్ట్రాలకూ చెరొక గవర్నరుని నియమించడం, రెండు రాష్ట్రాలకు వేరువేరుగా మంత్రివర్గాలను ఏర్పాటు

చెయ్యడం జరిగింది. రెండు రాష్ట్రాలకు వేరువేరుగా హైకోర్టులు, యూనివర్శిటీలు ఏర్పాటుచెయ్యబడినవి.

తూర్పు పంజాబ్‌లో హిందువులు, సిక్కులు అధిక సంఖ్యలో వున్నందున ఈ రాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గమూ, పశ్చిమ పంజాబులో ముస్లిములు అధిక సంఖ్యలో వున్నందున ముస్లింలీగ్ మంత్రి వర్గమూ ఏర్పడినాయి. తూర్పు పంజాబ్ ఇండియన్ యూనియన్‌లో ఒక రాష్ట్రంగానూ, పశ్చిమపంజాబ్ పాకిస్తాన్‌లో ఒక రాష్ట్రంగానూ ఏర్పడినాయి.

తూర్పు పంజాబ్‌లో, హిందువులు, సిక్కులు కలసి అధిక సంఖ్యలో వున్నందున, కాంగ్రెసువారు ఈ రాష్ట్రపరిపాలన విషయమై వంతుప్రకారం ఒకసారి హిందువు, మరొకసారి సిక్కు ప్రధానిగాను, గవర్నరుగాను వుండే ఏర్పాటును చెయ్యడానికి నిశ్చయించారు.

విభజనానంతరం తూర్పు పంజాబ్ వైశాల్యం దాదాపు 37,000 చ. మైళ్ళు అనీ, జనాభా సుమారు 1,24,96,000 అనీ అంచనా. అయితే దాదాపు 20 లక్షలమంది ముస్లిములు తూర్పు పంజాబు వదలిపోయి నందుననూ, పశ్చిమ పంజాబునుంచి వెళ్లిపోయినవారిలో దాదాపు 15 లక్షలమంది తూర్పు పంజాబు చేరుకున్నందుననూ, సరియైన జనాభాలెఖ్ఖ చెప్పడానికి యిప్పుడిప్పుడే వీలులేదు.

తూర్పు పంజాబ్ రాష్ట్రానికి రాజధానిని కొత్తగా నిర్మించడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు. ప్రస్తుతం ప్రభుత్వం శీతకాలంలో జలంధర్‌లోనూ, ఎండాకాలంలో సిమ్లాలోను వుంటున్నది.

గవర్నర్ . సర్ చందూలాల్ మాధవలాల్ త్రివేది.

పదవీ స్వీకారం: 1947 ఆగస్టు 15

జీతం: రు. 5,500. (ఇన్‌కంటాక్సు పోగా రు. 3,000)

మంత్రిమండలి: పదవీస్వీకారం: మొదట్లో నలుగురు 1947 ఆగస్టు 15; తరువాత సెప్టెంబరు 24 న అధికంగా ముగ్గురు చేర్చుకొనబడినారు.

ప్రధానమంత్రి: రాష్ట్రపాలన, ఆరోగ్యము, విద్య, వైద్యశాఖ — డాక్టర్ గోపీచంద్ భార్గవ

| | |
|---|---|
| న్యాయశాఖ : జైళ్లు, భూమి శిస్తు, నీటి పారుదల | సర్దార్ స్వర్ణసింగ్ |
| కాందిశీకుల రక్షణ : | సర్దార్ ప్రతాపసింగ్ |
| పబ్లిక్ వర్క్సు, సివిల్ సప్లయిస్, రవాణా | కెప్టెన్ రంజిత్ సింగ్ |
| కార్మికులు, ఎక్సైజు, పన్నులు | సర్దార్ పృథ్వీసింగ్ అజాద్ |
| అడవులు, వ్యవసాయము, పశువైద్యము, కో ఆపరేటివ్ సొసైటీలు | చౌదరి కర్తార్ సింగ్ |
| ఆర్థికశాఖ, స్థానిక పరిపాలన పరిశ్రమలు | లాలా కృష్ణగోపాల దత్ |

మంత్రుల జీతాలు : ప్రధానికి నెలకు రు. 2,000; ఇతరులకు నెలకు 1,500. అదనంగా అందరికీ నెలకు రు. 300 అలవెన్సు; ఉచిత గృహవసతి.

అసెంబ్లీ స్పీకరు : సర్దార్ కపూరసింగ్

పార్లమెంటరీ సెక్రటరీలు : సర్దార్ శివశరణసింగ్ (డెవలప్‌మెంట్) సర్దార్ నరోత్తమసింగ్ (కాందిశీకులరక్షణ); సర్దార్ శివసింగ్ (సివిల్ సప్లయిస్); పండిత భగవత్ రాంశర్మ (హోం); ప్రొఫెసర్ షేర్ సింగ్ (కార్మికులు, ఎక్సైజు); శేలీరాం (పబ్లిక్ వర్క్సు)

## బడ్జెట్

తూర్పు పంజాబ్ రాష్ట్రానికి 1949-50 బడ్జెటును, 1949 మార్చి 7 తేదీన, ప్రధానమంత్రి గోపీచంద్ భార్గవ, శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి.

| | | |
|---|---|---|
| 1949-50 లో వస్తుందని అంచనా వేసిన ఆదాయం | ... | రు. 14,47 లక్షలు |
| 1949-50 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | ... | రు. 22,92 లక్షలు |
| లోటు అంచనా | ... | రు. 8,55 లక్షలు |

# పశ్చిమబెంగాల్

విభజనకు పూర్వం బెంగాల్ రాష్ట్రపు వైశాల్యం : 77,442 చ. మైళ్ళు. జనాబా. 6,03,06,525. వీరిలో నూటికి 54 వంతులు ముస్లిములు; 42 వంతులు హిందువులు. నూటికి 92 వంతులు బెంగాలీ భాషను మాట్లాడుతారు. మిగతావారు హిందీ, ఉర్దూలను మాట్లాడుతారు.

జనాభాలో నూటికి 21 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారు. ఉత్తరదేశంలో బియ్యం అత్యధికంగా పండే రాష్ట్రం బెంగాలే. ఈ రాష్ట్రంలో వ్యవసాయంక్రిందవున్న భూమిలో నూటికి 85 వంతులు బియ్యపు పంటలో వుంటుంది. మిగతా ముఖ్య పంటలు : బార్లీ, గోధుమ, పప్పుదినుసులు, తిలధాన్యములు, జనపనార.

పరిశ్రమలలో జనపనార, టీ, బొగ్గు, పంచదారల ఉత్పత్తి ప్రధానంగా చెప్పదగినవి.

1947 జూన్ 3 వ తేదిన బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించిన దేశ విభజన సూత్రంప్రకారం, బెంగాల్ రాష్ట్రం, పశ్చిమ, తూర్పు బెంగాల్ రాష్ట్రాలుగా విభజించబడింది.

విభజనానంతరం, పశ్చిమ బెంగాల్ వైశాల్యం 28,215 చ. మైళ్లు అనీ, జనాభా దాదాపు 2,12,00,000 అనీ అంచనా. సుమారు 20 లక్షలమంది హిందువులు తూర్పు బెంగాల్ నుంచి పశ్చిమ బెంగాల్‌కు వచ్చివేశారు.

పశ్చిమ బెంగాలులోని జనాభా మొత్తంలో నూటికి 25.01 వంతులు ముస్లిములు వుంటారని అంచనా.

పశ్చిమ బెంగాల్‌కు రాజధాని కలకత్తా.

గవర్నర్ : డాక్టర్ కైలాసనాథ కాట్జూ
పదవీస్వీకారం : 1948 జూన్ 21
జీతం : రు. 5,500 (ఇన్‌కంటాక్సుపోగా రు. 3,000)

## మంత్రి మండలి :

1947 ఆగస్టు 15 న దేశవిభజనతోపాటు బెంగాల్ రాష్ట్రం విభజనకూడా జరగడంతో, పశ్చిమ బెంగాలులో డాక్టర్ పి. సి. ఘోష్ నాయకత్వాన మంత్రిమండలి ఏర్పాటు చేయబడింది. కాని 1948 జనవరిలో, రాష్ట్ర అసెంబ్లీ కాంగ్రెసు పార్టీవారు డాక్టర్ ఘోష్ మంత్రి మండలిని రాజీనామా యిమ్మని కోరినందున డాక్టర్ ఘోష్ మంత్రి మండలి రాజీనామా యిచ్చింది. జనవరి 23 తేదీన, డాక్టర్ బి. సి. రాయ్, మంత్రి మండలిని ఏర్పాటుచేశాడు. తరువాత, 1947 నే. 6 న తేదిన కొద్దిమార్పులతో యీక్రింది మంత్రివర్గం ఏర్పాటుచేయ బడింది.

| | |
|---|---|
| ప్రధాన మంత్రి<br>రాష్ట్రపాలన<br>స్థానిక పరిపాలన | డాక్టర్ బి. సి. రాయ్. |
| ఆర్థికము, వాణిజ్యం<br>పరిశ్రమలు | ఎన్. ఆర్. సర్కార్ |
| నీటిపారుదల<br>కాలువలు | భూపతిమజుందార్ |
| అడవులు: | హేమచంద్ర నాస్కర్ |
| ఎక్సైజు: | మోహినీ మోహనబర్మన్ |

విద్య : రాయ్ హరేంద్రనాథ చౌధురి
సహకారము, కాందిశీకుల రక్షణ : ఎన్. బి. మైత్రి
రెవిన్యూ, రవాణా, పబ్లిక్ వర్క్సు : బి. సి. సిన్హా
సివిల్ సప్లయిలు : ప్రఫుల్లచంద్రసేన్
న్యాయము : ఎన్. దత్తు - మజుందార్
కార్మికులు : కె. పి. ముఖర్జీ
వ్యవసాయము, పశువైద్యము : యాదవేంద్రనాథ పంజా

మంత్రుల జీతాలు : ప్రధాన మంత్రికి నెలకు రు. 1,500; ఇతర మంత్రులకు ఒక్కొక్కరికి నెలకు రు. 1,250, అలవెన్సులతోసహా.

పార్లమెంటరీ సెక్రటరీలు: హోం, సుశీలకుమార్ బెనర్జి; ప్రధాన మంత్రికి, హేమంతకుమార్ బాసు; వ్యవసాయం, కన్హ్యాలాల్ దాస్; పబ్లిక్ వర్క్స్, హరేంద్రనాధ దోలూయ్; సివిల్ సప్లయిస్, నిశాపతి మాజి, రజనీకాంత పరమాణిక్.

## అసెంబ్లీ సభ్యుల సంఖ్య:

కాంగ్రెసు 48; ముస్లింలీగు, 22; ఇతరులు, 2.

స్పీకర్ : ఈశ్వర్ దాస్ జలాని (జీతం, రు. 750).

డిప్యూటీ స్పీకర్ : అశుతోష్ మల్లిక్ (జీతం రు. 300)

అసెంబ్లీసభ్యులకు జీతాలు, నెలకు రు. 200. సభా సమావేశానికి హాజరైన ప్రతిరోజుకు, కలకత్తా నగరవాసులకు రు. 2-8-0, బయట నుంచి వచ్చినవారికి, రైలు ఖర్చులుకాక, రోజుకి రు. 15.

### బడ్జెట్

పశ్చిమ బెంగాల్ రాష్ట్రానికి 1949-50 బడ్జెటును శాసనసభలో, 1949 ఫిబ్రవరి 24 తేదీన ఆర్థికశాఖా మంత్రి ఎన్. ఆర్. సర్కార్ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| 1949-50 లో వస్తుందని అంచనా వేసిన ఆదాయం. | రు. 31,82,00,000 |
| 1948-49 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు. | రు. 32,93,00,000 |
| లోటు. | రు. 1,11,00,000 |

# బీహారు

బీహారు రాష్ట్రం, ఒరిస్సా, బెంగాల్, సి. పి. యు. పి. రాష్ట్రాల మధ్యవుంది. దీని వైశాల్యం 69,745 చ. మైళ్లు. జనాభా, 3,63,40,151. వీరిలో తొమ్మిదవ వంతుమాత్రం, ముస్లిములు. అత్యధిక సంఖ్యాకులు హిందువులు.

జనాభాలో నూటికి 80 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. నూటికి ఎనిమిదివంతులు మాత్రమే పరిశ్రమలమీద ఆధారపడినవారు. ఈ రాష్ట్రంలో పండే పంటలలో ప్రధానమైనది బియ్యం. మామూలుగా ప్రతిసంవత్సరమూ, 1,20,00,000 ఎకరాల భూమిలో బియ్యం పంట వేస్తారు. అంటే, వ్యవసాయ భూమిలో, నూటికి 52 వంతులు బియ్యం పంటక్రింద వుంటుందన్నమాట. బియ్యం తరువాత చెప్పదగిన ముఖ్య పంటలు: మొక్కజొన్న, బార్లీ, ఆముదపు గింజలు ఆవాలు. తెల్లచక్కెర ఉత్పత్తిలో, మనదేశంలో యునైటెడ్ ప్రావిన్సెసు తరువాత చెప్పవలసింది బీహార్. దేశం మొత్తంలో తయారయ్యే తెల్ల చక్కెరలో నూటికి 26 వంతులు బీహారులోనే తయారవుతుంది. జనప నార పంటకూడా, ఈ రాష్ట్రంలోని ముఖ్యపంటలలో ఒకటి. ఇటీవల పొగాకు పంటకూడా ఎక్కువ అవుతున్నది.

ప్రపంచంలోని గొప్ప ఉక్కు పరిశ్రమలలో ఒకటైన, టాటా ఉక్కు కంపెనీ బీహారు రాష్ట్రంలోనే వుంది. ప్రపంచంలోని గొప్ప ఇనుప గనులలో ఒకటి, ఈ రాష్ట్రంలో వుంది. అందుచేత, పారిశ్రామికంగా ఈ రాష్ట్రం పేరుపొందింది. ఖనిజ సంపత్తి ఈ రాష్ట్రంలో విశేషంగా వుంది. వాటిలో ముఖ్యమైనవి, ఇనుముకాక, బొగ్గు, అభ్రకము.

లక్క పరిశ్రమకూడా ఈ రాష్ట్రంలో ఎక్కువ. ఇక్కడనుంచి ఏడాదికి పదికోట్ల రూపాయలపైబడిన విలువగల లక్క ప్రతి సంవత్సరమూ విదేశాలకు ఎగుమతి అవుతుంది. సిమెంటుకూడా ఎక్కువగా తయారవుతున్నది.

ఈ రాష్ట్రానికి ప్రత్యేకంగా (పాట్నాలో) ఒక హైకోర్టు వుంది. ఒక యూనివర్శిటీ వుంది.

దీనికి రాజధాని పాట్నా (జనాభా 1,96,435). వేసవిలో బీహార్ గవర్నరు రాంచిలో వుంటాడు.

ప్రజలలో హిందువులు 2,65,14,269; ముస్లిములు, 47,16,314;

గవర్నరు : ఎం. ఎస్. ఆనే

పదవీస్వీకారం : 1948 జనవరి 12

జీతం : రు. 5,500 (ఇన్‌కంటాక్సుపోగా రు. 3,000)

మంత్రిమండలి: పదవీస్వీకారము: ఏప్రిల్ 2, 1946

| | |
|---|---|
| శ్రీకృష్ణసింహా: | ప్రధానమంత్రి, న్యాయము |
| అనుగ్రహనారాయణసింహా: | ఆర్థికశాఖ, కార్మికశాఖ |
| బదరీనాథ వర్మ: | విద్య |
| వినోదానంద ఝా: | స్థానికస్వపరిపాలన |
| డాక్టరు సయ్యద్ మహమ్మద్: | ప్రయాణసౌకర్యము |
| జగ్‌లాల్ చౌధురి: | ఆరోగ్యము |
| రామచరిత సింగ్: | పబ్లిక్ వర్క్సు |
| కృష్ణవల్లభసహాయ్: | రెవిన్యూ |
| అబ్దుల్ కయూం అన్సారి: | గృహపరిశ్రమలు |

స్పీకరు: వింధ్యేశ్వరీ ప్రసాద్ వర్మ

డిప్యూటీ స్పీకరు: దేవశరణ్ శింగ్

| అసెంబ్లీలో పార్టీబలం: | 152 |
|---|---|
| కాంగ్రెసు | 97 |
| లీగ్ | 34 |
| నేషనలిస్టు ముస్లిములు | 5 |
| స్వతంత్రులు | 16 |

కౌన్సిలు ప్రెసిడెంట్: శ్యామప్రసాద్ సింహ

| కౌన్సిలులో పార్టీబలం: | 30 |
|---|---|
| కాంగ్రెసు | 15 |
| లీగ్ | 4 |
| స్వతంత్రులు | 11 |

పార్లమెంటరీ సెక్రటరీలు:

శివనందన్ ప్రసాద్ మండల్; నృపేంద్ర ముఖర్జీ; వీరచంద్ర పటేల్; సుఖలాల్ సింగ్; షా మహమ్మద్ ఉమేర్; అబ్దుల్ అహాద్ మహమ్మద్ నూర్; దేవేంద్రనాథ సామంత; భోలా పశ్వాన్; జానిఫెస్ లక్రా.

### బడ్జెటు

1949—50 సంవత్సరానికి బడ్జెటును, 1949 ఫిబ్రవరి 21 వ తేదిన ఆర్థికశాఖామంత్రి అనుగ్రహనారాయణసింహా, రాష్ట్ర శాసన సభలో ప్రవేశపెట్టాడు. ఆ బడ్జెటు వివరాలివి:

1949—50 లో రాగలదని అంచనా వేసిన

| | |
|---|---|
| ఆదాయం | ... రు. 24,40,00,000 |
| 1949—50 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | ... రు. 21,52,00,000 |
| మిగులు (అంచనా) | ... రు. 2,88,00,000 |

## బొంబాయి

బొంబాయిరాష్ట్రం వైశాల్యము 1947 ఆగస్టు 17 నాటికి 76,443 చ. మైళ్ళు. జనాభా, 2,08,49,840. మదరాసు రాష్ట్రంలాగనే ఇది కూడా మూడు భాషాభాగాలు కలసిన రాష్ట్రం. ప్రజలు గుజరాతీ, మహారాష్ట్ర, కన్నడ తెగలకు చెందినవారు. హిందువులు, 1,65,55,390; ముస్లిములు, 19,20,368. 1947 ఆగస్టు తరువాత, చాలా సంస్థానాలు యీ రాష్ట్రంలో కలసిపోవడంవల్ల, 1949 మార్చి 1 నాటికి యీ రాష్ట్ర వైశాల్యం (1949 మే 1 న యీ రాష్ట్రంలో కలసిపోయే బరోడా సంస్థానంతో సహా) 1.21,849 చ. మైళ్ళు. జనాభా, దాదాపు 290 లక్షలు. ఇండియాలోని పెద్ద రాష్ట్రాలలో, బొంబాయికి మూడవస్థానం.

ఈ రాష్ట్ర ప్రజలలో నూటికి 69 వంతులమంది వ్యవసాయంమీదనే ఆధారపడి జీవించేవారే. ఇక్కడ పండే పంటలలో ముఖ్యమైనవి ప్రత్తి, చెరకు, బియ్యం, గోధుమ, పప్పుదినుసులు, రాగులు.

పారిశ్రామికంగా చాలా ముందుకువచ్చిన రాష్ట్రం ఇది. మనదేశం లోని వస్త్రపరిశ్రమకు ప్రధాన కేంద్రం ఈ రాష్ట్రమే. దీనికి ముఖ్య ప్రదేశాలు బొంబాయి నగరం, అహమ్మదాబాద్ నగరం. విదేశాలతో మనదేశపు వ్యాపారమంతా కూడా ఎక్కువగా, బొంబాయినగరంనుంచే జరుగుతున్నది. అంచేత, మనదేశపు వ్యాపారానికి బొంబాయి ఆయువుపట్టు అయింది.

ఈ రాష్ట్రానికి ప్రధాన నగరం బొంబాయి. వేసవికాలంలో ప్రభుత్వం పూనాలో వుంటుంది. బొంబాయినగరం, అసలు దేశపు భూభాగంకాదు. అసలు భూమికి కొంచెందూరంగా సముద్రంలోవున్న చిన్న ద్వీపాల సమూహం. ఇప్పుడు వంతెనలు కట్టి, రోడ్లువేసి, ఈ ద్వీపాలను అసలు భూభాగంతో కలిపివేశారు. అయినప్పటికీ, ఇది చిన్న ద్వీపాల సమూహం కనుక, ఓడలకు రేవు వసతి బాగా వుంటుంది.

గవర్నరు : రాజా సర్ మహారాజసింగ్

పదవీస్వీకారము : 6, జనవరి 1948

జీతం : రు. 5,500 (ఇన్‌కంటాక్స్‌పోగా రు. 3000)

| | | |
|---|---|---|
| మంత్రులు : | బాలగంగాధర ఖేర్ | : ప్రధానమంత్రి, విద్య |
| | మురార్జి దేశాయ్ | : హోం, రెవిన్యూ |
| | డాక్టర్ ఎం. డి. డి. గిల్డర్ | : ఆరోగ్యము |
| | దినకర దేశాయ్ | : న్యాయము |
| | వైకుంఠనాథ్ మెహత | : ఆర్థికశాఖ |
| | వి. ఎల్. ఎం పటేల్ | : ఎక్సైజు |
| | గుల్జారిలాల్ నంద | : కార్మికులు |
| | ఎం. పి. పటేల్ | : వ్యవసాయము |
| | గోవింద వర్తక్ | : స్థానిక స్వపరిపాలన |
| | జి. డి. తపసె | : పరిశ్రమలు |

స్పీకరు : కె. ఎస్. ఫిరోదియా

డిప్యూటి స్పీకరు : ఎస్. ఎన్. అంగాడి

అసెంబ్లీ సభ్యులు : 175

| | |
|---|---|
| కాంగ్రెసు | 127 |
| ముస్లింలీగు | 31 |
| యూరపియనులు | 6 |
| స్వతంత్రులు | 5 |

| | |
|---|---|
| ఆంగ్లో-ఇండియనులు | 2 |
| కమ్యూనిస్టులు | 2 |
| రాడికల్ డెమొక్రాట్ | 1 |
| హిందూమహాసభ | 1 |

కౌన్సిలు ప్రెసిడెంటు : రామచంద్ర ప్రగాఢే నాయక్

కౌన్సిలు సభ్యులు : 29

| | |
|---|---|
| కాంగ్రెస్ | 16 |
| లీగ్ | 1 |
| లిబరల్ | 1 |
| స్వతంత్రులు | 6 |
| ప్రోగ్రెసివ్ | 1 |
| హిందూమహాసభ | 1 |

పార్లమెంటరీ సెక్రటరీలు: ఎస్. ఆర్. కాంతి; కె. ఎఫ్. పటేల్, ఎస్. పి. గావ్‌కార్ : మిస్ ఇందుమతి శేఠ్; యశ్వంతరావ్ చవాన్; డి. కె. కుంతె; డి. ఎస్. దాంగేకార్; పి. కె. సావంత్.

## బడ్జెటు

1949-50 సంవత్సరానికి బడ్జెటును 1949 ఫిబ్రవరి 24 వ తేదిన ఆర్థికశాఖామంత్రి వి. ఎల్. మెహతా. శాస్త్రి శాసనసభలో ప్రవేశ పెట్టాడు. ఆ బడ్జెటు వివరాలివి.

1949-50 లో రాగలదని అంచనావేసిన

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రు. 48,80,00,000 |

1949-50 లో అవుతుందని అంచనా

| | | |
|---|---|---|
| వేసిన ఖర్చు | ... | రు. 52,40,00,000 |
| లోటు (అంచనా) | ... | రు. 3,60,00,000 |

హాఫీజ్ మహమద్ ఇబ్రహీం: నీటిపారుదల
సంపూర్ణానంద్: విద్య, కార్మికులు
ఠాకూర్ హుకుంసింగ్: రెవిన్యూ, అడవులు
నిసార్ అహమద్ ఖాన్ షెర్వాని: వ్యవసాయము
గిర్ధారిలాల్: ఎక్సైజు, రిజిస్ట్రేషను
ఎ. జి. ఖేర్: { స్థానికపరిపాలన, ప్రజారోగ్యం.
సి. బి. గుప్త: ఆహారము
లాల్ బహదూర్ శాస్త్రి: పోలీసు
కేశవదేవ్ మాలవీయా: పరిశ్రమలు

మంత్రుల జీతాలు: ఒక్కొక్కరికి నెలకు రు. 1,500.

స్పీకరు: పురుషోత్తమదాస్ టాండన్ (జీతం: రు. 1,500)

డిప్యూటీ స్పీకరు: నఫీసుల్ హసన్

కౌన్సిలు అధ్యక్షుడు: చంద్ర భాల్

## పార్లమెంటరీ సెక్రటరీలు:

చరణ్ సింగ్; గోవింద సహాయ్; జె. ఎ. సాబ్; లతాఫత్ హుసేన్; మౌల్వి హాఫిజుర్ రహమాన్; ఆర్. జి. తిలక్; ఠాకూర్ గోవింద సింగ్; వహీద్ అహమద్.

## శాసనసభలలో పార్టీలబలం:

అసెంబ్లీ—228

| | |
|---|---|
| కాంగ్రెసు | 153 |
| జనత | 26 |
| జమీందార్ పార్టీ | 6 |
| స్వతంత్రులు | 25 |
| ఖాళీస్థానాలు | 16 |

కౌన్సిలు—60

| | |
|---|---|
| కాంగ్రెసు | 29 |
| స్వతంత్రులు | 17 |
| ఏపార్టీకి చెందనివారు | 12 |
| సోషలిస్టు | 1 |
| ఖాళీస్థానం | 1 |

శాసన సభ్యుల జీతములు: నెలకు ఒక్కొక్కరికి రు. 200; శాసనసభకు హాజరైన రోజుకు రు. 10 అలవెన్సు.

1949-50 సంవత్సరానికి బడ్జెటును, 1949 ఫిబ్రవరి 28 తేదీన శాసనసభలో ఆర్థికశాఖామంత్రి పండిత గోవిందవల్లభ పంత్ ప్రవేశ పెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి:

1949–50 లో రాగలదని అంచనా వేసిన
ఆదాయం ... రు. 55,73,00,000

1949—50 లో అవుతుందని అంచనా
వేసిన ఖర్చు ... రు. 55,58,00,000

మిగులు అంచనా ... రు. 15,00,000

# సెంట్రల్ ప్రావిన్సెసు

ఇది, బొంబాయి, బీహార్ రాష్ట్రాలకు మధ్యగా, త్రికోణా కారంలోవున్న రాష్ట్రం. దీనిని సెంట్రల్ ప్రావిన్సెస్ అండ్ బీరార్ అంటారు: బీరారు అనబడే భాగం, హైదరాబాదు నైజాంవద్దనుంచి బ్రిటిష్ ప్రభుత్వం శాశ్వతమైన కౌలుకు తీసుకున్న భాగం. ఈ రాష్ట్రపు వైశాల్యం, 98,575 చ. మైళ్ళు (దీనిలో బీరారు, 17,809 చ. మైళ్ళు) జనాభా, 1,68,43,584 (బీరారులో, 36,04,866 మంది కలిపి). ఈ రాష్ట్రంలో సుమారు 24,000 చ. మైళ్ళ భూమి, పర్వతాలతోను అడవుల లోను నిండిన భాగం. ఈ ప్రాంతంలో కొండజాతులవారు విశేషంగా నివసిస్తున్నారు. పురాణ ప్రసిద్ధమైన వింధ్యపర్వతాలు, నర్మదానది ఈ రాష్ట్రంలోనే.

1947 ఆగస్టు తరువాత, యీ రాష్ట్రంలో కలిసిపోయిన స్వదేశ సంస్థానాలతో సహా యీ రాష్ట్ర వైశాల్యం, 153,710 చ. మైళ్ళు. ఇండియాలోని రాష్ట్రాలన్నిటిలోకీ వైశాల్యంలో పెద్దది ఇదే.

ప్రజలలో నూటికి 56 వంతుల మంది హిందీ మాట్లాడుతారు : 31 వంతులమంది మరాటీ, ఏడువంతులమంది గోండ్ భాషను మాట్లాడుతారు. రాష్ట్రంలోని కొండజాతులలో ప్రధానమైనదీ, అధిక సంఖ్యాకులుకలదీ గోండ్ జాతి. హిందువులు, 1,29,31,996. ముస్లిములు 7,83,697. రాష్ట్రంలోని భూమిలో అడవులక్రిందవున్న భాగమూ, బంజరుభూమిపోగా, మిగతదానిలో నూటికి 67 వంతులు వ్యవసాయంలోవుంది. ప్రజల ప్రధానవృత్తికూడా ఇదే. వ్యవసాయంలోవున్న భూమిలో నూటికి 33 వంతులు వరిపంటక్రిందవుంది. తరువాత గోధుమ, పప్పుదినుసులు, నూనె ధాన్యాలు లెఖకువస్తాయి.

పరిశ్రమలలో బట్టల మిల్లులు చెప్పదగినవి. నాగపూర్ ఈ పరిశ్రమకు కేంద్రం. తరువాత, మెంగనీసును త్రవ్వి ఎత్తడంకూడా, పరిగణనీయమైన పరిశ్రమే. ఈ రాష్ట్రంనుంచి కలపకూడా విశేషంగా ఇతర రాష్ట్రాలకు, ముఖ్యంగా మదరాసు రాష్ట్రానికి, ఎగుమతి అవుతుంది.

దీనికి రాజధాని నాగపూర్ (3,01,957)

గవర్నరు: మంగళదాస్ పక్వాశ
పదవీస్వీకారం : 1947 ఆగస్టు 15
జీతం రు. 5,500 (ఇన్‌కంటాక్సు పోను, రు. 3,000)

మంత్రిమండలి : పదవీస్వీకారం: 1946 ఏప్రిల్ 27

| | |
|---|---|
| పండిత రవిశంకర శుక్ల: | ప్రధానమంత్రి |
| పండిత డి. పి. మిశ్ర: | హోం, కార్మికులు |
| డి. కె. మెహతా: | ఆర్థికశాఖ |
| ఎస్. వి. గోఖలె: | విద్య |
| ఆర్. కె. పటిల్: | ఆహారం |
| ఎ. ఎం. మకాగ: | ఎక్సైజు |

డాక్టర్ డబ్ల్యు. ఎం. బార్లింగే: ఆరోగ్యం
రామేశ్వర్ అగ్నిభోజ: పబ్లిక్ వర్క్సు
పి. కె. దేశముఖ్: శాసనం

మంత్రుల జీతాలు : ఒక్కొక్కరికి నెలకు రు. 1,000
స్పీకరు : ఘనశ్యామసింగ్ గుప్త

పార్లమెంటరీ సెక్రటరీలు: శ్రీమతి విమలాబాయి దేశపాండే, హెచ్. జె. ఖండేకార్, కె. ఎన్. ఖండారాన్; ప్రేమశంకర్ భగత్, రామగోపాల్ తివారి, బి. ఎస్. అగ్నిహోత్రి.

శాసనసభలో పార్టీల బలం—112

| | |
|---|---|
| కాంగ్రెసు | 92 |
| ముస్లింలీగు | 13 |
| స్వతంత్ర ముస్లిం | 1 |
| షెడ్యూల్డు కాస్టు ఫెడరేషను | 1 |
| కార్మిక స్వతంత్ర | 1 |
| భూస్వామివర్గం | 1 |
| స్వతంత్రులు | 2 |

ముస్లింలీగు సభ్యులలో నలుగురు పార్టీ నుంచి రాజీనామా ఇచ్చారు; ముగ్గురు పాకిస్తాన్‌కు వెళ్లిపోయారు.

## బడ్జెటు

1949—50 సంవత్సరానికి బడ్జెటును, 1949 ఫిబ్రవరి 28వ తేదీన శాసనసభలో, ఆర్థిక శాఖామంత్రి ఎస్. కె. గోఖలే ప్రవేశపెట్టాడు. ఆ బడ్జెటు వివరాలివి:

1949—50 లో రాగలదని అంచనా వేసిన
ఆదాయం .. రు. 18,99,00,000

1949—50 లో అవుతుందని అంచనా
వేసిన ఖర్చు ... రు. 18,79,00,000

ఆదాయంలో ఖర్చుపోగా మిగులు ... రు. 20,00,000

# కమిషనరు రాష్ట్రాలు

స్వపరిపాలన లేకుండా, కేవలం గవర్నరు-జనరలు పరిపాలనలో వున్న కొన్ని ప్రదేశాలను చీఫ్ కమిషనర్ల రాష్ట్రాలు అంటారు. వీటి పరిపాలనను, గవర్నరు-జనరలు అధికారానికి లోబడిన చీఫ్ కమిషనరు సాగిస్తాడు. ఇలాంటి రాష్ట్రాలు ఇండియాలో ఆరు వున్నాయి. అవి, అజ్మీరు-మార్వార; కూర్గ్; ఢిల్లీ; కచ ; హిమాచలప్రదేశం; అండమాన్, నికోబార్ దీవులు.

**అజ్మీరు - మార్వార** : ఇది రాజపుత్రస్థానంలో వుంది. దీని వైశాల్యం, 2,400 చదరపు మైళ్లు. జనాభా, 5,83,693. ప్రజలలో నూటికి 62 వంతులు వ్యవసాయంమీద ఆధారపడినవారు. ఇక్కడ పండేపంటలు, మొక్కజొన్న, రాగులు, బార్లీ, ప్రత్తి, తిలధాన్యములు, గోధుమ. ప్రజలలో హిందువులు 3,76,481; ముస్లిములు, 87,899.

కూర్గు : దక్షిణ భారతదేశంలో, మైసూరు రాజ్యానికి పశ్చిమంగా వున్న చిన్న రాష్ట్రం ఇది. దీని వైశాల్యం, 1,593 చ. మైళ్ళు. జనాభా, 1,68,726. ప్రజల ప్రధాన జీవనాధారం, వ్యవసాయం. ఇక్కడ ప్రధానమైన పంట కాఫీ. 1924 లో ఈ రాష్ట్రానికి ఒక శాసనసభ, ప్రజలు ఎన్నుకొన్న సభ్యులు 15 మంది, నామినేట్ చేయబడిన సభ్యులు అయిదుగురు గలది యేర్పాటుచేయబడింది. ఈ రాష్ట్రానికి ప్రధాననగరం. మెర్కారా. ప్రజలలో హిందువులు, 1,30,753: ముస్లిములు 14,730.

చీఫ్ కమిషనరు . దివాన్ బహదూరు సి. టి. మొదలియార్.

ఢిల్లీ : ఇండియాకు రాజధాని ఢిల్లీ. 1912 కు పూర్వం, కలకత్తా మనదేశానికి రాజధానిగా వుండేది. 1911 డిసెంబరు 12 వ తేదీన ఢిల్లీ దర్బారులో, జార్జి చక్రవర్తి, ఇకముందు భారతదేశానికి రాజధాని ఢిల్లీనగరమేనని ప్రకటించాడు. అప్పటినుంచీ, రాజప్రతినిధి ఢిల్లీలో వుంటున్నాడు.

పాతఢిల్లీ కొత్తఢిల్లీ, పరిసరాలు మొత్తం 574 చదరపు మైళ్ళ ప్రదేశం, ఒక ప్రత్యేక రాష్ట్రంగా, ఛీఫ్ కమిషనరు పరిపాలనక్రింద ఏర్పాటుచేయబడింది. రాజప్రతినిధికీ, శాశనసభలకూ కొత్త భవనాలను నిర్మించడానికి, అంటే కొత్తఢిల్లీ నిర్మాణానికి 14 కోట్ల రూపాయలు ఖర్చు అయింది. 1941 లో ఢిల్లీ జనాభా, 9,17,939. జనాభాలో హిందువులు, 5,67,335; ముస్లిములు, 3,04,971.

ఛీఫ్ కమిషనరు : శంకర్‌ప్రసాద్.

## కచ్

1948 జూన్ 1 తేదీవరకు స్వతంత్ర సంస్థానంగావున్న కచ్, ఆ తేదీన, ఇండియాలో ఒకరాష్ట్రంగా కలిసిపోయింది. దీనిని, ఇండియా ప్రభుత్వంవారు ఒక కమిషనర్ రాష్ట్రంగా ఏర్పాటుచేశారు.

ఇండియాకు పశ్చిమోత్తరాన, పాకిస్తాన్ రాష్ట్రమైన సింధుకు దిగువన, ఈ సంస్థానంవుంది. దీని వైశాల్యం 8461 చ. మైళ్ళు. ఆదాయం ఏడాదికి రు. 80 లక్షలు. ఈ సంస్థానాన్ని సంయుక్త సౌరాష్ట్ర రాజ్యంలో కలిపివెయ్యడమా, లేక తమ పరిపాలనలోకి తెచ్చుకోవడమా అనే విషయాన్ని పరిశీలించి, ఇండియా ప్రభుత్వంవారు దీనిని తమ పరిపాలనలో కమిషనర్ రాష్ట్రంగా వుంచడానికి నిశ్చయించారు. ఆ ప్రకారంమే కచ్ సంస్థానాధిపతి, మహారాజాధిరాజ మిర్జామహారావు శ్రీ మదనసింహాజీ బహదూర్‌తో 1948 మే 4 తేదీన ఒక ఒడంబడికకు వచ్చారు. 1948 జూన్ 1 తేది నుంచి కచ్ ఒక కమిషనర్ రాష్ట్రమైంది.

## అండమాన్, నికోబార్ దీవులు

బంగాళాఖాతంలో, మదరాసుకు తూర్పుగా 740 మైళ్ళు, కలకత్తాకు దక్షిణంగా 780 మైళ్ళదూరంలోవున్న అండమాను దీవులున్నూ, ఈ దీవులకు దక్షిణంగా 75 మైళ్ళదూరాన, బంగాళా

ఖాతంలోవున్న నికోబార్ దీవులున్నూ, ఇండియా ప్రభుత్వపరిపాలనలో, ఒక చీఫ్ కమిషనర్ పాలనలోవున్నాయి.

అండమానుదీవులలో పెద్దవి ఆరున్నూ, చిన్నదీవులు సుమారు రెండువందలున్నూ వున్నాయి. వీటి వైశాల్యం మొత్తం, 2,508 చ. మైళ్ళు. నికోబార్ దీవుల సంఖ్య, 19. వీటి వైశాల్యం, 635 చ. మైళ్లు. అండమానుదీవుల ప్రధాననగరం పోర్ట్ బ్లేర్.

పశ్చిమ పంజాబు, తూర్పు బెంగాలు రాష్ట్రాలనుంచి ఇండియాకు వచ్చిన కాందిశీకులలో కొంతమందిని యీ దీవులకు పంపి, వీటిని నివాస యోగ్యములుగాచేసి, వీటిని ఉపయోగించాలని ఇండియాప్రభుత్వంవారి ఉద్దేశం.

చీఫ్ కమిషనర్ : ఐ. మజీద్.

## హిమాచలప్రదేశ్

తూర్పు పంజాబ్ రాష్ట్రంలోవున్న బాఘల్, బాఘట్, బల్సాన్, బషార్, భజ్జి, బిజ, దార్కోటి, ధామి, జుబ్బల్, కెవన్‌థాల్, కుమార్ సెయిన్, కునిహార్, కుథార్, మహాలోగ్, సాంగ్రి, మంగళ్, సిర్మూర్, థరోచ్, చంబ, మండి, సుకేత్ అనే 21 సంస్థానాల అధిపతులు, మొత్తం 10,600 చ. మైళ్ళ వైశాల్యమూ, సుమారు 9,36,000 జనాభాగల తమ సంస్థానాలను కేంద్రప్రభుత్వ పరిపాలనకు అప్పగించి వేశారు. ఈ ప్రాంతం అంతా హిమాచలప్రదేశ్ అనే పేరుతో ఒక లెఫ్టినెంట్ గవర్నర్ రాష్ట్రంగా కేంద్రప్రభుత్వం పరిపాలనలోవుంది. నూతన రాజ్యాంగం అమలులోకివచ్చి, యీ రాష్ట్రానికి లెఫ్టినెంట్ గవర్నర్ నియామకం జరిగేవరకూ, చీఫ్ కమిషనర్ పాలనలో వుంటుంది. చీఫ్ కమిషనర్ : ఎన్. సి. మెహత.

# పాకిస్తాన్

పాకిస్తాన్ అంటే 'పవిత్రులభూమి' అని అర్థం.

ఆసలు యీ పాకిస్తాన్ భావానికి పునాదివేసిన వ్యక్తి, సుప్రసిద్ధ ముస్లిం కవి సర్ మహమ్మద్ ఇక్బాల్. 1930 లో ఈయన ముస్లింలీగ్ అధ్యక్షుడు. అలహాబాద్ సమావేశంలో అధ్యక్షోపన్యాసం ఇస్తూ, 'పంజాబ్, సింధు, బలూచిస్తాన్, సరిహద్దు రాష్ట్రాలు నాలుగూ ఒకే ముస్లింరాజ్యంగా ఏర్పడి, భారతదేశపు పశ్చిమోత్తర దిశలోవున్న ముస్లిములకు ఒక స్వతంత్రదేశంగావుంటే చూడాలని నా ఆశయం అన్నాడు,

1935 లో రహమత్ ఆలీ బెంగాల్, అస్సాం, హైదరాబాదులు కూడా యీ పాకిస్తాన్‌లో భాగాలుగావుండాలని ప్రతిపాదించాడు.

1940 వరకు, ముస్లింలీగునాయకులు పాకిస్తాన్ వుద్యమానికి తమ అంగీకారాన్ని స్పష్టపరచలేదు. కాని, 1940 లో లాహోరు సమావేశంలో పాకిస్తాన్ నిర్మాణాన్ని కోరుతూ, ముస్లింలీగు తీర్మానం చేసింది. అప్పటినుంచీ, ముస్లింలీగు నాయకులు, దీనిని ఒక పెద్ద ఉద్యమంగా తయారుచేశారు.

1946 ఆగస్టు 16 తేదిన బెంగాల్‌లో ప్రభుత్వంవారు పాకిస్తాన్ దినం అమలుజరిపారు. ఆనాడు కలకత్తాలో తీవ్రమైన మతకలహాలు ఆరంభమయాయి. తరువాత యీ కొట్లాటలు, బొంబాయి. యు. పి. బీహారు, పంజాబ్ రాష్ట్రాలలో కూడా ప్రారంభమయాయి.

1946 సంవత్సరంలో మతకలహాలలో 12,400 మంది చంపబడినట్లు, పార్లమెంటులో ఇండియామంత్రి ప్రకటనవల్ల స్పష్టపడింది. ఆ తరువాత పంజాబ్‌లో జరిగిన అల్లరులవల్లనూ, సరిహద్దురాష్ట్రంలో జరిగిన అల్లరులవల్లనూ, ఇంకా ఎన్నో వేలమంది చంపబడ్డారు.

ముస్లిములకు పాకిస్తాన్ ఇస్తేనేగాని, యీ అల్లరులు అణగవని నిశ్చయించి బ్రిటిషుప్రభుత్వంవారు తదనుకూలంగా 1947 జూన్ 3 వ తేదిన ప్రకటనచేశారు. (రాజ్యాంగ సంస్కరణలు చూడండి). ఆప్రకటనను అనుసరించి భరతఖండం, ఇండియా పాకిస్తాన్ అనే రెండు రాజ్యాలుగా విభజింపబడింది. విభజనతరువాత, రెండురాజ్యాలూ చేసుకున్న సంధాతథపు ఒడంబడిక 1948 మార్చి 31 తో అంతమొందింది. 1948 ఏప్రిలో 1 తేది నుంచి పాకిస్తానుకు ఇండియా, ఇండియాకు పాకిస్తాన్ విదేశాలై పోయినాయి.

## పాకిస్తాన్ ప్రభుత్వం

గవర్నర్-జనరల్: ఖ్వాజా నజీముద్దీన్
పదవీస్వీకారము: సెప్టెంబరు 14, 1948.
ప్రైవేట్ సెక్రటరీ: డబ్ల్యు. యు. ఓ. అబ్బాసి
మిలిటరీ సెక్రటరీ. కర్నల్ యూజిని సెంట్ జె. వి. ఓక్లీ
పర్సనల్ సెక్రటరీ: ఖుర్షీద్

రక్షకులు:
- లెఫ్టినెంట్ ఎస్. ఎం. అహసాన్ (నౌకాదళం)
- కెప్టెన్ గుల్ హసన్ ఖాన్ (సైన్యం)
- ఫ్లైట్ లెఫ్టినెంట్ అబ్దారి (విమానదళం)

రాజప్రసాదాధికారి: మేజర్ మెక్ కాయ్

### మంత్రిమండలి

ప్రధానమంత్రి : లియాకత్ అలీ ఖాన్
విదేశ వ్యవహారాలు : సర్. ఎం. జఫరుల్లా ఖాన్
ఆర్థిక మంత్రి : గులాం మహమ్మద్

| | |
|---|---|
| ఆహారము<br>వ్యవసాయము<br>ఆరోగ్యము | పీర్జాదా అబ్దుల్ సత్తార్ |
| రైల్వేలు, రోడ్లు, పోస్టు<br>టెలిగ్రాఫ్ శాఖ | సర్దార్ అబ్దుర్ రబ్ నిష్టర్ |
| పరిశ్రమలు, సివిల్<br>సప్లయిలు, విద్య | ఫజ్లుర్ రహమన్ |
| శాసననిర్మాణము,<br>గనులు | జోగేంద్రనాథ మండల్ |
| బ్రాడ్‌కాస్టింగ్, హోం<br>ఇన్ఫర్మేషన్, కాందిశీకులు | ఖ్వాజా షహాబుద్దీన్ |
| పోర్టుఫోలియో లేని మంత్రి · | నవాబ్ ముస్తాక్ అహమ్మద్ గుర్మాని |
| డిప్యూటీ మంత్రి: రక్షణశాఖ: | డాక్టర్ మహమద్ హుసేన్ |
| ,, విదేశ శాఖ: | ఖాన్ సర్దార్ బహదూర్ ఖాన్ |
| ,, హోం శాఖ: | ప్రొఫెసర్ షేక్ కురేషి |
| మంత్రుల జీతాలు: | నెలకు రు. 3,000. ఉచిత వసతి. |
| సైన్యాధిపతి: | జనరల్ డి. డి. గ్రేసీ |
| నౌకాదళాధిపతి: | రియర్-అడ్మిరల్ జె. డబ్ల్యు. జెఫర్డ్ |
| విమానదళాధిపతి | ఏర్ వైస్-మార్షల్ రిచర్డ్ ఆచెర్లి |
| సైన్య, నౌకా, విమానదళాల<br>వైద్యశాఖకు డైరెక్టర్-జనరల్ | మేజర్-జనరల్ ఎస్. ఎం. ఎ. ఫరూక్ |

# పాకిస్తాన్ రాజ్యాంగసభ

అధ్యక్షుడు: తమీజుద్దీన్ ఖాన్ (రు. 3000)

కార్యదర్శి: బషీర్ అహమద్

డిప్యూటీ కార్యదర్శి: కె. అలి అఫ్జల్

పబ్లిసిటీ ఆఫీసర్: కర్నల్ అబ్దుల్ మజిద్ మాలిక్

## సభ్యులు (రాష్ట్రాలవారీగా)

**తూర్పు బెంగాల్** : (బెంగాల్ లోని జిల్లాలతరఫున 29 మంది ముస్లిములు, సిల్హెట్ జిల్లా తరఫున ఇద్దరు ముస్లిములు, బెంగాల్ జిల్లాల తరఫున 12 మంది హిందువులు, సిల్హెట్ తరఫున ఒక హిందువు) సభ్యుల సంఖ్య : 44

ముస్లిములు : అబ్దుల్ మసూద్ అబ్దుల్ హమిద్, అబ్దుల్లా ఆలి మహమ్మద్, మౌలానా మహమద్ అబ్దుల్లా ఎల్ - బాకీ, అబ్దుల్ కాశిం ఖాన్, మౌలానా మహమ్మద్ అక్రంఖాన్, అజీజుద్దీన్ అహమద్, ఇబ్రాహింఖాన్, ఎ. కె. ఫజ్లుల్ హక్, ఫజ్లుర్ రహమన్, ఘ్యాసుద్దీన్ పఠాన్, హమీదుల్ హక్ చౌధురి, ప్రొఫెసర్ ఇస్తియాక్ హుసేన్ ఖురేషి, లియాకత్ ఆలి ఖాన్, మఫీజుద్దీన్ అహమ్మద్, డాక్టర్ మహమ్మద్ హుసేన్, డాక్టర్ ఎ. ఎం. మాలిక్, ముర్తుజా రీజా చౌధురి, అహమద్ ఆలి, మహమ్మద్ హబీబుల్లాబహార్, నూర్ అహమద్, నూరుల్ అమీన్, సిరాజుల్ ఇస్లాం, మౌలానాషబ్బీర్ అహమద్ ఉస్మాని, ఖ్వాజాషహాబుద్దీన్, బీగంషయిస్తా షురావర్ది ఇక్రముల్లా, తమీజుద్దీన్, (సిల్హెట్ నుంచి) అబ్దుల్ హమీద్.

హిందువులు : జోగేంద్ర నాథమండల్, ప్రేమ హరివర్మ, ధీరేంద్ర నాద దత్త, రాజకుమార్ చక్రవర్తి, శ్రీశ చంద్ర ఛటోపాధ్యాయ, భూపేంద్రకుమారదత్త, జ్ఞానేంద్ర చంద్రమజుందార్, విరాట్ చంద్ర మండల్, ధనంజయరాయ్, శచీంద్ర నారాయణ సన్యాల్, హరేంద్ర కుమారసూర్, అక్షయ కుమారదాస్.

**పశ్చిమ పంజాబ్** : (ముస్లిములు 12; హిందువులు, 3; శిక్కులు, 2) సభ్యుల సంఖ్య : 17

ముస్లిములు : మియా మహమ్మద్ ఇఫ్తికారుద్దీన్, చౌధురి నజీర్ అహమద్ ఖాన్, మాలిక్ మహమ్మద్ ఫెరోజ్ ఖాన్ నూన్, మియా ముంతాజ్ మహమద్ ఖాన్ దౌలతానా, షేక్ కరమత్ ఆలి, మాలిక్ ఓమర్ హాయత్, బీగం జహనారా షా నవాజ్, సర్దార్ షౌకత్ హాయత్ ఖాన్, సర్దార్ అబ్దుర్ రబ్ నిష్టర్, ఖాన్ ఇఫ్తికార్ హుసేన్ ఖాన్.

సింధు : (ముగ్గురు ముస్లిములు, ఒక హిందువు) : సభ్యుల సంఖ్య. 4.

ముస్లిములు : పీర్జాడా అబ్దుస్ సత్తార్ అబ్దుర్ రహమన్, మహమ్మద్ హాషీం గజ్దర్, ఖాన్‌బహదూర్ ఎం. ఎ. ఖుర్రో.

హిందువు : (ఖాళీ)

సరిహద్దు రాష్ట్రం : (ముస్లిములు ముగ్గురు) : ఖాన్ సర్దార్ బహదూర్‌ఖాన్, ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ (ఒక స్థానం ఖాళీ).

బలూచిస్తాన్ : (ఒక ముస్లిం) సర్దార్ బహదూర్‌నవాబ్ మహమద్‌ఖాన్ జోగజాయ్,

పాకిస్తాన్ రాజ్యాంగసభ ప్రథమ సమావేశం, 1947 ఆగస్టు 18 వ తేదీన జరిగింది. ఆ సమావేశానికి తాత్కాలికంగా, జోగేంద్రనాథ మండల్, అధ్యక్షుడుగా ఎన్నుకోబడినారు.

## పాకిస్తాన్ ప్రభుత్వ ప్రధానోద్యోగులు

| | |
|---|---|
| ప్రధాన న్యాయమూర్తి : | సర్ అబ్దుర్ రషీద్ |
| డైరెక్టర్ - జనరల్ ఆఫ్ సివిల్ ఏవియేషన్ : | జె. పి. జఫాక్ |
| డైరెక్టర్ - జనరల్ ఆఫ్ పోస్ట్స్ అండ్ టెలిగ్రాఫ్స్ : | కర్నల్ స్పియర్ |
| ఆడిటర్-జనరల్ : | యాకుబ్ షా |
| అడ్వొకేట్-జనరల్ : | ఎం. వసీం |
| రైల్వేస్ డైరక్టర్ - జనరల్ : | మియా నజీముద్దీన్ |
| టెక్స్టైల్ కమిషనర్ : | ఎ. బి. హబీబుల్లా |
| విద్యాశాఖ సలహాదారు : | డాక్టర్ ఎం. హసన్ |
| వైద్యశాఖ డైరక్టర్ జనరల్ : | కర్నల్ ఎం. ఎ. జాఫరీ |
| బ్రాడ్‌కాస్టింగ్ కంట్రోలర్ : | జడ్. ఎ. బొఖారి |

## ప్రభుత్వ కార్యదర్శులు

మంత్రిమండలి కార్యదర్శి ... మహమ్మద్ ఆలీ

విదేశ శాఖ ... ఎం. ఇక్రముల్లా

రక్షణ శాఖ ... లెఫ్టినెంట్ కర్నల్ ఇస్కందర్ మీర్జా
రవాణా శాఖ ... జడ్. హెచ్. ఖాన్
ఆర్థిక శాఖ ... అబ్దుల్ కాదర్
సంస్థానాల శాఖ ... లెఫ్టినెంట్ కర్నల్ ఎ. ఎస్. బి. షా
వ్యాపార శాఖ ... ఎ. మెక్ ఫార్కుహార్
పరిశ్రమల శాఖ ... జి. ఫరూక్
న్యాయ శాఖ ... అక్బర్ హుసేన్
ఆహార శాఖ ... సర్ హెరాల్డ్ షూబర్ట్

## పాకిస్తాన్‌లో విదేశ ప్రతినిధులు

ఇంగ్లండ్ : హైకమిషనర్ : సర్ లారెన్సు గ్రాఫెటీ స్మిత్
ఇండియా : హైకమిషనర్ : డాక్టర్ సీతారాం
ఈజిప్టు : రాయబారి : మహమ్మద్ ఆలీ అల్లూబా పాషా
బర్మా : రాయబారి : యు. పె. కిన్
ఫ్రాన్సు : రాయిబారి : లియాన్ మార్షల్
పర్షియా : రాయబారి : హసన్ ఆలి ఘఫారి
టర్కీ : రాయబారి : యాహ్యా కెమల్ బే అలి
అమెరికా. రాయబారి : మెర్లి హెచ్. కాక్రాన్
ఆఫ్ఘనిస్తాన్ : రాయబారి : సర్దార్ షా వలీఖాన్

## విదేశాలలో పాకిస్తాన్ ప్రతినిధులు

ఇంగ్లండ్ : హైకమిషనర్ : హబీబ్ ఇబ్రాహిం రహింతుల్లా
ఇండియా : హైకమిషనర్ : మహమ్మద్ ఇస్మాయిల్
బర్మా : రాయబారి : మహమ్మద్ ఆలి
అమెరికా : రాయబారి : ఎం. ఎ. హెచ్. ఇస్పహాని
ఆఫ్ఘనిస్తాన్ : రాయబారి : ఐ. ఐ. చుంద్రిగార్
ఇరాన్, ఇరాక్ : రాయబారి : ఘజనఫర్ ఆలి ఖాన్
ఈజిప్టు : రాయబారి : హాజీ ఎస్సాక్ సేట్

### బడ్జెటు

పాకిస్తాన్ 1949-50 బడ్జెటు 1949 ఫిబ్రవరి 28 తేదిన, పాకిస్తాన్ పార్లమెంటులో అర్థిక శాఖామంత్రి ఘులాం మహమ్మద్ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి:

| | | |
|---|---|---|
| 1949-50 లో వస్తుందని అంచనా వేసిన ఆదాయం | రు. | 118,19,00,000 |
| 1949-50 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | రు. | 117,20,00,000 |
| మిగులు అంచనా | రు. | 99,00,000 |

# తూర్పు బెంగాల్

పాకిస్తాన్ నిర్మాణంతో, బెంగాల్ రాష్ట్రవిభజన జరిగింది. పశ్చిమ బెంగాల్ ఇండియాలోను, తూర్పు బెంగాల్ పాకిస్తాన్‌లోను భాగాలైనాయి. తూర్పు బెంగాల్ రాష్ట్రాన్ని వ్యావహారికంగా తూర్పుపాకిస్తాన్ అనికూడా అంటున్నారు.

తూర్పు బెంగాల్ వైశాల్యం సుమారు, 51,000 చ. మైళ్ళు అనీ, జనాభా దాదాపు 3,97,00,000 అనీ అంచనా. జనాభాలో సుమారు పదిలక్షలమంది హిందువులు యీ రాష్ట్రాన్నివదలి పశ్చిమ బెంగాల్‌కు వెళ్ళిపోయారు. అందుచేత, మళ్ళీ జనాభాలెఖలు తీసుకొనేవరకూ, యీ రాష్ట్రపు సరియైన జనాభా తెలియదు.

తూర్పు బెంగాల్‌కు రాజధాని ఢాకా. ప్రధాన రేవుపట్టణం చిటగాంగ్.

విభజనవల్ల పరిశ్రమలు విస్తారంగా పశ్చిమ బెంగాల్‌కు పోతే, పంటప్రదేశం అధికంగా తూర్పు బెంగాల్‌కు సంక్రమించింది.

గవర్నర్: సర్ ఫ్రెడరిక్ బర్న్
పదవీస్వీకారం: 1947 ఆగస్టు 15

మంత్రిమండలి: పదవీస్వీకారం: 1947 ఆగస్టు 15 న, ఖ్వాజా నజీముద్దీన్ నాయకత్వాన ముగ్గురు మంత్రులతో మంత్రిమండలి స్థాపింప

బడింది. 1947 సెప్టెంబర్ 16 న మరొక నలుగురు చేర్చుకొన బడినారు: ప్రధానమంత్రి: ఖ్వాజానజీముద్దీన్; సివిల్ సప్లయిస్ మంత్రి: నూరుల్ అమీన్; రెవిన్యూమంత్రి: హమీదుల్ హక్ చౌదురి; విద్యామంత్రి: అబ్దుల్ హమీద్; రవాణా; హసన్ ఆలి; వ్యవసాయమంత్రి; సయ్యద్ మహమ్మద్ అఫ్జల్; ఆరోగ్యమంత్రి: హబీబుల్లా బహార్.

పాకిస్థాన్ గవర్నర్ జనరల్ జిన్నా మరణకారణంగా, ప్రధాన మంత్రి ఖ్వాజానజీముద్దీన్ పాకిస్థాన్ గవర్నర్ జనరల్‌గా నియమితులై నందున, తూర్పుబెంగాల్ ప్రధానిగా నూరుల్ అమీన్ నియమితులైనారు. 1948 సెప్టెంబరు 15 తేదిన యీక్రింది మంత్రిమండలి ఏర్పాటు చేయబడింది.

| | |
|---|---|
| ప్రధానమంత్రి : హోం, న్యాయశాఖ ప్లానింగ్ | నూరుల్ అమీన్ |
| ఆర్థిక మంత్రి : వాణిజ్యం, పరిశ్రమలు : | హమీదుల్ హక్ చౌధురి |
| విద్య : | అబ్దుల్ హమీద్ |
| రవాణా : | హసన్ ఆలి |
| సివిల్ సప్లయిలు : | సయ్యద్ మహమద్ అఫ్జల్ |
| ఆరోగ్యము, స్థానికపాలన : | హబీబుల్లా చౌధురి |
| కాందిశీకుల రక్షణ, జైళ్ళు రిజిస్ట్రేషన్ | మఫీజుద్దీన్ అహమ్మద్ |

మంత్రుల జీతాలు: ప్రధానమంత్రి, రు. 1,800; ఇతర మంత్రులు, రు. 1,500. ఇదికాక, అందరు మంత్రులకు నెలకూ 300 రూపాయలు కారు అలవెన్సు, అద్దెలేకుండా యిల్లు ఇవ్వబడుతుంది.

## బడ్జెట్

తూర్పు బెంగాల్ రాష్ట్రపు 1949–50 బడ్జెటును శాసనసభలో 1949 మార్చి 12 తేదిన ఆర్థికశాఖామంత్రి హమీదుల్ హక్ చౌధురి ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి :

1949–50 లో వస్తుందని అంచనా వేసిన
ఆదాయం ... రు. 17,85,00,000
1949–50 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు రు. 17,26,00,000

# పశ్చిమ పంజాబ్

పాకిస్తాన్ నిర్మాణంతోపాటు, పంజాబ్ రాష్ట్రవిభజనకూడా జరిగింది. (వివరాలకు తూర్పు పంజాబ్ చూడండి) పశ్చిమ పంజాబ్ వైశాల్యం దాదాపు 62,000 చ. మైళ్ళు ఉంటుందనీ, జనాభా సుమారు 1,69,22,000 అనీ అంచనా. అయితే, యీ రాష్ట్రంనుంచి దాదాపు 25 లక్షలమంది హిందువులు వెళ్ళిపోయారు. దాదాపు 15 లక్షల మంది ముస్లిములు తూర్పు పంజాబునుంచి ఇక్కడకు వచ్చారు. అంచేత, మళ్ళీ జనాభా లెఖలు తీసుకొనేవరకూ, యీ రాష్ట్రపు జనాభా ఇంత అని స్పష్టంగా చెప్పడానికి వీలులేదు.

పశ్చిమ పంజాబ్‌కు రాజధాని లాహోర్.

గవర్నర్ : సర్ ఫ్రాన్సిస్ మూడీ
పదవీస్వీకారం : 1947 ఆగస్టు 15.
మంత్రిమండలి : పదవీస్వీకారం : 1947 ఆగస్టు 15.
ప్రధాన మంత్రి : నవాబ్ ఇఫ్తికార్ హుసేన్‌ఖాన్
రెవిన్యూ మంత్రి: సర్దార్ షౌకత్ హయత్ ఖాన్
ఆర్థిక మంత్రి : మియాముంతాజ్ మహమద్ నూరుల్లా
విద్యా మంత్రి: షేక్ కరమత్ ఆలి
ఆరోగ్యం : సర్దార్ అబ్దుల్ హమీద్‌దస్తి
రెవిన్యూ : మేజర్ ముబారిక్ ఆలి షా
అసెంబ్లీ స్పీకర్ : షేక్ ఫయజ్ మహమ్మద్

రాష్ట్రపు మంత్రివర్గం 1949 జనవరి 25 తేదిన రాజీనామా ఇచ్చింది. రాష్ట్రపరిపాలనను గవర్నరే తన స్వాధీనంచేసుకొని, శాసన సభనుకూడా రద్దుచేశాడు.

# సరిహద్దు రాష్ట్రం

పాకిస్తాన్‌కు పశ్చిమోత్తర సరిహద్దులోవున్న రాష్ట్రం ఇది. కొంత కాలం పంజాబురాష్ట్రంలో కలసివుండి, తరువాత ఛీఫ్ కమిషనర్ పరిపాలనలోవున్న ఈ రాష్ట్రం, 1932 లో స్వపరిపాలనగల ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటుచేయబడింది. దీని వైశాల్యం. 14,263 చదరపు మైళ్ళు. 1941 లెఖల ప్రకారం, జనాభా: 30,38,067. హిందువులు. 1,80,321; ముస్లిములు. 27,88,797. భరతఖండం విభజన జరిగిన తరువాత దాదాపు పదిలక్షల మంది హిందువులు యీ రాష్ట్రాన్నివదలి ఇండియాకు వచ్చేశారు.

ఈ రాష్ట్రంలోని ప్రజలు తమ జీవితానికి కేవలం వ్యవసాయం మీదనే అధారపడివున్నారు. ఇక్కడ పరిశ్రమలనేవే ఏమీ లేవని చెప్పవచ్చును. రాష్ట్ర మంతటిలోని భూమిలోనూ, నాల్గవ వంతులో మాత్రమే వ్యవసాయం జరుగుతున్నది.

దీనికి రాజధాని పెషావర్ (1,73,420). 1947 జూలై లో జరిగిన రెఫరెండం ఫలితంప్రకారం సరిహద్దురాష్ట్రాన్ని పాకిస్తాన్‌లో చేర్చివేస్తూ గవర్నర్-జనరల్ ప్రకటనచేశారు.

పాకిస్తాన్ ప్రభుత్వ నిర్మాణం జరిగిన వారం రోజులలోగా, అంటే ఆగస్టు 22 వ తేదిన, సరిహద్దురాష్ట్రపు కొత్త గవర్నరు ఆ రాష్ట్రంలో డాక్టర్ ఖాన్‌సాహెబ్ నాయకత్వానవున్న కాంగ్రెసు మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేసి, ముస్లింలీగు నాయకుడు ఖాన్ అబ్దుల్ కయూం ఖాన్‌ను మంత్రిమండలిని స్థాపించమని కోరాడు. ఆ ప్రకారమే మంత్రిమండలి స్థాపించబడింది

గవర్నర్: సర్. ఎ. ఎఫ్. డండాస్

మంత్రిమండలి: పదవీస్వీకారం: 1947 ఆగస్టు 23

ప్రధానమంత్రి<br>ఆర్థిక శాఖ } ఖాన్ అబ్దుల్ కయూంఖాన్

రెవిన్యూమంత్రి<br>స్థానికపరిపాలన } ఖాన్ మహమ్మద్ పరీద్ ఖాన్

విద్యామంత్రి: మియా జాఫర్ షా

స్పీకరు: నవాబ్ అల్లా నవాజ్ ఖాన్

బడ్జెటు

1948-49 సంవత్సరానికి బడ్జెటును శాసనసభలో, 1948 మార్చి 17 వ తేదీన ఆర్థికశాఖామంత్రి ఖాన్ అబ్దుల్ కయూంఖాన్ ప్రవేశ పెట్టారు. ఆ బడ్జెటు వివరా లివి:

1948-49 లో రాగలదని అంచనా వేసిన

ఆదాయం ... రు. 3,60,60,000

1948-49 లో అవుతుందని అంచనా

వేసిన ఖర్చు ... రు. 3,79,01,000

లోటు ... రు. 18,41,000

# సింధు

1936 లో కొత్తగా సృష్టింపబడిన రెండు రాష్ట్రాలలో, సింధు ఒకటి. అంతకుపూర్వం, ఇది బొంబాయిరాష్ట్రంలో చేరివుండేది. దీని వైశాల్యం, 48,136 చదరపు మైళ్ళు. 1941 లెఖల ప్రకారం జనాభా, 45,35,008. వీరిలో 32,08,325 మంది ముస్లిములు; 12,29,926 మంది హిందువులు. కొన్ని వేలమంది మాత్రం, క్రైస్తవులు, ఆంగ్లో-ఇండియనులు, యూరపియనులు. ప్రజలు మాట్లాడే భాష, అరబ్బీ, ఫారసీ, సంస్కృత

భాషల మిశ్రమం. దేశవిభజన జరిగిన తరువాత,-దాదాపు పదిలక్షల మంది హిందువులు ఇండియాకు వచ్చేశారు.

సింధురాష్ట్రంలో పెద్ద పరిశ్రమలు ఏమీలేవు. ప్రజలలో అధిక సంఖ్యాకులు వ్యవసాయంమీద ఆధారపడినవారే. ఈ రాష్ట్రపు నామానికి కారణమైన సింధునదివల్ల చాలా భూమికి నీటి సదుపాయం వుంది.

దీనికి రాజధానీ ఇన్నాళ్ళూ కరాచి. ఇకముందు, ఇదే రాష్ట్రంలో వున్న హైదరాబాదు నగరం.

పాకిస్తాన్ నిర్మాణం జరిగిన ఏడాదిన్నరలో, సింధురాష్ట్రంలో రెండు మంత్రివర్గాలు మారి, మూడవ మంత్రిమండలి, 1949 ఫిబ్రవరి 18 న ఏర్పాటుచేయబడింది.

మొదటి మంత్రిమండలి 1947 ఆగస్టు 15 న ఎం. ఎ. ఖుహ్రో అధ్వర్యాన స్థాపింపబడింది. కాని, ఈయనపై దుష్పరిపాలన, లంచగొండితనం మొదలైన నేరాలు ఆరోపించబడినందున, ఆయనను 1948 లో గవర్నరు బర్తరఫ్‌చేశాడు. 1948 అక్టోబరు 7 తేదీన పీర్ ఇలాహిబక్స్ నాయకత్వాన మరొక మంత్రిమండలి ఏర్పాటుచెయ్యబడింది. కాని, శాసనసభ ముస్లింలీగు పార్టీ సభ్యులలో అధికసంఖ్యాకులు యీయనపట్ల విశ్వాసంలేదని ప్రకటించినందున, 1949 ఫిబ్రవరి 4 తేదిన తన పదవికి రాజీనామా ఇచ్చాడు. 1949 ఫిబ్రవరి 18 తేదిన యూసుఫ్ అబ్దుల్లా హరూన్ నాయకత్వాన మరొక మంత్రివర్గం ఏర్పాటుచేయబడింది.

గవర్నర్: దీన్ మహమ్మద్

పదవిస్వీకారం : 1948 అక్టోబర్ 7

మంత్రి మండలి : 1949 ఫిబ్రవరి 18

ప్రధానమంత్రి<br>ఆర్థికశాఖ } యూసుఫ్ అబ్దుల్లా హరూన్

రెవిన్యూమంత్రి : సయ్యద్ మీరాన్ మహమ్మద్ షా
పబ్లిక్ వర్క్సుమంత్రి: మీర్ బందె ఆలిఖాన్ తాల్పూర్
ఆహారమంత్రి
పరిశ్రమలు: కార్మికులు } సయ్యద్ నూర్ అహమద్ షా
స్పీకర్ : ఆఘా బద్రుద్దీన్ అహమ్మద్ షంసుద్దీన్ ఖాన్ దురాని

బ డ్జె టు

1949—50 సంవత్సరానికి బడ్జెటును, శాసనసభలో మార్చి 10 తేదిన, ఆర్థికమంత్రి యూసుఫ్అబ్దుల్లా హరూన్ ప్రవేశపెట్టాడు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| 1949—50లో రాగలదని అంచనావేసిన | |
| ఆదాయం | ... రు. 7,40,91,000 |
| 1949—50 లో అవుతుందని అంచనా | |
| వేసిన ఖర్చు | ... రు. 9,17,49,000 |
| లోటు | ... రు. 1,76,58,000 |

# కమిషనర్ రాష్ట్రం

బలూచిస్థాన్ : ఇండియాకు పశ్చిమోత్తరాన, పాకిస్థాన్కు నైరుతి మూలగావున్న ప్రాంతం. దీనిలో స్వదేశ సంస్థానాధిపతుల పాలనలోవున్న భాగంపోగా, పాకిస్థాన్ గవర్నరు-జనరల్ చే నియమింపబడే కమిషనరు అధికారంలోవున్న ప్రాంతం, 54,456 చ. మైళ్లు. జనాభా, 5,01,631. రాష్ట్రంలో చాలాభాగం ఎడారి కొండలమయం. ఇటీవలనే, యీ రాష్ట్రంలో వ్యవసాయం కొంచెం ఎక్కువగా జరుగుతోంది. అరేబియన్ సముద్రంలో చేపలను పట్టడం యిక్కడి ప్రజల ప్రధానవృత్తులలో ఒకటి. జనాభాలో 1941 లెఖలప్రకారం, హిందువులు 44,623; ముస్లిములు, 4,38,930.

# మదరాసు రాష్ట్రం

ఇండియాలోని పెద్దరాష్ట్రాలలో రెండవ స్థానం మదరాసుది. జిల్లా లన్నిటిలోకి పెద్దది విశాఖపట్టణం. మదరాసురాష్ట్రపు వైశాల్యం 1,24,363 చ. మైళ్ళు. ఈరాష్ట్రానికి తూర్పున 1,250 మైళ్ళ పొడవునా, పడమటన 450 మైళ్ళ పొడవునా సముద్రతీరంవుంది. తెలుగు జిల్లాల లోని కృష్ణా,గోదావరీ నదులూ, అరవ జిల్లాలలోని కావేరినదీ, ఈరాష్ట్రం లోని విశేష భాగానికి వ్యవసాయ భూముల సాగుకు ఆధారంగా వున్నాయి. ఈ నదులమీద ఆధారపడిన ప్రాంతాలే ఈ రాష్ట్రంలో అత్యధికంగా సారవంతమైనవి.

ఈ రాష్ట్రంలో ప్రధాన పంటలు బియ్యము, చోళ్ళు, రాగులు, జొన్నలు సజ్జలు.

తెలుగు, అరవ, కన్నడం, మళయాళం, తుళుభాషలు, ఇక్కడ ప్రధాన భాషలు.

ఈ రాష్ట్ర నిర్మాణము, భారతదేశంలోని ప్రస్తుతపు రాష్ట్రాలన్నిటి లాగే, ఒక క్రమపద్ధతిపొద జరుగలేదు. బ్రిటిషువారు, అదిలో వర్తకా నికి వచ్చి, మదరాసు, మచిలీపట్టణం నగరాలవద్ద ఫ్యాక్టరీలు కట్టుకొని, క్రమేపీ దేశీయ రాజుల కలహాలలో జోక్యం కలిగించుకొని తమ పలుకు బడిని ఎక్కువచేసుకున్నారు. తరువాత, దేశీయ రాజులకు సైన్యసహాయం చేసి, వారివద్దనుంచి ప్రతిఫలరూపంలో భూమిని తీసుకోవడం ఆరంభిం చారు. కొంతకాలం అయిన తరువాత, దేశీయరాజులతో తామే యుద్ధాలుచేసి, భూమిని ఆక్రమించుకున్నారు, ఈవిధంగా ఏర్పడ్డ రాష్ట్రాలలో మదరాసు ఒకటి.

హైదరాబాదు నవాబు దత్తంచేసిన తెలుగు జిల్లాలు, కర్నాటక నవాబులవద్దనుంచీ, మైసూరు పాలకుడైన టిప్పుసుల్తానుకు, మహారాష్ట్ర రాజులను ఓడించీ ఆక్రమించిన దక్షిణ జిల్లాలు కలిసి ప్రస్తుతపు మద రాసు రాష్ట్రం ఏర్పడింది.

క్రమక్రమంగా విస్తరిల్లిన మదరాసురాష్ట్ర పరిపాలన, మదరాసులోని సెంట్ జార్జి కోట అధిపతిచేతిలోవుండేంది. ఈకోట వ్యవహారాలను నిర్వహించే అధిపతికి 1785 వరకూ, ప్రెసిడెంటు అని వ్యవహారిక హోదా. ఆతరువాత, యీరాష్ట్ర పరిపాలనకు గవర్నర్లు నియమింపబడినారు.

భారతదేశంలోని అన్ని రాష్ట్రాలతోపాటే, ఈ రాష్ట్రంలోకూడా రాజ్యాంగ సంస్కరణలు ప్రవేశపెట్టబడినాయి. ప్రస్తుతం ఈరాష్ట్రంలో రెండు శాసనసభలు (లెజిస్లేటివ్ కౌన్సిలు, లెజిస్లేటివ్ అసెంబ్లీ) వున్నాయి.

## మదరాసు గవర్నర్లు

1858 లో భారతదేశంలో ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనలోవున్న భాగాలన్నిటి పరిపాలనను బ్రిటిషుప్రభుత్వం స్వాధీనపరచుకున్నది. అప్పటినుంచి మదరాసుకు గవర్నర్లుగా వున్నవారు :

| | |
|---|---|
| సర్ ఛార్లెస్ ట్రెవెల్యాన్ | 1859 |
| విలియం ఏంబ్రోస్ మోర్ హెడ్ | 1860 |
| సర్ విలియం థామస్ డెనిసన్ | 1861 |
| ఎడ్వర్డ్ మాల్టబీ | 1863 |
| నేపియర్ ప్రభువు | 1866 |
| హోబర్ట్ ప్రభువు | 1872 |
| బకింగ్ హాం ప్రభువు | 1875 |
| ఎల్ఫిన్స్టన్ గ్రాంట్ డఫ్ | 1881 |
| రాబర్ట్ బర్క్ | 1886 |
| వెన్ లాక్ ప్రభువు | 1891 |
| సర్ ఆర్థర్ హేవెలక్ | 1896 |
| ఏంప్టిల్ ప్రభువు | 1900 |
| సర్ ఆర్థర్ లాలే | 1906 |
| పెంట్లండ్ ప్రభువు | 1912 |

| | |
|---|---|
| విల్లింగ్డన్ ప్రభువు | 1919 |
| గోషెన్ ప్రభువు | 1924 |
| సర్ నార్మన్ మార్క్ష్‌బాంక్స్ | 1929 |
| సర్ జార్జి శ్టాన్లే | 1929 |
| ఎర్స్కిన్ ప్రభువు | 1934 |
| సర్ ఆర్థర్ హోప్ | 1940 |
| సర్ ఆర్చిబాల్డ్ నై | 1946 |
| భావనగర్ మహారాజు | 1948 |

1934 లో సర్ జార్జి శ్టాన్లే వెళ్ళిపోయి, ఎర్స్కిన్ ప్రభువు వచ్చే లోగా ఆరునెలల కాలం సర్ మహమ్మద్ ఉస్మాన్ సాహెబ్ బహదూరున్నూ, 1936 లో ఎర్స్కిన్ ప్రభువు సెలవులో వెళ్ళినప్పుడు సుమారు నాలుగు మాసములు సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడున్నూ ఆక్టింగ్ గవర్నర్లుగా వున్నారు. స్వరాజ్యానికి పూర్వం మదరాసుకు గవర్నర్లుగావున్న దేశీయులు వీరిద్దరే.

పైన పేర్కొన్న అనేకమంది గవర్నర్లు ఒకరి తరువాత మరొకరు వచ్చేలోపల, అనేకులు అంతా బ్రిటిషువారే, ఆక్టింగు గవర్నర్లుగా వున్నారు. కాని, గ్రంథవిస్తరభీతిచే, వారి పేర్లను ఇక్కడ పేర్కొనలేదు.

## జనాభా

మదరాసు రాష్ట్రంలో గ్రామాలు 35,432; రాష్ట్ర మొత్తంలో ప్రజలు నివసిస్తూవున్న ఇండ్లు, 96,36,792. వీటిలో, 14,63,649 పట్టణాలలో వున్నాయి. 81,73,146 గ్రామాలలో వున్నాయి.

1941 సంవత్సరంలో తీసిన లెఖలప్రకారం రాష్ట్రపు జనాభా మొత్తం: 4,93,41,810. వీరిలో 78,64,833 మంది పట్టణాలలో నివసిస్తున్నవారు; 4,14,76,927 మంది గ్రామవాసులు; పురుషులు: 2,45,57,143; స్త్రీలు: 2,47,84,667. అక్షరాస్యులు, 66,00,645 మంది మాత్రమే.

మతములవారిగా లెఖలు ఈ క్రిందివిధంగా తేలినవి :

హిందువులు 4,26,99,822; (వీరిలో షెడ్యూల్డు క్యాస్ట్ 80,68,492; ఇతరులు, 3,47,31,330) ముస్లిములు, 38,96,452 భారతీయ క్రైస్తవులు, 20,01,082; ఆంగ్లో-ఇండియనులు, 28,661 ఇతర క్రైస్తవులు, 17,535; సిక్కులు, 418; జైనులు, 30,136; పార్శీలు, 469; బౌద్ధులు, 1,072; యూదులు, 191; కొండజాతులు, 5,62,029; ఇతరులు, 4,043.

1941 లో జనాభా లెఖలు అయినతరువాత, రాష్ట్రంలో జనాభా క్రమంగా పెరుగుతునే వచ్చింది. 1948 లో మదరాసురాష్ట్రపు జనాభా 5,34,45,764 అని అంచనా వేయబడింది.

| | |
|---|---|
| 1947 లో జననాలు : | 17,13,102 |
| వీరిలో పురుషులు : | 8,79,410 |
| స్త్రీలు : | 8,33,992 |
| వీరిలో పల్లెలలో : | 14,04,371 |
| పట్టణాలలో : | 3,09,031 |
| 1947 లో మరణాలు : | 10.50,720 |
| వీరిలో పురుషులు : | 5,31,329 |
| స్త్రీలు : | 5,19,391 |
| వీరిలో పల్లెలలో : | 8,76,379 |
| పట్టణాలలో | 1,64,341 |

1941 తరువాత ప్రతి సంవత్సరము, రిజిస్టరుచేయబడిన జనన మరణాల వివరా లివి :

| సంవత్సరం | జననాలు | మరణాలు |
|---|---|---|
| 1941 : | 17,17,133 | 11,35,837 |
| 1942 : | 16,84,023 | 11,20,126 |
| 1943 : | 15,65,644 | 12,70,687 |
| 1944 : | 14,94,134 | 12,91,418 |
| 1945 : | 15,11,878 | 11,43,401 |
| 1946 : | 16,39,674 | 9,79,041 |
| 1947 : | 17,13,102 | 10,50,720 |

పై జనన మరణాల లెఖనుబట్టి, ఆ ఏడు సంవత్సరాలలోనూ, ప్రతి ఏటా మరణాలకంటె, ఎన్ని జననాలు ఎక్కువవున్నదీ ఇలా తేలింది.

1941 : 5,81,296; 1942 : 5,63,894 : 1943 : 2,94,957; 1944 : 2,02,716; 1945 : 3,68,477; 1946; 6,60,632, 1947 : 6,62,382.

వయోజన ఓటింగు హక్కుగలవా రెందరో నిర్ణయించడానికి, రాష్ట్రంలోని వయోజనుల జనాభా లెఖలు 1948 అక్టోబరు, నవంబరు నెలలలో తీసుకోనబడినవి.

రాష్ట్రమొత్తంలో 2,57,49,856 మంది ఓటర్లు రిజిష్టరుచేయబడి నారనీ, వీరిసంఖ్య అసలు జనాభాలో నూటికి 48 వంతులు వుంటుందనీ తేలింది.

# పశుసంపద

1944 డిసెంబరులో తీసుకున్న లెఖలప్రకారం, మనరాష్ట్రంలోని పశుసంపద ఇది:

| | |
|---|---|
| ఆవులు : మొత్తం | 58,07,079 |
| పాలిస్తూవున్నవి | 18,64,058 |
| వట్టిపోయినవి | 21,55,862 |
| గొడ్డుమోతువి | 10,09,593 |
| పొలంలో పనులకు ఉపయోగిస్తున్నవి | 5,84,540 |
| ఎందుకూ పనికిరానివి | 1,93,026 |
| ఎద్దులు : మొత్తం | 69,42,549 |
| ఆంబోతులు | 91,144 |
| పొలం పనులకు ఉపయోగిస్తున్నవి | 56,48,336 |
| పనులకు పనికివచ్చేవీ, ఎదకు పనికివచ్చేవీ | 8,42,310 |
| ఎందుకూ ఉపయోగించనివి | 3,60,759 |

| | |
|---|---|
| పెయ్యలు' మొత్తం | 36,05,286 |
| మగవి | 17,75,790 |
| ఆడవి | 18,29,496 |
| గేదెలు : మొత్తం | 30,42,827 |
| పాలిచ్చేవి | 15,69,658 |
| వట్టిపోయినవి | 9,216,20 |
| గొడ్డుమోతువి | 4,26,836 |
| పొలం పనులకు ఉపయోగిస్తున్నవి | 77,160 |
| ఎందుకూ పనికిరానివి | 46,053 |
| దున్నలు : మొత్తం | 11,79,375 |
| ఆంబోతులు | 52,008 |
| పొలం పనులకు ఉపయోగిస్తున్నవి | 10,10,638 |
| ఎందుకూ ఉపయోగించనివి | 1,16,729 |
| పెయ్యలు : మొత్తం | 20,67,123 |
| మగవి | 8,72,450 |
| ఆడవి | 11,94,673 |
| గొర్రెలు | 1,05,69,189 |
| మేకలు | 60,87,650 |
| గుర్రములు | 50,016 |
| గాడిదలు | 1,54,534 |
| ఒంటెలు | 119 |
| పందులు | 7,43,754 |
| కోళ్ళు | 1,40.08,870 |
| బాతులు | 7,66,214 |

1944 - 45 లో 53,579 పశువులూ, 1945 - 46 లో 25,810 పశువులూ, 1946 - 47 లో 34,256 పశువులూ మరణించినట్లు ప్రభుత్వ లెఖలవల్ల తెలుస్తోంది.

# వ్యవసాయపు భూమి: పంటలు (1946-47)

| | | |
|---|---|---|
| మదరాసు రాష్ట్రంలో మొత్తం భూమి : | 7,99,30 వేల ఎకరాలు | |
| దానిలో అడవి . | 1,35,I6 | ,, |
| వ్యవసాయ భూమి : | 3,05,34 | ,, |
| వ్యవసాయానికి రానిది (రోడ్లు నదులు మొదలైనవాటిక్రింద ఉన్నదీ, ప్రజల ఇతర ఉపయోగాలకొరకు ప్రత్యేకించబడినది) | 1,41,48 | ,, |
| వ్యవసాయానికి పనికివచ్చే బీడు (ఈ భూమిలో వ్యవసాయం ఏమీ లాభసాటికాదు) | 1,19,53 | ,, |
| బీడు భూమి : | 97,79 | ,, |
| వ్యవసాయం జరిగిన భూమిలో, కాలువల ద్వారా నీటి సప్లయిపొందిన భూమి | 86,92,215 ఎకరాలు | |

మదరాసు రాష్ట్రంలోని రైతువారి గ్రామాలు. 21,101. 1356 ఫసలీ (1946-47) లో మదరాసురాష్ట్రంలో రైతువారి అధీనంలో వున్న భూమి 2,76,70,382 ఎకరాలు. 1945-46 లో 2,76,61,319 ఎకరాలు. అంటే 1945-46 లో కంటె, 1946-47 లో 9063 ఎకరాల భూమి అదనంగా రైతువారి అధీనంలోకి వచ్చిందన్నమాట.

రైతువారి అధీనంలోవున్న భూమిలో, దాదాపు 2,02,00,000 ఎకరాల భూమి 1945-46 లో వ్యవసాయం చేయబడింది. 1946-47 లో 2,05,00,000 ఎకరాలలో వ్యవసాయం జరిగింది. 1945-46 నాటికంటె 1946-47 లో వ్యవసాయం జరిగిన రైతువారి భూమి 2,92,?02 ఎకరాలు ఎక్కువ. దీనిలో 2,''3,519 ఎకరాలు పల్లపు భూమి; 68,683 ఎకరాలు మెట్టభూమి.

రైతువారి అధీనంలోను, జమీందారి అధీనంలోనువున్న భూమిలో 1946-47 లో వ్యవసాయం జరిగిన భూమి మొత్తం, దాదాపు 2,16,20,000 ఎకరాలు. 1945-46 లో వ్యవసాయం జరిగిన భూమి, 213,00,000 ఎకరాలు.

ఒక సంవత్సరంలో (1945-46 నుంచి 1946-47 నాటికి) ఈ రాష్ట్రంలో వ్యవసాయం జరిగే భూమి 3,25,201 ఎకరాలు ఎక్కువైంది. బీడు భూమి కొలత లెఖలో, 1,57,455 ఎకరాలు తగ్గింది.

# ఆహారపు పంటలు

1947 జూన్ 30 తో అంతమయే 1946-47 సంవత్సరంలో మదరాసు రాష్ట్రంలో ఆహారపంటలు ఎంత భూమిలో వేసినదీ, ఎంత పండినదీ, వివరాలు యీ క్రింది పట్టీవలన తెలుసుకోవచ్చును.

| దినుసు | ఎకరాలు | పంట (టన్నులు) |
|---|---:|---:|
| ధాన్యములు | 2,28,07,268 | 99,52,900 |
| పప్పులు | 29,35,523 | 2,53,550 |
| మసాలా సుగంధ దినుసులు | 7,68,951 | 3,01,510 |
| చక్కెర | 2,91,096 | 6,54,070 |
| పళ్ళు, కాయకూరలు | 7,91,662 | 28,12,180 |
| ఇతర ఆహారవస్తువులు | 33,856 | 9,690 |
| మొత్తం | 2,76,28,356 | 2,39,83,000 |

1947 నవంబరు మాసాంతానికి, మదరాసు రాష్ట్రంలో వరిపంట వేసిన భూమి 93,63,000 ఎకరాలు, 1946 లో 89,97,000 ఎకరాలు. అంటే, 1946 లో కంటె 1947 లో నూటికి 4.7 వంతులు ఎక్కువ భూమిలో వరిపంట వెయ్యడిందన్నమాట,

1947 పంటవల్ల 41,25,000 టన్నుల బియ్యం లభిస్తాయని అంచనా. 1946 లో 41,90,000 టన్నుల బియ్యం పండాయి. 1947 పంట తక్కువ అంచనా వెయ్యడానికి కారణం, ఆ సంవత్సరంలో

చాలా ఆకాలవర్షములు. పంటకు పురుగుపట్టడం మొదలైన యీతి బాధలు.

మదరాసు రాష్ట్రంలో ఆహార ధాన్యాల విషయంలో, తమకు సరిపోగా ఎగుమతికికూడా పంటపండే జిల్లాలు ఆరు. అవి: తూర్పు గోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, తంజావూరు. మిగతావన్నీ లోటు జిల్లాలక్రిందనే లెఖ. గత రెండుసంవత్సరాలలోను, యీ జిల్లాలలో ఎంత బియ్యం, ప్రభుత్వ సేకరణకు లభించినదీ యీ క్రింది అంకెలవల్ల తెలుస్తుంది.

| జిల్లా | 1945-46 | 1946-47 |
|---|---|---|
| తూర్పు గోదావరి | 100,992 | 91,741 |
| పశ్చిమ గోదావరి | 172.601 | 207,875 |
| కృష్ణ | 180,150 | 152,975 |
| గుంటూరు | 77,465 | 52,085 |
| నెల్లూరు | 57,597 | 51,693 |
| తంజావూరు | 282,253 | 282,469 |

మదరాసు రాష్ట్రంలో 1946 - 47 లో 49,19,452 టన్నుల ఆహారధాన్యాలూ, 1947 - 48 లో 43,00,000 టన్నుల ఆహార ధాన్యాలూ పండినవి. ఇది చాలక 1946 - 47 లో 1,41,000 టన్నులూ, 1947 - 48 లో 2,60,569 టన్నులూ ఆహార ధాన్యాలు దిగుమతి చేయబడినవి.

1948 - 49 లో 42,96,000 టన్నుల ధాన్యం పండుతుందని అంచనా.

మామూలుగా ఈరాష్ట్రంలో ఏడాదికి దాదాపు 50,80,000 టన్నుల బియ్యం పంట లభించేది. రాష్ట్రంలోని ప్రజల అవసరాలకు ఈ బియ్యం చాలేదికాదు. అందుచేత, 2,79,000 టన్నుల బియ్యం ఇతర రాష్ట్రాలనుంచి దిగుమతిచేసుకోవడం జరిగేది. యుద్ధానికి పూర్వం, ఈ దిగుమతి ప్రధానంగా బర్మానుంచి జరిగేది. కాని, యుద్ధకాలంలో బర్మా నుంచి దిగుమతులు ఆగిపోయాయి. అందుచేత, భారతదేశానికి ఇతర దేశాల నుంచి బియ్యం దిగుమతి చేసుకోవడం జరిగింది.

1945 నవంబరు 1 నుంచి 1946 అక్టోబరు 31 నాటికి, ఒక ఏడాదిలో, ఇతర రాష్ట్రాలనుంచి 1,72,929 టన్నులు, విదేశాలనుంచి 1,32,278 టన్నులు బియ్యం, మదరాసు రాష్ట్రంలోకి దిగుమతి చేయబడినవి. 1946 నవంబరు 1 నుంచి 1947 ఆగస్టు 21 లోగా ఇతర రాష్ట్రాలనుంచి 1,14,805 టన్నులు; విదేశాలనుంచి 51,055 టన్నులు దిగుమతి చేయబడినవి.

ఆహార ధాన్యాల పంటను ఎక్కువ చెయ్యడానికి రైతులకు సహాయపడే వుద్దేశంతో ప్రభుత్వం, వ్యవసాయశాఖ ద్వారా రైతులకు అందజేసిన ఎరువు వివరాలు :

1945 - 46 : ప్రభుత్వం సేకరించిన రసాయనిక ఎరువు, 13,727 టన్నులు (విలువ. రు. 37,05,415) రైతులకు అందజేసినది 17.032 టన్నులు. దీని విలువ రు. 46,32,913. ఇదే సంవత్సరంలో ప్రభుత్వం సేకరించిన వేరుశెనగ తెలగపిండి ఎరువు 73,566 టన్నులు. (విలువ. రు. 70,05,415). రైతులకు అందజేసినది, 113,285 టన్నులు. (విలువ, రు. 1,31,07,000).

1946 - 47 లో ప్రభుత్వం సేకరించిన రసాయనిక ఎరువు, 23,189 టన్నులు (విలువ, రు. 58,03,135) రైతులకు అందజేసినది, 26.826 టన్నులు (విలువ. రు. 66,90,686). ఇదే సంవత్సరంలో ప్రభుత్వం సేకరించిన వేరుశెనగ తెలగపిండి ఎరువు, 235,156 టన్నులు (విలువ, రు. 2,25,74,976) రైతులకు పంచినది, 24,313 టన్నులు. (విలువ, రు. 80,00,000).

### మదరాసు రాష్ట్రంలోని పంచదార ఫాక్టరీలు

| | |
|---|---|
| 1931—32 | 2 |
| 1941—42 | 11 |
| 1942—43 | 10 |
| 1943—44 | 12 |
| 1944—45 | 11 |
| 1945—46 | 11 |

రాష్ట్రంలో ఇంకా నాలుగు ఫాక్టరీలు స్థాపించడానికి కేంద్ర ప్రభుత్వం అనుమతి పొందవలసి ఉందని, రాష్ట్ర పరిశ్రమశాఖా మంత్రి 1949 మార్చి 6 తేదీన వెల్లడి చేశారు.

ఈ మిల్లులు ఉన్నస్థలం: అనకాపల్లి, ఏటికొప్పాక, బొబ్బిలి, సీతానగరం, (విశాఖపట్టణం జిల్లా). వుయ్యూరు (కృష్ణాజిల్లా); కిర్లంపూడి, సామర్లకోట (తూర్పుగోదావరిజిల్లా); నెల్లికుప్పం (దక్షిణార్కాడు జిల్లా;) హాస్పేట (బళ్ళారిజిల్లా); పొదనూరు (కోయంబత్తూరుజిల్లా); తాచనల్లూరు (తిరునెల్వేలి జిల్లా).

# భూమిపన్ను: ప్రభుత్వాదాయం

మదరాసు రాష్ట్రప్రభుత్వానికి వచ్చే భూమిపన్ను మూడువిధాలు: ఒకటి, జమీందారులు చెల్లించే పేష్కష్; రెండు శ్రోత్రియం, ఇనాం భూముల యజమానులు చెల్లించే నీటితీరువపన్ను; మూడు, రైతువారి గ్రామాలలో వ్యవసాయదారులు చెల్లించే భూమిశిస్తు, నీటితీరువపన్ను.

1946-47 లో జమీందారులు చెల్లించవలసిన పేష్కష్, రు. 47,49,747.

ఇదే సంవత్సరంలో రైతువారీ భూములపన్ను, నీటితీరువల ఆదాయం మొత్తం. రు. 10,41,98,287.

# నీటితీరువ సదుపాయాలు

మదరాసు రాష్ట్రంలోని వ్యవసాయ యోగ్యమైన భూమి నాలుగు కోట్ల ఎకరాలపైబడివుంటే, దీనిలో మూడుకోట్ల 64 లక్షల ఎకరాల భూమిలోనే, 1946-47 లో వ్యవసాయం జరిగింది. దీనిలో మెట్టభూమి 2,23,54,088 ఎకరాలు; మాగాణి, 86,92,215 ఎకరాలు.

మాగాణి భూమిలో చెరువులమీదనూ, బావులమీదనూ ఆధార పడిన భూమికాక, నదుల నీటిని కాలువలద్వారా పొలాలకు తీరువ కట్టడంవల్ల, 1946-47 లో మొదటి పంట 39,06,561 ఎకరాలలోను, రెండవపంట 7,80,554 ఎకరాలలోను పండింది. నీటి తీరువనుపొందిన భూములలో పండినపంట విలువ, రు. 62 89,66,630 అని అంచనా.

మదరాసు రాజధానిలో పంటభూములకు అత్యధికంగా నీటితీరువ జరిగే ప్రాంతాలు కృష్ణా, గోదావరి డెల్టాలలోనూ, కావేరి డెల్టాలలోనే. 1946-47 లో నదుల కాలువలవల్లనూ, ఆ ప్రాంతాలలో బావులవల్లనూ, ఏఏ ప్రాంతాలలో ఎంతెంత భూమికి నీటి తీరువకట్టినదీ, ముఖ్యమైన ప్రాంతాలను గురించిన వివరాలివి. నీటి తీరువపొందిన ప్రాంతపు వైశాల్యం ఎకరాలలో ఇవ్వబడింది. ఇక్కడ ఇచ్చిన వివరాలు ఆయా ప్రాంతాలలో పండిన రెండు పంటలూ ఎంత భూమిలో పండినదీ సూచిస్తాయి.

| కాలువలు | పంటపండిన భూమి |
|---|---|
| గోదావరి డెల్టా | 12,40,642 |
| కావేరి డెల్టా | 10,62,266 |
| కృష్ణా డెల్టా | 10,05,903 |
| కావేరి - మెట్టూరు ప్రాజెక్టు | 2,42,149 |
| పెన్నా నది | 2.04,645 |
| పెరియార్ నది | 2,09.845 |
| తాడేపల్లి కాలువ | 25,439 |
| కృష్ణ తూర్పు కాలువ | 96,808 |
| కర్నూలు - కడప కాలువ | 83,002 |
| చికాకోల్ కాలువ | 88,235 |
| పాలార్ ఆనకట్ట | 1,21,391 |
| నాగావళి నది | 28,631 |

మదరాసు రాష్ట్రంలో, ప్రజలకూ, పంటలకూకూడా ప్రధాన జీవనదులు, గోదావరి, కృష్ణ, కావేరి, పెన్న; ఈ నదులవల్ల ఎంత భూమికి నీటి సరఫరా అయేదీ, వాటి పుట్టుక, ప్రవాహం. వివరాలు ప్రక్క పేజీలో చూడండి.

గోదావరి : అరేబియన్ సముద్రానికి 50 మైళ్ళ దూరాన, పశ్చిమ కనుమలలోపుట్టి తూర్పుకు ప్రవహించి, బంగాళాఖాతంలో పడుతున్నది. ఈ మహానది పొడవు 900 మైళ్ళు. మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, అనేవి యీ నదికి ఉపనదులు. ఈ మహానదిలోనికి సుమారు 1,15,000 చదరపుమైళ్ళ ప్రాంతంలోనుంచీ, వాగులలోనుంచీ నీరు కలుస్తుంది. ఈ మహానది కాలువలవల్ల, 12 లక్షల ఎకరాలపైగా భూమికి వ్యవసాయానికి నీరు లభిస్తున్నది. ఈ నది నీటి తీరువపొందే ప్రాంతంలో పండేపంట విలువ ఏడాదికి దాదాపు 13 కోట్ల రూపాయలు వుంటుంది. ఈ నది నీటిని వ్యవసాయానికి అందజెయ్యడానికి కాలువలూ, ఆనకట్టలూ కట్టడానికి మొత్తం, 209 లక్షల రూపాయలు అయింది. ఈ పెట్టుబడిమీద, ఏడాదికి నూటికి 12 వంతుల చొప్పున. పన్నుల రూపంగా తిరిగివస్తున్నది. ఈ నదికి ఆనకట్ట, రాజమండ్రికి దిగువను ధవళేశ్వరంవద్ద కట్టారు.

కృష్ణ : ఆంధ్రదేశాన్ని సస్యశ్యామలం చేస్తున్న మహానదులలో రెండవది కృష్ణ. ఈ నదికూడా పశ్చిమకనుమలలోనే పుట్టి బంగాళా ఖాతంలో పడుతున్నది. భీమనది, తుంగభద్ర. మూసీనదులు దీనికి ఉప నదులు. సుమారు. 97,000 చదరపు మైళ్ళ ప్రాంతంనుంచి వాననీరు వాగులు దీనిలో కలుస్తాయి. గోదావరికి ఆనకట్టకట్టిన సర్ ఆర్థర్ కాటన్ గారే, కృష్ణకుకూడా బెజవాడవద్ద ఆనకట్ట కట్టించారు. ఈ నది కాలువలవల్ల సుమారు 9,30,000 ఎకరాల భూమికి నీటి సరఫరా అవుతున్నది. ఈభూమిలో పండే పంటల విలువ ఏడాదికి దాదాపు 12 కోట్ల రూపాయలు. ఈ నదికి కాలువలు, ఆనకట్ట కట్టడానికి 227 లక్షల రూపాయలు ఖర్చయింది. ఈ పెట్టుబడిమీద ప్రస్తుతం ఏడాదికి నూటికి 16 వంతుల చొప్పున, పన్నులరూపంగా ఆదాయం వస్తున్నది.

కావేరి : దక్షిణదేశానికి జీవనది అయిన కావేరి జన్మస్థానం కూర్గు. అక్కడనుంచి మైసూరు రాష్ట్రంగుండాగా, తంజావూరు జిల్లా

గుండానూ ప్రవహించి అనేక శాఖలుగా చీలి, బంగాళాఖాతంలో పడుతున్నది. ఈ నది పొడవు దాదాపు 500 మైళ్ళు. సుమారు 31,000 చదరపు మైళ్ళ ప్రాంతంనుంచి, వరదనీరు యీ నదిలో కలుస్తుంది. ఈ నదికి మైసూరువద్ద కృష్ణరాజసాగరం, సేలంవద్ద స్టాన్లీ డాం అనే రిజర్వాయర్లు రెండు వున్నాయి. శివసముద్రంవద్ద, యీ నదీ పాతంవల్ల ఉద్భవించే శక్తిని ఉపయోగించీ, మేటూరువద్ద స్టాన్లీ డాం లో నిలవ చేసిన నీటి శక్తిని ఉపయోగించీ, దక్షిణదేశంలో విశేషప్రాంతానికి విద్యుచ్ఛక్తి సప్లయి చేస్తున్నారు. ఈ నది శ్రీరంగంవద్ద, రెండుగా చీలుతున్నది. ఈ రెండు పాయలకు మధ్యవున్న దీవిని శ్రీరంగద్వీపం అంటారు. ఇక్కడి చీలికలలో దక్షిణపుపాయను కావేరిఅనే పిలుస్తారు. ఉత్తరపుపాయను కొలెరూన్ అంటారు. కావేరి నీటి తీరువవల్ల దాదాపు 8,70,000 ఎకరాల భూమి సాగుఅవుతుంది. ఈ భూమిలో పండే పంటల విలువ ఏడాదికి దాదాపు 982 లక్షల రూపాయలు.

**పెన్న:** పెన్నానది (పినాకిని) నెల్లూరుజిల్లాలో ప్రవహిస్తున్నది. దీనికి సంగంవద్ద ఒక ఆనకట్ట, నెల్లూరువద్ద మరొక ఆనకట్ట వున్నాయి. ఈ నదివల్ల 1,46,600 ఎకరాల భూమికి నీటి తీరువ లభిస్తున్నది.

పంటలను అభివృద్ధి చెయ్యడానికి, పొలాలకు బావుల నీటివసతిని కలిగించడానికి ప్రభుత్వంవారు, కొత్త బావులను త్రవ్వినందుకూ, పాత బావులను బాగుచేయించినందుకూ రైతులకు ధనసహాయం చేయడం, గత నాలుగు సంవత్సరాలనుంచీ సాగించారు. 1944 నుంచి, నాలుగేళ్ళలో రాష్ట్రంలో 47,846 కొత్తబావులు త్రవ్వబడినవి; 25,618 పాతబావులు బాగుచేయబడినవి. కొత్తవాటిని త్రవ్వినందుకు రు. 3,87,96,354 లు, పాతవాటిని బాగుచేసినందుకు రు. 48,70,492 లు, 1948 ఆగస్టుతో అంతమయే నాలుగేళ్ళలోనూ ప్రభుత్వంవారు రైతులకు సహాయంచేశారు. మొదటి మూడు సంవత్సరాలలోను అయిన ఖర్చులో, నూటికి 20 వంతులు, తరువాత నూటికి 50 వంతులు కేంద్ర ప్రభుత్వంవారు యిచ్చారు.

# రామపాదసాగర నిర్మాణము

మద్రాసు ప్రభుత్వ స్పెషల్ ఇంజనీరు ఎల్. గోవిందరాజ అయ్యంగార్ 1947 అక్టోబరు, 17 తేదీన బాంక్వెటింగ్ హాలులో ప్రత్యేకము ఏర్పాటుచేయబడిన సభలో రామపాదసాగర నిర్మాణమునుగురించి ఈ క్రింద వివరాలు తెలియచేశారు.

ఆధునిక నిర్మాణములలో బోల్డరు డాము విశేషమైనది. దాని ఎత్తు 726 అడుగులు; నిడివి 1,282. రిజర్వాయరులో రామపాదసాగరమునందున్న నీటికి రెట్టింపు నీరు ఉండును. రామపాదసాగరం ప్రాజెక్టు ఎత్తు 400 అడుగులు. బాగా లోతు పునాదిరాయినుంచి 428 అడుగులు. రాజమహేంద్రవరమునకు 20 మైళ్ళ దూరమున పోలవరమువద్ద ఇది కట్టబడును. ఇక్కడ గోదావరిలో మహానందీశ్వరకొండ ఉన్నది. దానిపై శివ, విష్ణ్వాలయములు ఉన్నవి. ఆ కొండకు అటూ ఇటూ ఆనకట్ట కట్టవలసి ఉన్నది. ఆ దేవాలయములు పైకి ఎత్తి కట్టబడును. గోదావరికి ఎడమవైపున విశాఖపట్టణం నౌకాశ్రయంవరకూ 131 మైళ్ళ పొడవునూ, కుడివైపున కృష్ణానదివరకూ 110 మైళ్ళు పొడవునూ, కృష్ణ దాటి గుంటూరుమండలమున 105 మైళ్ళ దూరము కాల్వలు త్రవ్వబడును. ఉభయ గోదావరులు, విశాఖ, కృష్ణ, గుంటూరుమండలములందు 23 లక్షల ఎకరములు ఇందువల్ల సాగగును.

ఈ ప్రదేశములలో 90 లక్షల ఎకరములలో మొదటి పంట. 4 లక్షల ఎకరములలో రెండవ పంట రాగలదు. గోదావరి డెల్టాలో మూడులక్షల రెండువేల ఎకరములు కృష్ణ డెల్టాలో 64 లక్షల ఎకరములు రెండవ పంట నిచ్చును. కొల్లేరు సరస్సుప్రాంతములో 60 వేల ఎకరములు. మొత్తము 23 లక్షల ఎకరములపై పంటవచ్చును. దీనికి 1945 అంచనాలప్రకారము 86 కోట్ల రూపాయలు వెచ్చింపవలెను. దీనిమీద ఏడాదికి 242 లక్షల రూపాయల ఆదాయం వస్తుంది.

డాముక్రింద కుడివైపున విద్యుచ్ఛక్తి ఉత్పత్తి స్థానము ఉండును. లక్ష మొదలు లక్షన్నరవరకూ కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని, ఆరుమాసములు దీనికితోడు 20 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చెయ్యవచ్చును. లాకులుకట్టి అటు సెంట్రల్ ప్రావిన్సెసు, బస్తరువరకును, ఇటు హైద్రాబాదు, విశాఖపట్టణం మద్రాసులవరకు నావల రవాణా సౌకర్యములను కలిగించవచ్చును.

పోలవరమునకు పైన రెండుమైళ్ళ దూరమున ఆనకట్ట కట్టుదురు. రిజర్వాయరునీరు భద్రాచలం దుమ్ముగూడెములవరకు వ్యాపించును. భద్రాచలస్వామి రామపాదములకు 8, 10 అడుగుల దిగువవరకూ నీరు వచ్చును. ఆనకట్ట ఎత్తు పెంచినచో రామపాదములవరకు గూడా నీరు రాగలదు. గోదావరి ప్రవాహములో సాలీనా 800 లక్షల ఘ. అ. నీరు ప్రవహించుచున్నది. ప్రస్తుతం 100 కి ఆరువంతులైనా నీరు ఉపయోగపడుటలేదు. ఆనకట్ట కట్టినచో 15 మొదలు 20 వంతులు వరకూ యీ నీటిని ఉపయోగించుకొనవచ్చును. సాలీనా 25 కోట్ల ఆదాయము ఈ ప్రాజెక్టువల్ల లభించును.

సలహా ఇంజనీర్ల బోర్డువారు ఆనకట్ట నిర్మాణము సాధ్యమని తీర్మానించిరి. సాధారణమైన నదీగర్భమును, ప్రవాహము, పునాది, ఖననము మున్నగు సమస్యలున్నను, నిస్సందేహముగా ఆనకట్టను నిర్మించవచ్చునని వారు అభిప్రాయపడిరి.

రిజర్వాయరు నీరు 587 చ. మైళ్ళు వ్యాపించును. దానిలో హైద్రాబాదులో 181 చ. మైళ్ళు, బస్తరు సంస్థానమున 16 చ. మైళ్ళు జయపూరునందు 11 చ. మైళ్ళు, చెన్నరాష్ట్రమునందు 381 చ. మైళ్లు. ప్రభుత్వమువారు ప్రాజెక్టును మంజూరు చెయ్యదలచినట్లయితే 1948 చివరగాని 1949 ప్రారంభమునగాని పని ప్రారంభించులోపున ప్లాంటు యంత్రములు, నిర్మాణ పరికరములు సమీకరించుకొనవలెను. కార్మికులకు,

అధికారులకు క్యాంపులు, భవనములు వెయ్యవలెను. కొవ్వూరునుంచి పరికరములు అందజేయుటకు రైలుమార్గము వెయ్యవలెను. 100 మొదలు 150 వరకు పంపులు 5 ఏళ్ళు పనిచెయ్యవలెను. నదిపై అచ్చుట వంతెనలు కట్టుకొనవలెను. 500 టన్నుల ఉత్పత్తిచెయ్యగల సిమెంటు ఫ్యాక్టరీని కట్టవలెను. కొవ్వూరు దగ్గరగాని, బెజవాడ దగ్గరగాని సిమెంటు ఫ్యాక్టరీ కట్టుకొనవచ్చును. స్టీము లాంచీలు తెప్పించవలెను. అమెరికా, ఇంగ్లండునుంచి పంపులు తెప్పించవలెను.

1949 మార్చిలో కేంద్ర శాసనసభలో ఒక ప్రశ్నకు జవాబు చెపుతూ, మంత్రి ఎన్. వి. గాడ్గిల్ గారు చెప్పిన దానినిబట్టి, రామపాద సాగర్ నిర్మాణానికి 130 కోట్ల రూపాయలు అవుతుందని. 19 సంవత్సరాలకాలం పడుతుందని, అంచేత, యింతకన్న తక్కువఖర్చులో, తక్కువకాలంలో నిర్మాణంపూర్తిఅయే ఇతర ప్రాజెక్టులను ప్రభుత్వంవారు పూర్తిచేస్తారనీ తేలింది.

# రాష్ట్ర ప్రభుత్వ ఆదాయవ్యయాలు

మదరాసు రాష్ట్ర ప్రభుత్వానికి 1944-45 లో 41,23,72,993 రూపాయలూ, 1945-46 లో 47,98,89,000 రూపాయలూ 1946-47 లో 56,99,53,000 రూపాయలూ, 1947-48 లో 50,71,10,000 రూపాయలూ ఆదాయంవచ్చింది. 1948-49 లో 53,38,37,000 రూపాయలూ, 1949-50 లో 51,75,32,000 రూపాయలూ ఆదాయం వస్తుందని అంచనా వేయబడింది.

1944-45 లో 41,23,17,839 రూపాయలూ, 1945-46 లో 47,98,74,000 రూపాయలూ, 1946-47 లో 56,98,89,000 రూపాయలూ 1947-48 లో 55,83,64,000 రూపాయలూ ఖర్చుఅయింది. 1948-49లో57,04,08,000 రూపాయలూ1949-50లో 55,66,09,000 రూపాయలూ ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది.

# విద్య

1949 మార్చి 1 తేది నాటికి మదరాసు రాష్ట్రంలో 36,575 ప్రైమరీ స్కూళ్ళు, 212 మిడిల్ స్కూళ్ళు, 763 హైస్కూళ్ళు వున్నాయి.

ప్రైమరీ స్కూళ్ళలో చదువుతున్నవారి సంఖ్య : 36,50,748 ; మిడిల్ స్కూళ్ళలో చదువుతున్నవారి సంఖ్య, 42,946 ; హైస్కూళ్లలో చదువుతున్నవారి సంఖ్య, 4,34,307.

గత అయిదు సంవత్సరాలలోను ఎలిమెంటరీ స్కూళ్ళ సంఖ్య, దానిలో దానిలో చదివిన బాలుర సంఖ్య ఎలా పెరిగిందీ యీ క్రింది పట్టీవలన తెలుస్తుంది.

| సంవత్సరం | స్కూళ్ళు | చదివినవారు |
|---|---|---|
| 1944-45 | 36,035 | 30,27,458 |
| 1945-46 | 35.929 | 32,44,261 |
| 1946-47 | 36.148 | 34,56,085 |
| 1947-48 | 36,393 | 36,95,217 |
| 1948-49 | 36,668 | 38,20,000 |

ఇలాగే, గత అయిదు సంవత్సరాలలోను రాష్ట్రంలోని సెకండరీ స్కూళ్ళ వివరాలు ఇవి :

| సంవత్సరం | స్కూళ్ళు | చదివినవారు |
|---|---|---|
| 1914-45 | 840 | 3,59,092 |
| 1945-46 | 855 | 4,04,938 |
| 1946-47 | 901 | 4,41,425 |
| 1947-48 | 971 | 4,76,749 |
| 1948-49 | 1,041 | 4,93,729 |

1948 లో ఎలిమెంటరీస్కూళ్ళకు రు. 5,87,60,800, సెకండరీ స్కూళ్ళకు రు. 91,42,800, కాలేజీలకు రు. 75,66,100, అంటే మొత్తం రాష్ట్రంలో విద్యాబోధనకు ప్రభుత్వం పెట్టినఖర్చు, రు. 7,54,69,700.

1949-50 లో విద్యాబోధనకు 10,70,73,900 రూపాయలు ఖర్చుపెట్టడానికి ప్రభుత్వం నిశ్చయించారు.

1948-49 లో రాష్ట్రప్రభుత్వంవారు యూనివర్శిటీ విద్యాబోధనకు 180 లక్షల రూపాయలూ, హైస్కూళ్ళలో విద్యాబోధనకు 87½ లక్షల రూపాయలూ, ప్రాథమిక విద్యాబోధనకు 537 లక్షల రూపాయలూ ఖర్చుపెడుతున్నట్టు, విద్యాశాఖామంత్రి 1948 డిసెంబరు 23 న చెప్పారు.

మదరాసు రాష్ట్రంలో మూడు విశ్వకళా పరిషత్తులు వున్నాయి. అవి: మదరాసు, ఆంధ్ర, అన్నామలై. మదరాసు విశ్వకళా పరిషత్తు 1857 లో, 47 గురు విద్యార్థులతో స్థాపించబడింది, 1948 లో, ఈ కళా పరిషత్తు అధ్వర్యాన చదువుతున్నవారి సంఖ్య, 38,000. ఆంధ్ర ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 1926 లో స్థాపించబడింది. 1948 లో, దీని అధ్వర్యాన చదువుతున్న వారిసంఖ్య, 10,112. అన్నామలై విశ్వకళా పరిత్తు 1929 లో స్థాపించబడింది. 1948 లో దీని అధ్వర్యాన చదువుతున్న వారి సంఖ్య, 1,817.

మదరాసు, అన్నామలై, ఆంధ్రవిశ్వకళాపరిషత్తుల అధ్వర్యాన మొత్తం 87 కాలేజీలు రాష్ట్రంలో వున్నాయి. వీనిలో ఇంజనీరింగ్ కాలేజీలు, 5; టెక్నోలాజికల్ ఇన్స్టిట్యూట్, 1: మెడికల్ కాలేజీలు, 4; వ్యవసాయ కాలేజీలు, 2; పశువైద్యకాలేజి, 1; లాకాలేజీలు, 2; టీచర్లట్రెయినింగ్ కాలేజీలు, 5; మిగతావి, ఆర్ట్సు, సైన్సు కాలేజీలు.

రాష్ట్రంలోని వివిధ కాలేజీలలో చదువుతున్న వారిసంఖ్య 1942-43 నుంచి 1948-49 లోగా ఏడేళ్లలోనూ రెండురెట్లకుపైగా పెరిగింది. ఆవివరాలు ఇవి:

1942-43, 17,039; 1943-44, 19,950; 1944-45, 26,097; 1945-46, 29,292; 1946-47, 31,943; 1947-48, 35,974; 1948-49, 39,658.

1946-47 లో రాష్ట్రంలోని సెకండరీస్కూళ్లలో మొత్తం 15,471 మంది ఉపాధ్యాయులు వున్నారు. వారిలో 13,246 మంది ట్రెయినింగు పొందినవారు.

ఎలిమెంటరీ స్కూళ్లలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న వారి సంఖ్య: 97,866. వీరిలో ట్రెయినింగు పొందినవారు, 90,527.

1948 మార్చిలో జరిగిన స్కూలుఫైనలు పరీక్షకు, మొత్తం 56,300 మంది విద్యార్థులు రిజిస్టరు చేసుకున్నారు. వీరిలో మదరాసు విశ్వకళాపరిషత్తు అధ్వర్యాన, 41,570; ఆంధ్ర, 14,730. ఈ మొత్తం విద్యార్థులలో బాలికలు, 5,015 మంది. వీరిలో మదరాసు విశ్వకళా పరిషత్తు ప్రాంతంనుంచి, 4,233; ఆంధ్ర, 777.

రిజిస్టరు చేసుకున్న విద్యార్థులలో, పరీక్షకు కూచున్నవారి సంఖ్య, రాష్ట్రమంతటికీ 54,133. వీరిలో మదరాసు విశ్వకళాపరిషత్తు ప్రాంతం నుంచి, 40,000; ఆంధ్ర, 14,133 పరీక్షలు మొత్తం 517 కేంద్రాలలో జరిగాయి.

ఈ పరీక్షకు కూచున్నవారిలో, కాలేజలలో చదువుకు అనుగుణ్యమైన విషయాలలో పరీక్షకు కూచున్న వారిసంఖ్య, రాష్ట్రమంతటికీ 51,385; మదరాసు విశ్వకళాపరిషత్తు ప్రాంతంనుంచి, 37,811; ఆంధ్ర, 13,374. కాలేజీలలో చదువుకు అర్హతపొంది, పరీక్ష ప్యాసయిన వారి సంఖ్య: రాష్ట్రమంతటికీ, 26,116; వీరిలో మదరాసు విశ్వకళాపరిషత్తు ప్రాంతంనుంచి, 18,785; ఆంధ్ర, 7,331.

ఆంధ్ర యూనివర్శిటీ జిల్లాలలో, గత అయిదు సంవత్సరాలలో స్కూలుఫైనలు, ఇంటర్మీడియేట్ పరీక్షలకు ఎంతమంది విద్యార్థులు హాజరైనదీ, ఎంతమంది ప్యాసయినదీ, యీ క్రింది అంకెలవల్ల తెలుసుకో వచ్చును.

## స్కూలు ఫైనలు

| సంవత్సరం | పరీక్షకు కూచున్నవారు | ప్యాసయినవారు |
|---|---|---|
| 1944 | 8,777 | 3,500 |
| 1945 | 8,603 | 3,836 |
| 1946 | 8,771 | 3,903 |
| 1947 | 11,103 | 5,034 |
| 1948 | 14,133 | 7,831 |

## ఇంటర్మీడియేట్

| సంవత్సరం | పరీక్షకు కూచున్నవారు | ప్యాసయినవారు |
|---|---|---|
| 1943 | 3,581 | 1,328 |
| 1944 | 3,969 | 1,360 |
| 1945 | 4,519 | 1,573 |
| 1946 | 5,096 | 1,792 |
| 1947 | 5,731 | 1,883 |

రాష్ట్రంలోని ఎలిమెంటరీస్కూళ్ళలో ఉపాధ్యాయులుగా పని చేస్తున్న వారిసంఖ్య:

1941—19,470: 1946-47—25,353.

ప్రస్తుతం అనంతపురం, బళ్ళారి, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలు, ఆంధ్ర యూనివర్శిటీలో చేరకుండా, మదరాసు యూనివర్శిటీలోనే వున్నాయి.

## మెడికల్ కాలేజీలు

మనరాష్ట్రంలో ప్రస్తుతం అయిదు మెడికల్ కాలేజీలు వున్నాయి. అవి: మదరాసు మెడికల్ కాలేజి, స్టాన్లీ మెడికల్ కాలేజి (మదరాసు), ఆంధ్ర మెడికల్ కాలేజి (విశాఖపట్టణం), గుంటూరు మెడికల్ కాలేజి, మధుర మెడికల్ కాలేజి.

## వ్యవసాయశాఖ కాలేజీలు

మనరాష్ట్రంలో ప్రస్తుతం రెండు వ్యవసాయకళాశాలలు వున్నాయి. ఒకటి కోయంబత్తూరులోను, ఒకటి బాపట్లలోను వుంది. ఒక్కొక్క కాలేజీలో 96 సీట్లు వున్నాయి. మొత్తం 192 సీట్లకూ, 1947-48 లో 182 సీట్లు ఈ రాష్ట్రంలోని విద్యార్థులకు ప్రత్యేకించబడినవి. మిగతా పది సీట్లలోనూ, అయిదు, ఒరిస్సానుంచి వచ్చిన విద్యార్థులకూ, మూడు పశ్చిమబెంగాల్ నుంచి, రెండు కూర్గ్‌నుంచీ వచ్చినవారికీ ఇవ్వబడినవి.

ఈ రాష్ట్రానికి చెందిన 182 మంది విద్యార్థులలోనూ, బ్రాహ్మణేతరులు 110, బ్రాహ్మణులు 41, ముస్లిములు 8, క్రైస్తవులు 10 మంది వున్నారు.

## పశువైద్యకళాశాల

పశువైద్యకళాశాల మనరాష్ట్రంలో ఒకటీవుంది. దానిలో ఏడాదికి 100 మంది విద్యార్థులను చేర్చుకోవడానికి వీలువుంది.

1946 లో మచిలీపట్టణంలో ఒక లాకాలేజ, 1945-46 లో కాకినాడలో ఒక ఇంజనీరింగ్ కాలేజి స్థాపింపబడినవి.

1948 లో మదరాసురాష్ట్రంలోని మెడికల్ కాలేజిలకును, ఇంజనీరింగు కాలేజిలకును విద్యార్థులను చేర్చుకోవడంలో, గవర్నమెంటు ఉద్యోగాలను యివ్వడంలో కులాలవారిగా ఏ నిష్పత్తి అవలంబించబడుతున్నదో, అదే నిష్పత్తి అవలంబించబడినది. ఆ నిష్పత్తి ఏమిటంటే: బ్రాహ్మణేతరహిందువులు, 6; బ్రాహ్మణులు, 2; హరిజనులు, 2; భారతీయక్రైస్తవులు, 1; ముస్లిము, 1; హిందూ నిమ్నజాతులు, 2.

## విజ్ఞానవ్యాప్తికి ప్రభుత్వం తోడ్పాటు

మదరాసు ప్రభుత్వంవారు ప్రాంతీయభాషలను అభివృద్ధి పరచడానికి, వాటి గౌరవహోదాలను విస్తృతపరచడానికి నిశ్చయించి ఆంధ్ర, తమిళ, మళయాళ, కన్నడ, సంస్కృతభాషలలో ఆస్థాన కవులను నియమించడానికి తీర్మానించుకొన్నారు. ఈ ఐదుభాషలనుంచీ ఐదుగురు ఆస్థానకవులు నియమించబడుతారు. వీరి ఉద్యోగకాలపరిమితి అయిదు సంవత్సరాలు. తరుపరి ప్రభుత్వం యిందు నిమిత్తం ఏర్పాటుచేసే కమిటీలద్వారా ప్రతి ఐదుసంవత్సరముల కొకసారి యీ ఆస్థానకవులు నియమించబడుతూ వుంటారు. ఈ ఆస్థాన కవులకు ఏడాదికి వెయ్యి రూపాయలు గౌరవవేతనం ఇవ్వబడుతుంది. 1949 లో యీ క్రిందివారు ఆస్థాన కవులుగా నియమించబడినారు.

తెలుగు: శతావధాని, కళాప్రపూర్ణ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

తమిళం: విద్వాన్ నామక్కల్ రామలింగంపిళ్లె

మళయాళం: మహాకవి వల్లతోల్ నారాయణ మీనన్

కన్నడం: ఎం. నారాయణ పాయ్

సంస్కృతం: మహామహోపాధ్యాయ కె. ఎస్. కృష్ణమూర్తిశాస్త్రి

ఇంతేగాక ప్రాంతీయభాషలలో వివిధ సమస్యలను గూర్చిన వాఙ్మయాన్ని అభివృద్ధిచేయడానికి మరొక విధానాన్ని ప్రభుత్వం తయారుచేసింది. వివిధ విషయాలమీద వ్రాయబడ్డ, ప్రకటించబడ్డ గ్రంథాలకు యేటేట బహుమానాలిస్తారు. తెలుగు, అరవభాషల గ్రంథాలకు రు. 500 ల చొప్పున, మళయాళ, కన్నడ భాషలలో వ్రాయబడే వాటికి రు 250 ల చొప్పున బహుమానాలుంటాయి. ప్రస్తుతం దిగువ

విషయాలను గూర్చిన గ్రంథములకు బహుమతు లివ్వడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

(1) పాటలు, పద్యాలు (2) గద్యరచన (కళ, యాత్ర) (3) చిన్నకథ (4) నవల, నాటకము (5) పరిశోధన (భాష, చరిత్ర, పురాణవాఙ్మయం) (6) భౌతిక, రసాయనశాస్త్రాలు (7) ప్రకృతి శాస్త్రం, వ్యవసాయం (8) చరిత్ర, ఆర్థిక - రాజకీయ, సాంఘిక శాస్త్రాలు (9) గణిత, భూగోళశాస్త్రాలు, ఇంజనీరింగు (10) బాలవాఙ్మయం (11) విద్యాపద్ధతులు, వేదాంత మానసిక తత్వశాస్త్రాలు (12) ఔషధ, పారిశుద్ధ్యశాస్త్రాలు.

ఈ విషయాలన్నిటిలోనూ వెలువడిన పుస్తకాలు అంతగా లేనందున ఏడాదికి ఆరు బహుమతులు మాత్రమే యిచ్చుటకు ఉద్దేశింపబడినది.

## లైబ్రరీలు

మదరాసు రాష్ట్రంలో 1945-46 లో 1563 లైబ్రరీలు, 1946-47 లో 1544 లైబ్రరీలు ఉన్నాయి. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోను లైబ్రరీలను స్థాపించడానికి, రాష్ట్రంలో ఒక కేంద్ర లైబ్రరీని స్థాపించడానికి ప్రభుత్వంవారు ఉద్దేశించారు. ప్రభుత్వంవారి యీ ఉద్దేశాన్ని ఆచరణలోకి తీసుకొని రావడానికి, విద్యాశాఖామంత్రి 1948 ఫిబ్రవరి 21 న ఒక బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టారు. ఈ బిల్లు 1949 ఫిబ్రవరిలో శాసనమైంది. దీనిప్రకారం అచ్చువేసిన ప్రతి పుస్తకాన్ని నాలుగు ప్రతులు ఉచితంగా, రాష్ట్రంలోని కేంద్ర లైబ్రరీకి, ప్రచురణ కర్తలు పంపించవలసివుంది. రాష్ట్రంలోని 1544 లైబ్రరీలలోను 1,159 లైబ్రరీలు జిల్లాబోర్డులచే నడుపబడేవి. 102 మునిసిపాలిటీలవి.

# ఆంధ్ర విశ్వకళాపరిషత్

స్థాపితము: 1926 ఏప్రిల్ 26

ఛాన్సలర్: హిజ్ ఎక్సలెన్సీ భవనగర్ మహారాజు

ప్రో-ఛాన్సలర్: శ్రీ శ్రీ శ్రీ కళాప్రపూర్ణ మహారాజా విక్రమదేవవర్మ, జయపురం

వైస్-ఛాన్సలర్: డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి (జీతం: నెలకు రు. 2000)

రిజిస్ట్రార్: శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి (జీతం: రు. 750-50/2-1000)

ఇంగ్లీషు వక్త: ప్రొఫెసర్ వి. ఎస్. కృష్ణ

తెలుగు వక్త: శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

లా సలహాదారు: శ్రీ లక్కరాజు సుబ్బారావు

## సిండికేట్

(1) డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి (2) డాక్టర్ డి. సదాశివ రెడ్డి, డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్, మదరాసు. (3) టి. ఎన్. ఎస్. రాఘవన్, సెక్రటరీ, ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్, మదరాసు. (4) శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు, కపిలేశ్వపురం కుమార జమీందారు. (5) శ్రీ మేకా రంగయ్య అప్పారావు బహదూర్, వుయ్యూరు కుమార జమీందారు. (6) శ్రీ ఎస్. పార్థసారధినాయుడు, మిసెస్ ఎ. వి. ఎన్ కాలేజి ప్రిన్సిపాల్, విశాఖపట్టణం. (7) డాక్టర్ టి. భాస్కరమీనన్, ఆంధ్ర మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్. విశాఖపట్టణం, (8) శ్రీ లక్కరాజు సుబ్బారావు, కాకినాడ. (9) శ్రీ జె. పి. ఎల్ షెనాయ్, జిల్లా కలెక్టర్, విశాఖపట్టణం. (10) కుమార్ శ్రీ విద్యాధర సింగ్‌దేవ్, జయపురం. (11) శ్రీ చెలికాని వెంకటరావు, జయపుర

దివాను, జయపురం. (12) జనాబ్ మహబూబ్ అలిబేగ్ సాహెబ్ బహదూర్, బెజవాడ. (13) శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు బెజవాడ. (14) శ్రీ కె. వి. రమణయ్యనాయుడు, మచిలీపట్టణం. (15) డాక్టర్ మల్లవరపు వెంకట కృష్ణారావు, వాల్తేరు. (16) డాక్టర్ ఎ. ఎల్. నారాయణ, మదరాసు.

## అకడమిక్ కౌన్సిలు

(1) డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి. (2) డాక్టర్ డి. సదాశివ రెడ్డి, మదరాస్. (3) సర్. సి. వి. రామన్, బెంగుళూరు. (4) ప్రొఫెసర్ వి. ఎస్. కృష్ణ. యూనివర్సిటీ కాలేజి ప్రిన్సిపాల్, వాల్తేరు. (5) ప్రొఫెసర్ టి. విజయరాఘవన్, ఆంధ్రయూనివర్సిటి. వాల్తేరు. (6) ప్రొఫెసర్ ఎ. నరసింగరావు, ఆంధ్ర యూనివర్సిటి, వాల్తేరు. (7) ప్రొఫెసర్ ఎస్. భగవంతం, ఆంధ్రయూనివర్సిటి, వాల్తేరు. (8) ప్రొఫెసర్ కె. రంగధామరావు. ఆంధ్ర యూనివర్సిటి, వాల్తేరు. (9) ప్రొఫెసర్ టి. ఆర్. శేషాద్రి, ఆంధ్ర యూనివర్సిటి, వాల్తేరు. (10) ప్రొఫెసర్ జి. గోపాలరావు, ఆంధ్ర యూనివర్సిటి, వాల్తేరు. (11) ప్రొఫెసర్. సి. మహదేవన్, ఆంధ్ర యూనివర్సిటి, వాల్తేరు. (12) ప్రొఫెసర్. ఆర్. గోపాల అయ్యర్. ఆంధ్ర యూనివర్సిటీ. వాల్తేరు. (13) ప్రొఫెసర్ [illegible] లేశ్వరనెన్, ఆంధ్ర యూనివర్సిటి, వాల్తేరు. (14) ప్రొఫెసర్ జి. వెంకటరావు, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు. (15) ప్రొఫెసర్ [illegible]. [illegible]. [illegible]ర్, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు. (16) ప్రొఫెసర్ కె. కె. దాస్, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు. (17) ప్రొఫెసర్ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేర్, (18) ప్రొఫెసర్ ఎన్. వెంకట రామన్, లాప్రొఫెసర్, లాకాలేజి, మచిలీపట్టణం. (19) డాక్టర్ టి. భాస్కర మీనన్, ఆంధ్రమెడికల్ కాలేజి ప్రిన్సిపాల్, విశాఖపట్టణం

ఎం. తిరునరణన్, గవర్నమెంట్ ట్రెయినింగ్ కాలేజి, రాజమండ్రి. (42) మిస్ అచ్చమ్మ టి. థామస్. పి. ఆర్. కాలేజ, కాకినాడ. (43) శ్రీ వి. పాల్ ప్రసాదరావు, ఎ. సి. కాలేజి, గుంటూరు (44) శ్రీ ఇ. లక్ష్మీప్రసాదరావు, ఎం. ఆర్. కాలేజి, విజయనగరం. (45) శ్రీ పి. వి. శేషగిరిరావు, హిందూ కాలేజి, మచిలీపట్టణం. (46) శ్రీ ఎన్. శ్రీనివాస రావు, మిసెస్ ఎ. వి. ఎన్. కాలేజి, విశాఖపట్టణం. (47) శిరోమణి వి. అన్నప్ప శాస్త్రి, గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజ, రాజమండ్రి. (48) విద్వాన్ బి. వెంకటసుబ్బయ్య, వి. ఆర్. కాలేజి. నెల్లూరు. (49) శ్రీ బి. రాఘవేంద్రరావు, ఎస్. ఆర్. ఆర్. కాలేజి, బెజవాడ. (50) శ్రీ ఎం. రఘురామారావు, సర్ సి. ఆర్. రెడ్డి, కాలేజ, ఏలూరు. (51) శ్రీ సి. జె. దాసారావు, జె. వి. డి. కాలేజ, వాల్తేర్. (52) శ్రీ. జె. వెంకటేశ్వర్లు, ఎర్స్కిన్ కాలేజి. వాల్తేరు. (53) శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం, యూనివర్శిటి లా కాలేజ, మచిలీపట్టణం. (54) శ్రీ ఎం. నరసింహారావు, బోర్డ్ హైస్కూల్ హెడ్ మాస్టర్, గన్నవరం, (55) డాక్టర్ ఎ. ఎల్. నారాయణ, మదరాసు (56) డాక్టర్ కస్తూరి నారాయణమూర్తి మైలాపూర్, మదరాసు.

## సెనేట్

(అకడమిక్ కౌన్సిలులోను సిండికేట్ లోను సభ్యులుగా వుండి సెనేట్ లోగూడా సభ్యులుగా వున్నవారి అడ్రసులు యీ క్రింద యివ్వలేదు.)

(1) హిస్ ఎక్సలెన్సీ మదరాసు గవర్నరు, శ్రీ భావనగర్ మహారాజు. (2) శ్రీ శ్రీ మహారాజా డాక్టర్ విక్రమదేవవర్మగారు, జయపురం మహారాజు. (3) డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి. (4) డాక్టర్ డి. సదాశివరెడ్డి. (5) కర్నల్ ఎస్. ఎల్. భాటియా, మదరాసు ప్రభుత్వ సర్జన్ జనరల్. (6) మదరాసు ప్రభుత్వ పరిశ్రమలశాఖ డైరక్టర్. (7)

మదరాసు ప్రభుత్వ వ్యవసాయశాఖ డైరక్టర్. (8) ప్రొఫెసర్ వి. ఎస్. కృష్ణ. (9) కె. సత్యనారాయణ. (10) సిస్టర్ మేరీస్టానిస్లాస్. (11) డాక్టర్ టి. భాస్కరమీనన్. (12) సి. ఆర్. శ్రీనివాస అయ్యంగార్, (13) వి. హెచ్. సదారంగని. (14) ఎ. ఆర్. రామస్వామి అయ్యర్, (15) రెవరెండ్ డాక్టర్ హెచ్. హెచ్. రైస్. (16) కె. శివరామ కృష్ణారావు. (17) కె. సచ్చిదానందం పిళ్ళై. (18) కె. పి. గోవింద మీనన్. (19) ఎస్. పార్థసారథినాయుడు. (20) డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచారి. (21) వి. సుబ్బారావు. (22) మిస్. పి. సీతమ్మాళ్. (23) పెద్దాడ రామస్వామి. (24) డి. ఎస్. సుబ్రహ్మణ్యం. (25) ప్రొఫెసర్ టి. విజయరాఘవన్. (26) ప్రొఫెసర్ ఎ. నరసింగరావు. (27) ప్రొఫెసర్ ఎస్. భగవంతం. (28) ప్రొఫెసర్ కె. రంగధామరావు, (29) ప్రొఫెసర్ టి. ఆర్. శేషాద్రి. (30) ప్రొఫెసర్ ఎ. గోపాలరావు. (31) ప్రొఫెసర్ సి. మహాదేవన్. (32) ప్రొఫెసర్ ఆర్. గోపాల అయ్యర్. (33) ప్రొఫెసర్ కై లేస్సర్ రేక్. (34) ప్రొఫెసర్ జి. వెంకటరావు. (35) ప్రొఫెసర్. జె. బి. జరార్. (36) ప్రొఫెసర్ కె. కె. దాస్. (37) ప్రొఫెసర్ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్. (38) ప్రొఫెసర్ ఎస్. వెంకటరామన్. (39) టి. ఎన్. ఎస్. రాఘవన్. (40) జె. పి. ఎల్. షెనాయ్. (41) కుమార్ శ్రీ విద్యాధర్ సింగ్ దేవ్. (42) చెలికాని వెంకటరావు. (43) సర్వేపల్లి రాధాకృష్ణ. (44) తిరువాంకూరు మహారాజు. (45) తిరువాంకూరు మహారాణి. (46) టి. శ్రీహరినారాయణ, రిటైర్డు జిల్లా మెడికల్ ఆఫీసర్, ఏలూరురోడ్ బెజవాడ. (47) లక్కరాజు సుబ్బారావు. (48) ఎస్. వి. పి. పట్టాభి రామారావు. (49) శ్రీ మేకా రంగయ్య అప్పారావు బహదూర్. (50) కందాళ సర్వేశ్వరశాస్త్రి వకీలు, హొత్తేర్. (51) నేతి సుబ్రహ్మణ్యం, అడ్వొకేట్, త్యాగరాయనగర్, మదరాసు. (52) పి. వి. సుబ్బారావు, పెరెంట్ల, గుంటూరుజిల్లా. (53) కొల్లిపర వెంకటరమణయ్యనాయుడు, ప్లీడర్, మచిలీపట్టణం. (54) డాక్టర్ మల్లవరపు వెంకటకృష్ణారావు, (55) భాగవతుల అప్పారావు, లెక్చరర్, గవర్నమెంట్ ఆర్ట్సుకాలేజి,

రాజమండ్రి. (56) డాక్టర్ కస్తూరి నారాయణమూర్తి, మదరాసు. (57) మామిడిపూడి వెంకటరంగయ్య, 21 పిఠాపుర్ నగర్, మదరాసు. (58) సి. సీతాపతిరావు, అడ్వొకేటు, రాజమండ్రి. (59) నడింపల్లి వెంకట లక్ష్మీ నరసింహారావు, బారిష్టరు, గుంటూరు. (60) ఎం. రామకృష్ణారెడ్డి లెక్చరర్, సర్. సి. ఆర్. ఆర్. మునిసిపల్ కాలేజి, ఏలూరు. (61) నగమర్తి వెంకటరామస్వామి, ఎం. ఎల్. ఏ. మహారాణిపేట పోస్టు, విశాఖపట్టణం. (62) పి. సుబ్రహ్మణ్య అవధాని, అడ్వొకేట్, మచిలీపట్టణం. (63) అల్మకూరి గోవిందాచార్యులు, ఎం. ఎల్. సి. ఏలూరు. (64) జి. వెంకట రెడ్డి, ఎం. ఎల్. సి. కమలానగర్, అనంతపురం. (65) కె. బ్రహ్మానంద రెడ్డి. ఎం. ఎల్. ఏ. నరసరావుపేట. (66) నివర్తి వెంకట సుబ్బయ్య, ఎం. ఎల్. ఏ. నంద్యాల. (67) కె. షణ్ముగం, ఎం. ఎల్. ఏ. వెంకటగిరి. (68) ఎం. నరసింహారావు, హెడ్ మాస్టర్; బోర్డు హైస్కూలు. గన్నవరం. (69) కుమారరాయ అప్పారావు బహద్దర్, అమ్మపాలెం జమీందార్, కాళహస్తి. (70) జద్దుతుల్ అక్రోన్ బులుసు బుచ్చి సర్వారాయుడు, కపిలేశ్వరపురం జమీందారు. (71) ఎన్. వి. రామకృష్ణారెడ్డి, మునగాల కుమారరాజా, నందిగూడెం, కృష్ణాజిల్లా. (72) బెజవాడ గోపాల రెడ్డి, ఆర్థికశాఖామంత్రి, మదరాసు. (73) సి. అన్నారావు, పేష్కార్, తిరుమల-తిరుపతి దేవస్థానం, తిరుపతి, (74) దివాన్ బహద్దూర్ ధన్వాడ అనంతరావు, 3 ఖాదర్ నవస్ ఖాన్ రోడ్ నుంగంబాకం, మదరాసు. (75) విశ్వనాథ సత్యనారాయణ. (76) ఉభయ భాషాప్రవీణ కె. సుబ్బరామయ్య. (77) మహమ్మద్ అహమ్మద్ మొహిదీన్ అన్సారి. (78) విద్వాన్ రఘునాథపన్ గోపెంగి (79) దంతులూరి నారాయణ రాజు. భీమవరం, (80) గ్రంధి వెంకట రెడ్డి, నరసాపురం. (81) ఎల్. బుల్లెయ్య. డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ ఆఫీసర్, మచిలీపట్టణం. (82) దస్త్రి. వెంకటస్వామి. డిస్ట్రిక్టు రిజిస్ట్రార్, నెల్లూరు. (83) సి. నారాయణస్వామి నాయుడు, స్పెషల్ ఆఫీసర్, డిపార్టుమెంట్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్, ఫోర్ట్ సెంటుజార్జి, మదరాసు. (84) డాక్టర్

సైన్సు (ఎం. ఎస్. సి.) 4. మాస్టర్ ఆఫ్ సైన్సు ఆనర్స్ (ఎం. ఎస్. సి. ఆనర్స్) 5. డాక్టర్ ఆఫ్ సైన్సు (డి. ఎస్. సి.)

కామెర్సు : 1. బాచిలర్ ఆఫ్ కామెర్సు (బి. కాం.) 2. బాచిలర్ ఆఫ్ కామెర్స్ ఆనర్స్ (బి. కాం. ఆనర్స్) 3. మాస్టర్ ఆఫ్ కామెర్స్ (ఎం. కాం.) 4. మాస్టర్ ఆఫ్ కామెర్స్ ఆనర్స్ (ఎం. కాం. ఆనర్స్).

వ్యవసాయ శాస్త్రం : 1. బాచిలర్ ఆఫ్ సైన్సు అగ్రికల్చర్ (బి. ఎస్. సి. ఎజి.) 2. మాస్టర్ ఆఫ్ సైన్సు అగ్రికల్చర్ (ఎం. ఎస్. సి. ఎజి.)

విద్యా బోధక శాస్త్రం : 1. బాచిలర్ ఆఫ్ ఎడ్యుకేషన్ (బి. ఇడి.) 2. మాస్టర్ ఆఫ్ ఎడ్యుకేషన్ (ఎం. ఇడి).

వైద్య శాస్త్రం : బాచిలర్ ఆఫ్ మెడిసిన్ అండ్ సర్జరీ (ఎం. బి. బి. ఎస్). 2. డాక్టర్ ఆఫ్ సైన్సు (డి. ఎస్, సి). 3. డాక్టర్ ఆఫ్ మెడిసిన్ (ఎం. డి.) 4. మాస్టర్ ఆఫ్ సర్జరీ (ఎం. ఎస్).

న్యాయ శాస్త్రం : 1. బాచిలర్ ఆఫ్ లా (బి. ఎల్).

ప్రాచ్య భాషలు : 1. విద్యాప్రవీణ; 2. భాషాప్రవీణ, 3. ఆలిమ్-ఇ-ఫజల్; 4. మున్షి-ఇ-ఫజల్; 5. ప్రాచ్యభాషావేత్తృత్వపత్రం (పి. ఒ. ఎల్.) 6. ప్రాచ్యభాషా కోవిద పట్టం (ఎం. ఒ. ఎల్).

పరీక్షలు జరిపి, ఉత్తీర్ణులైనవారికి యిచ్చే పైపట్టములు కాక, "కళాప్రపూర్ణ" అనే గౌరవపట్టము, డి. లిట్., డి. ఎస్. సి., ఎల్. ఎల్. డి. అనే గౌరవపట్టములుకూడా, అర్హులని తోచినవారికి ఇవ్వబడుతవి.

# ప్రజారోగ్యం : వైద్యసహాయం

భారతదేశంలో అత్యధిక సంఖ్యాకుల మరణానికి కారణమైన జబ్బులలో ప్రధానమైనవి, మలేరియా, క్షయ, అమ్మవారు. మదరాసు రాష్ట్రంలో, 1947 లో ఏఏ జబ్బులవల్ల ఎంతమంది చనిపోయినదీ యీ క్రింది అంకెలవల్ల తెలుసుకోవచ్చును.

| | |
|---|---|
| జ్వరములు | 2,58,207 |
| ఊపిరితిత్తులకు సంబంధించిన జబ్బులు | 99,428 |
| గ్రహణి, అతిసారము | 75,719 |
| స్ఫోటకం | 2,650 |
| కలరా | 12,743 |
| టైఫాయిడ్ జ్వరం | 1,578 |
| ప్లేగు | 2,718 |

1947 లో వివిధ వ్యాధులవల్ల కలిగిన మరణాలసంఖ్య 1946 లో కంటె ఒక్క-స్ఫోటకం తప్ప తక్కిన ప్రతి వ్యాధి విషయంలోనూ ఎక్కువైంది. 1947 లో మదరాసు రాష్ట్రంలో, ప్రసూతి వైద్యం, శిశు సంరక్షణ, చెయ్యడానికి చైల్డు వెల్ఫేర్ అంట్ మెటర్నిటీ సెంటర్లు కొత్తగా 22 స్థాపించబడినవి. అంతకుపూర్వం వున్నవాటితో కలిసి, 1947 లో మొత్తం 318 సెంటర్లు పనిచేశాయి.

1946 సంవత్సరానికి మదరాసు రాష్ట్రంలోవున్న వైద్యశాలలు 1189. అంతకుపూర్వపు సంవత్సరంలో 1187 వుండేవి.

1946 అంతానికివున్న వాటి వివరాలివి:

ప్రభుత్వం పెట్టినవి. 192; ప్రభుత్వం పెట్టిన ప్రత్యేక వైద్యశాలలు. 33; స్థానికసంస్థలు పెట్టినవి, 465; ప్రజలచే స్థాపింపబడి ప్రభుత్వ సహాయం పొందినవి. 60; ప్రభుత్వసహాయం లేకుండా, ప్రజలచేత స్థాపింపబడినవి. 84; రైల్వేవారు పెట్టించినవి. 56; గ్రాంటు సహాయంతో నడిచిన గ్రామీణ వైద్యశాలలు, 299.

అన్ని ఆస్పత్రులలోను, రోగులు చేరి వుండి చికిత్సపొందడానికి వున్న పడకలు, 15,640. 1946 లో రాష్ట్రంలోని అన్ని ఆస్పత్రుల లోను జరిగిన ఆపరేషనుల సంఖ్య 563.451. ఈ ఆపరేషనుల అనంతరం చనిపోయిన రోగులసంఖ్య. 1,635.

ఆస్పత్రులలో చికిత్సపొందినవారిలో ఏఏ రోగాలవల్ల ఎంతమంది చనిపోయినదీ, వివరాలు :

| రోగం | చేరిన రోగులు | మరణాలు |
|---|---|---|
| మలేరియా : | 130,081 | 438 |
| టైఫాయిడ్ : | 31,752 | 739 |
| రక్తగ్రహణి : | 343,070 | 445 |
| క్షయ : | 85,854 | 1,411 |

1946 సంవత్సరాంతానికి మదరాసురాష్ట్రంలో పనిచేస్తున్న డాక్టర్ల సంఖ్య : సివిల్ అసిస్టెంట్ సర్జనులు, 377; సబ్ అసిస్టెంట్ సర్జనులు, 1189; ఐ. ఎం. ఎస్., ఐ. ఎం. డి. ఉద్యోగులు, 28 : కంపౌండర్లు 1,298.

1946 లో మొత్తం 85,84,105 మందికి టీకాలు వేయబడినవి. 1947 లో 48,81.375 మందికి టీకాలు వేయబడినవి.

## న్యాయరక్షణ

1946 సంవత్సరంలో మదరాసు రాష్ట్రంలో నేరాల సంఖ్య తగ్గినది. హత్యలుగాని దొంగతనాలుగాని ఏవీ ఎక్కువగా లేవు. నవంబరు నెలలో మాత్రం సమ్మెలు, కొట్లాటలు జరిగాయి.

న్యాయ విచారణ: న్యాయ విచారణకు మదరాసు రాష్ట్రంలో 1946 లో పనిచేసిన న్యాయాధిపతుల సంఖ్య : పర్మనెంటు హైకోర్టు జడ్జీలు, 14; తాత్కాలిక అదనపు హైకోర్టు జడ్జీలు, 2; సెషన్సు జడ్జీలు 32; శాశ్వత అదనపు సెషన్సు జడ్జి, 1; ఏజన్సీ సెషన్సు జడ్జీలు, 3; అదనపు ఏజన్సీ జడ్జీలు 3; తాత్కాలిక అదనపు జడ్జీలు, 2; అసిస్టెంటు సెషన్సు జడ్జీలు, 30; తాత్కాలిక అసిస్టెంటు సెషన్సు

జడ్జీలు, 7; జిల్లా మేజిస్ట్రేట్లు, 24; జుడిషియల్ జిల్లా మేజిస్ట్రేట్లు, 22; ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్లు, 4; ఒక తాత్కాలిక ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు; సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్లు, 94; సబ్ మేజిస్ట్రేట్లు, 594; స్పెషల్ మేజిస్ట్రేట్లు, 68; ఆనరరీ మేజిస్ట్రేట్లు, 31; బెంచి కోర్టులు, 217; గ్రామ మేజిస్ట్రేటు కోర్టులు, 674; పంచాయితీ కోర్టులు, 2,825.

*1946 లో వివిధ కోర్టులలో చెప్పబడిన శిక్షల వివరాలు: మరణ శిక్షలు, 165; ద్వీపాంతరవాసం, 333; కఠిన శిక్షలు, 31,557; సాధారణ శిక్షలు, 6,059; జరిమానాలు, 581,863.

జైళ్ళు: 1946 లో మదరాసు రాష్ట్రంలో 11 సెంట్రల్ జైళ్లు, మూడు జిల్లా, స్పెషల్ జైళ్లు, 291 సబ్ - జైళ్ళు వున్నాయి.

సంవత్సరారంభంలో జైళ్ళలో వున్నవారి సంఖ్య: 18,406; ఈ సంవత్సరంలో జైలుకు వెళ్ళినవారు, 164,350; విడుదలపొందినవారు, 163,742; సంవత్సరాంతంలో జైళ్లలో వున్నవారు, 19,014.

తుపాకుల లైసెన్సులు: 1946 లో 1,833 మందివద్ద తుపాకులను వుంచుకోడానికి, 1,698 పిస్టోళ్ళు, రివాల్వరులు వుంచుకోడానికీ, 49,347 నాటు తుపాకులను వుంచుకోడానికి లైసెన్సులు అమలులో వున్నాయి.

సివిల్ కోర్టులు: 16 మంది హైకోర్టు జడ్జీలు, 26 మంది జిల్లా జడ్జీలు, కాక మదరాసు రాష్ట్రంలో, 1946 లో. 37 మంది సబ్ జడ్జీలు, 140 మంది జిల్లా మునసబులు, 3630 పంచాయితీ కోర్టులూ, సివిల్ దావాలను విచారించారు.

అదే సంవత్సరంలో, రాష్ట్రంలోని కోర్టులన్నిటిలోనూ వెయ్యబడిన దావాల సంఖ్య, 2,18,516. అంతకుపూర్వపు సంవత్సరంలో వెయ్యబడిన దావాల సంఖ్య, 2,18,160.

1946 లో కొత్తగా 159 మంది అడ్వొకేటు వృత్తిలో ప్రవేశించారు.

## పోలీసు

1947 డిసెంబరు నాటికి మదరాసు రాష్ట్రంలోగల పోలీసు సిబ్బంది వివరాలు:

కానిస్టేబిల్సు, 34,101; హెడ్ కానిస్టేబిల్సు, 5,007; సబ్-ఇన్స్పెక్టర్లు, 1629; డిప్యూటీ సూపరింటెండెంట్సు, 149; డిస్ట్రిక్టు సూపరింటెండెంట్సు, 38; డిప్యూటీ ఇన్స్పెక్టర్సుజనరల్, 5; ఇన్స్పెక్టర్ జనరల్, ఒకడు. 1946 లో పోలీసుశాఖ నిర్వహణను గురించి ప్రభుత్వ రిపోర్టులో యీ క్రింది వివరాలు తెలియ జేయబడినవి.

1945 లో అయిదుసార్లే అయితే, 1946 లో 33 సార్లు పోలీసు వారు ప్రజాసమూహాలపై తుపాకులు కాల్చవలసి వచ్చింది.

1945 లో కార్మికుల సమ్మెలు 77 అయితే, 1946 లో 273 సమ్మెలు జరిగాయి.

పోలీసువారు దర్యాప్తు చేస్తున్న నేరాలు 1945 లో 55,138 అయితే, 1946 లో 63,781 అయాయి. నేరాల వివరా లివి:

| నేరాలు | 1945 | 1946 |
|---|---|---|
| బందిపోట్లు | 77 | 103 |
| దారిదోపిళ్లు | 481 | 483 |
| ఇళ్ళదోపిళ్ళు | 7327 | 8999 |
| పశువులను ఎత్తుకుపోవడం | 4491 | 4954 |
| దొంగతనాలు | 26132 | 29200 |
| ఖూనీలు | 1092 | 1165 |
| న్యూసెన్సు కేసులు | 2,38,205 | 2,27,124 |

# మద్యనిషేధము

మదరాసు రాష్ట్రంలో, 1946 అక్టోబరు 1 వ తేదిన ఎనిమిది జిల్లాలలో మద్యపాన నిషేధ శాసనం అమలు జరుపబడింది. ఆ జిల్లాలు ఇవి. కోయంబత్తూరు, సేలం, ఉత్తరార్కాడు, అనంతపురం, కర్నూలు, కడప, బళ్ళారి, చిత్తూరు.

1947 అక్టోబరు 1 వ తేదీనుంచి మరొక ఎనిమిది, (గుంటూరు, మలబారు, నీలగిరి, నెల్లూరు, తంజావూరు, తిరుచినాపల్లి, దక్షిణ కన్నడ మధుర), జిల్లాలలో మద్యనిషేధశాసనాన్ని అమలు జరిపారు.

1948 అక్టోబరు 1 తేదీనుంచి, మదరాసు నగరం, తిరునెల్వేలి, రామనాథం, దక్షిణార్కాడు, చెంగల్పట్టు, కృష్ణా, పడమటి గోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్టణం, జిల్లాలలో మద్యనిషేధం అమలుజరుపబడింది. అంటే, 1948 అక్టోబరు 1 తేదీనుంచి, మదరాసురాష్ట్రం అంతటా మద్యనిషేధం అమలుజరుపబడిందన్నమాట. ఈ సంస్కారం వల్ల రాష్ట్రప్రభుత్వం తమ ఆదాయంలో ఏడాదికి దాదాపు 17 కోట్ల రూపాయలను కోల్పోయారు.

రాష్ట్రంలో ఎక్కడా మద్యనిషేధంలేని 1945-46 లో, మద్యపానీయాలమీద వేసినపన్నువల్ల రాష్ట్రప్రభుత్వాదాయం రు. 16,81,74,000.

## మోటారుకార్లు: బస్సులు

1946-47 అంతానికి (అంటే 1947 మార్చి 31 వ తేదీనాటికి) మదరాసు రాష్ట్రంలో మొత్తం 30,714 మోటారుబండ్లు వున్నాయి. అంతకు పూర్వపు సంవత్సరంలో 18,653 మాత్రమే వున్నాయి. ఆ బండ్ల వివరాలివి:

| బండ్లు | 1944—45 | 1945—46 | 1946—47 |
|---|---|---|---|
| మోటారు సైకిళ్ళు : | 1,458 | 1,513 | 2,823 |
| మోటారు టాక్సీలు : | 404 | 371 | 522 |
| లారీలు | 2,663 | 3,311 | 6,341 |
| బస్సులు | 3,091 | 3,662 | 5,057 |
| ప్రైవేటు కార్లు : | 10,430 | 9,762 | 15,972 |

గత ప్రపంచ యుద్ధానికిపూర్వం, మోటారుబండ్లు ఎక్కువగానే వాడకంలోవుండేవి. యుద్ధకాలంలో, దిగుమతులు తగ్గినందున, బండ్ల సంఖ్య తగ్గింది. ఇప్పుడు క్రమేపీ హెచ్చుతున్నది.

ఏయే సంవత్సరాలలో ఈ రాష్ట్రంలో ఎన్ని మోటారు బండ్లు వున్నదీ, ఈక్రింది అంకెలవల్ల తెలుస్తుంది.

| | |
|---|---|
| 1941—42 | 19,239 |
| 1942—43 | 17,685 |
| 1943—44 | 17,240 |
| 1944—45 | 18,046 |
| 1945—46 | 18,653 |
| 1946—47 | 20,714 |

1940—47 లో 57,911 మంది ప్రైవేట్లుగా పని చెయ్యడానికి లైసెన్సులను పొందివున్నారు. వీరిలో 15,559 మంది బస్సులను నడపడానికి లైసెన్సు పొందినవారు. తక్కిన లైసెన్సులు తమ మోటార్లను నడుపుకొనే యజమానులకు ఇచ్చినవి.

1940 లో మదరాసు రాష్ట్రంలో 1,47,24,000 గాలనుల పెట్రోలు వాడకం జరిగింది. యుద్ధకాలంలో ఈ వాడకం బాగా తగ్గించబడింది. 1944-45 లో 59,79,237 గాలనుల పెట్రోలు మాత్రమే వాడకం జరిగింది. 1945-40 లో ఈ వాడకం పెరిగి, 75,45,205 గాలనులు అయింది. 1946-57 లో 1,35,27,518 గాలనుల పెట్రోలు వాడకం జరిగింది, అయితే, పెట్రోలు వాడకంలో పొదుపుచెయ్యడంలో ఇతర రాష్ట్రాలన్నింటినీ మించినది మదరాసు.

1947—48 నుంచి మదరాసు నగరంలోనూ, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలోనూ బస్సు సర్వీసులను తామే, క్రమేపి స్వాధీనపరచుకోవడానికి రాష్ట్రప్రభుత్వంవారు నిశ్చయించారు.

ఈ పద్ధతి ప్రకారం, ప్రభుత్వంవారే బస్సులను నడిపించడం ప్రారంభించినప్పటినుంచి, 1948 జనవరి 31 నాటికి, బస్సులమీద ప్రభుత్వంవారు మొత్తం పెట్టుబడి రు. 23,70,000 పెట్టారు. దీనివల్ల ఆదాయం, రు. 14,02,772 వచ్చింది. బస్సులను నడపడానికి ఖర్చు రు. 8,95,678 అయింది. నికరలాభం, రు. 5,08,094. అంటే, పెట్టుబడి మీద నూటికి 12½ వంతులు లాభం వచ్చిందన్నమాట.

1949 జనవరి 1 తేది నాటికి మదరాసు నగరంలోని అన్ని బస్సు మార్గాలలోను గవర్నమెంటువారే బస్సులను పెట్టించారు. ఆనాటికి నగరంలో ప్రభుత్వంవారి బస్సులు 320 తిరుగుతున్నాయి. ఈ బస్సు సర్వీసులలో, ప్రభుత్వంక్రింద డ్రైవర్లు, కండక్టర్లు, మెకానిక్కులు, గుమస్తాలు కలసి, మొత్తం 1500 మంది పనిచేస్తున్నారు.

## రోడ్లు

మదరాసురాష్ట్రంలో 1948 అంతంనాటికి, 2,000 మైళ్ళ జాతీయరహదార్లు; 3,108 మైళ్ళ రాష్ట్రీయరహదార్లు; 15,055 మైళ్ళ, పెద్దజిల్లాబోర్డురోడ్లు వున్నాయి. వీటిని ఒకటోరకం రోడ్లు అంటారు. ఇవికాక, జిల్లాలలోని చిన్నరోడ్లు 7,968 మైళ్ళు; గ్రామాలరోడ్లు, 36,958 మైళ్ళు వున్నాయి. వీటిని రెండోరకం రోడ్లు అంటారు. మొదటిరకం రోడ్లు మొత్తం 20,163 మైళ్ళలో 15,640 మైళ్ళు రాష్ట్రప్రభుత్వ పరిపాలనలో వున్నాయి. మిగతావి స్థానికసంస్థల పరిపాలనలో వున్నాయి. వీటినికూడా తమ పరిపాలనలోకి తీసుకోవడమే ప్రభుత్వంవారి ఉద్దేశం.

అప్పుడు రెండోరకపు రోడ్లుమాత్రమే స్థానికసంస్థలపాలనలో వుంటాయి.

# పశువైద్యం

1946-47 అంతానికి మదరాసు రాష్ట్రంలో 138 పశువైద్యశాలలు వున్నాయి. ఈ సంవత్సరంలో కొత్తగా పశువైద్యశాలలు ఏవీ స్థాపించబడలేదు. అసలు రాష్ట్రంలోవున్న పశువైద్యశాల లన్నిటిలోనూ 136 ప్రభుత్వం వారిచే పెట్టబడినవి. రెండు ప్రైవేటుగా స్థాపింపబడినవి.

1946 మార్చి 31 వ తేదినాటికి రాష్ట్రంలో పనిచేస్తున్న వెటరినరీఅసిస్టెంట్ సర్జనులు 396 మంది. వీరిలో 38 మంది తాత్కాలికంగా నియమింపబడినవారు. గ్రామాలలో సంచారంచేసి పశువులకు వైద్యం చేసే టూరింగ్ పశువైద్యుల సంఖ్య 165.

రాష్ట్రంలో పశువైద్యశాలలో, ఈ శాఖవారు మొత్తం 970 అంబోతులను వుంచారు.

1946-47 లో వివిధ వ్యాధులవల్ల చనిపోయిన పశువుల సంఖ్య, 29,568.

పశువులను హింసించిన నేరాలకు, 1946-47 లో శిక్షింపబడిన వారి సంఖ్య 20,424. ఇలా శిక్షలు పొందినవారికిచెందిన పశువులలో, 5,251 పశువులను, పనిచెయ్యలేనివిగా నిర్ణయించి, ఆస్పత్రులకు పంపడం జరిగింది.

# అడవులు

మదరాసు రాష్ట్రంలో 1945-46 లో 18,776 చ. మైళ్ళ అడవి వుంటే, 1946-47 లో 18,758 మైళ్ళు మాత్రమే అడవులక్రింద ప్రత్యేకించబడింది. దీనిలో 15,404 చ. మైళ్ళు ప్రభుత్వానికి ప్రతిఫలం చేకూర్చే, మొదటి తరగతి అడవి. దీని కాపలా, నిర్వహణఅంతా అటవీ శాఖవారి చేతిలోవుంది. నేరే, 2,918 చ. మైళ్ళ అడవి రెవిన్యూ శాఖవారి అధీనంలో, పంచాయితీల పరిపాలనలోవుంది.

1946-47 లో మొత్తం 63,926 ఎకరాల అడవులలో చెట్లను నరికించి, వంట చెరకుగా సప్లయి చెయ్యడం జరిగింది.

ఉత్తరార్కాడు, సేలం, కోయంబత్తూరు జిల్లాలలోని అడవులలో మంచి గంధపుచెట్లు ఎక్కువగా ఉన్నాయి. 1946-47 లో యీ అడవులనుంచి 380 టన్నుల మంచి గంధపుచెక్క కొట్టబడింది. రాష్ట్రంలోని అడవులలో 14,133 చ. మైళ్ళ ప్రదేశంలో పశువులను మేపడానికి అనుమతి ఇవ్వబడింది. ఇలా అడవులలో మేతకు అనుమతి యివ్వబడిన పశువులసంఖ్య, 27,25,000. దీనివల్ల వచ్చిన ఆదాయంలో, రు. 7,19,000.

అడవులవల్ల రాష్ట్రప్రభుత్వానికి 1946-47 లో రు. 1,58,68,000 ఆదాయం వచ్చింది. అడవుల నిర్వహణకు రు. 79,72,000 ఖర్చు అయింది.

# సహకారోద్యమం

భారతదేశంలో సహకారోద్యమానికి, 1904 లో ప్యాసయిన కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీస్ శాసనంతో పునాదిపడింది. ఈశాసనం 1904 మార్చి 25 తేదీన అమలులోకి వచ్చింది.

ఈ చట్టం ఉద్దేశం ఏమిటంటే, సామాన్య ప్రజలలో పొదుపరితనాన్ని పెంపొందించడం, రైతులూ, కార్మికులూ, చేతివృత్తులవారూ, సామాన్యాదాయంగల యితర వ్యక్తులూ అన్యోన్య సహాయంచేసుకొని, తమ యిబ్బందులను గడుపుకొనేటట్టు చెయ్యడం.

ఈ చట్టం ప్యాసయిన తరువాత కొంత కాలంవరకు, దేశంలో కో-ఆపరేటివ్ సొసైటీల స్థాపన ఎక్కువగా జరగలేదుగాని, 1910 నుంచీ ఈ సొసైటీలు చాలా ఎక్కువ అయాయి.

మదరాసు రాష్ట్రంలో కూడా, కో-ఆపరేటివ్ ఉద్యమం క్రమక్రమంగా చాలా అభివృద్ధికి వచ్చింది, 1946-47 లో యీ ఉద్యమం మరీ బాగా అభివృద్ధిలోకి వచ్చింది.

1947 జూన్ 30 నాటికి మదరాసు రాష్ట్రంలో మొత్తం 17,057 కో-ఆపరేటివ్ సొసైటీలు వున్నాయి. అంతకు పూర్వపు సంవత్సరంలో, 16,068 వున్నాయి. 1946 లో వున్న సొసైటీల సభ్యులసంఖ్య 22 లక్షల 10 వేలపైగావుంది. ఆ సొసైటీలన్నిటిలోను పెట్టుబడి మొత్తం, రు. 50,97,51,000 పైగా.

ఇవిగాక, డిప్యూటీ కమిషనర్ ఆఫ్ సివిల్ సప్లయిస్, డైరక్టర్ ఆఫ్ రీసెటిల్మెంటుల అధికారానికి లోబడిన సొసైటీలు 309. వీటిలో సభ్యులసంఖ్య, 3,16,000. పెట్టుబడి, రు. 228 లక్షలు.

ప్రైమరీ సొసైటీలు : 1947 జూన్ 30 తేది నాటికి, మదరాసు రాష్ట్రంలో 11,375 ప్రైమరీ కో-ఆపరేటివ్ సొసైటీలు వున్నాయి. ఆసంవత్సరంలో, యీ సొసైటీలు, 3,47,16,000 రూపాయలు అప్పుయిచ్చాయి. వాటిలో 6,108 సొసైటీలు లాభం సంపాదించాయి. తక్కినవి కొద్దో గొప్పో నష్టపడ్డాయి.

కో-ఆపరేటివ్ బ్యాంకిలు : 1946-47 లో, మదరాసు రాష్ట్రంలో 30 సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకిలువున్నాయి. 14,386 సొసైటీలు యీబ్యాంకిలతో చేరివున్నాయి. బ్యాంకులన్నీకూడా లాభం మీదనే పనిచేశాయి.

ప్రైమరీ లాండ్ మార్ట్‌గేజి బ్యాంకులు: భూములతనఖా మీద అప్పలిచ్చే ప్రైమరీ బ్యాంకులు 1946-47 లో మదరాసు రాష్ట్రంలో 120 వున్నాయి. ఈ బ్యాంకులన్నింటి మొత్తం సభ్యత్వపు సంఖ్య, 89,768. ఆ సంవత్సరంలో, యీ బ్యాంకులు 46 లక్షల 96 వేల రూపాయల పైగా అప్పు లిచ్చాయి. సంవత్సరాంతానికి యీ బ్యాంకులకు రావలసిన బాకీలు, 2,68,91,000 రూపాయలు. ఈ బ్యాంకులన్నీ, మదరాసులోని సెంట్రల్ లాండ్ మార్ట్‌గేజి బ్యాంకు పర్యవేక్షణలో పనిచేస్తాయి.

అమ్మకపు సొసైటీలు : అవసరమైనవారికి తగిన హామీ మీద అప్పులు యివ్వడమేకాక, సహకార పద్ధతిమీద సరకులను అమ్మే

సొసైటీలు 1946-47 లో మదరాసు రాష్ట్రంలో 193 పనిచేశాయి. ఈ సొసైటీలలో సభ్యత్వపు సంఖ్య మొత్తం 107,513. వ్యవసాయంవల్ల వచ్చే పంటల ధరలన్నీ కంట్రోలులో వున్నందున, ఈ సొసైటీలు ఎక్కువ విస్తారంగా వ్యాపారం చెయ్యడానికి వీలులేకపోయింది.

పండ్ల వుత్పత్తిదారుల కో-ఆపరేటివ్ సొసైటీలు: ఇలాటి సంస్థలు, 1946-47 లో మదరాసు రాష్ట్రంలో 14 వున్నాయి. వీటిలో ముఖ్యమైనది, కడపజిల్లాలోని కోడూరులోవున్న సొసైటి. దీని తరువాత చెప్పదగినది, పాలకొల్లులోది. దాని తరువాత చెప్పదగినది రాజమండ్రిలో వుంది. 1945-46 లో యీ సొసైటీలు 19,46,000 రూపాయల విలువగల పండ్లను అమ్మితే, 1946-47 లో అమ్మకం 6,72,000 రూపాయలే. దీనికి కారణం, సైన్యానికి పండ్లను సప్లయి చెయ్యడం విరమించటమే.

చెరకు ఉత్పత్తిదారుల సొసైటీలు: 1946 47 లో మదరాసు రాష్ట్రంలో ఇలాటి సొసైటీలు 16 పనిచేశాయి. చెరకు పెంచే రైతులకు అప్పు ఇవ్వడం, వారు ఉత్పత్తిచేసిన చెరకునుగాని, బెల్లాన్నిగాని, టోకుగా అమ్మడం మొదలైన పనులను ఈ సొసైటీలు చేశాయి.

పాల సప్లయి సొసైటీలు, యూనియనులు: 1946-47 లో మదరాసు రాష్ట్రంలో పాలసప్లయి యూనియనులు 21, సొసైటీలు 269 వున్నాయి. ఈ సొసైటీలలో 220 సొసైటీలు 21 యూనియనులలో చేరినవి. మిగతా 49 సొసైటీలు స్వతంత్రంగా వ్యవహరించాయి. యూనియనులు రు. 43,17,000 ఖరీదుగల పాలనుకొని, రు. 49,26,000 లకు అమ్మాయి. సొసైటీలన్నీ మొత్తం రు. 53,80,000 పాలను అమ్మాయి.

గృహపరిశ్రమల సొసైటీలు: 1946-47 లో 160సొసైటీలు బెల్లపు తయారుకు, 42 సొసైటీలు కోడిగ్రుడ్ల అమ్మకాన్నీ, 43 స్త్రీల గృహపరిశ్రమలవల్ల ఉత్పత్తిఅయిన వస్తువులను అమ్మడం, 13 లోహపు పనివాండ్ల తరఫున, 11 కుమ్మరి పనివాండ్ల తరఫున, 10 తేనె

టీగల పెంపకము, తేనె అమ్మడము, 8 తోళ్ళపనివారి తరఫున, 7 చేతితో కాగితం తయారుచేసేవారి తరఫునా, 7 సొసైటీలు కర్రబొగ్గు తయారుచేసేవారి తరఫునా, 51 సొసైటీలు ఇతర గృహపరిశ్రమల తరఫునా పనిచేశాయి. ఈ సొసైటీలన్నీ కొన్న వస్తువుల ఖరీదు, రు. 30,31,000.అమ్మిన వస్తువుల ఖరీదు, రు. 30,70,000.

నేతపనివారి సొసైటీలు: 1946-47 లో, మదరాసు రాష్ట్రంలో చేనేత పనివారి కో-ఆపరేటివ్ సొసైటీలు 659 వున్నాయి. వీటిలోవున్న సభ్యులు మొత్తం, 108,625. వీరందరి చేతిలోనూవున్న మగ్గాల సంఖ్య, 85,531. 1946-47 లో వీరు నేసిన బట్టల విలువ, రు. 4,23,91,000. ఆ బట్టను అమ్మిన ధర, రు. 4,56,54,000.

సొసైటీలలో సభ్యులుగావున్న నేతనిపనివారందరికీ ఇచ్చిన కూలి మొత్తం, రు. 2,38,56,000.

మదరాసురాష్ట్ర చేనేతపనివారి కో-ఆపరేటివ్ సొసైటీకి లోబడి, ఈ ప్రైమరీ సొసైటీలన్నీ పనిచేస్తున్నాయి. వీటన్నిటికీ నూలు సప్లయి ఈ రాష్ట్ర సొసైటీయే చేసింది. వీరు నేసిన బట్టలలో చాలావరకు రాష్ట్ర సొసైటీ డిపోలలోనే అమ్మబడినవి.

టోకు వ్యాపారపు కో-ఆపరేటివ్ స్టోర్సు: 1946-47 లో ఇలాంటి స్టోర్సు 22 పనిచేశాయి. కంట్రోలుకు లోబడిన వస్తువులను, ఇతర సామగ్రిని చిల్లర స్టోరులకు పంచడం, ఇవి చేసిన పని. అంతేకాక, టోకుగా ధాన్యసేకరణ, ఆహారసామగ్రిని నిలవచెయ్యడం, పంచడం కూడా ఈ స్టోర్సు సాగించాయి. ఈ స్టోర్సు అన్నిటిలోవున్న సభ్యుల సంఖ్య, 10,288. ఇవన్నీ కలిపి, 1946-47 లో రు. 31,01,000 లాభం సంపాదించాయి.

ప్రైమరీ కో-ఆపరేటివ్ స్టోర్సు: 1946-47 లో మదరాసు రాష్ట్రంలో 1688 కో-ఆపరేటివ్ స్టోర్సు చిల్లర అమ్మకాన్ని సాగించాయి. వీటికివున్న బ్రాంచీల సంఖ్య, 1,270 ఈ స్టోర్సు అమ్మిన వస్తువులలో నూటికి 34 వంతులు జిల్లా టోకు సొసైటీల వద్దనుంచి

కొన్నవి. ఈ స్టోర్సులలో 557 స్టోర్సు నగరాలలోను నగరాలతో తుల్యమైన పెద్ద ఊళ్ళలోనూ వున్నాయి. వీటిలో 263 స్టోర్సుకు, రేషనులను పంచిపెట్టడానికి లైసెన్సు ఇవ్వబడింది.

గృహ నిర్మాణము : 1949 ప్రారంభంనాటికి, రాష్ట్రంలో 84 సహకార సంఘాలు, గృహనిర్మాణ కోసం ఏర్పడినవి ఉన్నాయి. వీటిలో ఒకటి మదరాసు నగరంలో వుంది.

## కార్మిక బలం

1947 అంతానికి మదరాసు రాష్ట్రంలో 3928 ఫాక్టరీలు వున్నాయి. 1946 అంతానికి, 3,554. 1947 అంతానికి, ఫాక్టరీలలో పనిచేస్తున్న వారిసంఖ్య, 2,76,586 మంది. 1946 అంతానికి 2,62,292. వీరిలో, బట్టల మిల్లులలో పనిచేస్తున్నవారు 1,02,125. ఇంత ఎక్కువ మంది కార్మికులు మరే పరిశ్రమలోనూ లేరు.

1945 లో 45 సమ్మెలు, 1946 లో 152 సమ్మెలు జరిగితే, 1947 లో 164 సమ్మెలు జరిగాయి. 1947 లో జరిగిన సమ్మెలవలన, మొత్తం రెండులక్షలమంది కార్మికులు చేసేపని నష్టమైంది.

1946 లో మదరాసు రాష్ట్రంలో, కార్మికుల యూనియనులు, రిజిష్టరు చేయబడినవి, 242 వున్నాయి. అదే సంవత్సరంలో 174 యూనియన్లు కొత్తగా రిజిష్టరు చేయబడినవి. 1945-46 సంవత్సరపు లెఖలను సరిగా చూపనందున, 30 యూనియనులు రిజిష్టరునుంచి తొలగించబడినవి. అంచేత 1947 మార్చి 31 నాటికి మదరాసు రాష్ట్రంలో వున్న కార్మికుల యూనియనులసంఖ్య, రిజిష్టరు చేయబడినవి, 385.

ఈ యూనియను లన్నిటిలోను సభ్యులుగావున్న కార్మికులసంఖ్య, 1947 మార్చి 41 నాటికి, 2,29,830. ఆసంవత్సరపు ఆరంభంనాటికి, యీ కార్మికులసంఖ్య 1,71,083.

## ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజెస్

యుద్ధకాలంలో సైనికులుగాను, సైన్యపు ఇతరశాఖలలోను పని చేసి ఇప్పుడు నిరుద్యోగులుగా వున్నవారికి ఉద్యోగాలకు చూపించడానికీ, వారిని ఏవైనా వృత్తులలో ప్రవేశపెట్టడానికి కేంద్రప్రభుత్వ కార్మికశాఖ మంత్రిత్వంవారు ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజెస్‌ను దేశమంతటా స్థాపించారు. మదరాసురాష్ట్ర ప్రాంతానికంతకూ ప్రధాన ఎక్స్చేంజి మదరాసు నగరంలో వుంది. సబ్ రీజియనల్ ఎక్స్చేంజి ఆఫీసులు, విశాఖపట్టణం, బెజవాడ, అనంతపురం, మదరాసు, నెల్లూరు, కోయంబత్తూరు, కాలికట్, తిరుచినాపల్లి, మధుర నగరాలలోవున్నాయి, ఇవికాక, జిల్లా ఆఫీసులు ప్రతిజిల్లా కేంద్రస్థానంలోను, ఒక్క నీలగిరిలో తప్ప, ఒకొకటి వున్నాయి. ఉద్యోగం లేకుండావున్న, మాజీ సైనికోద్యోగులు యీ ఆఫీసులలో తమ పేర్లను రిజిష్టరు చేసుకుంటే, వీరికితగిన ఉద్యోగాన్ని సంపాదించి పెట్టడానికి యీ ఆఫీసులు ప్రయత్నం చేస్తాయి. యుద్ధంలో పనిచేసి తిరిగివచ్చిన వారికేగాక ఉద్యోగం కావలసిన వారందరూకూడా యీ ఆఫీసులద్వారా ఉద్యోగాలు పొందవచ్చును.

## ఫాక్టరీలు

1947 ప్రారంభానికి మదరాసు రాష్ట్రంలో 3,449 ఫాక్టరీలు వున్నాయి. వీనిలో 377 కేవలం ఫాక్టరీలు పనిచెయ్యడానికి కావలసిన సరుకుల లభించే ఋతువులలో పనిచేసేవే. ప్రభుత్వానికి లెఖలు చూపిన 2,868 ఫాక్టరీలలో మొత్తం, రోజుకి సగటున 2,62,292 మంది పనిచేసినట్లు తెలుస్తోంది.

వివిధ ఫాక్టరీలలో పనిచేసిన వారిసంఖ్యల వివరాలు ఇవి: బట్టల మిల్లులు, 101,862; మోటారుబండ్ల నిర్మాణం, 7,094; రైల్వే కర్మాగారాలు, 9,516; ఇటుకలు, పెంకులు నిర్మాణం, 8,123; తోళ్ళను

పూనడం, 6,972; పొగాకు, 6,603; అగ్గిపెట్టెలు, 4,966; సినిమా స్టూడియోలు, 1,093; ఓడల నిర్మాణం, 2,400;

1946 లో రాష్ట్రంలోని ఫాక్టరీలలో మొత్తం, 5,481 ప్రమాదాలు జరిగాయి. వీటివల్ల చనిపోయినవారు, 41; తీవ్రంగా గాయపడిన వారు, 1,105; చిన్న గాయాలు తగిలినవారు, 4,335.

1946 లో రాష్ట్రంలో మొత్తం 152 సమ్మెలు జరిగాయి. అంతకు పూర్వం సంవత్సరం జరిగినవి, 42. 1946 లో జరిగిన సమ్మెలవల్ల, 4,30,000 మంది మనుష్యులుచేసేపని నష్టమైంది.

# రేవుపట్టణాలు

మదరాసు రాష్ట్రంలో 38 రేవులు వున్నాయి. వీటిలో మూడు,- మదరాసు, విశాఖపట్టణం, కొచ్చిన్-పెద్ద రేవులు. ఇవి కేంద్రప్రభుత్వం వారి నిర్వహణలో వున్నాయి. తక్కిన 35 రేవులూ. చిన్న రేవులక్రింద పరిగణింపబడుతున్నాయి. అవేవంటే: విశాఖపట్నం జిల్లాలో: బారువ, కళింగపట్నం. భీమునిపట్నం. తూర్పుగోదావరి జిల్లాలో: కాకినాడ. కృష్ణాజిల్లాలో : మచిలీపట్టణం. గుంటూరుజిల్లాలో : వాడరేవు. దక్షిణార్కాడు జిల్లాలో: కడలూర్, పోర్టోనోవో. తంజావూరు జిల్లాలో: తిరుమలవాసల్, ట్రాంక్విబార్, నాగపట్టణం, తొప్పుతురై, అదిరాంపట్నం, అమ్మపట్నం. రామనాథం జిల్లాలో: దేవిపట్నం, తొండి, పంబన్, ధనుష్కోడి, కిలకరై. తిరునెల్వేలిజిల్లాలో: పొన్నాని, కాలికట్, బడగర, కళ్ళాయి, తెల్లిచ్చేరి, కన్ననూర్, అళిక్కల్. దక్షిణ కన్నడ జిల్లాలో: కాసర్గోడ్, మెంగుళూర్, ముల్కి, మాల్పె, హంగరకోట, కుందపూర్, బైందూర్, భత్కల్.

ఇవన్నీ కూడా తీరవ్యాపారానికి అనుకూలంగా వున్నవే.

**మదరాసు :** మదరాసురేవు కేంద్రప్రభుత్వ పరిపాలనలోనే వున్నా, స్థానికంగా దీని పరిపాలనను నిర్వహించడానికి, పోర్టుట్రస్టు అనే పేరుతో ఒక ధర్మకర్తల బోర్డు నియమించబడినది. ఈ బోర్డులో

ప్రభుత్వం నియమించిన సభ్యులూ, స్థానిక వ్యాపార, వాణిజ్య, పరిపాలనా సంస్థల తరఫున ఎన్నుకోబడిన సభ్యులూ వుంటారు.

1946-47 లో మదరాసు రేవుకు వచ్చి వెళ్ళిన ఓడల సంఖ్య 879.

విశాఖపట్టణం : విశాఖపట్టణం హార్బరు నిర్మాణానికి స్కీము ఈస్టిండియా కంపెని రోజులలోనే వేయబడినా, 1925 దాకా దానిని కార్యరూపంలోకి తెచ్చే ప్రయత్నం జరగలేదు. 1933 లో హార్బరు ఓడలు నిలవడానికి తెరువబడింది. ఈ రేవు పరిపాలన కేంద్రప్రభుత్వం వారిచే నియమింపబడిన ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు సాగిస్తాడు.

కొచ్చిన్ : కొచ్చిన్ కూడా ఇటీవలనే నిర్మించబడిన హార్బరులలో ఒకటి. 1930 లో ఇది ఓడల రక్షణకు తెరువబడింది. మదరాసు రాష్ట్రపు దక్షిణ జిల్లాలకూ, కొచ్చిన్, తిరువాంకూరు సంస్థానాలకూ విదేశ వ్యాపారానికి ఈ రేవు ఎక్కువగా ఉపయోగిస్తున్నది. యూరప్ నుంచి ఆస్ట్రేలియాకు వెళ్ళే ఓడలు, కొచ్చిన్ రేవును తగిలి మరీ వెళ్లుతాయి. 1936 లో దీనిని పెద్దరేవులలో ఒకటిగా నిర్ణయించి కేంద్రప్రభుత్వం వారు తమ పరిపాలనలోకి తీసుకున్నారు.

కాకినాడ : మదరాసు రాష్ట్రంలోని రేవులలో ముఖ్యమైన వాటిలో అయిదవస్థానం కాకినాడ రేవుది. పెద్దపెద్ద ఓడలు, రేవుకు ఆరు, ఏడు మైళ్ళదూరంలో సముద్రంలోనే నిలబడతాయి. ఒడ్డునుంచి చిన్న లాంచీలు ఓడలదగ్గరకు వెళ్లి సరకులను ఎత్తడం, ఒడ్డుకు తీసుకు రావడం మొదలైనపని చేస్తాయి. ఇక్కడనుంచి విస్తారంగా ఎగుమతి అయే సరకులు, వేరుశనగలు, ఆముదపు గింజలు. ఇవన్నీ యూరపుకే వెడతాయి. అమెరికానుంచి కిరసనాయిలూ, ఇంగ్లండునుంచి లోహాలూ ఇక్కడ దిగుమతి అవుతాయి. ఈ రేవును పెద్దరేవుగా అభివృద్ధి చెయ్యాలని ఇటీవల జరిగిన సూచనపైె, కేంద్రప్రభుత్వంవారు నియమించిన కమిటీవారు విచారణ జరిపారు. కాని, దీనికి 80 మైళ్ళలో ఉత్తరాన విశాఖపట్టణమూ, 270 మైళ్ళలో దక్షిణాన మదరాసూ వున్నందున, ఈ రేవును అభివృద్ధిపరచడం మంచిది కాదని, ఆ కమిటీవారు శిఫార్సు చేశారు. దానిని ప్రభుత్వంవారు ఆమోదించారు.

# సముద్ర వ్యాపారము

మదరాసు రాష్ట్రానికి సముద్రం మీదుగా విదేశాలనుంచి 1946-47 లో 43,41,00,000 రూపాయల విలువగల సరకు దిగుమతి అయింది. 63,47,00,000 రూపాయల విలువగల సరకు ఎగుమతి అయింది. రాష్ట్రంలోనే ఒక రేవునుంచి మరొక రేవుకు 63,76,00,000 రూపాయల విలువగల సరకు రవాణా అయింది.

విదేశాలనుంచి, మదరాసు రాష్ట్రపు రేవులలో 1946-47 లో దిగుమతి అయిన సరకులలో ముఖ్యమైనవి :

| సరకు : | విలువ (వేల రూపాయలలో) |
|---|---|
| ఆహారధాన్యములు | 13,82,51 |
| యంత్రములు | 4,46,91 |
| మోటారుబండ్లు, సైకిళ్లు | 1,88,89 |
| కాగితము | 1,12,24 |
| ప్రత్తి | 1,12,16 |
| ఎరువులు | 1,42,33 |

1946-47 లో మదరాసురాష్ట్రపు రేవులలో 1637 మోటారు కార్లూ, 34,129 సైకిళ్లూ దిగుమతి అయాయి.

1946-47 లో మదరాసు రాష్ట్రంనుంచి విదేశాలకు ఎగుమతి అయిన సరకులలో ముఖ్యమైనవి :

| సరకులు : | విలువ (వేల రూపాయలలో) |
|---|---|
| తోళ్లు | 15,82,49 |
| నూనెలు | 1,08,03 |
| పీచుతో చేసిన వస్తువులు | 5,70,13 |
| టీ | 5,19,36 |
| పొగాకు | 5,83,78 |
| రబ్బరు | 3,03 |

# పరిశ్రమలు

1945 ఆగస్టులో యుద్ధం అంతమొందినప్పటికీ, విదేశాలనుంచి కావలసినంతగా యంత్రసామగ్రి మన దేశానికి దిగుమతి కాకపోవడం వల్ల, పరిశ్రమలు మదరాసు రాష్ట్రంలో ఎక్కువగా అభివృద్ధి పొందలేదు. అయితే, ఒక ముఖ్య గమనించాంశం ఏమిటంటే, మదరాసు రాష్ట్రం లోని పలువురు ఉత్సాహవంతులు, రాష్ట్ర పరిశ్రమలను చాలా అభివృద్ధిలోకి తీసుకురావడానికి విశేషకృషి చేస్తున్నారు. వీరిలో కొంతమంది, విదేశాలనుంచి యంత్రసామగ్రిని వీలైనంత త్వరగా దిగుమతి చేసుకోడానికి, తమ తరఫున ఎవరినైనా పంపిగాని, తాము స్వయముగా వెళ్ళి గాని ప్రయత్నాలు చేస్తున్నారు.

మదరాసు రాష్ట్రంలోని ముఖ్యపరిశ్రమలనుగురించి క్రింది వివరాలు చూడండి.

**బట్టలు, నూలుమిల్లులు :** మనరాష్ట్రంలో అత్యధిక సంఖ్యాకులకు పని కలిగించేవీ, అధిక సంఖ్యలో వున్నవీ బట్టలమిల్లులూ, నూలు మిల్లులు. 1947 లో ఈ రాష్ట్రంలో, ఇలాంటి మిల్లులు 72 వున్నాయి. వీటిలో 18 ఫ్యాక్టరీలు, వేజోళ్ళు పనీములు మొదలైనవి తయారుచేసేవి. మిగతా 54 నూలు, బట్టలు తయారుచేసేవి. వీటిలో 45 నూలు తయారు చేసేవే.

**జనపనార :** 1946–47 లో మదరాసు రాష్ట్రంలో నాలుగు జనపనార మిల్లులువున్నాయి. గోనెసంచుల అవసరం ఏమీ తగ్గనందున యీ మిల్లులన్నీ కూడా లాభసాటి వ్యాపారాన్నే సాగించాయి.

**తోళ్ల వ్యాపారం :** భారతదేశంనుంచి విదేశాలకు పూనిన తోళ్ళను అత్యధికంగా ఎగుమతిచేసే ప్రాంతాలలో మదరాసు రాష్ట్రం ఒకటి. 1946-47 లో, యీ రాష్ట్రంనుంచి 6,68,39,000 రూపాయల విలువగల పూనిన తోళ్ళు, 8,77,41,000 రూపాయల విలువగల పూనిన చర్మాలూ ఎగుమతిచేయబడినాయి.

పొగాకు : ఇండియాలో ఉత్పత్తి అయే సిగరెట్ పొగాకులో నూటికి 95 వంతులు, గుంటూరు, కృష్ణా, తూర్పుగోదావరి జిల్లాల లోనే ఉత్పత్తి అవుతుంది 1945 లో, యీ నాలుగు జిల్లాలలోను 3,28,185 ఎకరాల భూమిలో పొగాకు పండించబడింది. 1945-46 లో దాదాపు ఆరుకోట్ల రూపాయల విలువగల పొగాకు ఎగుమతి చేయబడింది.

పంచదార : 1947 ఫిబ్రవరి నాటికి ఈరాష్ట్రంలో 14 పంచ దార ఫ్యాక్టరీలు వున్నాయి. ఈ ఫ్యాక్టరీలలో, 1946-47 లో మొత్తం 51,178 టన్నుల పంచదార తయారుచెయ్యబడింది. 1946-57 లో యీ రాష్ట్రంలో 1,79,960 ఎకరాల భూమిలో చెరుకుపంట వెయ్య బడింది. దానిలో పండిన చెరకు మొత్తం 47,90,000 టన్నులనీ, దాని నంతనూ బెల్లంగా మార్చినట్లయితే, 5,27,000 పైచిలుకు బెల్లం తయా రవుతుందనీ అంచనా వేయబడింది.

వేరుశెనగ : 1946-47 లో మదరాసు రాష్ట్రంలో మొత్తం 40,40,000 ఎకరాలభూమిలో వేరుశెనగపంట వేయబడినట్లు అంచనా. అంతకు పూర్వపు సంవత్సరం యీ పంట, 39 లక్షల ఎకరాల భూమిలో వెయ్యబడింది. 1945-46 లో 13,40,000 టన్నుల వేరుశెనగకాయలు పండితే, 1946-47 లో 16,33,000 టన్నులు మాత్రమే పండినాయి. 1946-47 లో 1,84,41,000 రూపాయల విలువగల వేరుశెనగ బర్మాకు ఎగుమతి చెయ్యబడింది.

నువ్వులనూనె : 1946-47 లో 6,52,000 ఎకరాలలో నువ్వుల పంట వేయబడింది. అంతకు పూర్వపు సంవత్సరంలో 5,58,000 ఎకరాలలో వెయ్యబడింది. 1946-47 లో రు, ౭,09,000, విలువగల నువ్వులనూనె మదరాసు రాష్ట్రంనుంచి సిలోనుకు ఎగుమతి చెయ్య బడింది.

పెంకులు : 1946-47 లో పెంకుల పరిశ్రమబాగానే వృద్ధి పొందింది. సరకు కావలసినంతగా ఉత్పత్తి అవలేదు. 16,59,000 రూపాయల విలువగల పెంకులు విదేశాలకు ఎగుమతి చేయబడినవి.

సిమెంటు: తగినంతగా రాతిసిబొగ్గు దొరకనందున, మదరాసు రాష్ట్రంలో సిమెంటు ఉత్పత్తి తగ్గింది. అయితే, యుద్ధకాలంలో నిలచిపోయిన నిర్మాణాలన్నిటికోసం, సిమెంటు గిరాకీ మాత్రం చాలా హెచ్చుగానే వుంది. మదరాసు రాష్ట్రంలోని సిమెంటు ఫ్యాక్టరీలలో, 1945-46 లో పనిచేసిన కార్మికుల సంఖ్య, 2,224. ఆంధ్రదేశంలో, బెజవాడలోను, తాడేపల్లి వద్దను సిమెంటు ఫ్యాక్టరీలు ఉన్నాయి.

అగ్గిపెట్టెలు: మదరాసు రాష్ట్రంలో అగ్గిపుల్లల తయారు 1946-47 లో, అంతకు పూర్వపు సంవత్సరకంటె తగ్గింది. రాష్ట్రంలో అగ్గిపుల్లల అమ్మకం, గత సంవత్సరంకంటె, నూటికి 19 పాళ్ళు పెరిగింది. తిరువాన్కూరు సంస్థానంలోవున్న అగ్గిపుల్లల ఫ్యాక్టరీని తమస్వాధీనంలోకి తెచ్చుకొని, తద్వారా యీ పరిశ్రమను అభివృద్ధి పరచడానికి, శ్రీపురం ప్రకాశరావుగారు కృషిచేస్తున్నారు.

గాజుపరిశ్రమ: గాజుపరిశ్రమ ఇటీవల మదరాసు రాష్ట్రంలో కొంత ముందుకు వస్తున్నది. మదరాసులో శ్రీపురం ప్రకాశరావుగారి నిర్వహణలో ఒక గాజు ఫ్యాక్టరీ పనిచేస్తున్నది. రాజమండ్రిలో గోపాల్ గ్లాస్ వర్క్స్ స్థాపింపబడినది. రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో గాజు ఫ్యాక్టరీలను స్థాపించే ప్రతిపాదనలు ప్రభుత్వం ఆమోదానికి ఎదురు చూస్తున్నాయి.

సబ్బు పరిశ్రమ: మదరాసు రాష్ట్రంలో, ప్రభుత్వంవారిచే కాలికట్‌లో స్థాపింపబడిన కేరళసోప్ ఇన్‌స్టిట్యూట్ తప్ప వేరే సబ్బుల ఫ్యాక్టరీ ఏదీ పెద్దదిలేదు. గృహపరిశ్రమతీరుగా సబ్బులను తయారుచేయడం జరుగుతున్నది. కాని, అది అంత లాభదాయకం కానందువల్ల ఎక్కువమంది సబ్బులను తయారుచెయ్యడానికి పూనుకోవడం లేదు. సబ్బులకు గిరాకీమాత్రం హెచ్చుగానేవుంది.

ప్రభుత్వ యాజమాన్యంలో నిర్వహింపబడుతున్న కేరళ సోప్ ఇన్‌స్టిట్యూట్, 1946-47 లో 675 టన్నుల సబ్బులను తయారుచేసింది. వీటి అమ్మకపు విలువ, రు. 12,71,000. ఈ ఫ్యాక్టరీలో పెద్ద ఆధునిక యంత్రాలను నెలకొల్పి దీనిని అభివృద్ధికి తీసుకురావడానికి, ప్రభుత్వం

వారు బడ్జెటులో డబ్బుకూడా ఏర్పాటుచేశారు. 1946-47 లో యీ ఇన్‌స్టిట్యూట్‌లో 16 మంది విద్యార్థులకు, సబ్బు తయారు చెయ్యడం నేర్పబడింది.

చేపనూనె తియ్యడం : కాలికట్‌లో మదరాసు ప్రభుత్వం వారు స్థాపించిన గవర్నమెంట్ ఆయిల్ ఫ్యాక్టరీలో, 1946-47 లో మొత్తం 15,004 గాలనుల షార్కు లివరు ఆయిల్ తియ్యబడింది. విదేశాలనుంచి కాడ్‌లివర్ ఆయిల్ దిగుమతి, యుద్ధకాలంలోకంటె ఎక్కువగా జరిగినందునను, బొంబాయి, సింధు రాష్ట్రాలలోకూడా చేపనూనెను తియ్యడం ప్రారంభించినందుననూ, కాలికట్ ఫ్యాక్టరీలో తయారైన నూనె అమ్మకం 1946-47 లో తగ్గింది.

మోటారుబండ్ల నిర్మాణం : యుద్ధకాలంలో మిలిటరీ శాఖవారు ఉపయోగించిన, లేదా ఉపయోగించడానికి తెప్పించుకున్న మోటారు లారీలను, జీప్‌లను యుద్ధానంతరం విశేషంగా, వేలంపాటలలో ప్రజలకు అమ్మివేశారు. ఆ బండ్లనుకొన్నవారి ఇష్టప్రకారం వాటికి బాడీలను కట్టడానికీ, వాటికి మరమ్మతులను చెయ్యడానికీ చాలా వర్కుషాపులు రాష్ట్రంలో కొత్తగా స్థాపించబడినాయి. వీటిలో అధిక భాగం మదరాసు నగరంలోనే వున్నాయి. యుద్ధకాలంలో మోటారు డ్రైవర్లుగాను, మెకానిక్కులుగాను పనిచేసి విడుదల పొందినవారికి చాలామందికి ఈ వర్కుషాపులలో వుద్యోగాలు దొరుకుతున్నాయి. ఇలాటి సంస్థలలో, ఆంధ్రుల యాజమాన్యంలో సమర్థంగా నిర్వహింపబడుతున్నది, కుట్టీ అండ్ రావ్ (ఇంజనీర్స్) లిమిటెడ్, మదరాసు.

పిప్పరమెంట్ల తయారు : యుద్ధకాలంలో విదేశాలనుంచి పిప్పరమెంట్లు దిగుమతి అవడం పూర్తిగా తగ్గిపోయింది. దేశీయ పరిశ్రమలకు మంచి అవకాశం కుదిరింది. ఆంధ్రుల యాజమాన్యాన, ఆంధ్రుల పెట్టుబడిలో పిప్పరమెంట్ల ఫ్యాక్టరీ స్థాపన, 1943 లో జరిగింది. దానిపేరు, కె. స. పి. కన్ఫెక్షనరీ. దీనిని స్థాపించినవారు, చల్లపల్లి రాజాగారి సోదరులైన శ్రీ రాజా యార్లగడ్డ రామకృష్ణప్రసాద్ గారు. స్థాపించిన మూడు సంవత్సరాలలో, ఈ సంస్థను వీరు చాలా అభివృద్ధికి

తీసుకువచ్చారు. వీరు తయారుచేసిన అనేకరకాల తీపివస్తువులు 'సావరిన్ స్వీట్స్' అనే మార్కుతో అమ్మబడుతున్నాయి.

**కాగితము** : మదరాసు రాష్ట్రంలో ఒకే ఒక కాగితాల మిల్లు వుంది. అది రాజమండ్రిలోని ఆంధ్ర పేపర్ మిల్స్ కంపెనీ. ఇటీవల యీ మిల్లు యాజమాన్యం విషయంలో దావాలు జరిగినవి. ప్రస్తుతం ఇది కోర్టువారి అజమాయిషీలో వుంది. ఇది తప్ప వేరే కాగితాల మిల్లు లేక పోయినప్పటికీ, చేతితో కాగితం తయారుచేసే పరిశ్రమ మదరాసు రాష్ట్రంలో బాగానే జరుగుతున్నది. చేతితో కాగితంచేసే పరిశ్రమను ప్రోత్సహించే ఉద్దేశంతో, బెజవాడ, గాజులపల్లి, బగ్గ అనే మూడు చోట్ల కేంద్రాలను ప్రభుత్వంవారు స్థాపించారు. ఈ పరిశ్రమలో ట్రెయినింగు యివ్వడానికీ, కాగితం తయారుచెయ్యడానికీ యీ కేంద్రాలు ఉపయోగపడుతున్నాయి. ఇవికాక, మదరాసు, కోయంబత్తూరు, మధుర, పాలంకోట, సేలం నగరాలలోని సెంట్రల్ జెయిళ్ళలో కూడా చేతితో కాగితం తయారుచేసే కేంద్రాలు స్థాపింపబడినవి.

**సినిమా** : 1939 లో రెండవ ప్రపంచయుద్ధం రాకపూర్వం సినిమాపరిశ్రమ చాలా గందరగోళంగా వుండేది. సమర్థులతోపాటు, అసమర్థులుకూడా ఈ పరిశ్రమలో ప్రవేశించి పరిశ్రమనడకను పాడు చెయ్యడమేకాక, తామూకూడా విశేషంగా నష్టపడ్డారు. యుద్ధంవచ్చిన తరువాత, రాఫిలిం ధర పెరగడమూ, కంట్రోలు ఏర్పడడమూ, తారల జీతాలూ, ఫిలిం నిర్మాణానికయే ఇతర ఖర్చులూ పెరగడమూ, వీటన్నిటి వల్లా తోచినవారంతా ఈ పరిశ్రమలో దిగడానికి వీలులేకపోయింది. పైగా, సరిగా పరిశ్రమను నిర్వహించలేనివారు బయటికి జారారు. యుద్ధకాలంలో తట్టుకొని నిలబడ్డ కంపెనీలు చాలా కొద్ది. యుద్ధం అయిపోయినతరువాత, కంట్రోలుపోగానే, మళ్ళీ ఫిలిం కంపెనీలు చాలా నెలకొన్నాయి. కాని, స్టూడియోలు ఎక్కువగా లేనందున, అందరూ త్వరత్వరగా ఫిలిములను బయటికి తీసుకురాలేకుండావున్నారు. తెలుగు వారి యాజమాన్యాన ప్రస్తుతం రెండు స్టూడియోలు మదరాసులో వున్నాయి. వీనిలో వాహినీ పిక్చర్సువారి స్టూడియో గత సంవత్సరమే ఆధునిక యంత్రములతో స్థాపింపబడినది.

ఇప్పటివరకూ, దెబ్బతినకుండా నిలిచి ఫిలిం నిర్మాణాన్ని సాగిస్తున్న తెలుగు ఫిలిం కంపెనీలలో ముఖ్యమైనవి ఇవి:

జగదీశ్ ఫిలిమ్సు; స్థాపన, 1939. నిర్వాహకులు, వై. వి. రావు గారు. తీసిన చిత్రాలు; మళ్ళీ పెళ్ళి, విశ్వమోహిని, సత్యభామ, తాసిల్దార్, లవంగి (తమిళం.)

రాజరాజేశ్వరి పిక్చర్స్: స్థాపన, 1939. నిర్వాహకులు, కటారి నాగభూషణంగారు, పసుపులేటి కన్నాంబగారు. మంచి కట్టుదిట్టమైన ఏర్పాట్లతో సాగుతున్న తెలుగు సినిమా కంపెనీలలో ఇది ఒకటి. తీసిన చిత్రాలు: తల్లిప్రేమ, సుమతి, పాదుక, హరిశ్చంద్ర (తమిళం).

రోహిణి పిక్చర్: స్థాపన, 1937. యజమానులు. హెచ్. ఎం. రెడ్డిగారు. తీసిన ఫిలుములు, గృహలక్ష్మి, తెనాలిరామకృష్ణ, ఘరానా దొంగ, జస్టిస్ (హిందీ).

వాహినీపిక్చర్స్ లిమిటెడ్: మొదట్లో రోహిణిపిక్చర్స్ కంపెనీని హెచ్. ఎం. రెడ్డిగారితో కలసి స్థాపించిన బి. ఎన్. రెడ్డిగారు, 1939లో రోహిణి పిక్చర్సునుంచి విడిపోయి, ఈ కంపెనీని స్థాపించారు. కంపెనీలో ప్రధాన వ్యక్తి బి. ఎన్. రెడ్డిగారు. శ్రీ మూలా నారాయణస్వామి, కె. వి. రెడ్డి, వి. నాగయ్య, బ్రిజ్ మోహన్‌దాస్, సముద్రాల రాఘవాచారిగార్ల సహకారంతో, ఈ కంపెనీ ఉత్తమ చిత్రాలను తయారుచేసింది. తీసిన చిత్రాలు: వందేమాతరం. సుమంగళి, దేవత, పోతన, స్వర్గసీమ, వేమన.

శోభనాచల పిక్చర్స్: 1937లో స్థాపింపబడిన జయాపిక్చర్స్ అనే సంస్థ 1944లో శోభనాచల పిక్చర్స్ అని మార్చబడింది. నిర్వాహకులు మీర్జాపురం జమీందారు. వీరికి సొంత స్టూడియో వుంది. (శోభనాచల స్టూడియోస్). ఇక్కడ తెలుగు చిత్రాలేకాక, ఇతర కంపెనీల చిత్రాలుకూడా తయారవుతున్నవి. తీసిన చిత్రాలు: జరాసంధ, భోజకాళిదాసు, జీవనజ్యోతి, దక్షయజ్ఞం, నారదసంసారం, గొల్లభామ, కీలుగుర్రం.

సారథి ఫిలిమ్సు లిమిటెడ్: 1936 లో, శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారిచే స్థాపింపబడింది. ఉత్తమ చిత్రాలను తయారుచేసే సంస్థలలో ఒకటిగా పేరుపొందింది. ఇప్పటివరకు ఈ కంపెనీ తీసిన చిత్రాలు: మాలపిల్ల, రైతుబిడ్డ, పత్ని, పంతులమ్మ, మాయలోకం, గృహప్రవేశం, వీటిలో ఒక్క మాయలోకం తప్ప మిగతావన్నీ సాంఘిక చిత్రాలే. ఈ కంపెనీ డైరక్టర్లబోర్డు అధ్యక్షులు, చల్లపల్లి రాజాగారు. మేనేజింగ్ డైరక్టర్, శ్రీ రాజా యార్లగడ్డ రామకృష్ణ ప్రసాద్ గారు.

# ఆంధ్ర బ్యాంక్ లిమిటెడ్

ఆంధ్రదేశంలో, ఆంధ్రుల పెట్టుబడితో, ఆంధ్రుల యాజమాన్యాన స్థాపింపబడిన మొట్టమొదటి బ్యాంకి ఇది. 1923 నవంబరు 20 తేదిన స్థాపింపబడి, 1923 నవంబరు 28 తేదిన ఈ బ్యాంకి పనిచెయ్యడం ఆరంభించింది. ఈ బ్యాంకి నిర్మాణానికి పునాదివేసినవారు, దానిని మంచి కట్టుదిట్టములలో నడిపి మంచిస్థితిలోనికి తీసుకొనివచ్చి, సమర్థుల నిర్వహణకు అప్పగించినవారు, నేడు జాతీయకాంగ్రెసు మహాసభ అధ్యక్షులు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు.

ఈ బ్యాంకి స్థితినిగురించి డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు 1948 అక్టోబరు 7 తేదిన ఇలా వ్రాశారు. "ఆంధ్ర బ్యాంక్ నిర్వహణంలో, కేవలం వ్యక్తిగత త్యాగాలుచెయ్యడంలో నేగాక, బల్ల దగ్గర కూచుని అంకెలు కూడి, డబ్బుకు సరియైన లెఖలను చూపి చక్కగా పనిచెయ్యడంలో కూడా ఆంధ్రులు సమర్థులేనని వెల్లడి అయింది...25 సంవత్సరాల ఉపయుక్తమైన సేవజేసిన యీ బ్యాంకిని సమర్థంగా, జయప్రదంగా నిర్వహిస్తున్న డైరక్టర్లనూ, ప్రస్తుతపు జనరల్ మేనేజరు వారణాశి కృష్ణమూర్తిగారున్నూ చాలా ప్రశంసాపాత్రులు."

బ్యాంకి స్థాపన జరిగిననాడు డైరెక్టర్లు: శ్రీ నంబూరి వెంకట సుబ్బారావుగారు, శ్రీ ఉదయగిరి గోపాలరత్నంగారు, శ్రీ తాడేపల్లి సుబ్బారావుగారు, శ్రీ తటవర్తి రామబ్రహ్మంగారు, శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగారు, శ్రీ భాగవతుల పిచ్చయ్యగారు, శ్రీ జల్లు వెంకట సుబ్బారావుగారు, శ్రీ కంతేటి రామకృష్ణయ్యగారు, శ్రీ వడ్లమూడి వరదరాజులు నాయుడుగారు, శ్రీ అవసా సుబ్బారాయుడు నాయుడు గారు, శ్రీ దారా శివరావుగారు, శ్రీ పాలకుర్తి రంగారావుగారు, రావుసాహెబ్ తోట వీరయ్యనాయుడుగారు, డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు (మేనేజింగ్ డైరెక్టర్).

1948 నవంబరు 20 నాటికి, బ్యాంకి రజతోత్సవం జరుపుకొనే నాటికి డైరెక్టర్లు: శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహదూర్ (చల్లపల్లి రాజా) గారు; శ్రీ తాడేపల్లి శ్రీరాములుగారు; శ్రీ పిళ్ళారిసెట్టి పార్థసారథి నాయుడుగారు; శ్రీ తటవర్తి నాగపోతరావుగారు; శ్రీ మాజేటి శేషగిరిరావుగారు; శ్రీ దారా విశ్వేశ్వరరావుగారు; శ్రీ రేపాక సత్యనారాయణమూర్తిగారు; శ్రీ మద్ది సుదర్శనంగారు; శ్రీ దంటు సూర్యారావుగారు; శ్రీ జల్లు మాణిక్యాలరావుగారు; శ్రీ పాలకుర్తి శోభనాద్రిగారు; శ్రీ కొకర్లమూడి సుబ్బారావు నాయుడుగారు.

డైరెక్టర్ల బోర్డు ఛైర్మన్, శ్రీ చల్లపల్లి రాజాగారు; మేనేజింగ్ డైరెక్టర్, శ్రీ తాడేపల్లి శ్రీరాములుగారు; జనరల్ మేనేజర్, శ్రీ వారణాశి కృష్ణమూర్తిగారు.

శ్రీ వారణాశి కృష్ణమూర్తిగారు జనరల్ మేనేజరుగా 1944 ఆగస్టులో యీ బ్యాంకికి వచ్చినప్పుడు, యీ బ్యాంకికి 19 బ్రాంచిలు వుండేవి. రిజర్వుఫండు లక్షరూపాయలలోపు వుండేది. డిపాజిట్లు 70 లక్షల రూపాయలు వుండేవి. ఈనాడు యీ బ్యాంకి రిజర్వుఫండు 8 లక్షల పైబడింది; డిపాజిట్లు నాలుగుకోట్లకన్న ఎక్కువగా వున్నవి.

బ్రాంచిలసంఖ్య, 42. ఈ బ్యాంకి 1926 లో పొందిన లాభం రు. 10,284 అయితే, 1947 లో యీ బ్యాంకి సంపాదించిన లాభం, రు. 5,22,000. ఇటీవల యీ బ్యాంకు వాటాదార్లకు నూటికి 8 రూపాయల డివిడెండు పంచబడినది. యుద్ధకాలంలో వ్యాపారం సరిగా జరుగనిరోజులలో లాభాలు తక్కువ వచ్చినప్పుడు, యేడాదికి నూటికి 4½ రూపాయల డివిడెండు మాత్రమే పంచబడింది. మొదటినుంచీ కూడా, యీ బ్యాంకి పంచే డివిడెండు, దేశంలోని వ్యాపార పరిస్థితులు, కంపెనీ సొత్తువంమీద ఆధారపడివుంటూనే వున్నది. అంచేత, బ్యాంకిని వృద్ధిలోకి తీసుకొనిరావడం, స్వలాభాపేక్షతోగాక, కేవలం సంస్థను వృద్ధిలోకి తీసుకొనివచ్చే నిశ్చయంతోనే, యీ బ్యాంకి డైరెక్టర్లు తమ నిర్వహణ కార్యక్రమాన్ని నడుపుతున్నారని స్పష్టమాతున్నది.

తూర్పుకోస్తాలోని ఒక చిన్నపట్టణంలో, పాతికేండ్లనాడు స్వల్పమూలధనంతో స్థాపింపబడిన, యీ ఆంధ్రసంస్థ యీనాడు మదరాసు నుంచి బరంపురందాకా, హైదరాబాదుతోసహా అన్ని ముఖ్యపట్టణాలలోను బ్రాంచిలనుగలిగి, డబ్బు దాచుకొనేవారి విశ్వాసాన్ని, అప్పు తీసుకొనేవారి నమ్మకాన్నిపొంది జయప్రదంగా సాగుతున్నదంటే, కలసికట్టుగా సద్భావంతో పనిచేస్తే ఆంధ్రులు గొప్పసంస్థలను నిర్వహించగలరని స్పష్టపడుతోంది.

## బట్టల కంట్రోలు

ఇండియాలో వుత్పత్తి అయే బట్టలలో, మదరాసు రాష్ట్రానికి తలకు ఏడాదికి పదిగజాల గుడ్డ యివ్వబడుతుందని 1947 జనవరి 1 తేదిన ప్రకటింపబడింది. 1946-47 సంవత్సరానికి మదరాసు రాష్ట్రానికి 110,676 బేళ్ళ మిల్లు గుడ్డ కోటా ప్రత్యేకించబడింది. కాని, రాష్ట్రానికి అందినది, 93,739 బేళ్ళు మాత్రమే.

1946-47 లో రాష్ట్రంలోని చేనేతవారికి పంచడానికి 217,415 బేళ్ళ నూలు కోటా యివ్వబడింది.

1949 నుంచి మదరాసు రాష్ట్రానికి, నెలకు 24,050 బేళ్ళ మిల్లు బట్టల కోటా యివ్వబడింది. ఈ బట్టల అమ్మకాన్ని రాష్ట్రంలో జరిపించడానికి మొత్తం 610 మంది టోకు వ్యాపారస్తులకు 10,102 మంది చిల్లర వ్యాపారస్తులకు లైసెన్సులు యివ్వబడినవి.

# గ్రామీణ బ్రాడ్‌కాస్టింగ్

రేడియో ప్రోగ్రాములను గ్రామస్తులకు వినిపించడానికి గ్రామాలలో రేడియో సెట్లను ఏర్పాటు చేయించడానికి, వాటిని తనిఖీ చేయడానికి, చెడిపోయినవాటిని బాగుచేయించడానికి, మదరాసు రాష్ట్రంలో యీ శాఖ ఏర్పాటు చేయబడింది. 1948 మార్చి 31 నాటికి ఈ డిపార్టుమెంటులో ఒక రేడియో ఇంజనీరు, అయిదుగురు అసిస్టెంటు రేడియో ఇంజనీర్లు, 58 మంది రేడియో సూపర్‌వైజర్లు పనిచేస్తున్నారు.

1948 మార్చి 31 నాటికి గ్రామాలలో 660, మునిసిపాలిటీలలో 197, జిల్లాబోర్డు, గవర్నమెంటు, ఇతర విద్యాసంస్థలలో 84 సెట్లు పనిచేస్తున్నాయి.

తెలుగుజిల్లాలలో పంజాయితీల ఆధీనంలోవున్న గ్రామీణ రేడియోసెట్ల వివరాలు ఇవి: మొత్తం 304. విశాఖపట్టణం, 19; తూర్పుగోదావరి, 55; పశ్చిమగోదావరి, 40; కృష్ణ, 45; గుంటూరు, 39; నెల్లూరు, 25; చిత్తూరు, 13; కడప, 8; కర్నూలు, 20; బళ్లారి, 21; అనంతపురం, 19.

వీటిలో 19 మాత్రమే విద్యుచ్ఛక్తివల్ల పనిచేసేవి; మిగతావి 285 బ్యాటరీసెట్లు.

తెలుగు జిల్లాలో మునిసిపాలిటీల ఆధీనంలోవున్న సెట్ల వివరాలివి: ఆదోని, 1; అనకాపల్లి, 2; అనంతపూర్, 2; బళ్ళారి, 5; విజయవాడ, 6; భీమునిపట్టణం, 1; చికాకోల్, 3; కాకినాడ, 4; కడప, 2; గుడివాడ, 2; గుంటూరు, 2; మచిలీపట్టణం, 1; నంద్యాల, 1; నెల్లూరు, 2; నరసరావుపేట, 2; పాలకొల్లు, 1; పెద్దాపురం, 1; ప్రొద్దటూర్, 2; రాజమండ్రి, 4; తాడిపత్రి, 1; తెనాలి, 6; విజయనగరం, 2; విశాఖపట్టణం, 3; ఏలూరు, 2; ఒంగోలు, 1.

# ప్రజోపయోగ సంస్థలు

అనేకవిధాల ప్రజలకు సేవచేస్తూవున్న సంస్థలలో, మదరాసు రాష్ట్రంలోని ముఖ్యమైన సంస్థలలో కొన్నిటి వివరాలు యీ క్రింద ఇవ్వబడినవి :

**అవ్వై హోం, అడయార్ :** అనాథబాలికలకు, యువతులకు రక్షణనివ్వడానికి స్థాపింపబడినది. ఒక అనాథాలయం, ఒక యువతీ విద్యాలయం, బీదబాలికలకు ఒక హాస్టల్, ఒక వృత్తి బోధనాలయం యీ సంస్థచే నిర్వహింపబడుతున్నవి. ప్రజల విరాళాలచే నిర్వహింపబడుతూ, యీ సంస్థ అనాథలకు గొప్ప సేవ చేస్తున్నది.

**ఆంధ్రమహిళాసభ లజ్, మైలాపూర్, మదరాసు :** జాతి, మత, కులభేదాలను పాటించకుండా, స్త్రీలసేవ చెయ్యడానికి కృషిచేస్తున్న సంస్థ. ఈ సభలో, స్త్రీలకు క్లబ్ మాత్రమేగాక, విద్యాబోధన, వృత్తివిద్యల శిక్షణ యివ్వడానికి వివిధశాఖలు ఉన్నాయి. మహిళా విద్యాలయంలో హిందీ పరిక్షలకు, బెనారెస్ యూనివర్శిటీ పరిక్షలకు బోధనచెయ్యబడుతుంది. కళాకేంద్రంలో, సంగీతం, నాట్యం మొదలగు లలితకళలు నేర్పబడుతవి. అంతేగాక, జీవనోపాధిలేని యువతులకు వృత్తి, విద్యలు నేర్పబడుతవి. ఈ సంస్థలలో చదువుకొనే మహిళలు వుండడానికి హాస్టలుకూడా, యీ సభలోనేవుంది. అతి స్వల్పరూపంలో ప్రారంభమై యీ సభ నేడు మహిళలకు అత్యంత సేవచేస్తున్నది. ఈ వృద్ధికి కారకులు, శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు.

**గ్రుడ్డి, చెవిటి, మూగివారికి స్కూలు, కెతిడ్రల్, మదరాసు :** గ్రుడ్డి, మూగి, - చెవిటి బాలబాలికలకు విద్యాబోధన, వృత్తి విద్యల శిక్షణ యివ్వడానికి 1926 లో స్థాపింపబడినది. ప్రస్తుతం సుమారు 250 మంది బాలబాలికలు యీ సంస్థలో సహాయం పొందుతున్నారు. ఈ బాలబాలికలకు ఇంగ్లీషు, తమిళభాషలు మాత్రమే నేర్పబడుతున్నవి.

**బోయ్ స్కౌట్ అసోసియేషన్, ట్రిప్లికేన్, మదరాసు :** స్కౌటు ఉద్యమం ప్రారంభమైన రోజులలో, ఇండియాలో యీ వుద్యమంలో యూరపియనుబాలురు, ఆంగ్లో-ఇండియన్ బాలురు మాత్రమే చేర్చుకొనబడెడివారు. 1919 లో డాక్టర్ అనిబెసెంట్ భారతీయయువకులకొరకు ప్రత్యేకం ఒక స్కౌటు సంస్థను స్థాపించింది. దీనికి పోటీగా, అప్పుడు మదరాసు గవర్నరుగా వున్న పెంట్లండ్ ప్రభువు మరొక స్కౌటు సంస్థను స్థాపించారు. 1921 లో యీ రెండు సంస్థలు కలసిపోయాయి.

ఈ ఉద్యమం ఆశయం ఏమిటంటే బాలురకు సంఘసేవ, పౌరస్వత్వము, క్రమశిక్షణ, విధినిర్వహణ, సత్ప్రవర్తన మొదలైన సుగుణాలను నేర్పడం. ఇది దేశమంతటా వున్న వుద్యమం. మన రాష్ట్రంలోని అనేకనగరాలలో దీనికి బ్రాంచిలు వున్నాయి. సాధారణంగా హైస్కూళ్ళన్నిటిలోనూ బాలురు యీ సంస్థలో సభ్యులుగా వున్నారు. అనేక పట్టణాలలో, సభలు సమావేశాలు, ఉత్సవాలు జరుగుతున్నపుడు, ప్రజలను సమ్మర్దంలేకుండా సర్దటంలోను, వారికి అనేకవిధాల సహాయపడటంలోను స్కౌట్ బాలురు ఎంతో సహాయపడుతున్నారు.

**మదరాసు విజిలెన్స్ అసోసియేషన్, మైలాపూర్, మదరాసు :** గతిలేక వ్యభిచారపిశాచానికి లోబడిపోయిన యువతులను రక్షించి, వారికి ఏదైనా ఉద్యోగాలు చూపించడం, వివాహం చేయించడం మొదలైన సంఘసేవాశయముతో, 1925 లో స్థాపింపబడిన సంస్థ. ఈ సంస్థకు మదరాసునగరంలో నాలుగు, రాష్ట్రంలోని 48 పట్టణాలలో బ్రాంచిలు వున్నాయి. ఈ సంస్థలద్వారా 1931 నుంచి 1947 లోపల సుమారు 2700 మంది యువతులు సన్మార్గంలో పెట్టబడినారు,

**శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూర్, మదరాసు :** మహర్షి శ్రీ రామకృష్ణ పరమహంస పేరిట స్థాపింపబడి, దేశం అంతటా బ్రాంచిలుగల మఠం. మదరాసులోని మఠం, 1897 లో

స్థాపింపబడింది. వేదాంతబోధ, శాస్త్ర, కళా, పరిశ్రమలలో శిక్షణ, వేదాంత, మతగ్రంథముల ప్రచురణ, ఈతిబాధలవల్ల యిబ్బందిపడే ప్రజలకు సహాయంచెయ్యడం, యీ మఠం ఆశయాలు. మదరాసునగరంలో యీ మఠం ఒక కాలేజిని, ఒక హైస్కూలును, బాలికలకు శ్రీ శారదా విద్యాలయాన్నీ, విద్యార్థుల వసతిగృహాన్నీ, ఒక వృత్తి విద్యాబోధనశాలను, ఒక వైద్యశాలను నిర్వహిస్తున్నది. ఈ మఠం నిర్వహణ అంతా ఉదారుల విరాళాలవల్లనే జరుగుతున్నది.

**సేవాసమాజం, నుంగంబాకం, మదరాసు :** మదరాసు రాష్ట్రంలోని బీదలకు సహాయంచెయ్యడానికి గిల్డ్ ఆఫ్ సర్వీసు అనే పేరుతో 1923 లో స్థాపింపబడినది. మొదటిలో యీసంస్థ నిర్వాహణ ఆంగ్లేయయువతులే చేసేవారు. ప్రస్తుతం, అన్నిజాతులకూ కులాలకూ చెందిన 450 మంది సభ్యులువున్నారు. ఈ సంస్థకు రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోను బ్రాంచిలు వున్నాయి. దీనిని అభివృద్ధికి తేవడంలో 1946-48 లలో మదరాసు గవర్నరుగావున్న సర్ ఆర్చిబాల్డ్ నై భార్య లేడీ నై చాలా కృషిచేశారు. బీదస్త్రీలకు వివిధసహాయాలను చెయ్యడంలో యీ సంస్థ చాలా ప్రశంసనీయమైన పనిచేస్తున్నది.

**హిందుస్తాన్ స్కౌట్ అసోసియేషన్, మైలాపూర్, మదరాసు :** భారతీయులకు స్కౌట్ ఉద్యమంలో మొదట ప్రవేశం ఇవ్వనందున, భారతీయ బాలురకు స్కౌటు ఉద్యమంలాంటి శిక్షణనిచ్చే ఉద్దేశంతో, 1918 లో పండిత మదనమోహన మాలవీయ, పండిత హృదయనాథ కుంజ్రూ, పండిత శ్రీరాం వాజపేయగార్లు సేవాసమితి బోయ్ స్కౌట్స్ అసోసియేషన్‌ను అలహాబాదులో స్థాపించారు. దీనికి బ్రాంచి 1923 లో మదరాసులో స్థాపించబడింది. 1937 లో హిందూస్తాన్ స్కౌట్ అసోసియేషన్ అనే పేరుతో యీసంస్థ బొంబాయిలోని మరొక సంస్థతో కలిసి, దేశీయసంస్థగా మారిపోయింది. ఇప్పుడు, దేశ స్వాతంత్ర్యం వచ్చింది కనుక యీసంస్థనూ, బోయ్‌స్కౌట్ అసోసియేషనునూ కలిపి ఒకే సంస్థగా చెయ్యడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

# జమీందారీలు

మదరాసు రాష్ట్రంలో, జమీందారుల అధీనంలో మొత్తం 1,34,49,774 ఎకరాల భూమి వున్నది. జమీందారులు, తమ అధీనంలో వున్న భూమినుంచి మొత్తం, రు. 70,50,456 వసూలు చేసుకుంటున్నారని అంచనా. వీరు రాష్ట్రప్రభుత్వానికి చెల్లించే పేష్కష్ మొత్తం, 47,49,747 రూపాయలు. తెలుగు జిల్లాలలోని ముఖ్యమైన జమీందారీల వివరాలు యివి :

వెంకటగిరి : వైశాల్యం, 22,09,611 ఎకరాలు. దీనిలో వ్యవసాయం జరుగుతున్నదీ, వ్యవసాయ యోగ్యమైనదీ, 13,15,092 ఎకరాలు. జమీందారు ఆదాయం, రు. 12,61,202. ప్రభుత్వానికి కట్టే పేష్కష్, రు. 4,21,113.

విజయనగరం : వైశాల్యం. 8,74,196 ఎకరాలు; దీనిలో వ్యవసాయానికి పనికివచ్చేదీ, వ్యవసాయం జరుగుతున్నదీ మొత్తం, 6,37,046 ఎకరాలు. జమీందారు ఆదాయం, రు. 21,31,456. ప్రభుత్వానికి చెల్లించే పేష్కష్ రు. 11,26,076.

పిఠాపురం : వైశాల్యం. 2,09,177 ఎకరాలు. దీనిలో వ్యవసాయం జరుగుతున్నదీ, వ్యవసాయయోగ్యమైనదీ, 1,70,370 ఎకరాలు,

దేవరకోట (చల్లపల్లి): వైశాల్యం. 1,00,739 ఎకరాలు. దీనిలో వ్యవసాయం జరుగుతున్నదీ, వ్యవసాయయోగ్యమైనదీ, 90,390 ఎకరాలు. జమీందారు ఆదాయం, రు. 2,75,549; ప్రభుత్వానికి చెల్లించే పేష్కష్, రు. 2,55,675.

బొబ్బిలి : వైశాల్యం. 1,48,802 ఎకరాలు. వ్యవసాయానికి పనికివచ్చేదీ, వ్యవసాయానుకూలమైనదీ, 1,27,202 ఎకరాలు. జమీందారు ఆదాయం రు. 7,23,804.

# జిల్లాలు

మనరాష్ట్రంలో మొత్తం 25 జిల్లాలు వున్నాయి. వీటిలో మదరాసు నగరం ఒక్కటీ, 52 చ. మైళ్ళ వైశాల్యంతో, ఒక జిల్లాగా ఏర్పాటు చేయబడింది. మిగతావన్నీ తాలూకాలు, గ్రామాలు గల జిల్లాలే. వీటన్నిటిలోకీ ఎక్కువ వైశాల్యంగల జిల్లా విశాఖపట్టణం. తక్కువ వైశాల్యం గలది

మదరాసుకాక, మిగతా 24 జిల్లాలలోను 11 జిల్లాలు ఫక్తు తెలుగు జిల్లాలు. వీటి మొత్తం వైశాల్యం, 67,025 చ. మైళ్ళు. కేవలం భూమి పన్ను, నీటి తీరువపన్నువల్ల, యీ తెలుగు జిల్లాలనుంచి 1946-47 లో రాష్ట్రప్రభుత్వానికి వచ్చిన ఆదాయం రు. 5,13,08,733. ఈ తెలుగు జిల్లాలు ఏవంటే, అనంతపురం, కడప, కర్నూలు, కృష్ణ, గుంటూరు, చిత్తూరు, తూర్పుగోదావరి, నెల్లూరు, పడమటి గోదావరి, బళ్ళారి, విశాఖపట్టణం.

ఇవికాక మిగతా 13 జిల్లాల వైశాల్యం మొత్తం 59,111 చ. మైళ్ళు. ఈ జిల్లాలలో ప్రభుత్వానికి భూమిపన్ను, నీటి తీరువ పన్ను ఆదాయం 1946-47 లో రు. 5,28,80, 544.

## అనంతపురం

వైశాల్యం : 6,734 చ. మైళ్లు. జనాభా, 11,71,419; పురుషులు, 603,991; స్త్రీలు, 5,67,428. హిందువులు, 10,44,117; ముస్లిములు, 1,18,435.

జిల్లాలో భూమి 43,11,447, ఎకరాలు. దీనిలో అడవి, 446 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 4,75,188 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 9,91,515 ఎకరాలు. 1946-47 లో

పంటవేసిన భూమి, 18,84,138 ఎకరాలు. జిల్లా మొత్తం మీద భూమి పన్ను, నీటి తీరువపన్ను, ప్రభుత్వాదాయం, రు. 19,50,352.

తాలూకాలు తొమ్మిది : అనంతపురం, మడకశిర, కదిరి, గుత్తి, హిందూపురం, పెనుకొండ, కల్యాణదుర్గం, ధర్మవరం, తాడిపత్రి.

జిల్లా కేంద్రనగరం : అనంతపురం.

## ఉత్తరార్కాడు

వైశాల్యం : 4,671 చ. మైళ్లు; జనాభా, 25,77,540; పురుషులు, 12,93,692; స్త్రీలు, 12,83,848; హిందువులు, 23,51,516; ముస్లిములు, 1,74,317.

జిల్లాలో భూమి 29,74,637 ఎకరాలు. దీనిలో అడవి 757 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 4,79,990 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 3,87,753 ఎకరాలు. 1946-47 లో పంటవేసినభూమి, 12,36,498 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమి పన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం, రు. 64,90,951. ఇదికాక, ఎస్టేటు పేష్కష్‌లవల్ల ఆదాయం, రు. 62,356.

జిల్లాలో తాలూకాలు పది; కేంద్రనగరం, వెల్లూరు.

## కడప

వైశాల్యం: 5,923 చ. మైళ్ళు. జనాభా, 10,56,507; పురుషులు, 5,41,005; స్త్రీలు, 5,15,452; హిందువులు, 8,63,476; ముస్లిములు, 1,47,258.

జిల్లాలో భూమి 37,90,752 ఎకరాలు, దీనిలో అడవి, 1156 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 455,967 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 858,660 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 9,20,918 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వా దాయం, రు. 20,75,826.

తాలూకాలు ఎనిమిది: కడప, ప్రొద్దటూరు, రాజంపేట, జమ్మల మడుగు, పులివెందల, బద్వేల్, రాయచోటి, సిద్ధవటం.

జిల్లా కేంద్రనగరం: కడప.

## కర్నూలు

వైశాల్యం: 7,634 చ. మైళ్ళు; జనాభా, 11,46,250; పురుషులు, 5,79,688; స్త్రీలు, 5,66,562; హిందువులు, 874,289; ముస్లిములు, 1,73,157.

జిల్లాలో భూమి 48,53,320 ఎకరాలు. దీనిలో అడవి, 1647 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 301,561 ఎకరాలు. వ్యవసాయంచెయ్యకుండా వున్న బీడు 6,36,926 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి 15,78,524 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం రు. 26,02,126.

తాలూకాలు తొమ్మిది : కర్నూలు, ద్రోణాచలం, నంద్యాల, పత్తికొండ, నందికొట్కూరు, సిరువెళ్ళ, కంబం, మార్కాపురం, కోయిల్ కుంట్ల.

జిల్లా కేంద్రనగరం : కర్నూలు.

## కృష్ణ

వైశాల్యం: 3,469 చ. మైళ్ళు; జనాభా, 14,44,294; పురుషులు, 7,34,835; స్త్రీలు, 7,09,409 ; హిందువులు, 12,35,242 ముస్లిములు, 76.722.

జిల్లాలో భూమి 22,22,217 ఎకరాలు. దీనిలో. అడవి 110 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 413,438 ఎకరాలు. వ్యవ

సాయం చెయ్యకుండా వున్న బీడు 281,938 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి 5,14,342 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం, రు, 51,72,065. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 2,55,675.

తాలూకాలు తొమ్మిది: బందరు, విజయవాడ, నూజవీడు, నందిగామ, కైకలూర్, గుడివాడ, దివి, గన్నవరం, తిరువూరు.

జిల్లా కేంద్రనగరం : మచిలీపట్టణం.

## కోయంబత్తూరు

వైశాల్యం: 7,121 చ. మైళ్ళు. జనాభా, 28,09,648; పురుషులు 14,08,982; స్త్రీలు, 14,00,666; హిందువులు, 26,51,993; ముస్లిములు 73,169.

జిల్లాలో భూమి 45,51,376 ఎకరాలు. దీనిలో అడవి, 1448 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 345.730 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 124,443 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి 23,52,706 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను మొత్త ప్రభుత్వాదాయం, రు. 2,51,297. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది: రు. 24,521.

తాలూకాలు పది: జిల్లా కేంద్రనగరం, కోయంబత్తూరు.

## గుంటూరు

వైశాల్యం : 5,795 చ. మైళ్ళు; జనాభా, 22,77,283; పురుషులు, 11,55,926; స్త్రీలు, 11,21,357; హిందువులు, 17,97,256; ముస్లిములు 1,83,298.

జిల్లాలలో భూమి, 36,89,846 ఎకరాలు. దీనిలో అడవి, 468 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 465,860 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 214,683 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 19,30,463 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం, రు. 75,43,619. ఇదికాక ఎస్టేట్ పేష్కుష్‌వల్ల వచ్చినది, రు. 44,904.

తాలూకాలు తొమ్మిది : గుంటూరు, ఒంగోలు, బాపట్ల, తెనాలి, రేపల్లి, నరసరావుపేట, పల్నాడు, వినుకొండ, సత్తెనపల్లి.

జిల్లా కేంద్రనగరం : గుంటూరు.

## చిత్తూరు

వైశాల్యం, 5,951 చ. మైళ్ళు; జనాభా, 16,32,395; పురుషులు, 8,35,368; స్త్రీలు, 7,97,027; హిందువులు, 15,20,731; ముస్లిములు, 97,000.

జిల్లాలో భూమి, 37,71,906 ఎకరాలు. దీనిలో అడవి, 523 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 14,87,185 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 618,348 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి 5,83,418 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 42,41,082. ఇదికాక ఎస్టేట్ పేష్కుష్‌వల్ల వచ్చినది, రు. 3,51,471.

తాలూకాలు తొమ్మిది: చిత్తూరు, మదనపల్లి, వాయల్పాడు, కాళహస్తి, పుత్తూరు, పుంగనూరు, తిరుత్తణి, పలమనేరు, చంద్రగిరి.

జిల్లా కేంద్రనగరం: చిత్తూరు.

## చంగల్పట్టు

వైశాల్యం, 3,074 చ. మైళ్ళు; జనాభా, 18,23,955; పురుషులు, 9,27,355. స్త్రీలు, 8,96,600; హిందువులు, 17,33,280; ముస్లిములు, 43,306.

జిల్లాలో భూమి, 19,65,560 ఎకరాలు. దీనిలో అడవి 126 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 607,462 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు 291,255 ఎకరాలు. 1946-47 లో పంట వేసిన భూమి, 701,038 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 12,99,467. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 1,53,034.

తాలూకాలు ఏడు. జిల్లా కేంద్రనగరం చంగల్పట్టు.

## తంజావూరు

వైశాల్యం, 3,738 చ. మైళ్ళు; జనాభా, 25,63,375; పురుషులు, 12,47,065, ; స్త్రీలు, 13,16,310 ; హిందువులు, 22,99,007 ; ముస్లిములు, 1,70,414.

జిల్లాలో భూమి, 23,95,752 ఎకరాలు. దీనిలో అడవి, 24 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 629,579 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 195,510 ఎకరాలు. 1946-47 లో పంట వేసిన భూమి, 11,72,146 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 42,31,212 ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 35,087.

తాలూకాలు పదకొండు. జిల్లా కేంద్రనగరం, తంజావూరు.

## తి రు చి నా ప ల్లి

వైశాల్యం, 4 329 చ. మైళ్ళు; జనాభా, 21,94,091; పురుషులు, 10,83,435; స్త్రీలు, 11,10,656; హిందువులు, 19,90,203, ముస్లిములు, 91,668.

జిల్లాలో భూమి, 27,68.554 ఎకరాలు. దీనిలో, అడవి, 144 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 446,786 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు, 316,849 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 14,88,886 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటి తీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 38,67,350. ఇదికాక ఎస్టేట్ పేష్కుష్‌వల్ల వచ్చినది రు. 58,141.

తాలూకాలు ఏడు; జిల్లా కేంద్రనగరం, తిరుచినాపల్లి.

## తి రు నె ల్వే లి

వైశాల్యం, 4,342 చ. మైళ్ళు; జనాభా, 22,44,543; పురుషులు, 10,90,998; స్త్రీలు, 11,53,545; హిందువులు, 18,34,253: ముస్లిములు, 1,44,950.

జిల్లాలో భూమి, 27,76,422 ఎకరాలు. దీనిలో అడవి, 222 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 403,716 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 162,676 ఎకరాలు, 1946-47లో పంటవేసిన భూమి. 12,32,455 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద. భూమి పన్ను, నీటి తీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 41,50,720. ఇదికాక, ఎస్టేట్ పేష్కుష్‌వల్ల వచ్చినది రు. 237,347.

తాలూకాలు ఏడు; జిల్లా కేంద్రనగరం, తిరునెల్వేలి (తిన్నెవెల్లి).

## తూ ర్పు గో దా వ రి

వైశాల్యం, 6,322 చ. మైళ్ళు. జనాభా, 21,61,863; వీరిలో పురుషులు, 10,76,265; స్త్రీలు, 10,85,598; హిందువులు, 19,87,415; ముసిములు, 32,801.

జిల్లాలో 3,675 చ. మైళ్ళ ప్రదేశం ఏజన్సీ. దీనిలో జనాభా; 2,71,569 మందిలోనూ 1,36,213 మంది పురుషులు; 1,35,356 మంది స్త్రీలు.

జిల్లాలో భూమి, 36,39,741 ఎకరాలు. దీనిలో అడవి 864 వేల ఎకరాలు పోగా, 986,183 ఎకరాలు వ్యవసాయానికి రానిది. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 590,557 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 5,27,437 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 67,00,991. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 5,35,314.

తాలూకాలు పన్నెండు: రామచంద్రపురం, రాజమండ్రి, కాకినాడ, తుని, రాజోలు, పెద్దాపురం, అమలాపురం, భద్రాచలం, నూగూరు, యల్లవరం, చోడవరం, పిఠాపురం.

జిల్లా కేంద్రనగరం కాకినాడ; జిల్లా కోర్టుమాత్రం, రాజమండ్రిలో వుంది.

## దక్షిణార్కాడు

వైశాల్యం, 4,205 చ. మైళ్ళు; జనాభా, 26,08,753; పురుషులు, 13,09,554; స్త్రీలు, 12,99,199; హిందువులు, 24,50,521; ముస్లిములు, 84,118.

జిల్లాలో భూమి, 26,93,024 ఎకరాలు. దీనిలో అడవి 163 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 655,400 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 218,605 ఎకరాలు. 1946-47లో పంటవేసిన భూమి, 16,08,478 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 102,24,798. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 8,599.

తాలూకాలు ఎనిమిది: జిల్లా కేంద్రనగరం, కడలూర్.

## దక్షిణకన్నడ

వైశాల్యం, 4,045 చ. మైళ్ళు; జనాభా, 15,23,516; పురుషులు, 7,35,936; స్త్రీలు, 7,87,580; హిందువులు, 11,08,147; ముస్లిములు, 2,14,109.

జిల్లాలో భూమి, 25,77,295 ఎకరాలు. దీనిలో అడవి, 518 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 412,034 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 629,895 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 10,48,458 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 53,30,869.

తాలూకాలు ఆరు. జిల్లా కేంద్రనగరం, మంగుళూర్.

## నీలగిరి

వైశాల్యం, 989 చ. మైళ్ళు జనాభా, 2,09,709; పురుషులు, 1,12,870; స్త్రీలు, 96,839; హిందువులు, 1,02,766; ముస్లిములు, 17,661.

జిల్లాలో భూమి, 6,28,942 ఎకరాలు. దీనిలో అడవి, 341 వేల ఎకరాలు పోగా వ్యవసాయానికి రానిది, 34,292 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 47,312 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 2,29,098 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 33,36,983.

తాలూకాలు: కూనూర్, ఉదకమండలం, గూడలూర్. జిల్లా కేంద్రనగరం, ఉదకమండలం.

## నెల్లూరు

వైశాల్యం. 7,942 చ. మైళ్ళు; జనాభా, 16,17,026; పురుషులు, 8,12,149; స్త్రీలు, 8,04,877; హిందువులు, 14,16,178; ముస్లిములు, 1,20,004.

జిల్లాలో భూమి, 50,87,200 ఎకరాలు. దీనిలో అడవి, 468 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 15,97,296 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు, 11,66,291 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 9,35,031 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను నీటితీరువ పన్నులవల్ల ప్రభుత్వాదాయం రు. 34,24,728. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది రు. 4,21,113.

తాలూకాలు తొమ్మిది: నెల్లూరు, కోవూరు, కావలి, గూడూరు, ఉదయగిరి, కనిగిరి, రాపూరు, ఆత్మకూరు, కందుకూరు.

జిల్లా కేంద్రనగరం, నెల్లూరు.

## పడమటి గోదావరి

వైశాల్యం: 2,434 చ. మైళ్ళు; జనాభా, 13,80,088; పురుషులు, 6,87,572; స్త్రీలు, 6,92,516; హిందువులు, 12,63,181; ముస్లిములు, 29,728.

జిల్లాలో భూమి, 19,24,838 ఎకరాలు. దీనిలో అడవి, 48 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 279,404 ఎకరాలు. వ్యవసాయం చెయ్యని బీడు 270,103 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 5,97,551. ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 58,54,357. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 2,24,403.

తాలూకాలు ఎనిమిది: ఏలూరు, తాడేపల్లిగూడెం, భీమవరం, పోలవరం, నర్సాపురం, కొవ్వూరు, చింతలపూడి, తణుకు.

జిల్లా కేంద్రనగరం, ఏలూరు.

## బళ్ళారి

వైశాల్యం: 5,714 చ. మైళ్ళు. జనాభా, 10,51,253; పురుషులు, 5,34,665; స్త్రీలు, 5,16,570, హిందువులు, 9,27,070; ముస్లిములు, 1,12,705.

జిల్లాలో భూమి 36,48,044 ఎకరాలు; దీనిలో అడవి, 361 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 2,28,151 ఎకరాలు. వ్యవసాయం చెయ్యని బీడు, 4,07,870 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 20,49,950 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 25,35,187.

తాలూకాలు తొమ్మిది; బళ్ళారి, సిరుగుప్ప, రాయదుర్గం, హాస్పేట, కుడ్లిగి, ఆదోని, హడగళి, హర్పణహళ్ళి, ఆలూరు.

జిల్లా కేంద్రనగరం, బళ్ళారి.

## మదరాసు

వైశాల్యం, 52 చ. మైళ్ళు; జనాభా, దాదాపు 14 లక్షలు.

జిల్లాలోని భూమిలో వ్యవసాయానికి పనికివచ్చే భూమి ఏమీలేదు. అక్కడక్కడ మళ్ళుకట్టి, చోళ్ళు రాగులు పండించే భూమి స్వల్పం.

## మధుర

వైశాల్యం, 4,883 చ. మైళ్ళు; జనాభా, 24,46,601; పురుషులు, 12,11,923; స్త్రీలు, 12,34,678; హిందువులు, 22,43,398; ముస్లిములు, 1,06,788.

జిల్లాలో భూమి, 31,15,718 ఎకరాలు. దీనిలో అడవి, 741 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 2,45,109 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 6,87,697 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి 11,98,749 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 7,85,357. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 1,71,823.

తాలూకాలు ఏడు; జిల్లా కేంద్రనగరం, మధుర.

## మ ల బా రు

వైశాల్యం, 5,709 చ. మైళ్ళు, జనాభా, 39,29,425; పురుషులు, 19,01,404; స్త్రీలు, 20,28,021; హిందువులు, 24,78,653; ముస్లిములు, 13,37,760.

జిల్లాలో భూమి, 37,13,011 ఎకరాలు. దీనిలో అడవి, 358 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 6,10,572 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 9,63,684 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 10,48,458 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 1,67,917.

తాలూకాలు పది; జిల్లా కేంద్రనగరం, కాలికట్.

## రా మ నా ధ ం

వైశాల్యం, 4,851 చ. మైళ్లు; జనాభా, 19,79,643; పురుషులు, 9,48,475; స్త్రీలు. 10,31,168; హిందువులు, 17,36,829; ముస్లిములు, 1,43,344.

జిల్లాలో భూమి 30,88,090 ఎకరాలు. దీనిలో అడవి 63 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 750,968 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 526,995 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 3,10,808 ఎకరాలు.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను. నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 34,72,910. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 6,49,444.

తాలూకాలు తొమ్మిది. జిల్లా కేంద్రనగరం, రామనాథం (రామ్నాడ్)

## విశాఖపట్టణం

వైశాల్యం: 9,107 చ. మైళ్లు. జనాభా, 38,45,944. వీరిలో పురుషులు, 18,77,932; స్త్రీలు, 19,68,012; మొత్తం జనాభాలో హిందువులు, 18,06,224; ముస్లిములు, 29,122; క్రైస్తవులు, 20,503; కొండజాతులు, 2,86,623; ఇతరులు, 2,172.

జిల్లాలో 3,116 చ. మైళ్ళ భాగం ఏజన్సీ, పోగా మైదానపు ప్రదేశం, 5,991 చ. మైళ్ళు. జిల్లా జనాభాలో 2,21,437 మంది ఏజన్సీలో నివసిస్తున్నారు. వీరిలో 1,11,938 మంది పురుషులు; 1,09,499 మంది స్త్రీలు.

జిల్లాలో భూమి, 51,98,106 ఎకరాలు. దీనిలో అడవి 1213 వేల ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 11,31,399 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 627,914 ఎకరాలు. 1946-47 లో పంట వేసిన భూమి, 3,51,021 ఎకరాలు.

జిల్లా మొత్తముమీద భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 17,66,676. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 11,26,011.

మన రాష్ట్రంలో నేకాక, మనదేశంలోకల్లా ఎక్కువ వైశాల్యం గల జిల్లా ఇదే.

తాలూకాలు పదకొండు: పాలకొండ, విశాఖపట్టణం, పార్వతీపురం, సర్వసిద్ధి, గోలుకొండ, చీపురుపల్లి, అనకాపల్లి, వీరవల్లి చికాకోల్, గూడెం, పాతపట్నం.

సబ్ తాలూకాలు పది. శృంగవరపుకోట, బొబ్బిలి, సాలూరు, టెక్కలి, విజయనగరం, విశాఖపట్టణం, నరసన్నపేట, భీమునిపట్టణం, సోంపేట, ఇచ్ఛాపురం.

జిల్లా కేంద్రస్థానం, విశాఖపట్టణం.

### సేలం

వైశాల్యం, 7,073 చ. మైళ్ళు; జనాభా, 28,69,226; పురుషులు, 14,38,456; స్త్రీలు, 14,30,770; హిందువులు, 27,65,058; ముస్లిములు, 79, 016.

జిల్లాలో భూమి, 45,09,163 ఎకరాలు. దీనిలో, అడవి, 1000 వేల ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 686,144 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 741,125 ఎకరాలు. 1946-47 లో పంటవేసిన భూమి, 14,90,232 ఎకరాలు,

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటి తీరువపన్నులవల్ల ప్రభుత్వాదాయం, రు. 34,18,533. ఇదికాక, ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది. రు. 3,90,101.

తాలూకాలు తొమ్మిది. జిల్లా కేంద్రనగరం, సేలం.

## స్థానికసంస్థలు

మదరాసు రాష్ట్రంలో 24 జిల్లాబోర్డులూ, 83 మునిసిపల్ కౌన్సిళ్లూ వున్నాయి. 1949 జనవరి 1 వ తేదీనాటికి జిల్లాబోర్డులు రద్దుచేయబడి స్పెషల్ ఆఫీసర్ల పరిపాలనలో వున్నాయి. మునిసిపల్ కౌన్సిళ్ళకు 1947 లో ఎన్నికలు జరిగినవి. 1945-46 సంవత్సరాంతానికి మదరాసు రాష్ట్రంలో 375 పెద్ద పంచాయతీలు, 6757 చిన్న పంచాయతీలు ఉన్నాయి.

### జిల్లాబోర్డులు

1945-46 లో రాష్ట్రంలోని 24 జిల్లాబోర్డులకు, ప్రభుత్వపు గ్రాంటులతో సహా వచ్చిన ఆదాయం రు. 6,91,70,000. దీనిలో ప్రభుత్వం ఇచ్చిన గ్రాంటు మొత్తం రు. 1,81,57,000. ఈ జిల్లాబోర్డులన్నీ, ఆ సంవత్సరంలో తమ పరిపాలనకు మొత్తం రు. 6,73,83,000 ఖర్చు పెట్టాయి. 1945-46 లో, రాష్ట్రంలోని జిల్లాబోర్డులన్నీ మొత్తం

221 సెకండరీస్కూళ్ళనూ, 14,769 ఎలిమెంటరీస్కూళ్ళనూ నడిపాయి. ఈ ఎలిమెంటరీస్కూళ్ళలో 12,602 మగపిల్లలవీ, 2,167 ఆడపిల్లలవీ. అదే సంవత్సరంలో, సెకండరీ స్కూళ్ళలో చదువుతున్నవారి సంఖ్య, 76,451; ఎలిమెంటరీ స్కూళ్ళలో చదువుతున్నవారు, 13,16,118. ఈ స్కూళ్ళను నడపడానికి జిల్లాబోర్డులకు మొత్తం రు. 2,79,34,000 ఖర్చు అయింది. దీనిలో రు. 1,26,61,000 గవర్నమెంటువారు యిచ్చారు.

ఇదే సంవత్సరంలో, జిల్లాబోర్డులు రాష్ట్రంలో మొత్తం 1,236 వైద్యశాలలను నడిపాయి. వీటి నిర్వహణకు, రు. 30,01,000 ఖర్చు అయింది.

1945-46లో జిల్లాబోర్డుల అజమాయిషీక్రిందవున్న రోడ్ల మొత్తం పొడవు, 32,907 మైళ్ళు. వీటి నిర్వహణకు 1,61,73,000 రూపాయలు ఖర్చు అయింది. దీనిలో రు. 44,75,000 గవర్నమెంటువారు ఇచ్చారు.

గుంటూరు జిల్లాబోర్డువారి సొంతమైన రేపల్లె-తెనాలి రైలుదారి వల్ల ఆ బోర్డుకు రు. 1,39,000 నికరాదాయం వచ్చింది. రైలుదారిని కొనడానికి జిల్లాబోర్డు పెట్టిన పెట్టుబడిమీద నూటికి 11·9 వంతుల వడ్డీ కిట్టిందన్నమాట. ఈ రైలుదారి పొడవు 21 మైళ్ళు.

తిన్నెవెల్లి-కోయంబత్తూరు జిల్లాబోర్డులు రెండూ కలిసి ఉమ్మడిగా కొన్న, 33 మైళ్ళ పొడవుగల తిన్నెవెల్లి-తిరుచెందూరు రైలుదారివల్ల, ఆ బోర్డులకు రు. 3,06,000 నికరాదాయం వచ్చింది. ఇది పెట్టుబడిమీద నూటికి 11.2 వంతుల రేటు వడ్డి అని అంచనా.

## మునిసిపాలిటీలు

మదరాసు రాష్ట్రంలోని మునిసిపాలిటీల సంఖ్య 83. వాటిలో తెలుగు జిల్లాలలో వున్నవి 30. రాష్ట్రంలోని మునిసిపాలిటీలలో ఎక్కువ జనాభాగల నగరం మధుర (239,144). తక్కువ జనాభాగలది కొడైకెనాల్ (9724). తెలుగుదేశంలోని వాటి వివరాలకు ప్రక్క పేజీ చూడండి.

| పేరు | జనాభా | చైర్మను |
|---|---|---|
| అనకాపల్లి | 29,249 | డి. భోగలింగం |
| అనంతపురం | 21,482 | పప్పూరి రామాచార్యులు |
| ఆదోని | 35,431 | ఆర్. సుబ్బయ్య |
| ఏలూరు | 64,911 | శర్ల బ్రహ్మయ్య |
| ఒంగోలు | 21,184 | ధారా గోపాలశాస్త్రి |
| కడప | 28,246 | పుల్లకూర శేషయ్యశ్రేష్ఠి |
| కర్నూలు | 45,250 | మహబూబ్ ఆలిఖాన్ |
| కాకినాడ | 75,140 | డాక్టర్. వై. సీతాపతిరావు |
| గుంటూరు | 83,599 | (ఎన్నిక జరుగలేదు) |
| గుడివాడ | 23,919 | జి. వి. సుబ్రహ్మణ్యంగుప్త |
| చికాకోల్ | 22,249 | డాక్టర్ జి. వెంకటరావునాయుడు |
| చిత్తూరు | 27,835 | సి. రఘుపతి చెట్టి |
| తాడిపత్రి | 15,184 | ఎ. పెద్దఖాదర్ సాహెబ్ |
| తిరుపతి | 20,143 | ఓ. సుందరరాజులు నాయుడు |
| తెనాలి | 40,630 | ఆర్. సత్యనారాయణచౌదరి |
| నంద్యాల | 25,886 | దేశాయి కుప్పరావు |
| నరసారావుపేట | 17,644 | నాగసరపు కృష్ణమూర్తి |
| నెల్లూరు | 56,315 | ఆనం చెంచు సుబ్బారెడ్డి |
| పాలకొల్లు | 19,869 | పోలిశెట్టి వెంకటసుబ్బారావు |
| పెద్దాపురం | 20,835 | ముప్పన పెదవీరభద్రరావు |
| ప్రొద్దుటూరు | 26,961 | పి. ఎర్రమని రెడ్డి |
| బళ్ళారి | 56,148 | మునిలూర్ గంగప్పచౌదరి |
| బెజవాడ | 86,184 | డాక్టర్ తెన్నేటి చలపతిరావు |
| భీమునిపట్టణం | 9,914 | కలిగొట్ల సత్యనారాయణనాయుడు |
| మచిలీపట్టణం | 59,146 | డాక్టర్ రాళ్ళపల్లి అచ్యుతరామయ్య |
| రాజమండ్రి | 74,564 | డాక్టర్ ఎ. బి. నాగేశ్వరరావు |
| విజయనగరం | 51,749 | జొట్టు సీతారామస్వామి |

| | | |
|---|---|---|
| విశాఖపట్టణం | 70,243 | తెన్నేటి విశ్వనాథం |
| హోస్పేట | 26,023 | పత్తికొండ గురునాథం శ్రేష్ఠి |
| హిందూపూర్ | 19,049 | కట్టా వెంకటశేషయ్య |

ఆంధ్రదేశంలోని మునిసిపాలిటీలలో ఎక్కువ జనాభాగల నగరం బెజవాడ (86,184). తక్కువ జనాభాగలది భీమునిపట్టణం (9,914). రాష్ట్రమంతటికీ ఎక్కువ ఆదాయంగలది మధుర. (రు. 13,05,543). తక్కువ ఆదాయంగలది పళని (రు. 24,760).

1945-46 లో రాష్ట్రంలోని మునిసిపాలిటీలన్నిటికీ వచ్చిన ఆదాయం, ప్రభుత్వం ఇచ్చిన గ్రాంటులతోసహా, రు. 4,33,64,000. మునిసిపల్ పరిపాలనకు ఆ సంవత్సరంలో అయిన వ్యయం మొత్తం రు. 4,14,16,000.

రాష్ట్రంలోని మునిసిపల్ కౌన్సిళ్ళు తమ యాజమాన్యంలో మొత్తం 135 వైద్యశాలలనూ, 57 సెకండరీ స్కూళ్ళనూ, 1,143 ఎలిమెంటరీ స్కూళ్ళనూ నడిపాయి.

# మదరాసునగరం

1640 ఫిబ్రవరి 20 వ తేదిన, డే, కోగన్ అనే ఇద్దరు ఇంగ్లీషు వర్తకులు, ఈస్టిండియా కంపెనీ తరఫున మదరాసు రేవుకువచ్చి అక్కడ ఫ్యాక్టరీని స్థాపించారు. అప్పుడు మదరాసు రేవు వున్న ప్రాంతమంతా, చంద్రగిరి రాజుకు లోబడిన దామర్ల వెంకటపతినాయకుని అధికారంలో వుంది. మదరాసు పట్టణాన్ని, ఇంగ్లీషువారికి, రెండుసంవత్సరాలకు కౌలుకు ఇస్తూ, వెంకటపతినాయకుడు ఇచ్చిన గ్రాంటు, 1639 ఆగస్టులో ఇవ్వబడింది. ఈ పట్టణానికి తన తండ్రి చెన్నప్ప నాయకునిపేర చెన్న పట్టణం అని పేరు పెట్టవలసిందని వెంకటపతినాయకుడు, తను ఇచ్చిన గ్రాంటులో వ్రాశాడు.

ఇంగ్లీషువారు ఇక్కడ ఒక కోటకట్టి, దానికి ఫోర్టు సెంట్ జార్జి అని పేరు పెట్టారు. క్రమేపీ దక్షిణదేశంలో ప్రబలుతూవచ్చిన ఇంగ్లీషు వారికి మదరాసు కేంద్రస్థానం అయింది.

1652 లో ఫోర్టు సెంట్ జార్జికి, ఈస్టిండియా కంపెనీవారు ఒక ప్రెసిడెంటును నియమించి, అతని అధికారంలోవున్న ప్రాంతాన్ని ప్రెసిడెన్సీ అని పిలువసాగారు. 1661 లో ఈ ప్రెసిడెంటుకు గవర్నరు అనే వ్యవహార నామం ఇవ్వబడింది. క్రమంగా మదరాసునగరం పెరిగి, సమీపంలో వున్న మైలాపూరు, ఎగ్మూరు, తిరువళ్ళిక్కేణి, చింతాద్రిపేట, పరశువాకం మొదలైన ప్రాంతాలన్నింటినీ దానిలో కలుపుకొన్నది. ప్రస్తుతం మదరాసునగరం, భారతదేశంలోకల్లా పెద్దదైన రాష్ట్రానికి రాజధానిగా వుంది.

భారతదేశంలోని పట్టణాలన్నిటిలోకీ ఎక్కువ వైశాల్యంగల పట్టణం మదరాసే. ఇటీవల కొత్తగా నగరంలో చేర్చబడిన పరిసర ప్రాంతాలతో కలిపి, ఈ నగరపు వైశాల్యం, 52 చదరపు మైళ్ళు.

1949 లో ఈ నగరపు జనాభా దాదాపు 14 లక్షలు వుంటుంది. 1941 లో తీసిన జనాభా లెఖలప్రకారం, నగరంలో 87,888 ఇళ్ళు వున్నాయనీ, జనాభా 7,77,481 అనీ తేలింది. కాని, 1943 తరువాత, పొరుగూళ్ళనుంచి విశేషంగా జనులువచ్చి మదరాసులో స్థావరం ఏర్పర్చుకోవడంవల్లనూ 1941 నుంచి మదరాసులో అదనంగా పుట్టినవారివల్లనూ 1941 లో మదరాసు నగరంలో చేరని పరిసర ప్రదేశాలను 1946 లో మదరాసులో కలిపినందుననూ మదరాసు జనాభా, 1949 నాటికి 14 లక్షలవరకు పెరిగిందనటం అతిశయోక్తి కాజాలదు.

మదరాసునగర పరిపాలనను కార్పొరేషను సాగిస్తున్నది. ఇక్కడ నగరపాలనకు కార్పొరేషనును స్థాపించడం 1688 లో జరిగింది. ఆ సంవత్సరం, సెప్టెంబరు 28 వ తేదీన మొట్టమొదటి కార్పొరేషను నగరపాలన బాధ్యతను వహించింది. మొట్టమొదటి మేయరు మిస్టర్ నథేనియల్ హిగ్గిన్సన్.

ప్రస్తుతం అమలులోవున్న సిటీ మునిసిపల్ ఆక్టుప్రకారం మదరాసు కార్పొరేషనుకు 85 మంది సభ్యులు ఎన్నుకోబడుతారు. కౌన్సిలర్లు సభ్యులుగా వుండే పరిమితి మూడుసంవత్సరాలు. వీరుకాక ముగ్గురు

సభ్యులు నామినేట్ చేయబడినవారు వుంటారు. ఈ సభ్యులు ఒక మేయరును, డిప్యూటి మేయరును సంవత్సరానికొకసారి ఎన్నుకుంటారు. కౌన్సిలు నిర్ణయించిన విధానాలను అమలుజరపడానికి, ప్రభుత్వం నియమించిన కమిషనరు పరిపాలనా వ్యవహర్తగా వుంటాడు.

1949-50 లో మదరాసు కార్పొరేషనుకు పన్నులవల్ల వస్తుందని అంచనావేసిన ఆదాయం రు. 169 లక్షలు.

ఈ కార్పొరేషను అధ్వర్యాన మదరాసు నగరంలో, 27 శిశు రక్షణ, ప్రసూతి సహాయ కేంద్రాలు వున్నాయి. 174 ఎలిమెంటరీ స్కూళ్లు, కార్పొరేషను అధ్వర్యాన మదరాసులో నడుపబడుతున్నాయి.

1948—49

| | |
|---|---|
| మేయరు: | ఎస్. రామస్వామినాయుడు |
| డిప్యూటి మేయరు: | ఎస్. పకీరిస్వామి పిళ్లై |
| కమిషనర్: | రావుసాహెబ్ చళ్ళగిరినరసింహం, ఎం, ఎ. బి.ఎల్ |
| డిప్యూటి కమిషనర్: | ఎస్. శంకరన్, ఎం. ఏ., ఎల్. టి. |

# రాష్ట్ర రాజకీయాలు

మదరాసురాష్ట్ర పరిపాలన 1937 వరకూ, ద్వంద్వప్రభుత్వ విధానప్రకారం జరిగింది. 1937 లో 1935 ఇండియాచట్టం అమలులోకి వచ్చింది. 1937 ఆరంభంలో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుపక్షం అత్యధికబలాన్ని సంపాదించింది. కాని, 1935 చట్టంప్రకారం గవర్నరులకు గల ప్రత్యేకాధికారాలపట్ల ప్రతికూలాభిప్రాయాన్ని ప్రకటిస్తూ, దేశంలో కాంగ్రెసు అధికసంఖ్యలో శాసనసభలకు ఎన్నుకోబడిన రాష్ట్రాలలో ఎక్కడాకూడా కాంగ్రెసువారు పదవులను స్వీకరించలేదు. తరువాత, సాధారణ పరిస్థితులలో గవర్నరులు తమ ప్రత్యేకాధికారాలను వినియోగించరనే హామీ బ్రిటిషు ప్రభుత్వంనుంచి పొంది, వివిధ రాష్ట్రాలలో కాంగ్రెసు పక్షంవారు మంత్రివర్గాలను స్థాపించారు. మదరాసు రాష్ట్రంలో శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారి నాయకత్వాన మంత్రిమండలి, 1937 జులైలో ఏర్పాటయింది. ఈ మంత్రిమండలిలో

సభ్యులు: ప్రధానమంత్రి, సి. రాజగోపాలాచారి; రెవిన్యూమంత్రి, టంగుటూరి ప్రకాశం; కార్మికమంత్రి, వి. వి. గిరి; స్థానికపరిపాలన మంత్రి, బెజవాడ గోపాలరెడ్డి; ఆరోగ్యమంత్రి, డాక్టర్ టి. ఎస్. ఎస్. రాజన్; జైళ్ళమంత్రి, కె. రామన్‌మీనన్; పబ్లిక్ వర్క్సు మంత్రి, యాకుబ్ హసన్; న్యాయశాఖామంత్రి, డాక్టర్ పి. సుబ్బరాయన్; ఎక్సైజుమంత్రి, వి. ఐ. మునుస్వామిపిళ్ళై; ప్రచురణశాఖా మంత్రి, ఎస్. రామనాథన్.

మంత్రివర్గం ఏర్పాటయిన కొంతకాలానికి, జైళ్ళశాఖామంత్రి, కె. రామన్‌మీనన్ చనిపోయారు. అప్పుడు జైళ్ళశాఖను న్యాయశాఖా మంత్రి డాక్టర్ సుబ్బరాయన్‌కు యిచ్చి, వారి అజమాయిషీలో వున్న విద్యాశాఖకు, అప్పటివరకు పార్లమెంటరీ సెక్రటరీగావున్న సి. జె. వార్కీ గారిని మంత్రిగా నియమించడం జరిగింది.

ఈ మంత్రిమండలి పనిచేస్తూవుండగా, 1939 లో రెండవ ప్రపంచయుద్ధం ఆరంభమైంది. కాంగ్రెసు మంత్రివర్గాలతోను, భారత దేశ ప్రజలతోను సంప్రతించకుండానే, భారతదేశం జర్మనీకి ప్రతికూలంగా యుద్ధంలో పాల్గొంటున్నట్లు రాజప్రతినిధి ప్రకటించినారనే కారణంచేత దేశంలోని కాంగ్రెసు మంత్రివర్గాలన్నీ రాజీనామా యిచ్చాయి. మదరాసు మంత్రివర్గం 1939 అక్టోబరులో రాజీనామా యిచ్చింది. రాష్ట్రపరిపాలనను గవర్నరు ఐ. సి. ఎస్. ఉద్యోగులను సలహాదారులుగా నియమించుకొని నిర్వహించడం ప్రారంభించాడు, మళ్ళీ 1946 మే మాసంవరకూ, కొత్తగా ఎన్నికలుజరిగి ప్రజాప్రభుత్వం ఏర్పడినదాకా, రాష్ట్రపరిపాలన గవర్నరు సలహాదారులే నిర్వహించారు, కాంగ్రెసు మంత్రివర్గం, 1938 లో ప్రవేశపెట్టిన మద్యనిషేధ శాసనాన్ని 1943 లో సలహాదారుల ప్రభుత్వం రద్దుచేసింది.

1940 లో యుద్ధవ్యతిరేకప్రచారం చేసినందుకు, దేశంలోని అన్ని ప్రాంతాలలోలాగనే, మదరాసు రాష్ట్రంలోకూడా కాంగ్రెసు నాయకులు నిర్బంధంలో వుంచబడినారు. తరువాత మళ్ళీ, 1942 లో కాంగ్రెసు నాయకులూ, అల్లరులలో పాల్గొన్నారనే నేరంమీద అనేక మంది కాంగ్రెసువారూ జైళ్ళకు పంపబడినారు.

1945లో రెండవ ప్రపంచయుద్ధం ముగియడంతోనే కాంగ్రెసు నాయకులను విడుదలచెయ్యడం జరిగింది. దేశమంతటా ప్రజాప్రభుత్వాలను ఏర్పాటుచెయ్యడానికి ప్రయత్నాలు జరిగాయి. డిసెంబరుమొదలు ఏప్రిల్ వరకూ, దేశంలోని వివిధరాష్ట్రాలలో ఎన్నికలుజరిగాయి. మదరాసు రాష్ట్రంలో ఎన్నికలు, 1946 ఏప్రిల్ మాస మధ్యంలో ముగిసాయి. కాంగ్రెసుపక్షం అత్యధికబలంతో నెగ్గింది.

రాష్ట్రంలో మంత్రిమండలిని ఏర్పాటు చెయ్యడంలో, రాష్ట్ర శాసనసభలోని కాంగ్రెసుసభ్యులలో అభిప్రాయభేదాలు కలిగాయి. దానికితోడు, కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారు యీ విషయంలో జోక్యం కలిగించుకొని, శాసనసభ కాంగ్రెసుపార్టీ నాయకుని ఎన్నిక తాము సూచించినప్రకారమే జరగాలన్నారు. ఈ సూచనకు శాసనసభ కాంగ్రెసు సభ్యులు అంగీకరించక, తమ యిష్టంవచ్చిన నాయకుణ్ణే ఎన్నుకుంటామన్నారు. అయితే, యీ ఎన్నిక ఏకగ్రీవంగా జరుగలేదు. పార్టీ నాయకత్వానికి టంగుటూరి ప్రకాశంగారు, సి. ఎన్. ముత్తురంగ మొదలియార్‌గారు అభ్యర్థులుగా నిలచారు. అధికసంఖ్యాకులు ప్రకాశంగారిపక్షాన ఓటు చేసినందున, ప్రకాశంగారు నాయకులుగా ఎన్నుకోబడినారు. కాంగ్రెసు పార్టీకి శాసనసభలో అధికసంఖ్య వున్నందుననూ, యీ పార్టీకి నాయకులుగా ప్రకాశంగారు ఎన్నుకోబడినందుననూ, మంత్రిమండలిని ఏర్పాటు చెయ్యవలసిందని, గవర్నరు ప్రకాశంగారిని కోరారు. ప్రకాశంగారు 1946 మేనెలలో మంత్రిమండలిని ఏర్పాటు చేశారు. ఆ మంత్రిమండలి సభ్యులు: ప్రధానమంత్రి, టంగుటూరు ప్రకాశం; రెవిన్యూమంత్రి, కె. ఆర్. కరంత్. కార్మికమంత్రి, వి. వి. గిరి; పబ్లిక్ వర్క్సు మంత్రి, ఎం. భక్తవత్సలం; ఆరోగ్యమంత్రి, శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి; న్యాయమంత్రి, కె. భాష్యం; హిందూ ధర్మాదాయాలమంత్రి, కె. కోటిరెడ్డి; స్థానిక పరిపాలనమంత్రి, డానియల్ థామస్; వ్యవసాయమంత్రి, పి. యస్. కుమారస్వామిరాజా; విద్యామంత్రి, టి. ఎస్. అవినాశలింగంచెట్టియార్; ఆహారమంత్రి, ఆర్. రాఘవమీనన్, ప్రచురణశాఖామంత్రి, వి. కూర్మయ్య, అడవులశాఖామంత్రి బిక్కిని వీరాస్వామి.

కొంతకాలం తరువాత, అనారోగ్య కారణాలచేత, ఓక్కినివీరా స్వామిగారు తమ మంత్రిపదవికి రాజీనామా నిచ్చినందున, వారిస్థానే అడవుల మంత్రిగా ఓక్కిని వెంకటరత్నంగారు నియమింపబడినారు.

ప్రకాశం మంత్రిమండలి పదవిని స్వీకరించినప్పుడు, రాష్ట్రింలో ఆహారసమస్య చాలా విషమస్థితిలో వుంది. ఈ మంత్రిమండలి సమయానుకూలంగా వ్యవహరించి, ఆహారసమస్య విషమించకుండా, తిండిలేక ఒక్క మనిషికూడా రాష్ట్రింలో చావకుండా, చేసింది.

1946 అక్టోబరున ప్రకాశం మంత్రివర్గం, రాష్ట్రంలో ఎనిమిది (సేలం, ఉత్తరార్కాడు, కోయంబత్తూరు, చిత్తూరు, బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు) జిల్లాలలో మద్యనిషేధాన్ని ప్రవేశపెట్టారు.

కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పాటుచేసిన తరువాత, మన రాష్ట్రి చరిత్రలో జరిగిన ముఖ్య సంఘటనలలో ఒకటి ఏమిటంటే, చెన్నపట్టణంలోని మౌంటురోడ్‌లోవున్న 'గవర్నమెంటుహౌసు' భవనాన్ని, దానిచుట్టూవున్న ప్రదేశాన్నీ, ఆ ఆవరణలలో వున్న ఇతర భవనాలతో సహా, మొత్తం 110 ఎకరాల ఆవరణను, గవర్నరు మంత్రిమండలికి అప్పగించివెయ్యడం. ఈపని 1947 జనవరి 29 తేదీన జరిగింది.

ఇంతకు పూర్వం, ఈ భవనంలో గవర్నరూ, ఆయనపరివారమూ కాపురంవుండేవారు. ఇదికాక, గిండీలో (మదరాసుకు 15 మైళ్లలో) మరొక భవనంకూడా గవర్నరుకువుంది. గవర్నరూ, ఆయన పరివారమూ, అక్కడే కాపురంవుంటారు. మౌంటురోడ్డులోని 'గవర్నమెంటు హౌసు'లో ప్రధానమంత్రికి, శాసనసభ్యులకు వసతులు యివ్వడానికి ఏర్పాట్లు చేయబడినవి.

ప్రకాశం మంత్రివర్గం పట్టుమని ఒక ఏడాదికూడా అధికారంలో వుండకుండానే, ప్రకాశంగారి నాయకత్వంమీద తమకు విశ్వాసంలేదని, కాంగ్రెసు పార్టీకి చెందిన శాసనసభ్యులు ప్రకటించారు. ఈవిషయంలో అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి శంకరరావ్‌దేవ్, కాంగ్రెసు అధ్యక్షుడు ఆచార్య కృపలానీగార్లు మదరాసువచ్చారు. ప్రకాశంగారి మీద విశ్వాసంలేదని చెప్పిన వారిని సంప్రతించి కారణాలడిగారు. చివరకు కాంగ్రెసు అధ్యక్షుడు "ప్రకాశం నాయకత్వం పట్ల విశ్వాసం

లేదంటున్నవారు యెందుకు అలా అంటున్నారో నాకు బోధపడలేదు. కాంగ్రెసు కార్యక్రమాన్ని వ్యతిరేకించి ప్రకాశం చేసిన దేమీ లేదు" అన్నాడు. ఏమయినా అధిక సంఖ్యాకులకు యిష్టంలేనప్పుడు ప్రకాశం గారు నాయకుడుగా వుండటం మంచిది కాదన్నారు. ఆ సూచనను అనుసరించి, లెజిస్లేటివ్ కౌన్సిలులోను, లెజిస్లేటివ్ ఎసెంబ్లీలోను వున్న కాంగ్రెసు సభ్యుల సమావేశం, 1947 మార్చి 21 తేదీన జరిగింది. ఈ సమావేశంలో, పార్టీ నాయకత్వానికి ప్రకాశంగారూ, ఓ. పి. రామస్వామిరెడ్డియార్ గారూ అభ్యర్థులుగా నిలచారు. రామస్వామిరెడ్డియార్ గారికి 116 ఓట్లూ, ప్రకాశంగారికి 73 ఓట్లూ వచ్చాయి. రెడ్డియార్ గారు నాయకులుగా ఎన్నుకోబడినట్లు, యెన్నిక జరిపించిన ఆచార్య కృపలానీ ప్రకటించారు. ప్రకాశంగారు తమ ప్రధాన మంత్రిపదవికి రాజీనామా ఇచ్చారు.

1947 మార్చి 23 తేదిన ఓమండూర్, పెద రామస్వామిరెడ్డియార్ మంత్రి మండలిని ఏర్పాటుచేశారు.

1947 అక్టోబరులో మద్య నిషేధం మరొక ఎనిమిది (గుంటూరు, మలబారు, నీలగిరి, నెల్లూరు, తంజావూరు, తిరుచినాపల్లి, దక్షిణ కన్నడ, మధుర) జిల్లాలలో అమలు జరుపబడింది.

1948 అక్టోబరులో, రాష్ట్రంలోని మిగతా (మదరాసు నగరం, తిరునెల్వేలి, రామనాథం, దక్షిణార్కాడు, చెంగల్పట్, కృష్ణా, పడమటి గోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్టణం) జిల్లాలలో మద్యనిషేధం అమలు జరుపబడింది.

శ్రీరామస్వామి రెడ్డియార్ మంత్రిమండలిపదవి స్వీకరించిన తరువాత, భరతఖండ విభజన, ఇండియా పాకిస్తానులకు స్వరాజ్యసిద్ధి జరిగాయి.

స్వరాజ్యం లభించిన 1947 ఆగస్టు 15 తేదీన దేశంలోని అన్ని ప్రాంతాలతోపాటు, స్వరాజ్యోత్సవాన్ని మదరాసురాష్ట్రం, అత్యంత వేడుకతో మదరాసు నగరమూ జరుపుకొన్నాయి.

స్వదేశ సంస్థానాలుగావున్న బంగనపల్లి, పుదుకోటలు మదరాసు రాష్ట్రంలో కలిసిపోవడంకూడా 1948 లో జరిగిన ముఖ్య సంఘటనలలో

ఒకటి. 1948 ఫిబ్రవరి 20 న బంగనపల్లి, 1948 మార్చి 3 తేదిన పుదుకోట మదరాసు రాష్ట్రంలో కలియడంవల్ల రాష్ట్ర వైశాల్యం దాదాపు 3,500 చ. మైళ్ళు పెరిగింది.

1948 జనవరి 30 తేదిన గాంధిమహాత్మునిహత్య కారణంగా, కేంద్రప్రభుత్వంవారి చర్యను అనుసరించి మదరాసు ప్రభుత్వంవారు, యీరాష్ట్రంలోకూడా రాష్ట్రీయ స్వయంసేవక సంఘాన్ని, ముస్లింసేవ నషనల్‌గార్డ్సు దళాన్ని నిషేధించారు. కులతత్వప్రచారంచేసే దళాలను వుండనియ్యకూడదనే ఉద్దేశమే యీనిషేధానికి కారణం.

## నాయకుని ఎన్నిక

శాసనసభ కాంగ్రెసుపక్షు నాయకుని ఎన్నిక ప్రతిసంవత్సరమూ జరుగవలసింది కనుక, 1948 సంవత్సరానికి ఎన్నిక 1948 మార్చి 26 తేదిన జరిగింది. లెజిస్లేటివ్ అసెంబ్లీలోను, కౌన్సిలులోనువున్న మొత్తం కాంగ్రెసుపక్షు సభ్యులు 201 మందికీ, 197 మంది సభ్యులు యీ ఎన్నిక సమావేశానికి హాజరయారు. రానివారు నలుగురు ఎవరంటె: అసెంబ్లీ స్పీకరు జె. శివషణ్ముగంపిళ్ళై, కౌన్సిలు ప్రెసిడెంట్ ఆర్. బి. రామక్రిష్ణ రాజులుంగార్లు, గాక్టర్ శామ్యుయెల్, శ్రీ ముత్తురామలింగదేవర్.

పార్టీనాయకపదవి ఎన్నికకు ప్రధానమంత్రిగావున్న ఓమండూర్ పి. రామస్వామి రెడ్డియార్, మాజీప్రధాని టంగుటూరి ప్రకాశంపంతులు గార్లు పోటీచేశారు. శ్రీ రామస్వామి రెడ్డియార్‌కు 112 వోట్లు శ్రీ ప్రకాశం పంతులుకి 84 ఓట్లు వచ్చినవి. రెడ్డియార్ గెలిచినందున, రాష్ట్రప్రభుత్వ ప్రధానపదవి ఆయనకే దక్కినది.

ఎన్నిక జరిగిన తరువాత, ఏప్రిల్ 3 తేదిన హోం మంత్రి డాక్టర్ పి. సుబ్బరాయన్ రాజీనామా ఇచ్చారు. వీరి రాజీనామా ఏప్రిల్ 6 తేది మధ్యాహ్నం అంగీకరింపబడినట్లు గెజెట్ ప్రకటన జరిగింది. తత్ఫలితంగా మంత్రిమండలిలో మార్పులు జరిగాయి. మద్యనిషేధ మంత్రి డానియెల్ థామస్ 1948 జూన్ 15 తేదిన చనిపోయారు. వారి స్థానంలో డాక్టర్ ఎస్. గురుపాదం, జులై 2 తేదిన నియమింపబడినారు.

1949 మార్చి 31 నాటికి అధికారంలోవున్న మంత్రిమండలి ఇది:

| | |
|---|---|
| ప్రధానమంత్రి: | ఓమందూర్ పి. రామస్వామి రెడ్డియార్<br>లా అండ్ ఆర్డర్, (ఎలక్షన్లు, మినహాయింపబడిన ప్రాంతములు కాక) పబ్లిక్ శాఖ, హిందూ ధర్మాదాయముల శాఖ, ఖాది, హోంశాఖ, లా అండ్ ఆర్డర్ (పబ్లిక్) శాఖ, న్యాయ, శాసనసభ శాఖ, హైకోర్టు |
| ఆహార మంత్రి: | డాక్టర్ టి. ఎస్. ఎస్. రాజన్<br>ఆహారశాఖ |
| పబ్లిక్ వర్క్సు మంత్రి: | ఎం. భక్తవత్సలం<br>పబ్లిక్ వర్క్సుశాఖ, వృత్తాంత ప్రచురణశాఖ |
| ఆర్థిక మంత్రి: | కె. గోపాలరెడ్డి<br>ఆర్థికశాఖ, వాణిజ్య, పన్నులశాఖ, ఎన్నికల శాఖ, మినహాయింపబడిన ప్రాంతములశాఖ, మోటారు ట్రాన్స్పోర్టుశాఖ |
| మద్య నిషేధం: | ఎస్. గురుపాదం<br>మద్యనిషేధశాఖ, గృహావసతి నిర్మాణశాఖ, రిజిస్ట్రేషన్ శాఖ. ఫిర్కా డెవలప్ మెంట్ శాఖ |
| రెవిన్యూ మంత్రి | హెచ్. సీతారామరెడ్డి<br>పరిశ్రమలు, కార్మికులు, ప్లానింగ్ శాఖ, పరిశ్రమలు. రెవిన్యూ |
| స్థానికపరిపాలన మంత్రి | ఆర్. చంద్రమౌళి<br>స్థానికపరిపాలనా శాఖ, సహకారశాఖ |
| విద్యా మంత్రి. | టి. ఎస్. అవినాశలింగం చెట్టియార్<br>విద్యాశాఖ |

వ్యవసాయ మంత్రి : కె. మాధవమీనన్
వ్యవసాయశాఖ, అటవీశాఖ, పశువైద్యశా-
వైశ్యశాఖ

ఆరోగ్య మంత్రి : ఏ. బి. శెట్టి
ప్రజారోగ్యశాఖ, వైద్యశాఖ

గ్రామోద్ధరణ మంత్రి : వేముల కూర్మయ్య
హరిజనోద్ధరణ, మత్స్యశాఖ, సింకోనాశాఖ

పదవీస్వీకరణ : 1947 మార్చి 23-వ తేదీన, ఓ. పి. రామస్వామి రెడ్డియార్, డాక్టర్ రాజన్. ఎం. భక్తవత్సలం, బి. గోపాలరెడ్డి, హెచ్. సీతారామరెడ్డి, కె. చంద్రమౌళి, కె. మాధవ మీనన్ గార్లు.
1947 మార్చి 29-వ తేదీన కళా వెంకట రావు, వేములకూర్మయ్య, ఏ. బి. శెట్టి, టి. ఎస్. అవినాశిలింగం చెట్టియార్ గార్లు.

1949 మార్చి 31 తేదీన శాసనసభ కాంగ్రెసు పక్షనాయకుని ఎన్నిక జరిగింది. ఇంతవరకూ నాయకులుగావున్న ఓ. పి. రామస్వామి రెడ్డియార్ ఎన్నికనుంచి విరమించుకున్నారు. డాక్టర్ పి. సుబ్బరాయన్. శ్రీ పి. ఎస్. కుమారస్వామి రాజాగార్లు ఎన్నికకు పోటీచేశారు. కుమారస్వామి రాజాగారికి 105 ఓట్లు, సుబ్బరాయన్ గారికి 89 ఓట్లు వచ్చినవి. కుమారస్వామిరాజాగారు నాయకులుగా ఎన్నుకోబడినందున, రాష్ట్రానికి నూతన మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయవలసిందని వారిని గవర్నరు కోరారు. అలాగే, వారు నూతన మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు.

(కొత్త మంత్రివర్గపు పేర్లకు 'కొత్త సంగతులు' అనే శీర్షికలో చూడండి).

| | |
|---|---|
| గవర్నర్ : | హిజ్ హైనెస్ మహారాజా శ్రీ సర్ కృష్ణకుమార్ సింహజీ భావ్‌సింహజీ. కె. సి. ఎస్. ఐ, భావనగర్ మహారాజా |
| పదవీ స్వీకారం : | 7 సెప్టెంబర్ 1948. |
| జీతం : | రు. 5,500 (ఇన్‌కంటాక్సు పోను, 3,000). |
| ప్రైవేట్ సెక్రటరీ : | పి. గోవిందన్ నాయర్. |
| మిలిటరీ సెక్రటరీ : | మేజర్ సి. యస్. రెడ్డి. |
| సర్జన్ : | ఇ. కె. పద్మనాభన్ నంబియార్ |
| అంగరక్షకులు : | కెప్టెన్ డి. ఇ. దొరస్వామి<br>కెప్టెన్ ఒ. కె. కరుణాకరన్<br>రిసాల్దార్ సి. నారాయణస్వామి.<br>గౌరవ కెప్టెన్ డి. అంతోని |
| మంత్రుల జీతాలు : | నెలకు 850 రూపాయలు; కారు, ఇంటి అద్దె అలవెన్సు నెలకు 500 రూపాయలు, |

## మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు

| | |
|---|---|
| ప్రెసిడెంట్ : | ఆర్. బి. రామకృష్ణరాజులుంగారు |
| డిప్యూటి ప్రెసిడెంటు : | కె. వెంకటస్వామి నాయుడు |
| సెక్రటరీ : | ఎం. సూర్యారావు |

## సభ్యులు

1. అబ్దుల్ లతీఫ్ ఫరూఖి సాహెబ్ (మదరాసునగర ముస్లిం స్థానం) 2. అహమద్ ఇబ్రాహిం సాహెబ్, కె. టి. ఎం. (మదరాసు నగర ముస్లింస్థానం) 3. ఆదిత్యన్, ఎస్. ఓ. (నామినేటెడ్) 4. ఉప్పి సాహెబ్, కె. (పశ్చిమతీరం, ముస్లిం) 5. కుమారస్వామి మొదలియార్,

ఎం. డి. (తిరునెల్వేలి) 6. కృష్ణమూర్తి, రావుబహదూర్ డి. (నామి
నేటెడ్) 7. క్లబ్‌వాలాసతి, మేరీ నోగి (నామినేటెడ్) 8. గోపాల
కృష్ణయ్య, అడుసుమిల్లి (కృష్ణా) 9. గోవిందాచార్యులు, ఆత్మకూ:
(పశ్చిమ గోదావరి) 10. జగన్నాథం, హెచ్. ఎం. (నామినేటెడ్)
14. జయరాంరెడ్డి, ఎస్. (రామ్నాడ్) 12. జాన్, డాక్టర్ వి. కె.
(భారతీయ క్రైస్తవ) 13. తాజుద్దీన్ సాహెబ్, డాక్టర్ సయ్యద్
(మదరాసు నగర ముస్లింస్థానం) 14. నటరాజన్, కె. (తంజావూరు)
15. నాగప్ప చెట్టియార్, వి. వి. ఆర్. ఎన్. ఆర్, (రామ్నాడ్) 16.
నారాయణ మీనన్, ఎం. (మలబార్) 17. నారాయణరావు, మోతే
(పశ్చిమ గోదావరి) 13. నారాయణస్వామి నాయుడు, బి. (కృష్ణా)
19. పతి, ఎ. ఆర్. ఎల్. (నామినేటెడ్) 20. పురుషోత్తం, కురగా
(తూర్పు గోదావరి) 21. పెరుమాళ్ళస్వామి రెడ్డియార్, వి. (ఉత్త
రార్కాడు) 22. భీమారావు, బి. (బళ్ళారి) 23. మనథునైనాథదేశికర్,
కె. (తంజావూరు) 24. మంజయ్య హెగ్డె, డి. (దక్షిణ కన్నడ) 25
మాధవ మీనన్, కె. (మలబార్) 26. రహమతుల్లా సాహెబ్, ఎం.
కె. (మదరాసు నగర ముస్లింస్థానం) 27. రంగారెడ్డి, ఎన్. (కడప)
28. రాజన్, డాక్టర్ టి. యస్. యస్. (తిరుచినాపల్లి) 29. రామ
కృష్ణనాయుడు, ఆర్. (కోయంబత్తూరు-నీలగిరి) 30 రామకృష్ణరాజులుం
గారు. ఆర్. బి. (చిత్తూరు) 31. రామనాథం చెట్టియార్. యస్. ఎ.
యస్. యం. (తంజావూరు) 32. రామభద్రరాజు, నడింపల్లి (తూర్పు
గోదావరి) 33. రామస్వామి రెడ్డియార్, ఓ. పి. (దక్షిణార్కాడు)
34, రామారావు. డాక్టర్ యు. (మదరాసు నగరం) 35. రోచి-విక్టో
రియా, జె. యల్. పి. (భారతీయ క్రైస్తవ) 36 రోడ్రిగ్స్, ఎం. యస్.
టి. యఫ్. (భారతీయ క్రైస్తవస్థానం) 37. లక్ష్మణస్వామి మొదలి
యార్, సర్. ఎ. (నామినేటెడ్) 38. వీరభద్రరావు, కొల్లూరు
(విశాఖపట్టణం) 39. వీరభద్రస్వామి, పి. (విశాఖపట్టణం) 40. వీరా

స్వామి, బిక్కిన (తూర్పుగోదావరి) 41. వెంకటచలం, యస్. (విశాఖపట్టణం) 42. వెంకటరెడ్డి, జి. (అనంతపురం) 43. వెంకటస్వామి నాయుడు, కె. (మదరాసు నగరం) 44. శఠగోప మొదలియార్, యస్. కె. (సేలం) 45. శర్మ, పి. ఆర్. కె. (నామినేటెడ్) 46. శంకరరెడ్డి, యస్. (కర్నూలు) 47. షేక్ రౌదర్ సాహెబ్, యస్. కె. (పశ్చిమతీరం, ముస్లిం) 43 సుబ్బరామరెడ్డి, యల్. (నెల్లూరు) 49. సుదర్శనం, మద్ది (గుంటూరు) 50 సుందరరామయ్యర్, యం. కె. (మధుర) 51. సూర్యనారాయణరావు, ఆర్. (నామినేటెడ్) 52. హమీద్ సుల్తాన్ మారికేర్ సాహెబ్, వి. (మదరాసునగర ముస్లిం స్థానం) 53. హాన్స్‌మన్ సతి, మోనా (నామినేటెడ్); 54. డాక్టర్ ఎస్. గురుపాదం (నామినేటెడ్); ఒకస్థానంఖాళీ.

## మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ

స్పీకర్ : జె. శివషణ్ముగం పిళ్లె

డిప్యూటీ స్పీకర్ : శ్రీమతి చోడగం అమ్మన్నరాజా

సెక్రటరీ: డి. కె. వి. రాఘవ వర్మ

డిప్యూటీ సెక్రటరీ: ఎం. సూర్యారావు

## సభ్యులు

1. అనంతాచార్, ఒ. (హోస్పేట గ్రామీణ) 2. అణ్ణామలై పిళ్లై, ఎన్. (తిరువణ్ణామలై గ్రామీణ) 3. అబ్దుల్ ఖాదర్, మాల్వీహాజీ (రామ్నాడ్, ముస్లిం, గ్రామీణ) 4. అబ్దుల్ మజీద్, ఎం. ఎస్. (చెంగల్పట్ - దక్షిణఆర్కాట్ ముస్లిం గ్రామీణ) 5. అబ్దుర్ రహిమాన్, ఎం. ఎన్. (తిరునెల్వేలి, ముస్లిం) 6. అబ్దుల్ హమీద్ ఖాన్ (కర్నూలు ముస్లిం గ్రామీణ) 7. అమ్మన్న రాజా, శ్రీమతి చోడగం (ఏలూరు స్త్రీలస్థానం గ్రామీణ) 8. అరుణాచలం, టి. ఎస్. (తిరుచినాపల్లి -

శ్రీరంగంనగర స్థానం) 9. అవినాశలింగం చెట్టియార్, టి. ఎస్. (పల్లాడం గ్రామీణ) 10. అహమద్ కుట్టి సాహెబ్, హాజీ కోయప్ప తోడి, ఎం. (మలప్పురం ముస్లిం గ్రామీణ) 11. అంజలై అమ్మాళ్, (కడలూరు స్త్రీలస్థానం గ్రామీణ) 12 ఆటావుల్లా సాహెబ్ ఎం. ఎస్. (సేలం-కోయంబత్తూర్-నీలగిరి ముస్లిం గ్రామీణ) 13 ఆనంద నంబియార్, కె. (రైల్వే ట్రేడ్ యూనియన్, కార్మికస్థానం) 14. ఆరన్ రావు, అల్లాడి, (గుంటూరు-నెల్లూరు-ఇండియన్ క్రైస్తవ) 15. ఇబ్రాహిం కుణి, ఎం. (చిరక్కాల్, ముస్లిం గ్రామీణ) 16. ఇబ్రాహిం సాహెబ్, చిన్న కాజియర్ హాజీ మాల్వి, ఎస్. ఎ. ఎఫ్ (మధుర, ముస్లిం గ్రామీణ) 17. ఈశ్వర, కె. (కుందపూర్, గ్రామీణ, హరిజన్) 18. ఈశ్వరన్, ఎం. ఎ. (ఈరోడ్ గ్రామీణ) 19. ఎలర్టన్ డి. (యూరపియన్) 20. కదిరప్ప, (డి. పెనుకొండ గ్రామీణ హరిజన్) 21. కన్నప్ప మొదలియార్, వి. టి. (గుడియాతం గ్రామీణ) 22. కన్నియప్పన్, ఎం. (మదరాసు నగర ఫ్యాక్టరీ, రేవు పనివారల స్థానం) 23 కందస్వామి గౌండర్, పి. ఆర్. (పొల్లాచి గ్రామీణ) 24 కందస్వామి. పిళ్లై, పి. (సేలం నగరస్థానం) 25. కరంత్, కె. ఆర్. (పుత్తూర్, గ్రామీణ) 26. కొక్కన్, పి. (అరియలూర్ గ్రామీణ హరిజన్) 27. కాదర్ కుట్టిసాహెబ్ ఎ. కె. (కోటాయం ముస్లింగ్రామీణ) 28. కామరాజ నాడార్, కె. (సాతూర్ గ్రామీణ) 29. కామాక్షి చెట్టియార్. కె. సి. (పళని గ్రామీణ) 30. కామేశ్వరరావు, అన్నాప్రగడ (గుంటూరు - తెనాలి నగర స్థానం) 31. కాళేశ్వరరావు, అయ్యదేవర (బెజవాడ - మచిలీపట్టణం నగరస్థానం) 32. కుట్టిమాళ్ అమ్మ, శ్రీమతి ఎ. వి. (తెలిచేర్రి - కాలికట్ నగర స్త్రీలస్థానం) 33. కుణి కుమ్మరాన్ నంబియార్, కె. టి. పశ్చిమతీరపు భూస్వాముల నియోజకవర్గం) 34. కుప్పుస్వామి, ఆర్. (యూనియన్‌లలో లేని బట్టలమిల్లుల పనివారిప్రతినిధి) 35. కుప్పుస్వామి నాయుడు, ఎ. (కాంచీపురం గ్రామీణ) 36. కుమారస్వామి, గరిమెళ్ళ (చికాకోల్ గ్రామీణ) 37. కుమారకృష్ణ యాచేంద్రబహదర్, శ్రీ వెలుగోటి సర్వజ్ఞ, వెంకటగిరిరాజా (భూస్వాముల నియోజకవర్గం) 38. కుమా

రన్, ఎం. (చిరక్కాల్ గ్రామీణ) 39. కుమారస్వామిరాజా, పి. ఎస్. (శ్రీవిల్లిపుత్తూర్ గ్రామీణ) 40. కూర్మయ్య, వేముల (మచిలీపట్టణం, గ్రామీణ హరిజన్) 41. కులశేఖరదాస్, కె. (దిండివనం గ్రామీణ హరిజన్) 42. కృష్ణన్, కె. యస్. వి. (దిండివనం గ్రామీణ) 43. కృష్ణన్, ఎస్. (పొల్లాచి గ్రామీణ హరిజన్) 44. కృష్ణస్వామి వాండియార్, ఏ. (కుంభకోణం గ్రామీణ) 45. కొఠారి, సి. ఎం. (టీ, రబ్బరు తోటల యజమానులస్థానం) 46. కోటిరెడ్డి, కె. (కడప గ్రామీణ) 47. కోసలరామ నాడార్, కె. టి. (తూత్తుకోడి గ్రామీణ) 48. గంగాధర రామారావు బహదూర్, శ్రీ రావువెంకట కుమార మహీపతి, పిఠాపురం యువరాజు (భూస్వాముల నియోజకవర్గం) 49. గురువులు, సాకేటి (చికాకోల్ గ్రామీణ హరిజన్) 50. గోపాలరెడ్డి, బెజవాడ (కావలి గ్రామీణ) 51. గోపాలస్వామి ఎల్. ఎన్. (తిరుచినాపల్లి - కరూర్) 52. గోవిందదాస్, డి. (బళ్ళారి గ్రామీణ హరిజన్) 53. గోవింద నాయర్, సి. కె. (కురుంబ్రానాడ్ గ్రామీణ) 54. గోవిందన్ నాయర్, పి. (పొన్నాని గ్రామీణ) 55. గోవిందమీనన్, పి. (మలప్పురం గ్రామీణ) 56. గోవిందరాజులు నాయకర్, ఎస్. కె. (సైదాపేట గ్రామీణ) 57. గోవిందస్వామి నాయుడు, ఎన్. (బట్టల మిల్లుల పనివారి యూనియన్ మదరాసు) 58. చందు, ఏ. (కాలికట్ గ్రామీణ) 59. చంద్రమౌళి, కల్లూరి (తెనాలి గ్రామీణ) 60. చిదంబర అయ్యర్, ఎస్. (విల్లుపురం గ్రామీణ) 61. చెంగం పిళ్ళై, ఒ. (తిరువళ్ళూర్ గ్రామీణ హరిజన్) 62. జపామణి మాసిలామణి, శ్రీమతి (తిరునెల్వేలి పాలంకోట-తూత్తుకుడి నగర ఇండియన్ క్రిస్టియన్ స్త్రీలస్థానం) 63 జాఫర్ మొహిదీన్ సాహెబ్ (అనంతపూర్ ముస్లిం గ్రామీణ) 64. జోగి నాయుడు, అల్లూరి (విజయనగరం గ్రామీణ) 65. తంగవేలు, ఆర్. (తిరువణ్ణామలై, గ్రామీణ హరిజన్) 66. తంగస్వామి, పి. ఏ. (తిరునెల్వేలి, క్రిస్టియన్) 67. తాతాచారి, టి. కె. టి. ఎన్. ఆర్. (చంద్రగిరి గ్రామీణ) 68. త్యాగరాజపిళ్లె, ఎం. డి. (నాగపట్టణం గ్రామీణ) 69. త్యాగరాజ పోలగర్, జి. (తంజావూర్ గ్రామీణ) 70. త్యాగూ వొయికొక్కార్ (మన్నార్గుడి గ్రామీణ హరిజన్) 71. దామో

దరణ్ ఎం. పి. (కోటాయం గ్రామీణ) 72. దేవనాయగఅయ్యా, ఏ. (కడలూర్ గ్రామీణ) 73. దొరైకన్ను ఎం. (తిరుత్తణి, గ్రామీణ, హరిజన్) 74. దొరైరాజ పాండ్యన్, డి. (తిరునెల్వేలి, గ్రామీణ) 75. నటేశన్, పి. (దక్షిణభారత వాణిజ్యసంఘం) 76 నటేశన్, చెట్టియార్, ఎం. జి. (ధర్మపురి, గ్రామీణ) 77. నరసింహరాజు, పి. ఎల్. (విజయనగరం, గ్రామీణ) 78. నరసింహరావు, గుంటూరు. (మదరాసునగరం, ఉత్తరభాగం) 79. నాగప్ప, ఎస్. కర్నూలు, గ్రామీణ, హరిజన్) 80. నాగరాజ అయ్యంగార్, ఎన్. (నామక్కల్, గ్రామీణ) 81. నాగరాజ మణిగార్, ఎస్. (హోసూరు, గ్రామీణ) 82. నాగయ్యా, ఎస్. (కడప, గ్రామీణ, హరిజన్) 83. నాగేశ్వరరావు, మేడూరి (గుంటూరు, గ్రామీణ) 84. నాచియప్ప గౌండర్, కె. ఎ. (ఓమలూర్, గ్రామీణ) 85. నాథమునిరెడ్డి, ఆర్. (మదనపల్లి, గ్రామీణ) 86. నారాయణరెడ్డి, కె. బి. (రాజంపేట, గ్రామీణ) 87. పట్టాభిరామన్, టి. ఎస్. (తిరుచెంగోడ్, గ్రామీణ) 88. పట్టాభిరామయ్యా, ఎం. ఎస్. (దిండిగల్, గ్రామీణ) 89. పరమానందరాయర్, ఎస్. (చిదంబరం, గ్రామీణ. 90. పరమేశ్వరన్, ఓ. (చంగల్పట్టు, గ్రామీణ. హరిజన్) 91. పరిశుద్ధనాడార్, ఎ. వై. ఎస్. (తంజావూరు—మధుర—రామ్నాడ్ భారతీయ క్రైస్తవస్థానం) 92. పలియకుటుంబర్, ఎస్. కె. (కోయిల్పట్టి, గ్రామీణ, హరిజన్) 93 పళనిస్వామి గౌండర్ వి. పి. (కోయంబత్తూరు, గ్రామీణ) 94. పళ్ళంరాజు, మల్లిపూడి (కాకినాడ, గ్రామీణ) 95. పాయిస్, ఎల్. సి. (పశ్చిమతీరం, భారతీయ క్రైస్తవస్థానం) 96. ప్రకాశం, టంగుటూరి (మదరాసునగరం, దక్షిణప్రాంతం) 97. పెరియాస్వామి, ఎం. పి. (నామక్కల్, గ్రామీణ, హరిజన్) 98. పెరుమాళ్లునాయుడు, బత్తిని (కందుకూరు, గ్రామీణ) 99. పొన్నాంబాళ గౌండర్ (తిరుచినాపల్లి, గ్రామీణ) 100 పొన్నుస్వామి గౌండర్, వి. (తిరుపత్తూరు, గ్రామీణ), 101. పొన్నుస్వామి మొదలియార్, ఎ. (దక్షిణార్కాడు-తిరుచినాపల్లి-సేలం-కోయంబత్తూరు భారతీయ క్రైస్తవస్థానం) 102. పోక్కర్ సాహెబ్, బి. (కాలికట్-కన్ననూర్-తెలిచ్చేరి నగర ముస్లింస్థానం)

103. ఫెర్నాండెజ్, డబ్ల్యు. జె. (ఆంగ్లో-ఇండియన్) 104. ఫెరెల్లీ, ఎఫ్. (యూరపియన్) 105. ఫౌలర్, హెచ్. ఓ. (ఆంగ్లో-ఇండియన్) 106. బంగారయ్య, శ్రీమతి భూపతిరాజు (భీమవరం, గ్రామీణ) 107. బాచిలర్, బి. డబ్ల్యు. (మదరాసు యూరపియన్ వాణిజ్యసంఘం) 108. బాపినీడు, మాగంటి (ఏలూరు, గ్రామీణ) 109. బాలకృష్ణన్, ఎస్. సి. (పళని, గ్రామీణ, హరిజన్) 110. బేగం సుల్తాన్ మీర్ అమీరుద్దీన్ (మదరాసునగరం, ముస్లిం స్త్రీలస్థానం) 111. బొక్కై గౌడర్, కె. (నిలగిరి, గ్రామీణ) 112. బ్రహ్మానందరెడ్డి, కె. (నరసరావు పేట) 113. భక్తవత్సలం, ఎం. (తిరువళ్ళూర్, గ్రామీణ) 114. భాష్యం, కె. (యూనివర్సిటీ) 115. మరిముత్తు, ఎం. (తంజావూరు, గ్రామీణ, హరిజన్) 116. మల్లయ్య, యు. పద్మనాభ (మెంగుళూర్, గ్రామీణ) 117. మహబూబ్ అలిబేగ్ సాహెబ్ (పశ్చిమ గోదావరి-కృష్ణ, ముస్లిం, గ్రామీణ) 118. మహమ్మద్ అబ్దుల్ సలాం సాహెబ్ (గుంటూరు, ముస్లిం, గ్రామీణ) 119. మహమ్మద్ అన్వర్ సాహెబ్, ఎన్. (ఉత్తరార్కాడు, ముస్లిం, గ్రామీణ) 120. మహమ్మద్ ఇబ్రాహిం, ఎం. ఎ. (తంజావూరు, ముస్లిం, గ్రామీణ) 121. మహమ్మద్ ఇబ్రాహిం, వి. ఎన్. (తిరుచినాపల్లి, ముస్లిం, గ్రామీణ) 122 మహమ్మద్ ఇస్మాయిల్ సాహెబ్ (విశాఖపట్టణం—తూర్పు గోదావరి, ముస్లిం, గ్రామీణ) 123. మహమ్మద్ ఇస్మాయెల్ సాహెబ్, ఎం. (మదరాసునగరం, ముస్లిం) 124. మహమ్మద్ ఇస్మాయెల్ సాహెబ్ (బళ్ళారి, గ్రామీణముస్లిం) 125 మహమ్మద్ రజాఖాన్ (చిత్తూరు, ముస్లిం, గ్రామీణ) 126 మహమ్మద్ రఫీవుద్ అహమ్మద్ అన్సారిసాహెబ్ (నెల్లూరు, ముస్లిం, గ్రామీణ) 127. మహిం షామ్నాడ్ సాహెబ్ (పుత్తూరు, ముస్లిం, గ్రామీణ) 128. మాణిక్యం, ఆర్. ఎస్. (సాతూర్, గ్రామీణ, హరిజన్) 129. ముత్తయ్య చెట్టియార్, రాజా సర్ ఎం. ఎ. (నాటుకోటి నగరత్తార్లసంఘం) 130. మునిస్వామిపిళ్లై, వి. ఐ.

(తిరుకోయిలూర్, గ్రామీణ, హరిజన్) 131. మూర్తి, బయ్యా సూర్య నారాయణ (కాకినాడ, గ్రామీణ, హరిజన్) 132. మొహిదీన్ కుట్టి, పి. కె. (పాలఘాట్, ముస్లిం గ్రామీణ) 133. మోసెస్ విల్సన్. జాన్ (ఉత్తర సర్కారులు, ఇండియన్ క్రిస్టియన్) 134. రంగస్వామిరెడ్డి, ఎన్. (మాయవరం, గ్రామీణ) 135. రాఘవన్, కె. (మలప్పురం, గ్రామీణ, హరిజన్) 136. రాఘవ నీనన్, ఆర్. (పాలఘాట్, గ్రామీణ) 137. రాఘవయ్య, వెన్నెలకంటి (నెల్లూరు, గ్రామీణ) 138. రాజ గురునాథచెట్టియార్, శ్రీ. ఈలంపల్లి జమీందారు (భూస్వాముల నియోజకవర్గం) 139. రాజమన్నార్, జి. (మదరాసు నగరం, ఉత్తరభాగం) 140. రాజారాంనాయుడు, కె. (తిరుమంగళం, గ్రామీణ) 141. రామచంద్రరావు, డాక్టర్. డి. ఎస్. (మదరాసు-చంగల్పట్టు భారతీయ క్రైస్తవస్థానం) 142. రామమూర్తి, రొక్కం (టెక్కలి, గ్రామీణ) 143. రామస్వామి మొదలియార్, వి. ఎం. (నెల్లూరు గ్రామీణ) 144. రామయ్య. ఎస్. పి. (ముసిరి, గ్రామీణ) 145. రామస్వామి, దిగుమర్తి వెంకట, (విశాఖపట్టణం, గ్రామీణ) 146. రామానుజులు రెడ్డియార్, ఆర్. (చెయ్యార్, గ్రామీణ) 147. రాయప్ప, ఎ. (గుత్తి, గ్రామీణ) 148. రుక్మిణి లక్ష్మీపతి, శ్రీమతి ఆచంట (మదరాసు నగర స్త్రీల స్థానం) 149. లచ్చన్న, గౌతు (విశాఖపట్టణం-తూర్పు గోదావరి ఫాక్టరీ పనివారల ఎన్నిక స్థానం) 150. లక్ష్మణస్వామి, పండు (అమలాపురం, గ్రామీణ, హరిజన్) 151. లక్ష్మీ అమ్మాళ్, శ్రీమతి కె. (దిండిగల్, స్త్రీలస్థానం గ్రామీణ) 152. లక్ష్మీ అమ్మాళ్, శ్రీమతి వి. (షెర్మాదేవి, గ్రామీణ) 153. లింగరాజు, క్రొవ్విడి (రాజమండ్రి, గ్రామీణ) 154. వరదాచారి, కె. (తిరుత్తణి, గ్రామీణ) 155. వరదాచారి, ఎన్. ఎస్. (మదరాసునగరం, దక్షిణ భాగం) 156. వాట్సన్, ఇ. ఎ. (యూరపియన్, వాణిజ్య)

157. విలియమ్స్, టి. (యూరపియన్) 158. విశ్వనాథం, తెన్నేటి (విశాఖపట్టణం, నగరస్థానం) 159. వీరన్నపాడల్, కంకిపాటి (అనాగరిక ప్రాంతాలు, కొండజాతులు) 160. వీరరాఘవులు, నూకల (బెజవాడ, గ్రామీణ) 161. వెంకట నారాయణ, పైండా (కాకినాడ, నగరస్థానం) 162. వెంకటనారాయణరెడ్డి, బి. (గూడూరు, గ్రామీణ, 163. వెంకటరత్నం, బిక్కిని (రాజమండ్రి, గ్రామీణ) 164. వెంకటరామ అయ్యర్, అమ్మపేట పి. (తంజావూరు-కుంభకోణం నగరస్థానం) 165. వెంకటరామయ్య అప్పారావు బహదూర్, శ్రీ మేకా, మీర్జాపురం జమీందార్ (భూస్వాముల నియోజకవర్గం) 166. వెంకటరాజు, ఎం. (ఒంగోలు, గ్రామీణ) 167. వెంకటరావు, కళా (అమలాపురం, గ్రామీణ) 160. వెంకటరెడ్డి, గోపవరం (నంద్యాల, గ్రామీణ) 169. వెంకటరెడ్డి, రెడ్డివారి (చిత్తూరు, గ్రామీణ) 170. వెంకటసుబ్బయ్య, నివర్తి (కర్నూలు, గ్రామీణ) 171. వెంకటాచలం పిళ్ళై, బి. (అరియలూరు, గ్రామీణ) 172. వెంకటేశ్వర్లు, పిల్లలమర్రి (పశ్చిమ గోదావరి-కృష్ణా-గుంటూరు ఫాక్టరీ పనివారల ప్రతినిధి) 173. వెంకన్న, గొట్టుముక్కల (ఏలూరు, గ్రామీణ, హరిజన్) 174. వేదరత్నం పిళ్ళై, ఎ. (మన్నార్గుడి, గ్రామీణ) 175. వేలాయుధపాణి, పి. ఎం. (రాణిపేట, గ్రామీణ హరిజన్) 176. వేలుస్వామి గౌండర్, పి. ఎస్. (పెరియకుళం, గ్రామీణ) 177. వైద్యనాథఅయ్యర్, ఎ. (మేలూరు, గ్రామీణ) 178. శంకరసుబ్రహ్మణ్య మొదలియార్, వి. ఎస్. (తిరునెల్వేలి-పాలంకోట నగరస్థానం) 179. శామ్యుయెల్, డాక్టర్ ఎం. జె. (మధ్య జిల్లాలు, భారతీయ క్రైస్తవస్థానం) 180. శివషణ్ముగంపిళ్ళై, జె. (మదరాసునగర హరిజనస్థానం) 181. శ్రీనివాసపడయాచి, పి. ఆర్. (తిరుకోయిలూర్, గ్రామీణ) 182. శ్రీనివాసరావు, డబ్ల్యు. ఎస్. (రాణిపేట, గ్రామీణ) 183. షణ్ముగం, కె. (గూడూరు, గ్రామీణ హరిజన్) 184. షణ్ముగ రాజేశ్వర సేతుపతి, రాజాశ్రీ ఆర్. రామ్నాడ్

రాజా (భూస్వాముల నియోజకవర్గం) 185. షణ్ముగసుందరం, పి. (రామ్నాడ్, గ్రామీణ) 186. షా ఆలంఖాన్ శావాయ్ సాహెబ్ (కడప, ముస్లిం, గ్రామీణ) 187. షెట్టి, ఎ. బి. (కుందపూర్, గ్రామీణ) 188. సత్యనాథ కరయలర్, ఎల్. (కోయిల్పట్టి, గ్రామీణ) 189. సత్యనారాయణరాజు, అల్లూరి (నరసాపురం, గ్రామీణ) 190. సత్యనారాయణరాజు, భూపతిరాజు (వీరవల్లి, గ్రామీణ) 191. సన్యాసిరావు, గెడ్డం (సర్వసిద్ధి, గ్రామీణ) 192. సహజానంద, ఎ. ఎస్. (చిదంబరం, గ్రామీణ, హరిజన్) 193. సంగంనాయుడు, పలవలస (పాలకొండ, గ్రామీణ) 194. సంజీవరెడ్డి, నీలం (అనంతపురం, గ్రామీణ) 195. స్వామిగౌండర్, ఎస్. కె. (గోబిచెట్టిపాళయం, గ్రామీణ) 196. స్వామినాథన్, ఆర్. వి. (శివగంగ, గ్రామీణ) 197. సీతామహాలక్ష్మమ్మ, శ్రీమతి వల్లభనేని (బందరు, గ్రామీణ) 198. సీతారామరెడ్డి, హాలాహల్వి (బళ్ళారి, గ్రామీణ) 199. సీతారామస్వామి, గోన (బొబ్బిలి, గ్రామీణ) 200. సీతిసాహెబ్, కె. ఎం. (మలప్పురం, ముస్లిం, గ్రామీణ) 201. సుబ్బన్న గౌండర్, కె. కె. (గోబిచెట్టిపాళయం, గ్రామీణ) 202. సుబ్బరామన్, ఎన్. ఎం. ఆర్. (మధుర, నగరస్థానం) 203, సుబ్బరాయన్, డాక్టర్ పి. (ధారాపురం, గ్రామీణ) 204. సుబ్బయ్య, పి. (ఒంగోలు, గ్రామీణ, హరిజన్) 205. సుబ్బయ్యర్, ఆర్. (చంగల్పట్టు, గ్రామీణ) 206. సుబ్బారావు, కల్లూరు (పెనుకొండ, గ్రామీణ) 207. సుబ్రహ్మణ్య అయ్యర్, డాక్టర్ ఎస్. (తిరుపత్తూరు, గ్రామీణ) 208. సుబ్రహ్మణ్యం, ఎ. (సేలం, గ్రామీణ) 209. సుబ్రహ్మణ్యం, కె. (కోయంబత్తూరు, నగరస్థానం) 210. సుమంగళమ్మ, శ్రీమతి అల్లం (బళ్ళారి, గ్రామీణ, స్త్రీలస్థానం) 211. సూరయ్య, కొల్లిపర (బెజవాడ, గ్రామీణ) 212. హసన్ కోయసాహెబ్, పుతియపొమ్మని చింతకాన్ (కొళికట్, ముస్లిం, గ్రామీణ) 213. హుస్సేన్, హెచ్. ఎస్. (మెంగుళూర్, ముస్లిం,)

గ్రామీణ) 214. హైద్రూస్, ఎం. ఎ. (పాలఘాట్, ముస్లిం, గ్రామీణ). ఒక స్థానం ఖాళీగా వుంది.

**శాసనసభ్యుల జీతాలు:** శాసనసభ్యులకు యిచ్చేడబ్బు రెండు సూత్రాలమీద ఆధారపడివుంది.

నెలకు రు 150 జీతం; శాసనసభాసమావేశానికి హాజరైన ప్రతి రోజుకూ, రు 12½ అలవెన్సు. సభ్యుల స్వస్థానంనుంచి మదరాసుకు రావడానికి, రానుపోను రైలులో ఫస్టుక్లాసు అయేఖర్చుకు ఒకటిన్నర రెట్లు ప్రయాణపుఖర్చు.

పై పద్ధతికి అంగీకరించని సభ్యులకు, సభాసమావేశానికి హాజరైన ప్రతిరోజుకూ రు 20 అలవెన్సు: వారి స్వస్థానంనుంచి మదరాసు రావడానికి, రానుపోను రైలులో ఫస్టుక్లాసుకు అయేఖర్చుకు 1¼ రెట్లు ప్రయాణపుఖర్చు.

## అసెంబ్లీస్థానాల వివరాలు

మొత్తం స్థానాలు 215. జనరల్ పట్టణ 15; జనరల్ గ్రామీణ, 131: ముస్లింపట్టణం, 2; గ్రామీణ ముస్లిం, 26; జనరల్ స్త్రీల పట్టణ 8; జనరల్ స్త్రీల గ్రామీణ, 3; ముస్లిం స్త్రీల పట్టణ, 1; ఇండియన్ క్రిస్టియన్ స్త్రీల పట్టణ, 1; ఆంగ్లో ఇండియన్, 2; వాణిజ్యసంస్థలస్థానాలు, 5, అనాగరికజాతులు, 6; భూస్వాములు, 6; భారతీయ క్రైస్తవ, 8; కార్మిక, 6; యూనివర్సిటి, 1; యూరపియన్, 3.

## అసెంబ్లీలో పార్టీల బలం

కాంగ్రెసు: 166 లీగ్: 20
యూరపియన్: 3 ఆంగ్లో-ఇండియన్: 2
స్వతంత్ర: 16 కమ్యూనిస్టులు: 2
భారతీయ క్రైస్తవులు: 3

అసెంబ్లీ ఎన్నికలలో, ఏఏపార్టీల సభ్యులకు ఎన్నెన్నిఓట్లు వచ్చినవీ క్రింది పట్టీవలన తెలుస్తుంది:

కాంగ్రెసు: 2 ,04,826; కమ్యూనిస్టులు: 3,31,662, షెడ్యూల్డ్ క్యాస్టస్: 63,850; హిందూమహాసభ: 2,406; రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ, 10,667; స్వతంత్రులు: 1,44,944,

## కౌన్సిలులో పార్టీబలం

మొత్తం సభ్యులు, 54.

కాంగ్రెసు, 35; లీగ్, 4: యునైటెడ్ డెమొక్రాట్, 9; స్వతంత్రులు, 7.

కాంగ్రెసు లెజిస్లేటివ్ పార్టీ బలం, అసెంబ్లీలోను కౌన్సిలులోను కలిపి, 201. వీరిలో 107 మంది తమిళులు; 76 మంది ఆంధ్రులు; 18 మంది కేరళీయులు.

## ప్రభుత్వశాఖల కార్యదర్శులు

| | |
|---|---|
| ఛీఫ్ సెక్రటరీ: | కె. రామునిమీనన్ |
| హోం: | ఓ. పుల్లారెడ్డి |
| పబ్లిక్ వర్క్సు: | టి. ఎ. వర్ఖీస్ |
| డెవలప్ మెంట్: | కె. జి. మీనన్ |
| విద్య, ఆరోగ్యము: | ఎం. వి. సుబ్రమణ్యన్ |
| ఆహారం: | ఎం. ఎ. కుత్తలింగం పిళ్ళె |
| శాసనం: | కె. వి. రాజగోపాలన్ |
| ఆర్థికశాఖ: | టి. ఎన్. ఎస్. రాఘవన్ |
| స్థానిక పరిపాలన: | ఆర్. డి. పాల్ |
| రెవిన్యూ: | జి. వెంకటేశ్వర అయ్యర్ |

## రాష్ట్రంలో ప్రధానోద్యోగులు

రెవిన్యూ బోర్డు సభ్యులు:
- వి. ఎన్. కుద్వ
- వి. ఎస్. హెజ్మాడి
- డబ్ల్యు. ఆర్. ఎస్. సత్యనాథన్

| | |
|---|---|
| రాష్ట్ర టెక్స్‌టైల్ కమిషనరు : | ఎం. ఎస్. శివరామన్ |
| డైరక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ : | టి. ఎం. ఎస్. మణి |
| డైరక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ : | ఆర్. ఎం. సుందరం |
| పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ : | సి. కె. విజయరాఘవన్ |
| రిజిస్ట్రేషన్ ఇన్‌స్పెక్టర్ జనరల్ : | హెచ్. కృష్ణమూర్తి |
| సర్జన్ - జనరల్ : | కర్నల్ ఎస్. ఎల్. భాటియా |
| ఛీఫ్ ఇంజనీర్ (ఇరిగేషన్) : | ఎ. ఆర్. వెంకటాచార్య |
| ఛీఫ్ ఇంజనీర్ (హైవేస్) : | డబ్ల్యు. హెచ్. టర్నర్ |
| డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ హెల్త్ : | డాక్టర్ ఆర్. ఎం. మెత్యూ |
| ఛీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స : | ఎం. కేశవన్ ఉన్ని నాయర్ |
| డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ : | డి. సదాశివరెడ్డి |
| ఇన్‌స్పెక్టర్ ఆఫ్ లోకల్ బోర్డ్స : | కె. ఎం. ఉన్నితన్ |
| డైరక్టర్ ఆఫ్ పబ్లిసిటీ : | ఎస్. ద్రవ్యం |
| రైళ్ళ ఇన్‌స్పెక్టర్ జనరల్ : | కర్నల్ జి. ఎస్. గిల్ |
| రిజిస్ట్రార్ ఆఫ్ కో-ఆపరేటివ్ సొసైటీస్ | రావు బహదూర్ జె. సి. రయన్ |
| డైరెక్టర్ ఆఫ్ ఫైర్ సర్వీసెస్ : | సి. ఆర్. హేడింగ్‌హాం |
| డైరక్టర్ ఆఫ్ ఏనిమల్ హస్బెండరీ : | టి. జె. హర్లీ |
| లేబర్ కమిషనర్ | సి. జి. రెడ్డి |
| సెంట్రల్ ఎక్సైజు కలెక్టర్ : | ఆర్. జె. ప్రింగిల్ |
| ఛీఫ్ ఇంజనీర్ (ఎలక్ట్రిసిటీ) : | జి. సుందరం |
| ఆర్థిక సలహాదారు : | డాక్టర్ బి. ఆర్. నటరాజన్ |
| మదరాసు పోలీసు కమిషనర్ : | పి. కె. మోనప్ప |
| ట్రాన్స్‌పోర్ట్ కమిషనర్ : | వి. హనుమంతరావు |
| డైరక్టర్ ఆఫ్ కంట్రోల్డ్ కమోడిటీస్ | జె. శివానందం |
| ఇన్‌కంటాక్స కమిషనర్ : | జి. డి. బగ్రి |

## హైకోర్టు

ప్రధాన న్యాయమూర్తి, పి. వి. రాజమన్నార్. తక్కిన జడ్జీలు: జస్టిస్ ఎల్. సి. హార్విల్. జస్టిస్ యాహ్యాఆలీ, జస్టిస్ ప్రత్తిపాటి సత్య నారాయణరావు, జస్టిస్ పి. గోవిందమీనన్, జస్టిస్ ఎస్. పంచాప కేశశాస్త్రి, జస్టిస్ కె. సుబ్బారావు, జస్టిస్ పి. రాజగోపాలన్, జస్టిస్ ఎ. విశ్వనాథశాస్త్రి, జస్టిస్ చింతగుంట రాఘవరావు, జస్టిస్ ఇ. ఇ. మాక్, జస్టిస్ ఎ. ఎస్. పి. అయ్యర్, జస్టిస్ ఎన్. సోమసుందరం, జస్టిస్ పి. వి. బాలకృష్ణఅయ్యర్. రిజిష్ట్రార్: కె. ఎన్. గణపతి.

## పబ్లిక్ సర్వీసెస్ కమిషన్

చైర్మన్: దివాన్‌బహదూర్ టి. ఎం. నారాయణస్వామి పిళ్లె
మెంబర్లు: రావు బహదూర్ పి. జ్ఞానసుందరం మొదలియార్
పి. వి. నరసింహరాజు
సెక్రటరి: సి. కృష్ణస్వామిచెట్టి

## హిందూ ధర్మాదాయబోర్డు

ప్రెసిడెంట్: టి. ఎం. చిన్నయ్య పిళ్ళె
కమీషనర్లు: ఎ. ఎస్. మన్నడి నాయర్
పి. కామేశ్వరరావు
సెక్రటరి: ఎ. బాలకృష్ణ పిళ్ళె
డిప్యూటి సెక్రటరి: వి. శివశంకర రావు

## తిరుమల తిరుపతి దేవస్థానం కమిటి

కె. వెంకటస్వామి నాయుడు, (ప్రెసిడెంట్); ఎం. ఎల్, సి.; ఆర్. సూర్యారావు; వి. త్యాగరాజ ముదలియార్; ఎం. దొరైకణ్ణు, ఎం. ఎల్. ఎ., గోపవరం వెంకటరెడ్డి, ఎం. ఎల్. ఏ., మహంతు నారాయణ దాస్‌జి.

## జిల్లా కలెక్టర్లు

అనంతపురం: సి. వివేకానందమూర్తి

ఉత్తరార్కాడు: ఏ. దొరైరాజ్

కడప: బి. మాధవరావు నాయుడు

కర్నూలు: రావు బహదూర్ ఎస్. జోసెఫ్ రెడ్డి

కృష్ణ: పి. క్రోంబీ

కోయంబత్తూరు: యఫ్. డబ్ల్యు. ఎ. మోరిస్

గుంటూరు: టి. ప్రభాకరరావు నాయుడు

చంగల్పట్: ఖాన్ సాహెబ్ జి. అబ్దుల్ సత్తార్ సాహెబ్

చిత్తూరు: ఎన్. సుబ్రహ్మణ్యం

తంజావూరు: టి. కె. శంకరవడివేలు పిళ్లై

తిరుచినాపల్లి: వి. ఎన్. రాజన్

తిరునెల్వేలి: కె. ఘులాం మహమ్మద్ సాహెబ్

తూర్పుగోదావరి: ఆర్. కోటీశ్వరరావు నాయుడు

దక్షిణకన్నడ: ఎన్. సి. థామస్

దక్షిణార్కాడు ఎ. యఫ్. మెస్కర్హాస్

నీలగిరి: ఎస్. రాజగోపాల అయ్యంగార్

నెల్లూరు: ఆర్. ఎస్. మలయప్పన్

పడమటి గోదావరి: షేక్ అహమద్

బళ్ళారి: ఇ. సి. అల్లార్డైస్

మదరాసు: వి. పి. సుబ్రమణ్యన్

మధుర· కె. రామవర్మరాజా

మలబార్ ఆర్. ప్రసాద్

రామనాథం: పి. వి. సుబ్బారావు

విశాఖపట్టణం: జె. ప. ఎల్. షెనాయ్

సేలం: సి. వి. నరసింహన్

# 'లా' విషయాలు

మన దేశంలో అమలులో ఉన్న 'లా' ను స్థూలంగానైనా ప్రతి వ్యక్తీ తెలిసికొని ఉండాలి. ఇది చాలా ముఖ్యం. 'లా' తెలియక తప్పు చేశానన్నంతమాత్రాన శిక్ష తప్పదు. ఇలాంటి సమాధానాన్ని ఏ న్యాయస్థానమూ ఒప్పుకోదు. అందువల్ల సాంఘిక జీవనంలో ప్రతి సామాన్యము ముఖ్యంగా తెలుసుకోవలసిన కొన్ని విషయాలు ఇక్కడ సూచించబడినవి.

రశీదులు. తెల్లవారిలేస్తే పడుకునేదాకా డబ్బు వ్యవహారాలతో నిమిత్తంలేకుండా ఎవడికీ జరగదు. ఒకరికి పైకం ఇచ్చినప్పుడుగాని ఇంకొకరినుండి పుచ్చుకున్నప్పుడుగాని రశీదులు వ్రాసుకోవడం ఉత్తమమైన పద్ధతి. జరిగిన లావాదేవీలకు ఇవి సాక్ష్యంగా ఉండడంవల్ల లేనిపోని తగాదాలకు తావుండదు. ఈ రశీదులు ఒక ప్రత్యేకమైన విధంగా ఉండాలనే నియమంలేదు. ఫలానావారు ఫలానా మొత్తం ఫలానా దానికిగాను ఇచ్చినారు గనుక ముట్టినవని వ్రాసి, సంతకంచేసి తారీఖు వేస్తే సరిపోతుంది. ఇరవై రూపాయలకు మించని పక్షంలో ఏలాంటి స్టాంపును అంటించనక్కరలేదు. ఆ మొత్తాన్ని మించినప్పుడు మాత్రం ఒక అణా రెవెన్యూ చీటీని అంటించి ఆ బిళ్ళమీద సంతకం చేయవలసి ఉంటుంది. ఈ చీటీని అంటించకపోతే ఆ రశీదుకు విలువ ఉండదు.

ప్రామిసరి నోట్లు: ఎవరో అదృష్టవంతులు తప్ప జన బాహుళ్యం అప్పులనిచ్చి పుచ్చుకోకుండా జీవయాత్ర సాగించలేరు. ఏ వ్యవహారమైనా నోటిమాటలతోకంటె వ్రాతమూలంగా నిర్వహించు కుంటే ఉభయులకు శ్రేయస్కరం. అందువల్ల 'ఫలానా తేదీన ఫలానా నేను ఫలానా వారిదగ్గర ఫలానా మొత్తాన్ని ఫలానా కారణంవల్ల పుచ్చుకొన్నాను కాబట్టి ఫలానా వడ్డీతో అయే అసలు ఫాయిదాలను వారు కోరినప్పుడు వారికిగాని వారి ఆర్డరుకుగాని ఇవ్వగలవాడను' అని వ్రాసి చీటీ అంటించి దస్కతు చేయాలి. నోటు తాలూకు మొత్తం

రు. 250 కి మించనట్లయితే ఒకఅణా రెవిన్యూస్టాంపు సరిపోతుంది. రు. 250 నుండి రూ. 1000 వరకు రెండు అణాల స్టాంపు. ఆ పైన ఎంత మొత్తానికైనా నాలుగణాల చీటీ అతికిస్తే చాలు. అడిగినప్పుడు కాకుండా మారకపు (ఎక్స్ఛేంజ్) బిల్లుల మాదిరి తీరుమానం చేయదలచిన నోట్లకు రెండురూపాయల స్టాంపు వేయాలి. ప్రతి నోటుమీద ఇద్దరైనా సాక్షి సంతకాలుఉంటే మంచిది. నోటు వ్రాసినవ్యక్తి సాక్షుల ఎదుటనే సంతకం చేయాలి.

నోటు వ్రాయించుకున్నవారు వ్రాసినవారికి తెలియపరచి మరి ఎవరికైనా నోటును ప్రతిఫలం కోసం ట్రాన్స్ఫర్ చేయవచ్చును. నోటు వ్రాసిన తేదీ లగాయతు, మూడేండ్లలోపుగా ఆ తాలూకు మొత్తాన్ని వసూలు చేసుకోవటమో లేక దావా వేయటమో జరగకపోతే ఆ నోటు కాలదోషం పట్టిపోతుంది. ఈ గడువుదాటే లోపల నోటు వ్రాసిన వారిచేత కొంతసొమ్ము చెల్లువేయించి వారిచేతనే నోటు వెనుక భాగం మీద ఆ విషయం వ్రాయించడమో లేక నోటును తిరిగి వ్రాయించుకొనడమో చేయవలసి ఉన్నది.

చెక్కులు : పెద్ద మొత్తాలను ఇనుపపెట్టెలలో పెట్టి పదిలపరచుకొనడము, ప్రామిసరి నోట్లమీద అప్పులివ్వడము వివేకమైన పనులు కావు. ఒక్కొక్కప్పుడు అసలుకే మోసం రావచ్చును. వడ్డీ తక్కువ అయినప్పటికి బ్యాంకీలలో వేసికొంటే మంచిది. బ్యాంకీలలో అక్కౌంటు ఉన్నట్లయితే చేతిలో ఎక్కువ రొఖం ఉంచుకోవలసిన అగత్యం ఉండదు. ఇవ్వవలసినవారికి చెక్కు వ్రాసి ఇస్తే సరిపోతుంది. ఈ చెక్కులలో పుచ్చుకొనేవారి పేరు, ఇచ్చే మొత్తం, తారీకు వ్రాసి బ్యాంకువారికి నమూనాగా ఇచ్చిన విధంగా సంతకం చేయాలి. ఇవి అన్యులచేతులలో పడకుండా ఉంటానికి క్రాస్ చేయవలసి ఉంటుంది. అంటే చెక్కుమీద ఎడమవైపు పైభాగాన ఒకదానిక్రింద ఒకటిగా రెండు ఏటవాలు గీతలుగీసి, ఆ గీతలమధ్య 'అండుకో' అని వ్రాయాలి. అప్పుడు ఈ చెక్కు తాలూకు మొత్తము బ్యాంకీలో అక్కౌంటు వున్నవారిపరంగా మాత్రమే ఇవ్వబడుతుంది. ఒకసారి చెక్కు పుట్టిన తరువాత ఎవరికైనా ట్రాన్స్ఫర్ చేయవచ్చును. మూడు మాసాల

లోపుగా సొమ్ము చేసుకోకపోతే చెక్కు రద్దు అవుతుంది. హుండీల విషయంకూడ ఇంతే. ఇవి వ్యాపారస్థులకు ఎంతో ఉపయుక్తంగా ఉంటాయి. పొరుగువాళ్ళవారికి ఈ బ్యాంకి హుండీలద్వారా తక్కువ ఖర్చుతో ఎంత, డబ్బునైనా సులభంగా పంపవచ్చును. చెక్కుల పరంగా డబ్బు ఇచ్చినప్పుడు ఒకవేళ రశీదులు తీసికోకపోయినా ప్రమాద ముండదు.

ఎగ్రిమెంట్లు : వ్యాపారంలోగాని మరి ఇతర వ్యవహారాలలో గాని అనుకున్న ఒడింబడికలను లిఖితపూర్వకంగా నిర్ణయించుకుంటే ఉభయపార్టీలకు మంచిది. సాధ్యమయినంతవరకు ఈ అగ్రిమెంట్లను లాయర్లచేత వ్రాయించుకుంటే, న్యాయబద్ధంగాని అవకతవక షరతులకు అవకాశం ఉండదు. ప్రతిఫల శూన్యమైన కంట్రాక్టు అగ్రిమెంట్లు చెల్లవు. మోసంవల్ల, వత్తిడివల్ల, పొరబాటువల్ల ఏర్పడిన అగ్రిమెంట్లను రద్దు చేసుకోవచ్చును. సాధారణపు ఒడంబడికలను రూపాయిన్నర స్టాంపు పేపరుమీద వ్రాసుకోవాలి.

పవర్ ఆఫ్ అటర్ని : ఒక ప్రత్యేక వ్యవహారాన్నిగాని లేక సర్వవిధ వ్యవహారాలనుగాని తన తరఫున నిర్వహించటానికి ఒక వ్యక్తి మరొకవ్యక్తికి న్యాయబద్ధంగా అధికారం ఇవ్వవచ్చును. ఇది లిఖితపూర్వకంగా జరగాలి. వీటిని పవర్ ఆఫ్ అటర్ని అంటారు. ఒక్క ప్రత్యేక విషయానికయితే స్పెషల్ పవర్, సర్వవిషయాలకైతే జనరల్ పవర్ పత్రాలను వ్రాయాలి. ఒకరితరఫున దస్తావేజును రిజిష్టరు చేసేందుకు ఇచ్చే పవరును ముప్పావలా స్టాంపు పేపరుమీద వ్రాయాలి. స్పెషల్ పవరుకు రూపాయిన్నర స్టాంపు ఉపయోగించాలి. జనరల్ పవరుకు పదకొండు రూపాయల స్టాంపు అవసరం. ఈ పత్రాలలో "ఫలానా నేను ఫలానావారికి నా తరఫున ఫలానా కార్యనిర్వహణకు అధికారం ఇచ్చుచున్నాను కాబట్టి అందరు తెలుసుకోవలసినది" అని వ్రాసి సంతకంచేసి తారీకు వేయాలి. సాక్షుల సంతకాలుకూడ అవసరం. ఈ పవరు పత్రాలను రిజిష్టరుచేయిస్తే ఇంకా మంచిది.

కౌళ్లు : తెలుగుదేశంలో సాధారణంగా కొద్దో గొప్పో భూవసతి లేనివాళ్ళు అరుదు. స్వంతంగా వ్యవసాయం చేసుకునే వాళ్ళకంటె సాగుకు ఇతరులకిచ్చేవాళ్ళే అధికంగా ఉంటారు. అటువంటప్పుడు రైతువల్ల కౌలు వ్రాయించుకొనటము, రయితుకు భూస్వామి కబూలియత్ వ్రాసి ఇవ్వటము ఆచారంగా ఉంటున్నది. ఈ రెండు పత్రాలలోను విషయాలు ఒకేవిధంగా ఉంటాయి. ఉభయపార్టీల పేర్లు, సాగుకు ఇచ్చిన పొలం విస్తీర్ణం, రైతు చెల్లించవలసిన ధాన్యము లేక పైకము పరిమితికాలం మొదలైన అంశాలను, షరతులను ఉదహరించాలి. సాక్షి సంతకాలుకూడ అవసరం. ఈ పత్రాలను ఉచితమైన స్టాంపును పెట్టి రిజిష్టరుచేస్తే మంచిది. సంవత్సరానికి మించిన కౌళ్ళ సందర్భంలో తప్పకుండా రిజిష్టరుచేయుట మవసరం.

ఇదేవిధంగా నివేశన స్థలాలనుగాని ఇండ్లనుగాని అద్దెకు పుచ్చుకున్నప్పుడు లీజు పత్రాలు వ్రాసుకొనటం శ్రేయస్కరమైన పద్ధతి. అద్దె మొత్తాన్నిబట్టి స్టాంపు కాగితంమీద వ్రాసి రిజిష్టరు చేయించుకోవాలి. ఎప్పటికప్పుడు అద్దె రశీదులను తీసుకొని భద్రపరచుకోవలసి ఉంటుంది.

ఆస్తి విక్రయం : చరాస్తులను విక్రయించినప్పుడు వ్రాతకోత అవసరంలేదు. ప్రతిఫలం పుచ్చుకొని స్వాధీనం చెయ్యగానే అన్నిహక్కులు కొన్నవాడికి సంక్రమించగలవు. కొనుక్కున్నవాళ్ళు రశీదులు పుచ్చుకొనటము ఉత్తమం. విలువైన వస్తువుల అమ్మకం లిఖిత పూర్వకంగా జరిగితేనే మంచిది. స్థిరాస్తి అమ్మకం విషయంలో నూరు రూపాయలకు తక్కువగా ఉండేటట్లయితే పత్రాన్ని రిజిష్టరుచేయ నక్కరలేదు. స్వాధీనంచేస్తే సరిపోతుంది. ఆస్తి విలువ అంతకు మించినట్లయితే దస్తావేజును వ్రాయించి రిజిష్టరు చేయించాలి. లేకపోతే చెల్లదు.

స్థిరచరాస్తులను కొనుక్కునేటప్పుడు ప్రతిఫలం అప్పుడే చెల్లించి రిజిష్టరు చేయించుకోడానికి వీలుకానప్పుడు క్రయపు అగ్రిమెంటును వ్రాసుకుంటే మంచిది. ఆస్తి వివరాలను, ధరను, ఉభయుల పేర్లను,

ఇచ్చిన బయానాను, రిజిష్టరుచేసే గడువును, ఆవిధంగా జరగకపోతే జరగవలసిన నిర్ణయాన్ని ఈ అగ్రిమెంటులో వ్రాసుకోవాలి. పెట్టుకున్న గడువు దాటిపోక మునుపే లాయరుచేత దస్తావేజును వ్రాయించి, రజిష్ట్రారు సమక్షంలో పైకం చెల్లించి రిజిష్టరుచేయించితే మంచిది. ఆస్తికొనుక్కునేముందు ఆ అమ్మేవాడికి ఆస్తిమీద సర్వహక్కులు కలవా లేవా అని విచారించాలి. పూర్వపు దస్తావేజులను పరిశీలించడమే గాక పన్నెండు సంవత్సరాలలోపుగా జరిగిన అన్యాక్రాంతాలను ధృవపరిచే ఎన్‌కంబరెన్సు సర్టిఫికేటునుగూడ తెప్పించి చూచుకోవాలి. రజిస్ట్రేషనుతోపాటు ఆస్తి స్వాధీనంకూడ జరిగేట్లు చూడాలి. విక్రయ సమయంలో అద్దెకుగాని కౌలుకుగాని పుచ్చుకున్నవారి స్వాధీనంలో ఆస్తి ఉన్నట్లయితే వారిచేత కొన్నవారి హక్కులను లిఖితపూర్వకంగా ఒప్పందం చేయించాలి,

తాకట్లు : ఆధారంలేకుండా సులభంగా అప్పుపుట్టదు కొబట్టి స్థిరచరాస్తుల తాకట్లు అమలులోకి వచ్చినాయి. వస్తువులను కుదువ పెట్టినప్పుడు అందుకు సాక్ష్యంగా తాకట్టు పెట్టుకున్నవారి దగ్గరనుంచి పూర్తి వివరాలతో రసీదును పుచ్చుకోవాలి. స్థిరాస్తి తాకట్లు అనేక విధాలుగా ఉంటాయి. అన్నివిధాల తాకట్లలోను దస్తావేజులు రిజిష్టరు చేయించుకోవటం అవసరం. సామాన్యపు తాకట్టులో ఆస్తి తాకట్టు పెట్టినవాడి స్వాధీనంలోనే ఉంటుంది. తాకట్టు గడువులోపల అప్పును చెల్లించి తాకట్టును రద్దుచేయని పక్షంలో దావా వేయవలసి ఉంటుంది. స్వాధీనపు తనఖాలో ఆస్తిని అప్పు యిచ్చినవాడికి స్వాధీనం చేయవలసి ఉంటుంది. గడువులోపుగా ఆ ఆస్తిమీద వచ్చే అయివేజు వల్లగాని, రొఖ పూర్వకంగా గాని అప్పు అసలు ఫాయిదాలను చెల్లువేయగానే ఆస్తి తిరిగి స్వాధీనమవుతుంది. ఈ తాకట్టు దస్తావేజునుగూడ రిజిష్టరు చేయించాలి. మద్రాసులాంటి రాజధాని నగరాలలో మాత్రమే ఆస్తి తాలూకు టైటిల్ పత్రాలను తాకట్టుపెట్టి అప్పు తీసుకోవచ్చును. ఆస్తి ఎక్కడ వున్నా పట్టింపులేదు. పత్రాలనుమాత్రం మద్రాసులో స్వాధీనంచేస్తే ఈవిధమైన తాకట్టును కరారు చేసుకోవచ్చును. ఒకే ఆస్తిమీద

ఎన్ని తాకట్లయినా ఉండవచ్చును. అయితే తీర్మానంమాత్రం వరుస క్రమాన జరుగుతుంది. తరువాతి తాకట్లు, ముందు తాకట్లకు లోబడి ఉంటాయి. పన్నెండేండ్లుదాటితే తాకట్లు కాలదోషం పట్టగలవు.

**భాగస్తులు :** వ్యాపారంలో ఒక్కొక్కప్పుడు భాగస్తులను తీసుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. అటువంటి సందర్భంలో ఎంతటి అప్తులైనా, స్నేహితులైనా వ్యవహారరీత్యా పార్ట్నరుషిప్ అగ్రిమెంటునువ్రాసి రిజిష్టరు చేయించుకొంటే అంత్యనిష్ఠూరం ఉండదు. అదీగాక రిజిష్టరు చేయించకపోయినట్లయితే కొన్ని సాధక బాధకాలుంటాయి. ఈ భాగస్వాములు ఇతరులమీద కోర్టు వ్యవహారాలు జరపటానికి వీలుండదు. ఆపైన భాగస్వాముల మధ్య తగాదాలు వచ్చినప్పుడుకూడ అనేక అడ్డంకులు సంభవిస్తాయి. మైనర్లతో భాగస్వామికం ప్రమాదమైనది. ఒక వ్యవహారంకోసం ఏర్పడినభాగం స్వామికం ఆ వ్యవహారం పూర్తికాగానే రద్దు అవుతుంది. కాలపరిమితి పెట్టుకున్న భాగస్వామికం గడువు దాటగానే రద్దవుతుంది. మిగతా భాగస్వామికాలలో ఏ ఒక భాగస్వామి అయినా తక్కినవారికి నోటీసుఇచ్చి భాగస్వామికాన్ని రద్దుచేయవచ్చును. అందరు భాగస్వాముల సమ్మతిమీద ఏ విధమైన భాగస్వామికమైనా విచ్ఛిన్నం కాగలదు. భాగస్వామికం అమలులో ఉన్నంతవరకు వ్యవహార నిర్వహణంలో ప్రతీభాగస్వామి చర్యకు తక్కిన భాగస్తులు బద్ధులవుతారు.

**హామీలు :** ఒకరికిగాను మరొకరు హామీఇచ్చి బాధ్యత తీసికొనటం ప్రమాదకరమైన విషయం. ఎంతో జాగ్రత్తతో సంచరించాలి. హామీ ఇచ్చినవాడికి అసలు బాధ్యస్తుడితోపాటు సమాన బాధ్యత ఉంటుంది. అసలు బాధ్యస్తుడిమీద ముందుగా చర్య తీసుకోమని కోరటానికి వీలుండదు. వ్యక్తిగతంగా గాని ఆస్తులతోగాని హామీ ఉండడం ప్రమాదకరం.

**నష్ట పరిహారాలు:** ప్రతివ్యక్తికి స్వతస్సిద్ధంగా అనేక హక్కులుంటాయి. ఈ హక్కులు వ్యక్తిగతంగానైనా ఉండవచ్చును; లేక ఆస్తిపాస్తులకు సంబంధించినవిగానైనా ఉండవచ్చును. స్వేచ్ఛ నరికట్టి

నప్పుడుగాని, శరీరానికో మనస్సుకో బాధ కలిగించినప్పుడుగాని, గౌరవ
ప్రతిష్ఠలకు భంగం కలిగించినప్పుడుగాని, ఆస్తిపాస్తుల స్వాధీనానుభవా
నులను నిరోధించినప్పుడుగాని, అందుకు కారకులైన వారినుంచి కోర్టుల
ద్వారా నష్టపరిహారములు పుచ్చుకోవచ్చును. చేసుకున్న ఒడంబడికలకు
వ్యతిరేకంగా ప్రవర్తించినప్పుడుగూడ పరిహారాలు కోరవచ్చును. ఈ
విషయంలో తెలియకపోవడంవల్లనైతేనేమి, ఉపేక్షవల్లనయితేనేమి
అనేకులు శ్రద్ధవహించక తమ హక్కులను నిలబెట్టుకోటానికి ప్రయ
త్నించరు. ఈ విషయానికి పాశ్చాత్యులు అధికమైన ప్రాధాన్యమిస్తారు.
ఇది అందరూ గమనించి అనుసరించదగిన అంశం.

**నేరాలు :** క్రమ పరిపాలనకోసం కొన్ని చర్యలను ప్రభుత్వం
నేరాలుగా పరిగణించి 'లా' ప్రకారం దండిస్తుంది. ప్రభుత్వ నిర్వహ
ణకు ప్రతిబంధకాలయినవి, దేశంలో శాంతికి భంగకరము లయినవి,
నైతికంగా హేయములైనవి. ప్రజలకు దేహరీత్యాగాని మానసికంగా
గాని బాధాకరము లయినవి, ఆస్తిపాస్తుల పైగల హక్కులకు ప్రమాద
కరము లయినవి మొదలైన కృత్యాలను నిషేధించడమయింది. వీటికార
కులను న్యాయస్థానాలు విచారణచేసి నేరం రుజువయిన పక్షంలో
జుల్మానావల్లగాని, ఖైదులవల్లగాని లేక రెంటివల్లకాని శిక్షిస్తాయి.
నేరంచేసినవాళ్ళేగాక అందుకు సహాయకులు ప్రేరేపకులుకూడ దండించ
బడుతారు. రాజద్రోహం, నోట్లను తయారుచేయుటం, అవినీతిపనులు,
దొంగతనం, ఘాతపరచటం, హత్య, మాన నష్టం చేయటం మొదలై
నవి, ఈ తరగతి క్రిందికి వస్తాయి. ఇలాంటివి జరుగకుండా చూచేందుకు
పోలీసుశాఖ వారికేగాక ప్రజలకుకూడ కొంత అధికారం ఉన్నది.
అయితే నేరస్థులను విచారణచేసి శిక్షించే అధికారం ప్రభుత్వానికి
మాత్రమే ఉంటుంది. ఈ బాధ్యతను ప్రజలు నిర్వహించటానికి ఎంత
మాత్రమూ వీలులేదు. ఈ సందర్భంలో నేరనిరూపణకోసం వ్యక్తులను
పోలీసువారు హింసించటానికి హక్కులేదనే విషయం అందరూ తెలుసు
కోవలసి ఉన్నది.

**కోర్టు ధిక్కారము :** న్యాయస్థానాలను ధిక్కరించడం
నేరమవుతుంది. కోర్టువారి ఆజ్ఞలను ఉత్తరువులను ఉల్లంఘించకూడదు.

కోర్టుల గౌరవ ప్రతిష్ఠలకు భంగకరంగా ప్రవర్తించకూడదు. ఏదైనా కోర్టులో విచారణలో ఉన్న విషయాలను విమర్శించ కూడదు. న్యాయాధిపతులను అధికారరీత్యా తూలనాడగూడదు. ఆ విధంగా చేస్తే జుల్మానావల్లగాని, ఖైదువల్లగాని దండించబడుతారు. పౌరుల హక్కులను కాపాడేవి న్యాయస్థానాలు. న్యాయమూర్తుల దృష్టిలో తారతమ్యాలకుగాని, ముఖమాటానికిగాని, అదరాభిమానాలకుగాని తావులేదు.

**బాధ్యతలు :** సంఘం మేలుకోసం ప్రజలు పౌరసత్వవిధులను నిర్వర్తించవలసి ఉంటుంది. నేరాలనుగురించి నేరస్థులనుగురించి తెలిసిన విషయాలను ప్రభుత్వోద్యోగులకు తెలియచేయాలి. కుటుంబంలో జనన మరణాలు సంభవించినప్పుడు, మశూచికాది అంటువ్యాధులు తటస్థించినప్పుడు అధికారులకు ఎరుకపరచాలి. సకాలంలో టీకాలు వేయించటం, పరిసరాలలో మాలిన్యం చేయకుండా ఉండడం, గృహనిర్మాణ విషయాలలో ముందుగా అధికారుల అనుమతి పొందడం, చెల్లించవలసిన పన్నులను సకాలంలో చెల్లించడం మొదలైనవి పౌరసత్వపువిధులు. వీటిని ఉల్లంఘిస్తే శిక్షకు పాల్పడవలసి వస్తుంది.

తనకుగాని తనవారికిగాని సంబంధించిన ఉత్తరాలను ఉచితంగా గాని, ఫలాపేక్షతోగాని గ్రామాంతరాలకు చేరవేయటం నేరమవుతుంది. కవర్లలో డబ్బును పంపటంకూడ అంతే. రిజష్టరు చేయకుండా పంపిన వస్తువులుగాని, ఉత్తరాలుగాని పోయినప్పుడు పోస్టువాళ్లు నష్టానికి బాధ్యులుకారు. డబ్బును కవర్లలోపెట్టి పంపినప్పుడు ఇన్స్యూర్ చేయాలి. అధికారం పొందకుండా ఒకరి తపాలును మరొకరు తీసుకోకూడదు. రేడియోలు ఉన్నవాళ్లు లైసెన్సు రుసుములను సకాలంలో పోస్టాఫీసుకు చెల్లించకపోతే జుల్మానా పడుతుంది.

ఇవిగాక మనం ముఖ్యంగా గమనించవలసిన చట్ట నిబంధనలు ఇవి:

మన రాష్ట్ర ప్రభుత్వం జారీచేసిన నూతన చట్టాల ప్రకారం మత్తు పదార్థాలు నిషేధింపబడినవి. కల్లు, సారాయి, గంజాయి మొదలైన నిషావస్తువులను అమ్మటంగాని, కొనడంగాని, ఉంచుకొనడంగాని,

రవాణా చేయడంగాని, సేవించడంగాని జరుపకూడదు, ఆవిధంగా చేసి నట్లయితే జుల్మానాకుగాని, ఖైదుకుగాని పాలుబడవలసివస్తుంది. వీటిని తయారుచేసే పరికరాలను ఉంచుకున్నప్పటికి శిక్షార్హులు కాగలరు.

మద్రాసు ప్రభుత్వపు షాపులు వగైరాలు చట్టప్రకారం కొన్ని నిబంధనలను అనుసరించవలసి ఉంటుంది. షాపులు, దుకాణాలు, సినిమాలు, హోటళ్లు మొదలైనవి వారానికి తప్పనిసరిగా ఒకనాడు మూసి ఉంచాలి. వాటిలో పనిచేసే ప్రతి పనివాడికి వారానికి ఒకరోజు శలవ ఉండాలి. రోజుకు పని ఎనిమిది గంటలకు మించకూడదు. నాలుగేసి గంటల కొకసారి ఒకగంటసేపు విరామం ఇచ్చితీరాలి. పద్నాలుగేళ్ళు నిండని పిల్లవాళ్ళను పనికి నియోగించకూడదు. ఏడాది పనిచేసినవాళ్ళకు జీతంతో సెలవులు ఇవ్వాలి. ఈ నిబంధనలను ధిక్కరిస్తే శిక్షకు పాత్రులవుతారు.

మద్రాసు వసతి గృహముల చట్టప్రకారం ఇంటిఖామందు అద్దెకు ఉన్నవారిని నిష్కారణంగా వెళ్ళగొట్టేందుకు వీలులేదు. అనుకొన్న తేదీకి అద్దెను సక్రమంగా ఇచ్చినంతవరకు ఖాళీచేయమనడానికి వీలులేదు. ఇష్టం వచ్చినట్లు బాడుగను హెచ్చింపకూడదు. ఆవిధంగా హెంచితే రెంట్ కంట్రోలు ఆఫీసరుకు పిటీషను పెట్టి క్రమమైన అద్దెను నిర్ణయించమని అద్దెకున్నవాళ్ళు కోరవచ్చును. మునిసిపల్ పన్నునుబట్టి, 1940వ సంవత్సరంలో ఉన్న అద్దెనుబట్టి సక్రమమైన అద్దె నిర్ణయించడం జరుగుతుంది. ఇంటిఖామందు కొన్ని సందర్భాలలో అద్దెకు ఉన్నవారిని అద్దె కంట్రోలరు ద్వారా ఖాళీచెయ్యమని కోరవచ్చును. సక్రమంగా అద్దె ఇవ్వనప్పుడు, ఖామందు అనుమతిలేనిది ఇంటినిగాని ఇంటిలోని భాగాన్నిగాని ఇతరులను అద్దెకిచ్చినప్పుడు, అనుకున్నదానికి విరుద్ధంగా ఇంటిని వినియోగించినప్పుడు, ఖామందు కాపురం ఉండేందుకు వేరే స్వంత ఇల్లు లేనప్పుడు అద్దెకు ఉన్నవారిని వెళ్ళగొట్టవచ్చును. ఇల్లు ఖాళీగానే కంట్రోలరుకు వెంటనే తెలియజేయవలసి ఉంటుంది. ఇందుకు భిన్నంగా నడిచినవాళ్ళు జుల్మానాకు పాత్రులవుతారు.

విల్ నామా : మైనారీవెళ్ళి మతి తిన్నగా ఉన్న ప్రతివ్యక్తీ తనకు సంపూర్ణ హక్కున్న స్థిరచరాస్తులను తన తదనంతరం సంక్రమించ

వలసిన విధానాన్ని విల్ నామాద్వారా నిర్ణయించవచ్చును. ఆ వ్యక్తి జీవితకాలంలో విల్ నామా అమలులోకి రావటానికి వీలు లేదు. అందువల్ల మరణించేలోపుగా ఎన్ని విల్ నామాలైనా ఒక్కొక్కడు వ్రాయవచ్చు. కాని తేదీనిబట్టి చివర వ్రాసిన మరణశాసనమే చెల్లుతుంది. ఈ పత్రాన్ని స్వయంగానైనా లేక మరొకరిచేతనైనా వ్రాయించి కనీసం ఇద్దరు సాక్షుల సమక్షంలో సంతకం చేయాలి. అప్పుడే సాక్షులుకూడ దస్కతులు పెట్టాలి. ఉత్తరోత్రా ఈ విల్ నామావల్ల లాభంపొందే వాళ్ళు సాక్షులుగా ఉండేందుకు పనికిరారు. విల్ నామా పత్రాన్ని రిజిష్టరు చేయవలసిన అగత్యంలేదు. కాని చేస్తే మంచిది.

స్వార్జితమైన స్థిరచరాస్తులను అప్రతిబంధకమైన సర్వహక్కులూ ఉన్న వ్యక్తి తన ఇష్టంవచ్చిన వారికి ఉచితంగా ఇచ్చివేయవచ్చును. చరాస్తుల విషయంలో లిఖిత పూర్వకమైన పత్రం అవసరంలేదు. ఇచ్చివేస్తున్న ఉద్దేశాన్ని వెల్లడించి ఆస్తిని స్వాధీన పరిస్తే సరిపోతుంది. పత్రం వ్రాసుకుంటేమాత్రం రిజిష్టరు చేయించవలసి ఉంటుంది. స్థిరాస్తుల విషయంలో దానపత్రం వ్రాసి రిజిష్టరు చేయించి ఆస్తిని స్వాధీనంచేయాలి. మోసం, వత్తిడి, పొరబాటు మొదలైన కారణాలవల్ల తప్ప ఇచ్చిన దానాన్ని సాధారణంగా ఉపసంహరించుకోటానికి వీలులేదు.

**భీమా :** భీమాచేసుకునే ఆచారం దేశమంతటా వ్యాపించింది. భీమా అనేకవిధాలు. జీవితభీమా, అగ్నిభీమా, మోటారుభీమా మొదలైనవి అందరూ ఎరిగినవే. భీమాచేస్తున్నప్పుడు పాలిసీ ఫారంలో అడిగిన అన్నివిషయాలను యథార్థంగాను, స్పష్టంగాను, దాచకుండాను తెలియచేయుట మవసరం. అట్లా తెలియచెయ్యకపోతే పాలిసీ పాకానికివచ్చినప్పుడు ఇన్స్యూరెన్సుకంపెనీలు డబ్బుఇచ్చేందుకు నిరాకరిస్తాయి. అందువల్ల అనేకులు నష్టపడుతున్నారు. పాలిసీని ఎవరికి సంక్రమించేటట్లు నిర్ణయించుకున్నారో వారిపేరును ఉదహరించి కంపెనీవాళ్లు గుర్తించేట్లు చూడాలి. లేకపోతే పాలిసీదారుని మరణానంతరం తగాదాలు వచ్చి వారసత్వపు సర్టిఫికేట్ కోసం కోర్టుకు పోవలసి వస్తుంది.

**హిందూలా :** హిందూలాను గురించిన అనేక విషయాలు పరంపరాగతంగా జనబాహుళ్యానికి తెలిసేఉంటాయి. నాటినిగురించిస్థూలంగా

చెప్పటంకూడ కష్టమైనపని. సాధారణంగా అందరికీ సంబంధించిన కొన్ని ముఖ్యఅంశాలు ఇక్కడ చెప్పబడినవి. కాని ఈ విషయంలో ఎప్పటికప్పుడు మార్పులువస్తుంటాయి కాబట్టి అవసరమైనప్పుడు లాయర్ల సలహా తీసికొంటే మంచిది.

స్త్రీపురుషులకు పద్ధెనిమిదేండ్లు నిండేవరకు మైనారిటీ ఉంటుంది. కోర్టు ఆఫ్ వార్డ్స్ అధీనంలో వున్నవారు ఇరవైఒక్క సంవత్సరం నిండితేనేగాని మేజర్లుకారు. మైనర్లకు గార్డియన్ తండ్రి. తండ్రి లేకపోతే తల్లి గార్డియనవుతుంది. భార్యకు భర్త గార్డియన్. కొన్ని ప్రత్యేక సందర్భాలలో ఈ అధికారాన్ని కోర్టులే చెలాయించుతాయి.

సమిష్టిఆస్తి: సమిష్టికుటుంబము, కుటుంబఆస్తిఅనే సంస్థలు కేవలం హిందూన్యాయ విధానానికి చెందినవి. ఒక్కొక్క మూలపురుషుడి సంతతి యావత్తూ సమిష్టికుటుంబంగా పరిగణించబడుతుంది. పుత్రపౌత్రాదులు, వారిభార్యలు, అవివాహిత పుత్రికలు మొదలైనవారు దీనిలో సభ్యులు. కుటుంబం సమిష్టిగా ఉన్నదనటానికి ఉమ్మడిగా ఆస్తిపాస్తులు ఉండనవసరంలేదు. నివాస భోజనాది విషయాలలో ఉండే కూడిక దీనికి ముఖ్యలక్షణం.

ఈ సమిష్టి కుటుంబానికి చెందిన ఆస్తిలోని హక్కులు సమిష్టిగా ఉంటాయి. పుత్రపౌత్రాదులకు జన్మనుబట్టి ఆ ఆస్తిలో హక్కుఏర్పడుతుంది. వీరిసంఖ్య అధికమైన కొద్దీ వారివారి వాటాతగ్గుతూ ఉంటుంది. అదేవిధంగా వారిలో ఎవరైన గతించినప్పుడు గతించినవారివంతు మిగతా వారి ఆస్తిలో కలిసిపోతుంది. తండ్రి జీవితకాలంలోనే కొడుకులు కుటుంబాస్తిని పంపిణీచేయమని కోరవచ్చును. వ్యక్తిగతమైన సంపాదనలు కుటుంబాస్తిలో వాటంతటవిగా కలిసిపోవు.

విభాగాలయ్యేదాకా తండ్రీ, తండ్రిలేని పక్షంలో వారసులలో పెద్దవాడు, కుటుంబకర్తగా వ్యవహరిస్తాడు. కుటుంబానికి సంబంధించిన సక్రమమైన ఋణాలకోసం కుటుంబాస్తిని విక్రయించేందుకు తండ్రికి హక్కుంది. విభాగానంతరం కూడ తండ్రిచేసిన న్యాయబద్ధమైన అప్పులకు కొడుకులు వారివాటాకు సంబంధించినంతవరకైనా బాధ్యులవుతారు. కుటుంబాస్తిని పంచుకున్న వారసులు కుటుంబానికి చెందిన కొంద

రిని పోషించవలసి ఉంటుంది. ప్రస్తుతం కుటుంబ ఆస్తిలో తల్లికికూడ హక్కు ఏర్పడ్డది.

**పిత్రార్జితం:** తండ్రి మరణానంతరం అతడి పిత్రీయ స్వార్జితాది యావదాస్తి కొడుకులకు, కొడుకులులేని పక్షంలో పౌత్రాదులకు, సంక్రమిస్తుంది. పుత్రపౌత్రాదులు ఎవరూ లేనప్పుడు దౌహిత్రుడికి చెందుతుంది. తల్లి స్త్రీధనపు ఆస్తి కుమార్తెలకు చెందుతుంది. సంతానం లేకుండా భర్త మరణిస్తే భార్య తనజీవిత పర్యంతం ఆ ఆస్తిని అనుభవించవచ్చు. ఆమె తదనంతరం భర్తవారసులకు సంక్రమిస్తుంది. భార్య ఈ ఆస్తిని అవసరమైన ప్రత్యేక కారణాలకు తప్ప అన్యాక్రాంతం చేయడానికి హక్కు లేదు.

**దత్తత:** సంతానంలేనప్పుడు పురుషుడు దత్తత చేసుకోవచ్చును. దత్తత చేసుకోకుండ భర్త మరణించినట్లయితే భర్త అనుమతించిన పక్షంలో భార్య దత్తత చేసుకోవచ్చును. భర్త అనుమతి ఇవ్వకుండా మరణించినట్లయితే భర్త వారసుల అనుమతిని దత్తతకోసం తీసుకోవలసిఉంటుంది. దత్తపుత్రుడికి ఔరస పుత్రుడితో సమానమైన హక్కు లేర్పడుతవి. జనన కుటుంబంలో సర్వహక్కులూ అంతరిస్తాయి. తెలుగుదేశంలో కొన్నిచోట్ల ఇల్లరికం ఆచారం ఉన్న వర్గములలో ఇల్లటపు అల్లుడికి కూడ కుటుంబ ఆస్తిలో హక్కు ఏర్పడుతుంది.

**వివాహాలు:** హిందూధర్మశాస్త్రప్రకారం పురుషుడు ఎన్ని వివాహాలైనా చేసుకోవచ్చును. కాని ఇటీవల మద్రాసు ప్రభుత్వంవారు ఆమోదించిన చట్టప్రకారం బహుపత్నీత్వం నిషేధించడమైనది. భార్య జీవించియుండగా మరొక స్త్రీని న్యాయబద్ధంగా పెండ్లాడటానికి వీలు లేదు. రెండవ వివాహము చెల్లకపోగా భర్త శిక్షార్హుడు కాగలడు. వర్ణాంతర వివాహాలు చేసుకోదలచినవారు రిజిస్టరు వివాహం చేసుకుంటే మంచిది. వితంతువులు న్యాయబద్ధంగా వివాహం చేసుకోవచ్చును. అట్టి సందర్భంలో మొదటి భర్త ఆస్తిలో లభిస్తున్న అన్నిహక్కులు అంతరిస్తాయి. హిందూ 'లా'లో విడాకులకు అవకాశంలేదు. భర్త సరిగా చూడక బాధలుపెట్టే సందర్భంలో భార్య వేరేఉండి మనోవర్తిని కోర

వచ్చును. పైన చెప్పిన చట్టాన్ని అనుసరించి ఇక ముందు విడాకులకు అవకాశం ఏర్పడినది. అవినీతి అంటువ్యాధులు మొదలైన కారణాల వల్ల వివాహాన్ని రద్దు చేసికొనవచ్చును. వివాహ విచ్ఛిన్నం కోర్టుద్వారా మాత్రమే జరుగవలసియున్నది.

ప్రస్తుతం హిందూ న్యాయవిధానం దేశమంతటా ఒకేవిధంగా అమలు జరగటంలేదు. బంగాళా దేశంలో దాయభాగ విధానం, బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో మితాక్షరసూత్రం, ఇతర ప్రాంతాలలో మయూఖాది సూత్రాలు అనుసరణలో ఉన్నవి. భారతదేశం మొత్తంమీద హిందువులకు సంబంధించినతవరకూ ఒకేన్యాయ విధానం ఉండడం అవసరమని ప్రభుత్వం నిశ్చయించి 'హిందూ లా కోడ్' ఒకదానిని ప్రముఖులైన వారిచేత తయారుచేయించింది. ఈ బిల్లును ఇప్పుడు మనపార్లమెంటు సమగ్రంగా విచారిస్తున్నది. పార్లమెంటు ఆమోదించిన తరువాత ఈ కొత్తచట్టం అమలులోకి రాగలదు. ఈ కోడ్ ప్రకారం ప్రస్తుతం అమలులో ఉన్న న్యాయవిధానం చాలవరకు మారిపోతుంది. సమిష్టి కుటుంబపు ఆస్తిలో పుత్ర పౌత్రాదులకు జన్మనుబట్టి హక్కు ఏర్పడినప్పటికీ యావదాస్తిని తండ్రి తన ఇష్టంవచ్చినట్లు వినియోగించటమే గాక విల్‌నామాద్వారా సంక్రమింపచేయవచ్చును. తండ్రి బ్రతికి ఉన్నంతవరకు పుత్రాదులకు ఆస్తిలో హక్కు ఉండదు. భాగం పంచమని అడిగేందుకు వీలుపడదు. తండ్రి మరణానంతరం విల్‌నామా ఏదీ లేనియెడల ఆస్తని సన్నిహిత వారసులు పంచుకుంటారు. కుమారులలోపాటు తల్లికి, కుమార్తెలకు కూడ ఆస్తిలో భాగం పంచి ఇవ్వవలసి ఉంటుంది. ఏకపత్నీత్వానికి, విడాకులకు ముఖ్యస్థానం ఉంటుంది. దత్తతలో ఇప్పుడున్న అవకతవకలు ఇక ఉండవు. మంచి చెడ్డలను గమనించక ప్రతి మార్పునూ ప్రతిఘటించేవారు ఈకొత్త హిందూ లా కోడ్‌ను అనవసరమైన ఆవేశంతో తూలనాడినా హిందూ సంఘానికి ఒకవిధమైన ఐక్యతను తీసికొనివచ్చి ఉచితమైన హక్కులను అందరికీ ఏర్పరచి వ్యాజ్యాలను తగ్గించకలదని నిక్కచ్చిగా చెప్పవచ్చు.

సలహా : దేశంలో అమలులో వున్న న్యాయవిధాన్ని సమగ్రంగా ఇక్కడ విశదీకరించడానికి అవకాశంలేదు. కాబట్టి కొన్ని

ముఖ్యవిషయాలను మాత్రమే సూచించటమైంది. సందర్భాన్నిబట్టి అవసరమైనప్పుడల్లా న్యాయవాదుల సలహాను తీసుకోటం మంచిది. కోర్టుల చుట్టూతిరిగే వారి సహాయంతో వ్యవహారాలను చక్కబెట్టుకోవాలని చూస్తే కోర్టులపాలు గాక తప్పదు. దీర్ఘరోగి సగంవైద్యుడే కావచ్చును. అంతమాత్రాన బ్రతుకాశించిన వారెవరూ అలాంటి వాడిచేత వైద్యం చేయించుకోరు. అదేవిధంగా కోర్టువ్యవహారాలతో కొద్దో గొప్పో పరిచయంవున్న వ్యక్తులకు స్వంతవ్యవహారాలను వప్పగించ కూడదు. అవకాశం దొరికినప్పుడల్లా లేనిపోని పేచీలు కల్పించి దానికి ఫలితంగా తయారయ్యే తగాదాలవల్ల జీవనోపాధిని సంపాదించేవాళ్లు ప్రతిగ్రామంలోను వుంటారు. వీళ్ళను సంప్రదించి వారి సలహాలను తీసుకోవటం కేవలం అవివేకమైన పని. పత్రాలను దస్తావేజులను వీరిచేత వ్రాయించినట్లయితే తెలిసిచేసేవి తెలియకచేసేవి అనేక అవకతవకలు ఏర్పడక తప్పదు. అంతేగాక ఒక్కొక్కప్పుడు ఇలాంటి వ్యక్తులు ఉభయపార్టీలకు ఒకేవిషయంలో స్వలాభంకోసం సలహాలను ఇచ్చి అనవసరపు చిక్కులను తెచ్చిపెడతారు. అందువల్ల వీలైనంతవరకు వీరితో ఏప్రమేయమూ పెట్టుకోకుండా వుండటంమంచిది.

మధ్యవర్తిత్వం: పట్టుదలకోసం కోర్టులకు ఎక్కటంవల్ల ఏలాంటి లాభమూ వుండదు. డబ్బుతో కూడుకుని వుండేది కోర్టు వ్యవహారం. సాధారణంగా అనేక సందర్భాలలో వ్యాజ్యాలు గెలిచినా ఓడినా పర్యవసానం ఒకటిగానే పరిణమిస్తుంది. సాధ్యమైనంతవరకు అంకురించిన తగాదాలను సంప్రతింపులతో అణచివేయటం శ్రేయస్కరం. ఈవిధంగా సమాధానం కుదరకపోతే యోగ్యులైన పెద్దమనుష్యులను మధ్యవర్తులుగా నియమించి పరిష్కారం చేసుకోవటం మంచిది. ఉభయపార్టీల అంగీకారంమీద మధ్యవర్తులు ఏ పరిష్కారాన్ని అయినా తీర్చవచ్చును. వారు లిఖితపూర్వకంగా ఇచ్చిన తీర్పును కోర్టులు ఆమోదించి డిక్రీ ఇవ్వగలవు. ఈ మధ్యవర్తిత్వానికి ఒప్పుకున్న రెండుపక్షాలవారు ఈ డిక్రీకి బద్ధులవుతారు. సంప్రదింపులవల్ల పరిష్కారంకాని సందర్భాల్లో తప్ప కోర్టులకు ఎక్కవలసిన అవసరం వుండకూడదు. 'లా' కు సంబంధించిన ప్రతివ్యవహారంలోను ఎప్పటికప్పుడు న్యాయవాదుల సలహాను పొందటం ఉచితమైన పద్ధతి.

# ఆంధ్రరాష్ట్రం

మదరాసురాష్ట్రం భరతఖండంలోని తక్కిన అన్నిరాష్ట్రాల లాగానే, ఎప్పటికప్పుడు బ్రిటిషువారి అధీనంలోకి వచ్చిన ప్రాంతాలతో, వారి సౌకర్యం ప్రకారం ఏర్పాటు చేయబడింది. అందుచేతనే, మదరాసు రాష్ట్రంలో తెలుగు జిల్లాలు, తమిళ జిల్లాలు, కన్నడ, మళయాళ ప్రాంతాలు చేరిఉన్నాయి. ప్రతిభాషా ప్రాంతానికీ ప్రత్యేక ప్రభుత్వం వుంటేనేగాని, ఆప్రాంతం సర్వతోముఖంగా అభివృద్ధిపొందడానికి వీలు లేదనే విషయాన్ని నేడు ఇండియాలోని పరిపాలకవర్గాలవారూ, ప్రజానాయకులూకూడా తెలుసుకున్నారు.

దాదాపు 71 వేల చదరపుమైళ్ళ వైశాల్యమూ, దాదాపు 11 కోట్ల రూపాయల ప్రభుత్వాదాయమూ, విస్తారమైన ఖనిజసంపదా, దాదాపు మూడుకోట్ల జనాభా గల తెలుగుజిల్లాలను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యవలసిందనే ఆందోళన ఆంధ్రదేశంలో దాదాపు 40 సంవత్సరాలనుంచీ జరుగుతున్నది. ఇండియాలోని రాష్ట్రాలను భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా ఏర్పాటుచేసి ఆంధ్రజిల్లాలను ఒక ప్రత్యేక రాష్ట్రముగా ఏర్పాటు చేయవలసినదనే సూచన మొట్టమొదట 1910 లో గుంటూరులో యువజన సారస్వత సంఘము (యంగ్మెన్స లిటరరీ అసోసియేషను) వారు చేశారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమానికి ఇదే పునాది. తరువాత 1913 లో ఆంధ్రమహాసభ స్థాపింపబడినది. తరువాత అనేక సంఘములు, ఉద్యమములు దీనికి అనుబంధములుగా బయలుదేరాయి. 1916 లో కలకత్తా సమావేశములో అఖిలభారత కాంగ్రెసు మహాసభలో భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సిద్ధాంతము అంగీకరింపబడింది. కాంగ్రెసు రాష్ట్రాలలో ఆంధ్రరాష్ట్రం ప్రత్యేక స్థానాన్ని పొందింది.

'ఇది ఇలా ఉంటూండగా మాంటేగు - ఛెమ్సుఫర్డు కమిటీవారు ఇండియాకు రాజ్యాంగ సంస్కరణలను ప్రతిపాదించడానికి పరిస్థితుల

పరిశీలన నిమిత్తము ఇండియాకు వచ్చారు. అప్పుడు ఆంధ్రమహాసభవారు
ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ ఆ కమిటీకి ఒక నివేదికను
సమర్పించారు. తరువాత 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టుపై
కామన్సు సభలో చర్చలు జరుగుతూన్నప్పుడు ఆంధ్రమహాసభవారు ఒక
రాయబార వర్గాన్నికూడా ఇంగ్లండు పంపించారు. అదే సమయములో
ఇండియాలోని కేంద్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ
ఒక తీర్మానముచేసింది. అయినప్పటికీ 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా
ఆక్టులో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగలేదు.

1922 లో కేంద్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమో
దిస్తూ మళ్ళీ తీర్మాణముచేసింది. 1927-28 లో భారతదేశపు రాజ్యాంగ
విధానాన్ని సంస్కరించడానికి ప్రయత్నాలు జరుగుతూన్నపుడు ఆంధ్ర
రాష్ట్ర నిర్మాణముకోసము పెద్ద కృషి జరిగింది. సైమను కమిషన్ వారు
ఇండియాకు వచ్చినపుడు వారికి ఒక నివేదిక సమర్పించబడింది. 1927 లో
మదరాసు శాసనసభ కేంద్రశాసనసభలు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మా
ణాన్ని కోరుతూ తీర్మానాలు చేసాయి. పండిత మోతీలాలు నెహ్రూ
నివేదికకూడా ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదించింది. ఐతే ఆంధ్ర
దేశములో కాంగ్రెసు ఉద్యమము బలంగా ఉండటంవల్ల ప్రత్యేక
ఆంధ్రరాష్ట్రము మరొక కాంగ్రెసు రాష్ట్రముగా పరిణమిస్తుందని ఆంధ్ర
రాష్ట్ర నిర్మాణానికి సైమను కమిషనువారు అంగీకరించలేదు అయితే
ఒరిస్సా, సింధు అనే రెండు ప్రత్యేక రాష్ట్రాలను ఏర్పాటుచేయడానికి
అంగీకరించారు. 1935 లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటు చేయబడి
నప్పుడు గంజాంజిల్లాలోని ఆంధ్రులు అత్యధిక సంఖ్యలో ఉన్న
ప్రాంతాలు, బరంపురం పట్టణం, ఒరిస్సా రాష్ట్రములో కలిపి చేయ
బడినవి.

1937 లో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడ్డప్పుడు ఆంధ్రరాష్ట్ర
నిర్మాణం విషయములో ఆంధ్రులకు కొంత ఆశాభావం కలిగింది.

1938 లో మదరాసు అసెంబ్లీ, కౌన్సిలు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని కోరుతూ తీర్మానాలు చేశాయి. కాని అప్పుడూ రాష్ట్రనిర్మాణము జరుగలేదు. 1946 లో కౌన్సిలు ఆఫ్ స్టేట్‌లో ఇదే విధంగా తీర్మానం జరిగింది. కాని అప్పుడు కేంద్రప్రభుత్వము తరఫున, ఈ విషయము కన్‌స్టిట్యుయెంటు అసెంబ్లీలో నిర్ణయింపబడుతుందనే హామీ ఇవ్వబడింది. 1947 లో మదరాసు శాసనసభలు భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేశాయి. నూతన రాజ్యాంగవిధానము అమలు జరిపేటప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగుతుందని ఇండియా ప్రధాన మంత్రి పండిత జవహరలాల్ నెహ్రూ హామీకూడా ఇచ్చారు. అయి నప్పటికీ నూతన రాజ్యాంగ విధానపు ముసాయిదాలో ఆంధ్రరాష్ట్రము పేర్కొనబడలేదు.

1947 నవంబరులో రాజ్యాంగసభలో జరిగిన చర్చల ఫలితంగా, ఎస్. కె. ధార్ (అధ్యక్షుడు), డాక్టర్ పన్నాలాల్, జగత్ నారాయణలాల్ గార్లు సభ్యులుగాగల ఒక కమిషనును, రాజ్యాంగసభ అధ్యక్షుడు నియమించారు. కొత్త రాష్ట్రాలను వేటినైనా ఏర్పాటు చెయ్యవచ్చునా, చేస్తే వాటి సరిహద్దులు ఎలా వుండాలి, వాటి ఆర్థిక, పరిపాలనాస్థితులు ఎలా వుంటాయి అనే విషయాలను సూచించవలసిందని యీ కమిషనుకు తాఖీదు యివ్వబడింది.

ఈ కమిషను 1948 జులై 19 తేదిన ప్రథమంలో సమావేశమై నవంబరు 21 ఆఖరు సమావేశం జరిపింది. ఆంధ్రదేశంలో విశాఖపట్టణం, మదరాసు, దక్షిణాన కాలికట్, మంగుళూర్, కోయంబత్తూరు, బెంగుళూరు నగరాలలో సాక్షులను విచారించారు. మొత్తం, ఆంధ్ర, తమిళ, కన్నడ, మహారాష్ట్ర, కొంకణ, సి. పి. బీరార్ ప్రాంతాలలో 6,700 మంది సాక్షులను విచారించి, దాదాపు 1,000 మహజర్లు అందుకొని, యీ కమిషను తమ నిర్ణయాన్ని డిసెంబరు 10 న రాజ్యాంగసభ అధ్య

త్వానికి సమర్పించారు. ఆ నివేదికలో వారు చెప్పినదేమంటే, ఇండియాలో భాషాప్రాంతలుగా రాష్ట్రాలను ఎన్నడూ ఏర్పరచరాదని.

1948 డిసెంబరు 18 తేదిన అఖిలభారత కాంగ్రెసు మహాసభ, భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణాన్ని గురించి ఏ. ఐ. సి. సి. కిని వేదికను తయారు చెయ్యవలసిందిగా కోరుతూ, డాక్టరు పట్టాభి సీతారామయ్య, పండిత జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్ గార్లను ఒక కమిటీగా నియమించింది.

## శ్రీబాగ్ ఒడంబడిక

ఆంధ్రదేశంలోని, దత్తమండలము జిల్లాలు లేదా రాయలసీమ అని వ్యవహరింపబడే బళ్ళారి, అనంతపురము, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాలు ఆర్థికంగాను, పారిశ్రామికంగాను విద్యా విషయములోను చాలా వెనుకబడి ఉన్నవి. ఇంతకాలము రాష్ట్రపరిపాలన తమిళాంధ్రనాయకులచేతులలో ఉమ్మడిగా ఉండటంవల్ల రాయలసీమ పరిస్థితులను చక్కబరచడానికి తగినకృషి జరుగలేదు. అందువల్ల రాయలసీమవారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరిగినప్పుడు తమ జిల్లాల అభివృద్ధికి మిగతా జిల్లాల ఆంధ్రులు తగినకృషి చేస్తారనే హామీ కావాలని కోరారు. ఈ విషయంలో రాయలసీమ, సర్కారు జిల్లాల నాయకులు మదరాసులోని శ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి భవనం శ్రీబాగ్‌లో సమావేశమై 1937 నవంబరు 16 తేదీని ఒడంబడిక చేసుకొన్నారు. దీనికే శ్రీబాగ్ ఒడంబడిక అని పేరు. దీనిలోని ముఖ్యాంశములు ఇవి :

(1) రెండు విశ్వవిద్యాలయ కేంద్రాలు :—ఆంధ్రదేశంలో వైజ్ఞానిక కేంద్రాలను వ్యాపింప చేయడానికీ, వైజ్ఞానికంగానూ, సామాజికంగానూ ఆంధ్రులలో పరస్పర సహకారం అభివృద్ధి చెందటానికీ, ఆంధ్ర

విశ్వవిద్యాలయపు ఆధ్వర్యంక్రింద వాల్తేరులో ఒకటీ, అనంతపురంలో ఒకటీ, రెండు కేంద్రాలను ఏర్పరచాలని ఈ కమిటీ (సంప్రదింపుల సంఘం) అభిప్రాయపడుతున్నది. కళాశాలను స్థాపించే విషయంలో బోధించే శాస్త్రాలకు ఏప్రాంతం అనుకూలంగా వుంటుందో ఆప్రాంతంలో స్థాపించాలని కమిటీ అభిప్రాయపడుతున్నది.

(2) నీటిపారుదల :—రాయలసీమ, నెల్లూరు జిల్లాల ఆర్థిక, వ్యావసాయిక సంపదలు కోస్తాజిలాల సంపదలతో సరితూగేటు చేసేందుకై కృష్ణా, తుంగభద్రా పెన్నానదుల ప్రాజెక్టుకు 10 సంవత్సరాల వరకూ యెక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. ఈ కాలపరిమితి అవసరమయితే పెంచాలి.

ఈ నదులనీటి పంపిణీలో రాయలసీమ నెల్లూరు జిల్లాల అవసరాలనే ముందు పరిగణించాలి. ఈ విధానం రాష్ట్రపరిపాలనలో ఇప్పటినుంచే అనుసరించాలి.

(3) శాసనసభ :—శాసనసభా స్థానాలు జిల్లాలవారిగా సమానంగా ఉండేట్లు చూడాలి.

(4) రాజధాని, హైకోర్టు:—విశ్వవిద్యాలయ కార్యాలయం, రాజధాని, హైకోర్టులను మూడింటినీ వివిధ ప్రాంతాలలో నెలకొల్పటానికి అంగీకరించబడ్డది. పరిపాలనా ప్రాధాన్యతను ఒకే ప్రాంతంలో కేంద్రీకరించకుండా ఉండటమే దీని ఉద్దేశం. ఈ సూత్రాన్ని అనుసరించి విశ్వవిద్యాలయ కార్యాలయం ప్రస్తుతం ఉన్నచోటనే (వాల్తేరు) లో ఉండటానికీ, హైకోర్టు, రాజధానులలో ఒకటి కోస్తాజిల్లాలలోనూ, ఒకటి రాయలసీమలోనూ ఉంచేందుకు అంగీకరించబడ్డది. అయితే ఏది ఎక్కడ ఉండాలనేది రాయలసీమ వాసులే నిర్ణయిస్తారు.

(5) ఇరుపక్షాలూ సమ్మతిస్తే ఈ అంశాల్లో మార్పులు చేసుకోవచ్చును.

# విశాలాంధ్ర స్వరూపం



సి.పి.
ఒరిస్సా
బస్తరు
గంజాం
ఆదిలాబాదు
బొంబాయి
కరీంనగరం
బస్తరు ఆంధ్ర
కోరాపుట్టు
విశాఖ
వరంగల్లు
నల్లగొండ
గుంటూరు
కర్నూలు
బళ్ళారి
కడప
నెల్లూరు
చిత్తూరు
మద్రాసు
మైసూరు
తమిళనాడు

## ఆంధ్రరాష్ట్రపు వివరాలు

1947 ఏప్రిల్‌లో కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీకి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు సమర్పించిన నివేదికలో, ఆంధ్రరాష్ట్రంలో యీ క్రింది ప్రాంతాలను చేర్చాలని కోరారు.

విశాఖపట్టణం జిల్లా, తూర్పుగోదావరి జిల్లా, పడమటి గోదావరి జిల్లా, కృష్ణా జిల్లా, గుంటూరు జిల్లా, నెల్లూరు జిల్లా, కర్నూలు జిల్లా, కడప జిల్లా, చిత్తూరు జిల్లా, అనంతపురం జిల్లా, నెల్లూరు జిల్లా సరిహద్దునుంచి మదరాసు నగరంవరకు వున్న చెంగల్పట్ జిల్లాలోనిభాగం, బళ్ళారి జిల్లాలోని రాయదుర్గ్, ఆదోని, ఆలూరు తాలూకాలు, ఉత్తరార్కాడు జిల్లాలోని తెలుగుప్రాంతాలు, సేలం జిల్లాలోని హోసూరు తాలూకా, మదరాసునగరం, బళ్ళారి నగరం, ప్రస్తుతం ఒరిస్సారాష్ట్రంలో కలిపివేయబడిన తెలుగుప్రాంతాలు.

ఈ ప్రాంతా లన్నిటితోను ఆంధ్రరాష్ట్రాన్ని యేర్పాటుచేస్తే, రాష్ట్రపు వైశాల్యం 71,000 చ. మైళ్ళ పైగా వుంటుంది. జనాభా దాదాపు రెండున్నర కోట్లు వుంటుంది.

ఈ పై ప్రాంతాలేకాక, హైదరాబాదు సంస్థానంలో 41,502 చ. మైళ్ళ ఆంధ్రదేశమూ, మైసూరు సంస్థానంలో 6,000 చ. మైళ్ళ ఆంధ్రదేశమూ, సెంట్రల్ ప్రావిన్సెసులో [బస్తర్ సంస్థానాన్ని కలుపుకొని] 3,800 చ. మైళ్ళ ఆంధ్రదేశమూ వుంది. ఈ ప్రాంతా లన్నిటిలోనూ వున్న ఆంధ్రుల సంఖ్య కోటికిపైగా వుంటుంది.

మదరాసు రాష్ట్రంలో వున్నవారు కాక, ఇతర రాష్ట్రాలలో వున్న ఆంధ్రులసంఖ్య, 1931 జనాభా ప్రకారం ఇది: బొంబాయి 1,63,000; బెంగాల్, 31,206; అస్సాం, 30,776; బీహార్ ఒరిస్సాలు, 22,107, పుదుకోట సంస్థానం, 13,250; బర్మా, 160,640; ఈ సంఖ్య, యిప్పటికి చాలా ఎక్కువగానే పెరిగిఉంటుంది.

# ఇండియా రాజ్యాంగ విధానం

ఇండియాకు రాజ్యాంగ విధానాన్ని తయారు చెయ్యడానికి ఏర్పడిన కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీ నియమించిన కమిటీ రాజ్యాంగవిధానపు ముసాయిదాను 1948 ఫిబ్రవరి 26 తేదిన ప్రకటించారు. దీనిని పరిశీలించడానికి కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీ ప్రథమ సమావేశం 1948 మే 19 తేదిన జరిగింది. ఇంకా జరుగుతునేవున్నది. అసెంబ్లీ యీ విధానాన్ని పూర్తిగా చర్చించి, అవసరమైన మార్పులతోగాని, యథాతథంగాగాని ఆమోదించిన తరువాత, యీ విధానం అమలులోకి వస్తుంది. కమిటీవారు ప్రకటించిన ముసాయిదాలోని ముఖ్యాంశాలు ఇవి :

ఇండియా, అనేక రాష్ట్రముల సమాఖ్యగా వుంటుంది.

ఇండియాలో పుట్టిన ప్రతివ్యక్తిన్నీ, ఇండియాలో పుట్టి 1947 ఏప్రిల్ 1 తరువాత విదేశంలో శాశ్వతనివాసం ఏర్పరచుకోనని ప్రతి వ్యక్తిన్నీ, ఇండియాలో పౌరసత్వ హక్కులను కలిగివుంటాడు.

జాతి, మత, కుల, స్త్రీపుంవివక్షతల కారణంగా ఏ వ్యక్తికీ, హోటళ్ళలోకిగాని, పబ్లిక్ వినోదశాలలకుగాని, దుకాణాలలోకిగాని వెళ్ళకూడదనే నిర్బంధం వుండరాదు.

'అస్పృశ్యత' అనేది ఏ రూపంలోనూ ఇండియాలో ఆచరణలో వుండరాదు. అస్పృశ్యతను పాటించేవారు శిక్షార్హులవుతారు.

అమలులోవున్న చట్టానికి విరుద్ధంగా నేరంచేస్తేతప్ప, ఏ వ్యక్తినీ శిక్షించకూడదు.

మనుష్యులను అమ్మడం, నిర్బంధంమీద చాకిరీ చేయించుకోవడం పనికిరాదు.

ఎవరి యిష్టమైనమతాన్ని వారు అవలంబించడానికి, ప్రతివ్యక్తికీ స్వాతంత్ర్యం ఉంది.

ప్రభుత్వధనంతో నడుపబడే ఏ విద్యాసంస్థలోను మతబోధచేయడానికి వీలులేదు.

## ప్రభుత్వ బాధ్యతలు

స్త్రీపుంవివక్షతలేకుండా ప్రజలందరికీ తగినంతగా జీవనాధారం వుండేటట్టు ప్రభుత్వం చూడాలి. దేశంలోని నైసర్గికసంపద, ప్రజలందరి సమిష్టి మేలుకూ ఉపయోగపడేట్టు ప్రభుత్వం చూడాలి.

దేశంలోని ఆర్థికవ్యవస్థ, సంపదఅంతా ప్రజాబాహుళ్యపు మేలుకు విరుద్ధంగా ఏదో ఒకవర్గం చేతిలోవుండే పద్ధతిలో సాగకుండా ప్రభుత్వం చూడాలి.

స్త్రీగాని, పురుషుడుగాని సమానమైన పనిచేస్తే, వారికి సమానమైన ప్రతిఫలం లభించేటట్టు ప్రభుత్వం చూడాలి.

ఆర్థిక దురవస్థ కారణంగా, కార్మికులబలమూ, ఆరోగ్యమూ స్వప్రయోజనాలకోసం యితరులు దుర్వినియోగం చేయకుండానూ, ఆర్థిక దురవస్థల తమ వయస్సుకూ, ఆరోగ్యానికీ అనుకూలంగాని పనులలో కార్మికులు నియోగింపబడకుండా వుండేటట్టునూ ప్రభుత్వం చూడాలి.

ప్రతివ్యక్తికీ చెయ్యడానికి పనివుండేటట్టూ, విద్య లభించేటట్టూ, నిరుద్యోగం, ముసలితనం, జబ్బు, అంగవైకల్యం కలిగినప్పుడు సహాయం లభించేటట్టూ వీలైనంతవరకు ప్రభుత్వం శ్రద్ధ వహించాలి.

ప్రతివ్యక్తికీ ఉచితంగా ప్రాథమిక విద్య లభించే అవకాశం వుండాలి. ఈ చట్టం అమలులోకి వచ్చిన పదేండ్లలోగా, ప్రతి బాల బాలికకూ పధ్నాలుగుసంవత్సరాల వయస్సు వచ్చినదాకా నిర్బంధంగా, ఉచితవిద్య లభించే విధానాన్ని ప్రభుత్వం అమలు జరపాలి.

ప్రజల జీవన ప్రమాణాన్ని వృద్ధిపరచడమూ, ప్రజల ఆరోగ్యస్థితిని బాగు చెయ్యడమూ తన ప్రధాన బాధ్యతలుగా ప్రభుత్వం భావించాలి.

## సమాఖ్య (యూనియన్) పరిపాలన

ఇండియాకు ఒక ప్రెసిడెంటు వుండాలి. ఇండియా పరిపాలనను చట్టప్రకారం అతడే సాగిస్తాడు. ఇండియా సేన లన్నిటిమీద సంపూర్ణాధికారం అతడిదే.

ఇండియా ప్రెసిడెంటు, కేంద్ర శాసనసభల సభ్యులును, ఎన్నికల వల్ల సభ్యత్వం పొందిన రాష్ట్ర శాసనసభా సభ్యులును కలసిన సభచేత ఎన్నుకోనబడినవాడై వుండాలి. పదవిని స్వీకరించిన రోజు మొదలు అయిదేండ్లు ప్రెసిడెంటు అధికారంలో వుంటాడు. ఈలోగా అతడు కోరితే రాజీనామా యిచ్చి పదవిని త్యజించవచ్చు. లేదా, చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించాడనే నేరారోపణ కేంద్రశాసనసభలో చేయబడినట్లయితే, అది రుజువైతే, ప్రెసిడెంటును పదవినుంచి తొలగించవచ్చును.

ఇండియా పౌరుడు కాకపోయినా, 35 సంవత్సరాల లోపు వయస్సువాడైనా, ప్రజాసభకు సభ్యుడుగా ఎన్నుకోబడటానికి అర్హత లేనివాడైనా, ప్రభుత్వోద్యోగంలో వున్నవాడైనా, ప్రెసిడెంటుగా ఎన్నికకు అర్హుడుకాడు. ఒకసారి ప్రెసిడెంటుగా వున్న వ్యక్తి, మరొక్కసారి మాత్రమే అధ్యక్షపదవిని పొందడానికి అర్హతకలిగి వుంటాడు.

ఒక ప్రెసిడెంటు చనిపోయినా, రాజీనామా ఇచ్చినా, పదవి నుంచి తొలగించబడినా, అలా జరిగిన ఆరునెలలలోపల మరొక ప్రెసిడెంటుకోసం ఎన్నిక జరగాలి. ఇలాటి యెన్నిక జరిగేదాకా, ప్రెసిడెంటు పనిని వైస్-ప్రెసిడెంటు నిర్వహిస్తాడు.

వైస్-ప్రెసిడెంటు కేంద్ర శాసనసభల సమిష్టి సమావేశంలో ఎన్నుకోనబడినవాడై వుండాలి. వైస్-ప్రెసిడెంటు, కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుకి చైర్మనుగాకూడా వుంటాడు. ఇండియా పౌరుడు కానివాడూ, 35 సంవత్సరాలలోపు వయస్సులో వున్నవాడూ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుకి సభ్యుడుగా యెన్నుకోబడడానికి అర్హతలేనివాడూ, వైస్-ప్రెసిడెంటుగా యెన్నుకోబడడానికి అర్హుడుకాడు. వైస్-ప్రెసిడెంటు పదవీకాలం అయిదు సంవత్సరాలు.

ప్రెసిడెంటుకు సలహా యివ్వడానికి ఒక మంత్రిమండలి వుండాలి. ప్రధానమంత్రిని ప్రెసిడెంటు నియమిస్తాడు. ప్రధానమంత్రి సలహాపై తక్కిన మంత్రులను ప్రెసిడెంటు నియమిస్తాడు. మంత్రిమండలి, సమష్టిగావ, ప్రజాసభకు బాధ్యులై వుండాలి.

ప్రభుత్వం అమలుజరిపే చర్యలన్నీ, ప్రెసిడెంటు పేరుమీద నే జరుగుతాయి.

## పార్లమెంటు

ఇండియాకు ప్రజాసభ, రాష్ట్రసభ (కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు) అనే పేర్లతో రెండు సభలుగల పార్లమెంటు వుండాలి.

రాష్ట్రసభలో 250 మంది సభ్యులు వుండాలి. వీరిలో 15 మందిని ప్రెసిడెంటు తన నిర్ణయాన్ననుసరించి, కొన్ని ప్రత్యేకవర్గాలకు ప్రాతినిధ్యం యివ్వడానికి నియమిస్తాడు. మిగతా వారు రాష్ట్రాలలోని శాసనసభలచేత యెన్నుకోబడినవారై వుండాలి.

ప్రజాసభ సభ్యత్వం అయిదువందలకు మించకూడదు. వీరంతా కూడా దేశంలోని ప్రజలచేత యెన్నుకోబడినవారే అయివుండాలి. దేశంలోని ప్రజలలో ప్రతి 75,000 మందికి అధమం ఒక ప్రతినిధివుండేట్లుగా, ప్రతి 50,000 మందికీ ఒక ప్రతినిధికన్న యెక్కువ వుండకుండానూ ఈ సభ్యులు యెన్నుకోబడాలి. అలా యెన్నిక జరిగేటందుకు వీలుగా, రాష్ట్రాలలోని వివిధప్రాంతాలను నియోజకవర్గాలుగా ఏర్పాటు చెయ్యాలి.

ప్రజాసభ ప్రతి అయిదు సంవత్సరాలకు రద్దు అయిపోతుంది. మళ్ళీ యెన్నికలు జరుగుతాయి. రాష్ట్రసభ రద్దుకాదు. ప్రతి రెండుసంవత్సరాలకూ, రాష్ట్రసభలోని సభ్యులలో మూడవవంతుమంది సభ్యత్వం నుంచి విరమిస్తారు. ఆ ఖాళీలకుమాత్రమే యెన్నికలు జరుగుతాయి. ప్రతి సంవత్సరం అధమం రెండుసార్లయినా, యీ సభల సమావేశం జరగాలి. ఒక సమావేశం అయిన ఆరునెలలలోపున రెండవ సమావేశం జరగి తీరాలి. ప్రజాసభా కార్యక్రమాన్ని నడిపించడానికి స్పీకరు యెన్నుకోబడుతాడు. ఇండియా వైస్—ప్రెసిడెంటు, రాష్ట్రసభకు చైర్మన్‌గా వుంటాడు.

పార్లమెంటు సభలలో కార్యక్రమం అంతా హిందీలోగాని ఇంగ్లీషులోగాని జరగాలి. ఈ రెండుభాషలూ సరిగారాని సభ్యుడు అతని మాతృభాషలో మాట్లాడవచ్చునని అధ్యక్షుడు అనుమతి యివ్వ వచ్చును.

ఇండియాకు ఒక సుప్రీంకోర్టు (ప్రధాన న్యాయస్థానం) వుంటుంది. ఒక ప్రధాన న్యాయమూర్తి, ఏడుగురికి తక్కువ కాకుండా జడ్జీలు యీ కోర్టుకి, నియమించబడాలి. సుప్రీంకోర్టు జడ్జీలను, రాష్ట్రాలలోని హైకోర్టులతోను, సుప్రీం కోర్టుతోను సంప్రతించి, ప్రెసిడెంటు నియమిస్తాడు. సుప్రీం కోర్టు జడ్జీలు, 65 సంవత్సరాల వయసు నిండితే, ఆ పదవినుంచి విరమించాలి.

## రాష్ట్రపరిపాలన

ప్రతిరాష్ట్రానికీ ఒక గవర్నరు వుండాలి. రాష్ట్ర పరిపాలనాధికారం అతనిచేతిలో వుంటుంది. గవర్నరు, రాష్ట్రశాసనసభకు ఓటుచేసే హక్కుగలవారందరూ యెన్నుకొన్నవాడైనా అయివుండాలి; లేదా, రాష్ట్రశాసనసభలు సూచించిన ఏ నలుగురిలోనో, ప్రెసిడెంటుచే నియమింపబడిన ఒకడైనా అయివుండాలి. గవర్నరుపదవి పరిమితి అయిదు సంవత్సరాలు. ఒకసారి గవర్నరుగావున్న వ్యక్తి, మరి యింకొకసారి మాత్రమే గవర్నరు పదవికి అర్హతకలిగి వుంటాడు.

గవర్నరు తన ఉద్యోగాన్ని నిర్వహించడంలో అతనికి సలహాలనివ్వడానికి ఒక మంత్రిమండలి వుండాలి. ఈ మంత్రి మండలిలోని మంత్రులందరినీ గవర్నరే నియమిస్తాడు. ఇలా మంత్రుల్ని నియమించడంలో శాసనసభలోని అత్యధిక సంఖ్యాకుల విశ్వాసానికి పాత్రుడని తనకు తోచిన వ్యక్తితో సంప్రతించి, అతని సూచనప్రకారం సమష్టి మీద శాసనసభ్యులలో అత్యధిక సంఖ్యాకుల విశ్వాసానికి పాత్రులైన వారిని గవర్నరు తనమంత్రులుగా నియమిస్తాడు.

రాష్ట్రపరిపాలనలో జరిగే ప్రభుత్వఉత్తరువులన్నీ గవర్నరు పేరు మీదనే జరుగుతాయి.

ప్రతిరాష్ట్రానికీ, ఇండియా రాజ్యాంగచట్టంలో నిర్ణయించిన ప్రకారం ఒకటిగాని, రెండుగాని శాసనసభలు వుండాలి. ఏ రాష్ట్రానికి ఎన్ని శాసనసభలు వుండాలనే విషయం యీ చట్టాన్ని ఆమోదించే లోపల నిర్ణయింపబడుతుంది.

ప్రతి రాష్ట్రంలోని అసెంబ్లీ (శాసనసభ)లోని సభ్యులూ, వయోజన వోటుపద్ధతిలో ప్రజలచే యెన్నుకొనబడినవారుగా వుండాలి. ఈ సభ్యుల యెన్నిక, లక్షమంది ప్రజలకు ఒక ప్రతినిధికన్న యెక్కువ వుండకుండా వుండేపద్ధతిలో జరగాలి. అయితే ఏ అసెంబ్లీలోను మూడు వందలకంటె యెక్కువగాని, అరవైమందికంటె తక్కువగాని సభ్యులు వుండకూడదు.

రెండుసభలు వున్న రాష్ట్రంలో లెజిస్లెటివ్ కౌన్సిలు సభ్యులసంఖ్య, అసెంబ్లీ సభ్యుల సంఖ్యలో నాల్గవవంతుకు మించకూడదు.

లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులలో సగంమంది, ప్రత్యేక విజ్ఞానంగల అయిదువర్గాలకు చెందిన ముఖ్యుల పేర్ల పట్టీనుంచి తీసుకొనబడినవారు వుంటారు. మూడవవంతుమంది అసెంబ్లీ సభ్యులచేత యెన్నుకోబడినవారు వుంటారు. తక్కినవారిని గవర్నరు నియమిస్తారు. సగంమంది తీసుకొనబడే అయిదువర్గాలు ఏవంటే (1) యూనివర్శిటీలు (2) సారస్వతం, కళ, శాస్త్రం (3) వ్యవసాయం మొదలైనవి (4) ఇంజనీరింగ్, భవననిర్మాణం (5) పరిపాలనా వ్యవహారములు, సంఘసేవ.

అసెంబ్లీ కాలపరిమితి అయిదేళ్ళు. తరువాత అసెంబ్లీ రద్దయి, మళ్ళీ యెన్నికలు జరగాలి. కౌన్సిలు రద్దుకాదు. కౌన్సిలు సభ్యులలో దాదాపు మూడవవంతుమంది, దాదాపు ప్రతి మూడవ సంవత్సరాంతానికీ సభ్యత్వంనుంచి విరమిస్తారు. ఆస్థానాలకే మళ్ళీ నియామకం జరుగుతుంది.

రాష్ట్ర శాసనసభలు ప్రతి సంవత్సరమూ అథమం రెండుసార్లయినా సమావేశం కావాలి. ఒక సమావేశం పూర్తి అయిన రోజునుంచి ఆరునెలలు గడిచేలోపల రెండవ సమావేశం జరిగి తీరాలి.

ప్రతి అసెంబ్లీకి అధ్యక్షుడుగా స్పీకరు, ఉపాధ్యక్షుడుగా డిప్యూటీ స్పీకరు యెన్నుకోబడుతారు. ప్రతి కౌన్సిలుకు అధ్యక్షుడూ (ఛైర్మను) ఉపాధ్యక్షుడుగా డిప్యూటీ ఛైర్మను యెన్నుకోబడుతారు.

రెండు శాసనసభలు ఉన్న రాష్ట్రంలో ఒకే వ్యక్తి రెండు సభల లోను సభ్యుడుగా వుండకూడదు. రాష్ట్ర శాసనసభలలో సభ్యులుగా వున్నవారు పార్లమెంటు సభలలో సభ్యులుగా వుండకూడదు.

ప్రభుత్వోద్యోగంలో వున్నవారుగాని, మతి స్థిరంలేనివారుగాని, దివాలా తీసినవారుగాని, విదేశ ప్రభుత్వాధికారానికి లోబడినవారుగాని, చట్టచర్యలవల్ల తమ అర్హతలను కోల్పోయినవారుగాని, శాసనసభా సభ్యులుగా యెన్నికకు అర్హులు కారు.

రాష్ట్రాల పర్యవేక్షణలోకి రాకుండా, కేంద్రప్రభుత్వపు సంపూర్ణాధికారానికి లోబడిన పరిపాలనా విషయాలలో ముఖ్యమైనవి ఇవి:

దేశరక్షణ; సైన్య, నౌకా, విమాన దళాలను సమీకరించడం, వాటి నిర్వహణ; దేశరక్షణకు అవసరమని పార్లమెంటు నిర్ణయించే పరిశ్రమలు; ఆయుధములు, ఆయుధ సామగ్రి; ఏటమిక్ శక్తి, దాని ఉత్పత్తికి అవసరమయే ఖనిజములు; విదేశ వ్యవహారాలు, విదేశాలతో ఇండియాకు సంబంధం ఏర్పడే అన్నివిషయాలు: విదేశాలలో ప్రతినిధుల నియామకం; ఐక్యరాజ్యసమితి; అంతర్జాతీయ సమావేశాలలో పాల్గొనడము; యుద్ధము, శాంతి; విదేశాలతో ఒడంబడికలు చేసుకోవడం; పౌరసత్వ హక్కుల నిర్వచనం; తపాలా సౌకర్యములు. టెలిగ్రాఫ్ శాఖ, టెలిఫోన్ శాఖ: బ్రాడ్‌కాస్టింగ్; విమాన సౌకర్యములు; ఇండియా ప్రభుత్వాధికారంలో వున్న రైల్వేలు: రిజర్వుబ్యాంకు; నోట్లు; చెలామణి; పేటెంట్లు; ట్రేడు మార్కులు; సుప్రీంకోర్టు; జనాభా లెక్కలు; వ్యవసాయపు రాబడికాక ఇతర రాబడిమీద పన్ను; ఒకరాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి వలస, గనులలో కార్మికుల పని పరిస్థితులు; ఇన్సూరెన్సు; ఇండియా ప్రభుత్వపు అప్పులు; పార్లమెంటు ఎన్నికలు మొదలైనవి.

# ప్రముఖ వ్యక్తులు

అచ్యుతరామయ్య, డాక్టర్ ఆర్. జననం: 11 మే 1911; 1929 లో బందరు నోబుల్ కాలేజిలో ఇంటర్మీడియెట్ ప్యాసయి, ఆంధ్ర మెడికల్ కాలేజి (విశాఖపట్టణం) లో 1935 లో ఎం. బి. బి. యస్. ప్యాసయారు. విద్యార్థుల ఉద్యమాలలో పాల్గొన్నారు. 1937 లో బందరులో డాక్టరుగా ప్రాక్టీసు ప్రారంభించారు. ఇండియన్ మెడికల్ అసోసియేషన్ కేంద్ర సంఘంలో కృష్ణాజిల్లా తరఫున ప్రతినిధి, (1944-45). బందరు కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులు 1938 నుంచి; కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటి సభ్యులు 1940 నుంచి; బందరు హరిజనసేవాసంఘ కార్యదర్శి, 1938-39. వైస్-ప్రెసిడెంటు, 1939 నుంచి; బందరు హిందీ ప్రేమిమండలి ప్రెసిడెంటు 1943 నుంచి; బందరు మునిసిపల్ కౌన్సిలు చైర్మన్, 1949 నుంచి; అడ్రసు : మచిలీపట్టణం.

అమృతకౌర్, రాజకుమారి; జననం. 1887 ఫబ్రవరి 2; క్రైస్తవమతావలంబి; సంఘసేవలో చాలా కాలం పనిచేశారు; గాంధీమహాత్మునికి కార్యదర్శిగా పనిచేశారు. 1942 లో అరెస్టు చేయబడి, నిర్బంధంలో వుంచబడినారు. అఖిల భారత మహిళా సమావేశానికి అధ్యక్షురాలు, 1931-33; సిమ్లాలోను, లాహోరులోను టెన్నిస్ ఆటలో చాలా కప్పులను గెలిచారు. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖామంత్రి, 1947 అగస్టు 15 నుంచి. అడ్రసు: ఆరోగ్య మంత్రి, న్యూఢిల్లి.

అమ్మన్నరాజా, శ్రీమతి చోడగం; (పుట్టింటిపేరు గంధంవారు) జననం 1909 ఫిబ్రవరి 6; బి. ఏ. క్వీన్ మేరీస్ కాలేజి, మదరాసు; ఎల్. టి. మదరాసు; ఎం. ఎల్. ఏ. 1937; మళ్ళీ 1946; మదరాసు అసెంబ్లీ డిప్యూటీస్పీకరు; అడ్రసు: ఫోర్ట్ సెంట్ జార్జి, మదరాసు.

అవధాని, డాక్టర్ ఏ. వి. (ఆకెళ్ళ వ్యాఘ్రావధాని) జననం, 1905 జనవరి 10; ఎల్. ఎం. పి. 1927; మదరాసులో ప్రాక్టీసు ప్రారంభం, 1928; ఆలిండియా మెడికల్ లైసెన్సియేట్స్ అసోసి

మెషన్ మదరాసు బ్రాంచికి అసిస్టెంటు సెక్రటరి, 1940-45; అడ్రసు: 137 బ్రాడీస్ రోడ్; మైలాపూరు, మదరాసు.

అవినాషిలింగంచెట్టియార్, టి. ఎస్. జననం. 5 మే 1903 (తిరుప్పూర్); పచ్చయప్ప కాలేజిలో బి. ఏ. 1923 లో ప్యాసయారు. బి. ఎల్. 1925; సత్యాగ్రహోద్యమంలో చేరి ప్రాక్టీసు వదలివేశారు. కోయంబత్తూరులో శ్రీరామకృష్ణ మిషన్ విద్యాలయం స్థాపించారు. 1930 లో ఆరునెలలు, 1932 లో ఏడాది, స్వాతంత్ర్య పోరాటంలో జెయిలుకు వెళ్లారు. 1934 లో కేంద్రశాసనసభకు ఎన్నుకోబడి 1945 వరకు సభ్యులుగా వున్నారు. 1941 లోను 1942 లోను జెయిలుకు వెళ్ళారు. మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీకి 1946 లో ఎన్నుకోబడినారు, విద్యా శాఖామంత్రి 1946-49. తమిళాభిమానులు; తమిళ భాషాభివృద్ధికిన్ని, తమిళ విజ్ఞాన సర్వస్వమును ప్రచురించడానికి తమిళ వలార్చి కళగం (సారస్వతసంఘం) స్థాపించారు. అడ్రసు: కోయంబత్తూరు.

అసఫ్ ఆలి; జననం, 1888; బారిష్టరు; కాంగ్రెసు ఉద్యమంలో చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు. కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు కార్యదర్శి, 1934; కేంద్రశాసనసభ సభ్యులు 1935-1936; కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యులు. 1942 లో నిర్బంధించబడి, 1945 మేలో విడుదల చేయబడినారు. 1946-1947 లో కేంద్రప్రభుత్వ రైల్వేశాఖా మంత్రిగా వున్నారు. 1947 జనవరిలో, భారతదేశపు రాయబారిగా యునైటెడ్ స్టేట్సుకు పంపబడినారు. 1948 ఏప్రిల్ లో ఆపదవినుంచి విరమించారు; ఒరిస్సా గవర్నరు, 1948 జూన్ 21 నుంచి. అడ్రసు. కటక్.

అంబేద్కర్, డాక్టర్ భీమరావ్ రాంజీ; జననం, 1883; బారిష్టరు; ఎం. ఏ. పిహెచ్. డి. డి. ఎస్. సి., బొంబాయి సిడెన్‌హామ్స్ కాలేజిలో ప్రొఫెసర్, 1917; 1930-32 లో రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు సభ్యులు; నిమ్నజాతుల నాయకులు; 1942 జూలై నుంచి 1946 జూన్ వరకు వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యులు; భారత ప్రభుత్వ న్యాయశాఖామంత్రి, 1947 ఆగస్టు 15 నుంచి. అడ్రసు: న్యాయశాఖామంత్రి, న్యూఢిల్లీ.

ఆగాఖాన్, హిస్ హైనెస్ ఆగా సుల్తాన్ మహమ్మద్ షా; జననం 1875; ఇస్మాయిలీ ముస్లిముల పీఠాధిపతి. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటిషు ప్రభుత్వానికి చేసిన ఉపకారాలకు బహూకరణగా, రాజహోదా పొందారు. 1937 లో ప్రపంచ రాజ్యసమితికి అధ్యక్షత వహించారు. అడ్రసు : ఆగాహాల్, బొంబాయి.

ఆజద్, మౌలానాఅబుల్ కలాం; జననం 1888, మక్కాలో; బాల్యం అంతా అరేబియాలోనే గడిపి, కైరోలో ఆల్ అజార్ యూనివర్సిటీలో చదివారు. భారతదేశానికి వచ్చి, కలకత్తాలో నివాసం ఏర్పరచుకున్నారు. ఆల్ హిలాల్ అనే ఉర్దూ వారపత్రికను స్థాపించి, ఇస్లాం విజ్ఞానాన్ని ప్రచారం చేశారు. ఆ పత్రికను ప్రభుత్వం వారు నిలిపి వేయించారు. అప్పుడు ఆల్ బలాఘ్ అనే పేరుతో మరొక పత్రికను స్థాపించారు. ప్రభుత్వం ఆయనను నిర్బంధంలో వుంచారు. కాంగ్రెసులో చేరి 1921-22 లో జెయిలుకు వెళ్లారు. 1931-32 ఉద్యమంలోనూ, ఆ తరువాతనూ చాలాసారు జెయిలుకు వెళ్ళారు. 1923 లోనూ, 1939 నుంచి 1946 వరకునూ కాంగ్రెసు అధ్యక్షులు; 1942 లో ప్రభుత్వంచే నిర్బంధంలో వుంచబడి, 1945 జూన్ 15 న విడుదల చేయబడినారు. 1947 జనవరిలో కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖా మంత్రిగా పదవిస్వీకరించారు. ఇస్లాంమతాన్ని గురించి అనేక గ్రంథాలు వ్రాశారు. జైలులో వుండగా, ఖురాన్‌పై వ్యాఖ్య వ్రాశారు. అడ్రసు: విద్యాశాఖామంత్రి, న్యూఢిల్లీ.

ఉపేంద్రశర్మ, మండలపర్తి; జననం, 1912 జులై 1; ఎం. ఎ. (ఆంధ్ర యూనివర్శిటీ); గుంటూరు హిందూకాలేజీలో ప్రాచ్య భాషాశాఖ ప్రధానాధ్యాపకులుగా ఉన్నారు. భారతదేశ భాషాసమితి కార్యనిర్వాహక సభ్యులు; అఖిల భారత వైజ్ఞానిక మహాసభ సభ్యులు; అఖిలభారత గ్రంథాలయ మహాసభ సభ్యులు; ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘసభ్యులు; ఆంధ్రరాష్ట్ర ప్రాచ్య సారస్వత విజ్ఞాన పరిషత్తు అధ్యక్షులు. అడ్రసు : హిందూకాలేజీ, గుంటూరు.

ఉస్మాన్ : సర్ మహమ్మద్ ; జననం, 1884; బి. ఏ. మదరాసు క్రిస్టియన్ కాలేజి. 1921 లో మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీకి సభ్యు

లుగా ఎన్నుకోబడినారు. మదరాస్ షరీఫ్, 1924: సర్ బిరుదము, 1928; కె. సి. ఐ. ఇ, 1933. మదరాసు ఆక్టింగు గవర్నర్, 1934. 1937 లో మదరాస్ లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా నామినేట్ చేయబడినారు. వైస్రాయి కౌన్సిలు సభ్యులు, 1942-1946 అడ్రసు: తేనాంపేట, మదరాసు.

కమలాదేవి, శ్రీమతి; జననం, 1903 ఏప్రిల్ 3; మహిళాభ్యుదయానికి చిరకాలంనుంచి పాటుపడుతున్నారు. 1922లో కాంగ్రెస్ ఉద్యమంలో చేరారు. నాలుసార్లు జైలుకు వెళ్ళారు. బాల్యవివాహాలకు ప్రతికూలంగా ప్రచారం చేశారు. అఖిలభారత కాంగ్రెసు సోషలిస్టుపార్టీ స్థాపకులలో ఒకరు. అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యురాలు, 1946-47; అఖిలభారత మహిళా సమావేశం అధ్యక్షురాలు; అడ్రసు: శాంటాక్రూజ్, బొంబాయి సబర్బన్ డిస్ట్రిక్టు.

కరియప్ప, జనరల్ కె. ఎం. జననం, 1900 జనవరి 28; 1919లో ఇండియా సైన్యంలో చేరారు. మెసపొటేమియా వజీర్‌స్థాన్‌లలో పనిచేశారు. 1933లో క్వెట్టాలోని స్టాఫ్ కాలేజిలో చేరారు. ఇలాటి అవకాశం పొందిన ప్రథమ భారతీయుడు యీయనే. 1939 లో బ్రిగేడ్ మేజర్‌గా నియమితులైనారు. 1942లో లెఫ్టినెంట్-కర్నల్. 1947లో మేజర్ జనరల్. 1949 జనవరి 15 తేదిన ఇండియా సర్వసేనానిగా పదవి స్వీకరించారు. ఈ పదవి పొందిన ప్రథమ భారతీయుడు ఈయనే. అడ్రసు: న్యూఢిల్లీ.

కవీశ్వర్, సర్దార్ శార్దూల సింగ్; జననం, 1886; బి. ఏ., పంజాబ్ యూనివర్సిటీ; 1913లో ఢిల్లీలో 'సిక్కురివ్యూ'ను స్థాపించారు. ఢిల్లీనుంచి వెళ్ళగొట్టబడి, లాహోరులో నివాసం ఏర్పరచుకున్నారు. 1919 లో సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నందుకు అయిదేళ్ళు దేశాంతరం పంపబడినారు. కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులు, 1928; కాంగ్రెసు అధ్యక్షుడుగా, 1932-33 లో ఆక్టింగు చేశారు. కాంగ్రెసు ఉద్యమంలో నాలుగుసార్లు జైలుకు పంపబడినారు. 1939లో కాంగ్రెసు నుంచి విడిపోయి, ఫార్వర్డుబ్లాకులో చేరారు. సుభాసచంద్రబోస్ ఇండియాను వదలి పోగానే ఫార్వర్డు

శ్లాక్ అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. తరువాత నాలుగు సంవత్సరాలు నిర్బంధంలో వుంచబడినారు.

కామేశ్వరరావు, జయంతి; జననం, 17 జూలై 1917; బి.ఎస్.సి., ఇంజనీరింగ్ (బెనారెస్); ఎ. ఎం. ఐ. ఇ., ఛార్టర్డ్ ఇంజనీర్ (1948); గవర్నమెంట్ ఎలక్ట్రిసిటీ డిపార్ట్మెంట్‌లో జూనియర్ ఇంజనీర్ 1939-40; గవర్నమెంట్ స్కూల్ ఆఫ్ టెక్నాలజీలో లెక్చరర్, 1940-44; బెనారెస్ ఇంజనీర్స్ అసోసియేషన్ సెక్రటరి, 1948-49; కుట్టి అండ్ రావ్ (ఇంజనీర్స్) లిమిటెడ్ డైరెకర్; ఇండియన్ నేషనల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ డైరెక్టర్; నేషనల్ ఇంజనీర్ అను త్రైమాస ఆంగ్ల పత్రికలో భాగస్తులు. అడ్రసు: 1, రాజాబహదర్ మొదలియార్ వీధి, త్యాగరాయ నగర్, మదరాసు.

కాశీపతి, కపిల; జననం, 14 సెప్టెంబర్ 1908; బి. ఏ. ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి (గుంటూరు) ఎల్. ఎల్. బి. (బెనారెస్ హిందు యూనివర్శిటి); విద్యార్థిగా వుండగానే వక్తృత్వపు పోటీలలో పాల్గొనేవారు. 1931 లో కాశీలో జరిగిన ఇంటర్ - యూనివర్శిటి వక్తృత్వపు పోటీలో పాల్గొని సర్ రాస్ మసూద్ బంగారు పతకాన్ని గెలిచారు. సప్తమాంధ్ర విద్యార్థి మహాసభ (గుంటూరు, 1927) కు ప్రధాన కార్యదర్శి. స్వరాజ్య, మదరాసు మెయిలు పత్రికలలో పనిచేశారు. హైదరాబాదులో, మెయిలు పత్రిక ప్రత్యేక విలేఖరిగా వుండి, 1938 లో హైదరాబాదు సత్యాగ్రహం ఆరంభంకాగానే, సంస్థానంనుంచి పంపివేయబడినారు. 1939 లో ఆలిండియా రేడియోలో తెలుగు సబ్ ఎడిటర్‌గా చేరి, న్యూస్ ఎడిటర్ అలారు. 1947 లో, రాష్ట్రీయ బ్రాడ్‌కాస్టింగ్ ఆఫీసర్‌గా వీరిని మదరాసు ప్రభుత్వంవారు, కేంద్ర ప్రభుత్వ అనుమతిపై నియమించుకున్నారు. 1948 లో, గ్రామీణ బ్రాడ్‌కాస్టింగ్ విధానాలను తెలుసుకోడానికి ఇంగ్లండు, ఫ్రాన్సు, స్విట్జర్లెండు, ఇటలీ దేశాలకు వెళ్ళి వచ్చారు. తెలుగులో చాలా కథలు, పద్యములు, నాటికలు వ్రాశారు. అడ్రసు: ఆల్ ఇండియా రేడియో, న్యూఢిల్లి.

కామేశ్వరరావు, అయ్యదేవర; జననం 1881; బి. ఎల్. మదరాస్

లా కాలేజి: 1906 నుంచి కాంగ్రెసు సభ్యులు; వందేమాతరం, హోంరూల్ ఉద్యమములలో పని చేసినారు. 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో ప్రవేశం. అనేకసార్లు కారాగృహ ప్రవేశం. రెండుసార్లు బెజవాడ మునిసిపల్ కౌన్సిలు చైర్మను. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు 1926-29; అసెంబ్లీకి సభ్యులుగా 1937 లో యెన్నుకోబడినారు; కాంగ్రెసు పార్లమెంటరీ చీఫ్ విప్; మదరాసు ప్రభుత్వ చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ, 1937-1939; మదరాసు శాసనసభ్యులుగా మళ్ళీ 1946 లో ఎన్నుకోబడినారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్ సిండికేట్ సభ్యులు; 1917 నుండి అఖిలభారత కాంగ్రెసు సభ్యులు; 'ఫ్రెంచి స్వాతంత్ర్య విజయం, అమెరికా రాష్ట్రములు, చైనా జాతీయోద్యమం' టురుష్క ప్రజాస్వామికం, ఉపనిషత్సారములు, మొదలైన గ్రంథాలు వ్రాశారు. అడ్రసు: బెజవాడ.

కిద్వాయ్, రఫీ అహమద్; జననం, 1894; 1921 లో లాయరు పరీక్షకు చదువుతూ సహాయనిరాకరణోద్యంలో చదువు మానేశారు; యు. పి. రాష్ట్ర కాంగ్రెసు సెక్రటరీగాను, ప్రెసిడెంటుగాను వున్నారు, 1922-26; 1922 లో ఒక ఏడాది శిక్ష అనుభవించారు. యు. పి. రాష్ట్ర మంత్రి. 1937-39; కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యుడు, 1946 జూలై నుంచి. 1942-45లో నిర్బంధించబడినారు. యు. పి. రాష్ట్ర హోం మంత్రి 1946-47; కేంద్రప్రభుత్వ పోస్టు, టెలిగ్రాఫ్ శాఖామంత్రి 1947 ఆగస్టు 15 నుంచి, అడ్రసు: కమ్యూనికేషన్సు మినిస్టర్, న్యూఢిల్లీ.

కుటుంబరావు, కొడవటిగంటి; జననం 1909 అక్టోబరు 28; బి.ఏ. ఆంధ్రయూనివర్సిటి (1929) యువ ఎడిటర్ (1935) ఆంధ్రవారపత్రిక (1940-42) బొంబాయి మెటల్ ప్యాక్టరీలో (1942) నేషనల్ వార్ ఫ్రంట్, సిమ్లా, (1942) మెటల్ అండ్ స్టీల్ ఇన్స్పెక్టరేట్ లో (1943-45) ఆంధ్రపత్రిక సబ్ - ఎడిటర్, 1948 డిసెంబరు నుంచి; పేరుపొందిన కథకుడు, రచయిత. రచనలు; నీకేం కావాలి, కులంలేని మనిషి, మారుపేర్లు, అరుణోదయం (నవలలు), చిన్న కథల సంపుటీలు ఆరు; వీరాభిమన్యు, బాలనాగమ్మ చిత్రాలకు సంభాష

ణాలు వ్రాశారు, 'తారుమారు' అనే చిత్రానికి కథ వ్రాశారు. అడ్రసు: 19-ఎ, మసీదువీధి, సైదాపేట, మదరాసు.

కుమారస్వామి, గరిమెళ్ళ; ప్రస్తుత వయస్సు, 51; విశాఖపట్టణంజిల్లా శ్రీకూర్మంలో జననం; బి. ఏ. వరకు చదివి, 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరి చదువు మానివేశారు. అప్పటినుంచీ కాంగ్రెసు ఉద్యమాల్లో పాల్గొంటూ, తొమ్మిదిసార్లు జెయిలుకు వెళ్ళారు. ఉత్తర విశాఖ జిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగా కొంత కాలము, కార్యదర్శిగా ఆరుసార్లు పనిచేశారు. 1946 లో మదరాసు శాసనసభకు, 10,046 ఓట్లు మెజారిటీతో ఎన్నుకోబడినారు. విశాఖ పట్టణం జిల్లా హాస్పిటల్ కమిటీ, రాజకీయ బాధితుల సంఘం, ఫిర్కా డెవలప్‌మెంట్ సంఘం మొదలైన చాలా సంఘాలలో సభ్యులుగా వున్నారు. అడ్రసు: చికాకోల్.

కుమారస్వామిరాజా, పూసపాటి జగన్నాథ; వయసు 51 ఏళ్లు; రామ్నాడు జిల్లా, రాజపాలెం వాసులు. రాష్ట్రేతర ఆంధ్రులు. కాంగ్రెసు ఉద్యమంలో జెయిలుకు వెళ్లారు. 1937 లో రాష్ట్రశాసన సభ్యులుగా ఎన్నుకో బడినారు. మళ్లీ 1946 లో శ్రీవిల్లిపుత్తూరు నియోజక వర్గంనుంచి ఎన్నుకోబడినారు. వ్యవసాయ శాఖామంత్రి 1947-48; 1949 మార్చిలో రాష్ట్ర ప్రధానమంత్రిగా ఎన్నుకొనబడినారు. అడ్రసు, ఫోర్ట్ సెంట్ జార్జి, మదరాసు.

కూర్మయ్య, వేముల; జననం, 1907. బి.ఏ, ఎల్.ఎల్.బి., బెనారెస్ యూనివర్సిటీ; బందరు హరిజన నియోజకవర్గం తరపున 1936 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. మళ్ళీ 1946 లో కూడా అదేస్థానంలో ఎన్నిక. ప్రచురణ శాఖా మంత్రి. 1946-47; గ్రామోద్ధరణ శాఖామంత్రి 1947 మార్చినుంచి 1949 మార్చి.

కృష్ణమూర్తి, వారణాసి; జననం 1912 జూలై 30. బి. ఏ. (ఆనర్సు) అన్నామలై యూనివర్సిటీ (1933) బి. కాం. బొంబాయి (1935) 1935 లో బొంబాయి రాష్ట్రంలో బి. కాం. పరీక్షకు కూచున్న విద్యార్థు లందరిలోను ఎక్కువ మార్కులు సంపాదించి, యూనివర్సిటీ బహుమతినిపొందారు. 1935 లో బొంబాయిలో సెంట్రల్ బ్యాంకిలోచేరి,

అనేక రాష్ట్రాలలో 1942 వరకు పనిచేశారు. 1943 లో భారత్ బ్యాంకిలోచేరి, బెజవాడలోను ఢిల్లీలోను పనిచేశారు. 1944 ఆగస్టులో ఆంధ్రబ్యాంకిలో జనరల్ మేనేజరుగా చేరారు. అప్పటికి యీ బ్యాంకికి 19 బ్రాంచీలు వుండేవి. రిజర్వుఫండు లక్ష రూపాయల లోపు వుండేది. డిపాజిట్లు, 70 లక్షల రూపాయలు వుండేవి. వీరు చేరిన మూడు సంవత్సరాలలో యీ బ్యాంక్ డిపాజిట్లు రు. 4 కోట్లకు పైగా పెరిగాయి, రిజర్వుఫండు తొమ్మిది లక్షలయింది. బ్రాంచీల సంఖ్య 40 అయింది. వీరు ఇండియన్ బ్యాంకర్స్ ఇన్స్టిట్యూట్‌లో అసోసియేట్ మెంబరు. లండన్ బ్యాంకర్స్ ఇన్స్టిట్యూట్‌లో సభ్యులు. అడ్రసు: ఆంధ్రబ్యాంక్, మచిలీపట్టణం.

కృష్ణమూర్తి, హనుమంతుని. దివాన్ బహదూర్; జననం 1889 అక్టోబర్ 26. కలకత్తా విద్యాసాగర్ కాలేజీలో చదివారు. బి. ఎ; సర్ ఏ. పి. పాత్రోగారి అల్లుడు. 1923 లో రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటులో చేరారు. 1942 లో ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్‌గా, ఆ శాఖలోని అత్యున్నత పదవిలో నియమింపబడినారు. అడ్రస్ - 26, కమెండరన్ ఛీఫ్ రోడ్, ఎగ్మూర్, మదరాసు.

కృష్ణస్వామి అయ్యర్, అల్లాడి. జననం-1883 మే 14; మదరాస్ క్రిస్టియన్ కాలేజి, బి. ఏ; బి. ఎల్; మదరాసు లా కాలేజి. ప్రసిద్ధి పొందిన న్యాయవాది. 1929 నుంచి 1944 వరకు మదరాసు అడ్వకేట్ జనరల్. మదరాసులో నివాసమేర్పరచుకున్న ఆంధ్ర ప్రముఖులలో ఒకరు. విశ్వకళా పరిషత్తులకు, ప్రజోపయోగ సంస్థలకు విరివిగా విరాళాలిచ్చారు. 1930 లో దివాన్ బహదూర్ బిరుదును, 1932లో సర్ బిరుదును పొందారు. 1947 లో బిరుదులను వదలివేశారు. రాజ్యాంగసభ సభ్యులు. అడ్రస్ - ఏకామ్రనివాస్, లజ్, మైలాపూర్, మదరాస్.

కృష్ణారావు, గవిని వెంకట; జననం, 1914 నవంబరు 15; ఆంధ్ర యూనివర్సిటి బి. ఏ., 1937; ఆంధ్రప్రభ సబ్-ఎడిటర్, 1941-42; మళ్ళీ 1944-45; రాడికల్, 1946; ఆంధ్రజ్యోతి, 1947; రచనలు: సమరసింహా, చైత్రరథం, శివరాత్రి, వరూధిని, కావ్యజగత్తు, యుగసంధ్య, ఆదర్శ శిఖరాలు,

జఘనసుందరి, సునీథ; తెలుగు లిపి సంస్కారంకోసం కృషిచేస్తున్నారు; అడ్రసు : తెనాలి.

కేశవరావు, తేజోమూర్తుల; జననం, 16 డిసెంబరు 1908. బందరు ఆంధ్రజాతీయ కళాశాలలోను, శాంతినికేతనంలోనూ చిత్రలేఖనను అభ్యసించారు. ఆంధ్ర చిత్రలేఖకులలో చెప్పదగినవారిలో ఒకరు. 1934 లో లండనులో జరిగిన భారతీయ చిత్రప్రదర్శనలో వీరిబొమ్మలు ప్రదర్శింపబడి, ప్రశంశ పొందినవి. అడ్రసు: 24, వెంకట్రామ అయ్యర్ వీధి, జార్జిటౌన్ మదరాసు.

కేసరి, డాక్టర్ కె. ఎన్. (కోట నరకేసరి); జననం, 1875 ఏప్రిల్ 26;కడుపేదకుటుంబంలోజన్మించి, స్వయంకృషివల్ల అత్యధిక ధనార్జన గావించి, విద్యాదానం చేస్తున్న మహనీయు ఆంధ్రవ్యక్తి. జననం, ఒంగోలు తాలూకా ఇనమనమెళ్ళూరు. పదవఏట చెన్నపట్టణానికివచ్చి, కష్టపడి విద్య సంపాదించి, కేసరి కుటీరాన్ని స్థాపించి, ఆయుర్వేద ఔషధాలను తయారుచేసి, భాగ్యవంతులయారు. 'గృహలక్ష్మి' పత్రికను 1928 లో స్థాపించి నడుపుతున్నారు. చెన్నపట్టణంలో తెలుగు పిల్లలకు, తెలుగులో చదువుచెప్పే స్కూలులేని పరిస్థితిని గమనించి, మైలాపూరు తెలుగు స్కూలును తమ యాజమాన్యంలోకి తీసుకొని, కేసరీ స్కూలు అనే పేరుతో దానిని హైస్కూలుగా మార్చి, దానికి లక్షరూపాయలపైగా విరాళం ఇచ్చి, విద్యాప్రదాతలైనారు. కేసరీ కన్యా విద్యాలయం అనే పేరుతో, ఆడపిల్లలకు ప్రత్యేకంగా స్కూలు స్థాపించడానికి 1947 లో మరొక లక్షరూపాయలు విరాళమిచ్చారు. 1948 జూన్ 24 తేదిన మైలాపూర్ లోని డిసిల్వారోడ్డులోని హెర్మిటేజ్ అనే భవనంలో యీ కేసరి కన్యావిద్యాలయం తెరువబడింది. అడ్రసు: కేసరికుటీరం, రాయపేట, మదరాసు.

కేస్కార్, డాక్టర్ బాలకృష్ణ విశ్వనాథ; జననం, 1903; కాశీ విద్యాపీఠంలో పట్టభద్రులై, అచ్చటనే ప్రొఫెసర్ గా మూడేళ్లు పనిచేశారు. 1933 లో పారిస్ వెళ్లి ఆర్థిక శాస్త్రంలో డాక్టరేట్ పొందారు. 1921 లోనే కాంగ్రెసు ఉద్యమంలో చేరారు. 1930, 1931, 1941 లలో జైలుకి వెళ్లారు. 1946 లో కొద్దికాలం, కాంగ్రెసు

ప్రధాన కార్యదర్శిగా వున్నారు. 1948 ఫిబ్రవరిలో కన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోన బడినారు. ఇండియా ప్రభుత్వ విదేశశాఖ డిప్యూటీ మంత్రిగా, 1948 డిసెంబరు 7 తేదిన పదవి స్వీకరించారు. అడ్రసు: న్యూ ఢిల్లీ.

కోటయ్య, ప్రగడ; జననం. 26 జూలై 1915; మదరాసు రాష్ట్ర చేనేతపనివారల కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి; మూడు సంవత్సరముల నుంచీ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటి సభ్యులు. చేనేతవారి ఇబ్బందులను తొలగించడానికీ, వారి పరిస్థితులను బాగుపరచడానికీ కృషి చేస్తున్న ప్రముఖులలో ఒకరు. అడ్రసు: చేనేత కార్యాలయం, నిడుబ్రోలు.

కోటిరెడ్డి, కె. జననం, 1887 అక్టోబర్. బి. ఏ., మదరాసు; బి. సి. ఎల్. (ఆక్స్‌ఫర్డ్); ఎల్. ఎల్. బి. (లండన్); కడపలో బారిష్టరుగా ప్రాక్టీసు ప్రారంభం, 1918; 1923 నుంచి 1935 వరకు మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు. 1937 లో మదరాసు అసెంబ్లీ సభ్యులు; 1946 లో మళ్ళీ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. హిందూ దేవాదాయశాఖా మంత్రి, 1946-47; అడ్రసు, కడప.

గంగప్ప, ముండ్లూర్; జననం, 1901; సుమారు 16 ఏండ్లు బళ్లారి జిల్లాబోర్డు మెంబరు; ఒక ఏడాది బళ్ళారి తాలూకాబోర్డు ప్రెసిడెంటు; మునిసిపల్ కౌన్సిలరుగా 15 ఏళ్లనుంచి ఉన్నారు. నాలుగేళ్లు వైస్ ఛైర్మన్‌గా ఉన్నారు. ప్రస్తుతం (1947 నుంచీ) ఛైర్మన్‌గా వున్నారు. తమ తండ్రి నరసింహప్ప గారిపేర నడుపబడే విద్యార్థుల హాస్టలు స్థాపనకు లక్షరూపాయలు విరాళం యిచ్చారు. వీరు బట్టల వర్తకులు; అడ్రసు: బళ్ళారి.

గిరి, వరహాగిరి వెంకట్; జననం, 1894 ఆగస్టు 10. వరహాగిరి జోగయ్యపంతులుగారి కుమారులు. డబ్లిన్ యూనివర్సిటీ బారిష్టర్. 1922 లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని జైలుకివెళ్ళారు. రైల్వే కార్మికుల యూనియనులను స్థాపించడంలో పాల్గొన్నారు. 1926 లో మదరాసులో జరిగిన ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు; ఆల్ ఇండియా రైల్వేమెన్స్ ఫెడరేషన్ అధ్యక్షులు, 1927; ఈ ఫెడరే

షన్ కు ప్రధాన కార్యదర్శి, 1929-36; కార్మికుల ప్రతినిధిగా, రెండవ రౌండ్ టేబిలు కాన్ఫరెన్సు లో పాల్గొన్నారు. కేంద్రశాసన సభ సభ్యులు, 1934. మదరాసు శాసనసభ సభ్యులు, 1937. మదరాసు కార్మిక, పరిశ్రమ శాఖా మంత్రి, 1937-1939. మళ్ళీ శాసన సభ సభ్యులు, 1946. కార్మిక పరిశ్రమ శాఖామంత్రి 1946-1947. ప్రస్తుతం సిలోన్‌లో ఇండియా ప్రభుత్వ హైకమిషనర్ గా వున్నారు.

గురుపాదం, డాక్టర్ ఎస్. (వయస్సు 56 ఏళ్ళు); తంజావూర్ మెడికల్ స్కూలులో డిప్లొమా పొంది, కంటివైద్యం ప్రారంభించారు. చాలాకాలం కోయంబత్తూరులో ప్రాక్టీసు చేశారు. 1942 నుంచీ వెల్లూరులో ప్రాక్టీసు పెట్టారు. గ్రామపునర్నిర్మాణ కార్యక్రమంలో చాలా శ్రద్ధ కనపరచారు. 1948 జూన్ 26 తేది నుంచి 1949 ఏప్రిల్ 6 వరకు మదరాసు ప్రభుత్వ పీర్సానెల్ మెంట్ శాఖ మంత్రి.

గోపాల కృష్ణయ్య, వావిలాల; జననం, 1906; ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ ఉపాధ్యక్షులు; ఆంధ్ర మహాసభ స్థాయీ సంఘ సభ్యులు; తెలంగాణా సహాయక సంఘ కార్యదర్శి; ఆంధ్రదేశ కో ఆపరేటివ్ యూనియన్ డైరక్టరు; జాతీయోద్యమంలో జైలుకు వెళ్ళారు; ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శి; ఎడిటర్ : విద్యార్థి (1926) జ్యోతి (1937) సహకారం 1945-48; రచనలు; ఆంధ్ర రాష్ట్రం, సంస్థానాలు, తుంగభద్ర ప్రాజెక్టు, మద్రాసు మంత్రులు, ప్రభాతం, మన్యం, గ్రంథాలయ జిల్లు. అడ్రసు : సత్తెనపల్లి.

గోపాలరాయశర్మ, కొండముది. జననం 1920 అక్టోబర్ 16. బి. ఏ. (మదరాసు); లా కాలేజీలో చదువుతూ మానివేశారు, 1943-45 లో ఆంధ్రప్రభలో సబ్-ఎడిటర్. వీరు వ్రాసిన 'ఎదురీత' అనే నాటకానికి ఆంధ్ర నాటక కళాపరిషత్తువారు బహుమతి ఇచ్చారు. 'ఇదీ లోకం, ఏకదేశం, న్యాయం' అనే నాటకాలను కూడా వ్రాశారు. అడ్రసు, ఏలూరు.

గోపాలరెడ్డి, బెజవాడ; జననం, 1907 ఆగస్టు 5. శాంతినికేతనంలో శిక్షాభవన పట్టాన్ని పొందారు. 1930 లో ఉప్పు

సత్యాగ్రహంలో పాల్గొని మూడు నెలలశిక్ష పడ్డారు. విడుదల అవగానే మళ్ళీ విద్యార్థుల ఊరేగింపు జరిపి, ఆరునెలల శిక్ష పడ్డారు. 1932 మే లో 18 నెలల శిక్షపడి, 1933 జూన్‌లో విడుదల అయారు. 1937 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు, స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి 1937-39. 1946 లో శాసనసభకు మళ్ళీ ఎన్నుకోబడినారు. ఆర్థిక శాఖామంత్రి, 1947 మార్చినుంచి. అడ్రసు; ఫోర్ట్ సెంట్ జార్జి, మదరాసు.

గోపిచంద్, త్రిపురనేని. బి. ఏ, (ఆంధ్రయూనివర్సిటీ) బి. ఎల్. (మదరాస్). ఆరునెలలు మాత్రం లాయరుగా ప్రాక్టీసుచేసి, తరువాత సాహిత్య కృషిలో ప్రవేశించారు: కథారచనలోను, నవలా రచనలోను పేరుపొందారు. సినిమా కథా రచన, డైరక్షను యిప్పుడు ప్రధానకృషి. అడ్రసు: సూతాశ్రమం, తెనాలి.

గోవిందాచార్యులు, ఆత్మకూరి. జననం, 1897. 1917 నుంచీ దేశ సేవా కార్యక్రమంలో పాల్గొంటున్నారు. 1920 నుంచి కాంగ్రెసువాదిగా, అన్ని ఉద్యమములలోను పాల్గొని అనేకసార్లు జెయిలుకు వెళ్ళారు. 1922 నుంచి కాంగ్రెసు కమిటీలో సభ్యులుగ ఉన్నారు. సత్యాగ్రహి పత్రికా సంపాదకులు 1924-32. చాలాకాలం పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు సభ్యులు. గాంధి మహాత్ముని జీవితచరిత్ర, హిందూదేశ ఆర్థికచరిత్ర, ఉత్తర రామాయణ కావ్యము, వీరి రచనలలో ముఖ్యమైనవి. మంచి వక్త. ప్రస్తుతం మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు; ఆంధ్ర విశ్వకళా పరిషత్ సెనేట్ సభ్యులు. అడ్రసు : ఏలూరు.

చక్రపాణి (ఆలూరి వెంకట సుబ్బారావు); జననం, 1903 ఆగస్టు 5; చందమామ, ఆంధ్రజ్యోతి పత్రికల ఎడిటర్, 1945-48; రచనలు · త్రిలోచన కవిరాజు, బడదీదీ, దేవదాస్, మొదలైన అనువాదాలు; తోకచుక్క, పాత ముంగలి, భేతాళకథలు; 'ధర్మపత్ని' ఫిలింకు సంభాషణలు, స్వర్గసీమకు కథ వ్రాశారు. అడ్రసు : 37 ఆచారప్పన్ వీధి, మదరాసు.

చంద్రమౌళి, కస్తూరి; తెనాలి తాలూకా మోపర్రు వాస్తవ్యులు; స్కాట్లండువెళ్లి, అక్కడ యూనివర్సిటీలో పట్టం పొందారు. వ్యవ

సాయ సమస్యలపట్ల అభిమానం ఎక్కువ. 1937 లో ఎ. ఎల్. ఏ; 1946 లో మళ్ళీ ఎం. ఎల్. ఏ. 1947 నుంచి స్థానిక పరిపాలన శాఖామంత్రి. అడ్రసు : ఫోర్టు సెంట్ జార్జి, మదరాసు.

చామకూర్, ఎస్. ఎన్. (సత్యనారాయణ); జననం, 1904 ఏప్రిల్ 8; రాజమండ్రి. 1923 లో కీ. శే. దామెర్ల రామారావుగారివద్ద చిత్రకళను అభ్యసించారు. 1923 లో వెంబ్లీలో జరిగిన బ్రిటిష్ ఎంపైర్ ఎగ్జిబిషన్ కు ఇండియానుంచి ఎన్నబడిన 16 చిత్రాలలో, 'ధ్యానబుద్ధ' అనే వీరి చిత్రం ఒకటి. ఇదికాక, 'గౌరీకల్యాణం', 'మురళి పిలుపు', 'సిద్ధార్థ', నాగపూజ, అనే వీరి చిత్రాలు దేశంలోని అనేకప్రదర్శనలలో మెప్పుపొందాయి, 1928లో బొంబాయిలోని సర్ జె. జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్సులో చేరారు. 1930 లో యీ స్కూలు డిప్లొమా పొందారు. తరువాత వీరు సర్ ఎస్. వరదాచారి, సర్ అల్లాడి, సి. రాజగోపాలాచారి, మొదలైన నాయకుల పూర్తిసైజు చిత్రాలను వ్రాశారు. ప్రస్తుతం మదరాసులో, ఆర్టు ఎకడమీని స్థాపించారు. 1946 లో గాంధిజీ మదరాసు వచ్చినప్పుడు, గాంధీజీ అధ్వర్యాన ఆర్టిస్టు కాన్ఫరెన్సును జరిపారు. వీరు వ్రాసిన శ్రీ సి. రాజగోపాలాచారి గారి చిత్రమును 1948 జూలై 24 న మదరాసు అసెంబ్లీ హాలులో పండిత జవహరలాల్ నెహ్రూ ఆవిష్కరించారు. అడ్రసు : 19 అప్పర్ స్వామి కోయిల్ వీధి, మైలాపూర్, మదరాసు.

చిదంబరం చెట్టియార్, ఎం. ఏ; జననం, 1917 సెప్టెంబర్ 15; చెట్టినాడు రాజాగారి మూడవ కుమారుడు. చదువు, మదరాసు యూనివర్సిటీ; 1939 లో వ్యాపారంలో ప్రవేశించారు. తమిళ ఇసై సంఘం కార్యదర్శి; మదరాసు ఫ్లయింగ్ క్లబ్ ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబరు; ఇండియన్ బ్యాంకి లిమిటెడ్, మైసూరు క్రోం అండ్ లెదర్ టానింగ్ లిమిటెడ్ కంపెనీల డైరెక్టరు. కానాడు కత్తాన్ ఎలక్ట్రిక్ కార్పొరేషను మేనేజింగ్ డైరెక్టరు. అడ్రసు : చెట్టినాడ్ హౌస్, అడయార్, మదరాసు.

జయకర్, ది రైట్ ఆనరబిల్ డాక్టర్, ముకుంద్ రామారావ్; ఎం. ఎ. ఎల్. ఎల్. డి. ప్రీవీకౌన్సిలర్; బారిస్టర్; బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1923;

ఆ కౌన్సిలులోనె స్వరాజ్యపార్టీ నాయకులు, 1923-25; కేంద్ర శాసనసభసభ్యులు, 1926-30: రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకి ప్రతినిధి, 1931; ఇండియా ఫెడరల్ కోర్టు జడ్జి, 1937-39; కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీసభ్యులు, 1946-47; అడ్రసు, వింటర్ రోడ్, మలబార్ హిల్, బొంబాయి.

తిరుపతి రాజు, భూపతి రాజు; జననం, 1868 ఫిబ్రవరి 9: 1897 జూన్ 22 న జన్మస్థలమైన కుముదవల్లి గ్రామంలో శ్రీ వీరేశలింగ కవి సమాజ గ్రంథాలయాన్ని స్థాపించి దానిని వృద్ధిపరచడంలో నేటివరకు తోడ్పడుతున్నారు. భీమవరం తాలూకా గ్రంథాలయ సంఘమునకు మూడు సంవత్సరములు అధ్యక్షులుగా నుండి తాలూకాలో గ్రంథాలయములను స్థాపించడానికి కృషిచేశారు. అడ్రసు: కుముదవల్లి, భీమవరం తాలూకా.

తిరుమలరావు, మొసలికంటి; (కాకినాడ) జననం, 1901 జనవరి 29; బి.ఏ.కు చదువుతూ కాంగ్రెసు ఉద్యమంలో చేరి 1921 లో చదువు మానివేశారు; స్వరాజ్య (ఇంగ్లీషు) పత్రికలో పనిచేశారు; కేంద్రశాసనసభ్యులు 1937-41; కౌన్సిల్ ఆఫ్ స్టేట్ సభ్యులు, 1945-47; చాలా సార్లు జెయిలుకు వెళ్ళారు. తను సంపాదకత్వాన 'న్యూటైమ్సు' అనే ఆంగ్ల దినపత్రికను 1946 లో స్థాపించి, 1947 లో నిలిపివేశారు. 1948 జులైలో కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీకి మదరాసునుంచి సభ్యులుగా ఎన్నుకోబడినారు. అడ్రసు, తేనాంపేట, మదరాసు.

దివాకర్, రంగనాథ రామచంద్ర; జననం, 1894; బి. ఏ. (పూనా) 1916; ఎం. ఏ. 1918; కొల్హాపూర్ రాజారాం కాలేజిలో ప్రొఫెసర్‌గా పనిచేశారు; 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. రెండుసంవత్సరాలు ఖైదు శిక్ష పొందారు. 1923 లో నవశక్తి అనే ఇంగ్లీషుపత్రికను స్థాపించి, రాజద్రోహ నేరానికి మళ్ళీ రెండేళ్లు శిక్షపొందారు. కర్ణాటక రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి, 1926-29; అధ్యక్షులు, 1929-34; 1930 ఉప్పుసత్యాగ్రహంలోను 1933 లోను, జెయిలుకు వెళ్ళారు. 1940-41 లో వ్యక్తిసత్యాగ్రహంలోను, 1942 ఉద్యమంలోను అరెస్టుచేయుబడి 1945 ఆగస్టులో విడుదలచేయుబడినారు. 1946 లో కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీకిఎన్నుకో

బడినారు. ప్రచురణశాఖ, బ్రాడ్ కాస్టింగ్ మంత్రి (మినిస్టర్ ఆఫ్ స్టేట్)గా 1948 డిసెంబరు 7 తేదిన పదవి స్వీకరించారు. అడ్రసు, న్యూఢిల్లీ.

దుర్గాబాయి, శ్రీమతి గుమ్మడిదల; జననం, 1909. తమ పదమూడవ ఏటనే కాకినాడలో బాలికాహిందీపాఠశాలను స్థాపించి, జయప్రదంగా నిర్వహించారు. 1930 లో మదరాసుకు వచ్చి, అప్పటినుంచీ జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో జైలుకు వెళ్ళి, అక్కడ ఇంగ్లీషు నేర్చుకోవడం ప్రారంభించారు. తరువాత అనేకసార్లు జెయిలుకు వెళ్ళారు. స్వయంగా ఇంగ్లీషు చదువుకొని, బెనారెస్ మెట్రిక్యులేషన్ ప్యాసయారు. బెనారెస్‌లోను, వాల్తేరులోను చదివి, తమ 30 వ ఏట ఎం. ఏ. డిగ్రీని పొందారు. తరువాత 'లా' చదివి, ప్యాసయి, లాయరుగా ప్రాక్టీసు పెట్టారు. తెలుగుదేశమంతటా ప్రఖ్యాతి పొందిన మదరాసు ఆంధ్రమహిళా మండలి, యీ మండలిచే నిర్వహింపబడుతున్న సంస్థలుఅన్నీ, వీరి కృషిఫలితాలు. 1947 లో కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకొనబడినారు. అడ్రసు: బృందావనం, మైలాపూర్, మదరాసు.

దేశికాచార్యులు, దీవి; జననం, 1895 ఆగస్టు 30; మదరాసులో ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్ స్థాపించిన కీ. శే. దీవి గోపాలాచార్యులుగారి సోదరులు. ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్ మేనేజింగ్ డైరక్టరు. అడ్రసు, 79 గోపతి నారాయణస్వామి చెట్టి రోడ్, త్యాగరాయనగర్, మద్రాస్.

ధర్మారావు నాయుడు, తాపీ; ఆంధ్రవిశారద; జననం, 1888 సెప్టెంబరు 19; బి. ఏ. (మదరాస్); బరంపురంలో కల్లికోట కాలేజిలో లెక్చరర్, 1909; 1911 లో వేగుచుక్క గ్రంథమాల స్థాపించారు; మైనరు జమీందార్లకు చదువుచెప్పే న్యూయింగ్టన్ కాలేజిలో ట్యూటర్‌గాను గార్డియన్‌గాను 1917 నుంచి 1927 వరకు పనిచేశారు. బొబ్బిలి రాజాగారికి ప్రైవేటు సెక్రటరీ, ఆక్టింగ్ దివాన్, 1929; మందసారాజాగారికి ట్యూటర్, 1929-35; జనవాణి సంపాదకులు, 1936-39; కాగడా సంపాదకులు, 1939-

42; నేషనల్ సర్వీస్ లేబరు ట్రిబ్యునల్ పబ్లిసిటీ ఆఫీసర్, 1943; బరంపురంలో ఆంధ్రభాషాభివర్ధనీ సమాజాన్ని స్థాపించారు; మదరాసు సాహితీసమితి మొదటి అధ్యక్షులు: అభ్యుదయరచయితల సంఘ ప్రథమాధ్యక్షులు: అనేక గ్రంథాలు రచించారు. సారంగధర, మోహినీరుక్మాంగద, మాలపిల్ల, రైతుబిడ్డ, ఇల్లాలు, కాలచక్రం, అపవాదు, పత్ని, ధర్మాంగద, ద్రోహి, మొదలైన అనేక ఫిలిములకు కథలు వ్రాశారు. వీరికి 'ఆంధ్ర విశారద' బిరుదాన్ని శృంగేరి మఠాధిపతు లిచ్చారు. అడ్రసు 11, నాటు ముత్తుకుమారప్ప ముదలివీధి, మైలాపూర్. మదరాసు.

నరసింహమూర్తి, వేముల: జననం, 9 ఏప్రిల్ 1916; ఆంధ్రవిశ్వకళాపరిషత్ బి. ఏ. ఆనర్సు (గణితశాస్త్రం) 1938 లో, ఫస్టు క్లాసులుగా ఉత్తీర్ణులై, చేవ్రారె సన్యాసిరాజు స్వర్ణపతకమును పొందినారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో 1938-41 లలో పరిశోధన చేశారు. ఆంధ్రయూనివర్శిటీ కాలేజిలో గణితశాస్త్ర బోధకులు, 1943-45; రిజర్వుబ్యాంకు (బొంబాయి)లో 1945 నుంచి 1947 ఆగస్టు వరకు స్టాటిస్టిక్సు రిసెర్చి సూపరింటెండెంటు; 1941-1943 వరకు గాంధి మహాత్ముని నిర్మాణ కార్యక్రమంలో పాల్గొని కొంకరపర్రు గ్రామంలో విశిష్టాశ్రమం స్థాపించారు. స్వయంపోషక ఖాదీ విషయమై ప్రచారంచేశారు. అడ్రసు: స్టాటిస్టికల్ ఆఫీసర్, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.

నాగప్ప, సర్దారు. జననం, 6 సెప్టెంబరు 1911 (కర్నూలు). 1931 లో స్కూలుఫైనలు చదువుతూ, కాంగ్రెసు ఉద్యమంలోచేరి చదువు మానివేశారు. కాంగ్రెసు వలంటీరుగాను, ప్రచారకులుగాను పనిచేశారు. హరిజనులలో వివిధ తెగలు వుండకుండా ఐక్యత కలిగించడానికిపాటుపడ్డారు. 1937లో కాంగ్రెసుతరఫున కర్నూలుహరిజన నియోజకవర్గంనుంచి మదరాసు శాసనసభకు సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో వీరు, వీరి సతికూడా జైలుకు వెళ్ళారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో అరెస్టుచేయబడి, 1945 వరకు జెయిలులోవున్నారు. 1939-

45 ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. 1946 లో మదరాసు శాసనసభకు మళ్ళీ ఎన్నుకోబడినారు. 1947 లో ఇండియా రాజ్యాంగ పరిషత్ సభ్యులుగా ఎన్నుకోబడినారు. కర్నూలు హరిజన విద్యార్థి వసతి గృహాన్ని స్థాపించారు. అడ్రసు: ఫోర్టు, కర్నూలు.

నాగభూషణం, పాతూరి; జననం. 1907 ఆగస్టు 11; ఇంటర్మీడియెట్ (మదరాసు) లైబ్రరీ డిప్లొమా (ఆంధ్రయూనివర్సిటీ); 1928 లో తెనాలితాలూకా పెదపాలెం లో శ్రీ సేర్ల చెర్వు వెంకటేశ్వర్లు గారితోచేరి సేవాశ్రమం స్థాపించి, పదేళ్లు జాతీయవిద్య, గ్రంథాలయాలు, హిందీ, ఖద్దరు, స్వదేశీవస్తు ప్రచారమునకు కృషిచేశారు. 1938 నుంచి యిప్పటివరకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా వున్నారు. కొంతకాలం దక్షిణ భారత వయోజన విద్యాసంఘమునకు సహాయకార్యదర్శి. ప్రస్తుతం, పెదపాలెంలోని సేవాశ్రమవాణీ మందిరమునకు పర్యవేక్షకులుగను, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శిగను, పటమటలంక గ్రంథాలయ పుస్తకశాల మేనేజరుగను, గ్రంథాలయ సర్వస్వము సంపాదకులుగను ఉన్నారు. డైరెక్టర్: కెమికల్స్ లిమిటెడ్, నిడదవోలు; శ్రమజీవి ప్రెస్ లిమిటెడ్ మద్రాసు; ది ఈకో ఇండస్ట్రీస్ లిమిటెడ్, మదరాసు; ది సౌత్ ఇండియన్ కో-ఆపరేటివ్ పబ్లిషింగ్ సొసైటీ లిమిటెడ్, మదరాసు, రచనలు: గ్రంథాలయములు— రిజిస్ట్రేషన్; గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠములు; గ్రంథాలయ పత్రికలు. 1930-1932 లలో 9 నెలలు, మళ్లీ 6 నెలలు సత్యాగ్రహోద్యమంలో జైలుకు వెళ్ళారు. అడ్రసు: పటమటలంక, (వయా) బెజవాడ.

నాగభూషణం, హరి; జననం, 1884 డిసెంబరు 24; బి.ఏ. (బందరు) 1909; ఫస్టుగ్రేడ్ ప్లీడరీ పరీక్ష, 1913; 1914-1939 వరకు బందరులో ప్లీడరీప్రాక్టీసు. అనారోగ్య కారణంగా ప్రస్తుతం ప్రాక్టీసు మానివేశారు. పేరుపొందిన ఆంధ్ర సంగీత విద్వాంసులు. 'వాగ్గేయకార రత్న' మొదలైన బిరుదులు పొందారు. అడ్రసు: మచిలీపట్టణం.

నాగయ్య, వుప్పల; జననం, 1907 ఏప్రిల్ 17; మొదట్లో చిత్తూరుజిల్లాలో రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేశారు. తరువాత

జిల్లాబోర్డులో చేరారు. 1934 వరకు ఉద్యోగంలో వున్నారు. నాట్యకళపట్ల అభిమానంతో ఉద్యోగం మానివేశారు. గృహలక్ష్మి, వందేమాతరం, సుమంగళి, విశ్వమోహిని, దేవత, పోతన, భాగ్యలక్ష్మి, స్వర్గసీమ, త్యాగయ్య, వేమనఫిలిములలో నటించి, ప్రఖ్యాత ఆంధ్రనటుడుగా ప్రసిద్ధిపొందారు. త్యాగయ్యఫిలిమును డైరెక్టుచేశారు. త్యాగబ్రహ్మ గానసభకు సెక్రటరీ; ఆంధ్రగాన కళామండలికి వైస్-ప్రెసిడెంట్. అడ్రసు : 58 గోపతి నారాయణస్వామి చెట్టి రోడ్, త్యాగరాయనగర్, మదరాస్.

నారాయణమూర్తి, న్యాయపతి; జననం, 1897 జూలై 24. 1921 లో పచ్చయప్ప కాలేజీలో బి. ఏ. చదివి, కాంగ్రెసు ఆదేశానుసారం పరీక్షకు కూర్చోడం మానివేసి, దేశసేవలో నిమగ్నులయారు. గంజాం జిల్లా కాంగ్రెసు కమిటీ కార్యదర్శి, 1921; ఆంధ్ర కాన్ఫరెన్సు కార్యదర్శి, 1921; జైలు: 1922 లో ఆరునెలలు; మళ్ళీ మూడు నెలలు; 1930 లో ఏడాది; 1932 లో తొమ్మిది నెలలు; 1918 లో 'ఆంధ్రవాణి' పత్రికను బరంపురంలో స్థాపించారు 1922 లో దీనికి ఎడిటర్; 1936 'వాహిని' ఎడిటర్; 1938-42, ఆంధ్రప్రభ ఎడిటర్; 1945 లో గంజాం-విశాఖపట్టణం జిల్లాలతరఫున కేంద్ర శాసనసభకు కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నికోబడి, 1947 ఆగస్టు 15 న ఆ సభ రద్దు అయేవరకు సభ్యులుగా వున్నారు. 1922 నుంచి 1935 వరకు అఖిలభారత కాంగ్రెసు కమిటి సభ్యులు; 1931-35 లో ఆంధ్ర కాంగ్రెసు కమిటీ కార్యదర్శి; ఎన్నో కిసాన్‌సభలకు, రైతు సభలకు అధ్యక్షులుగా వున్నారు. అడ్రసు : 6, వీరభద్రన్ వీధి, మైలాపూర్, మదరాసు.

నిర్వికల్పానందస్వామి; జననం, 20 డిసెంబరు 1915; తమ పదునిమిదవ ఏటనే, (1933 లో) భువనేశ్వరంలోని శ్రీరామకృష్ణ మఠంలో తురీయాశ్రమ స్వీకారంచేశారు, 1939 వరకు అక్కడనే వున్నారు. 1939 లో విశాఖపట్టణంలో, ఆంధ్రదేశంలోని మొట్టమొదటి రామకృష్ణ మఠాన్ని స్థాపించడానికి ప్రయత్నంచేశారు. తరువాత 1942 వరకు వంగదేశంలోని రామకృష్ణ మఠ కేంద్రాలలో పనిచేశారు. 1942 నుంచి 1946 వరకు మదరాసులో వున్నారు. 1944 లో

శ్రీరామకృష్ణ మఠం తరఫున శ్రీరామకృష్ణ ప్రభ అనే మాస పత్రికను స్థాపించి, దానికి ప్రథమ సంపాదకులుగా పనిచేశారు. 1946 నుంచి 1948 వరకు విశాఖ పట్టణంలో వుండి ప్రచారకార్యాన్ని చేసి, ప్రస్తుతం పూరి-జగన్నాథంలో వున్నారు. వీరు సంస్కృతం, ఇంగ్లీషు, తెలుగు, వంగ భాషలలో పండితులు; రచనలు : యోగవాసిష్ఠం, భగవద్గీత, తత్త్వశాస్త్ర చరిత్ర మొదలైనవి; శ్రీ పూర్ణానంద, శ్రీ వనమాలి అనే పేర్లతో తెలుగు పత్రికలలో వ్యాసాలు వ్రాస్తూ వుంటారు; అడ్రసు : శ్రీ రామకృష్ణ మఠం, చక్రతీర్థం, పూరీ.

నియోగి క్షితీశచంద్ర; జననం, 1888; ఫెడరల్ కోర్టు అడ్వొకేటు; కేంద్ర శాసనసభ సభ్యులు. 1921 నుంచి 1947 వరకు; భారత ప్రభుత్వ వాణిజ్య శాఖామంత్రి; అడ్రసు, న్యూఢిల్లి.

నెహ్రూ, పండిత జవహార్ లాల్; జననం, 1889 నవంబరు 14; ఎం. ఎ., బారెట్లా; అలహాబాదు హైకోర్టులో అడ్వొకేటుగా ప్రాక్టీసు చేశారు. హోంరూల్ లీగ్ సెక్రటరీ, 1918; ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ మెంబరు, 1918 నుంచి; 1921 లో జైలు; 1922 లో విడుదల చేయబడి, మళ్ళీ జైలుకు పంపబడినారు; అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి, 1929; కాంగ్రెసు అధ్యక్షుడు, 1929-30; ఉప్పు సత్యాగ్రహంలో 1930 ఏప్రిల్ లో అరెస్టుచేయబడి, 1931 జనవరిలో విడుదల; మళ్ళీ 1932లో అరెస్టు, 1934 విడుదల; మళ్ళీ అరెస్టు, 1935 లో విడుదల; కాంగ్రెసు అధ్యక్షుడు, 1936, 1937; 1940 లో మళ్ళీ అరెస్టు, తొమ్మిదవసారి మళ్ళీ 1942 ఆగస్టులో అరెస్టు, 1945 జూన్ 15 న విడుదల; వైస్రాయి కౌన్సిలు మెంబరు, డిప్యూటి ప్రెసిడెంటు 1946 సెప్టెంబరు 2 నుంచి; స్వతంత్ర భారతదేశ ప్రధానమంత్రి 1947 ఆగస్టు 15 నుంచి; అడ్రసు, న్యూఢిల్లి.

నై, హిస్ ఎక్సలెన్సీ లెఫ్టినెంట్ జనరల్ సర్ ఆర్చిబాల్డు ఎడ్వర్డు; జననం, 1895 ఏప్రిల్ 23; 1914 లో సైన్యంలో సాధారణ సైనికుడుగా చేరి 1940 నాటికి మేజర్ - జనరల్ హోదాకు వచ్చారు; లెఫ్టినెంట్ జనరల్, 1941; బ్రిటిషు సైన్య డైరెక్టర్ ఆఫ్ స్టాఫ్ డ్యూటీస్,

1940; ఇంపీరియల్ జనరల్ స్టాఫ్కు ఉపనాయకుడు, 1941; మదరాసు రాష్ట్ర గవర్నరు 1946 మే 6 నుంచి 1948 సెప్టెంబరు 7 వరకు. ప్రస్తుతం ఇండియాలో బ్రిటను తరఫున హైకమీషనరు.

పట్టాభిసీతారామయ్య, డాక్టర్ భోగరాజు; జననం, 1880 నవంబర్ 24; 1906 నుంచి 1916 వరకు డాక్టరుగా ప్రాక్టీసుచేసి, కాంగ్రెసు వుద్యమంలో ఎక్కువగా పాల్గొన్నారు. అదే సంవత్సరంలో, ఏ. ఐ. సి. సి. మెంబరుగా ఎన్నుకోబడినారు. 1917 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు నిర్మాణం విషయంలో ఎక్కువ కృషిచేసినారు. 1937 లో రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. కొంతకాలం అఖిలభారత సంస్థాన ప్రజల కాంగ్రెసు అధ్యక్షులుగా వున్నారు. అఖిలభారత మోటారు యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు. చాలాకాలం కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులుగా వున్నారు. చాలాసార్లు జైలుకు వెళ్ళారు. రాజ్యాంగ పరిషత్తు సభ్యులు; భారత కాంగ్రెసు అధ్యక్షులు, 1949; అడ్రసు, న్యూఢిల్లీ.

పటేల్, సర్దార్ వల్లభభాయ్ జవేరిభాయ్; జననం; 1875 అక్టోబరు 31; బారిస్టర్; 1946 లో గాంధిజీతో కలసి రాజకీయరంగంలో ప్రవేశించారు. బార్డోలి సత్యాగ్రహాన్ని జయప్రదంగా నడిపారు. అహమ్మదాబాద్ మునిసిపల్ కౌన్సిల్ ప్రెసిడెంట్, 1924-28; కాంగ్రెసు అధ్యక్షుడు, 1931; కాంగ్రెసు వుద్యమంలో అనేకసార్లు జైలుకు వెళ్లారు. కాంగ్రెసు పార్లమెంటరీ సబ్కమిటీ అధ్యక్షుడు 1935 నుంచి; 1942 ఆగస్టు 9 న అరెస్టుచేయబడి, 1945 జూన్ 15 న విడుదల పొందారు. కాంగ్రెసు వర్కింగుకమిటీ మెంబరు; కేంద్రప్రభుత్వ హోం మెంబరు, 1945 సెప్టెంబరు 2 నుంచి; డిప్యూటీ ప్రధాన మంత్రి, హోంమంత్రి, 1947 ఆగస్టు 15 నుంచి; అడ్రసు: 1 ఔరంగజేబ్ రోడ్, న్యూఢిల్లీ.

పద్మావతీదేవి, కొమ్మూరి; జననం, 1908 జులై 7; శ్రీ కొమ్మూరి వెంకటరామయ్యగారితో వివాహం, 1922. శ్రీ బళ్ళారి రాఘవాచార్యులగారితో ప్రహ్లాదలో లీలావతి, రామదాసులో కమల, పాదుకలో కౌసల్య, హరిశ్చంద్రలో చంద్రమతి,

చంద్రగుప్తలో ఛాయ ముర, రామరాజులో ఆషాబీ, తప్పెవరిదిలో జానకి, సరిపడని సంగతులలో తార భూమికలను అనేక సార్లు 1930-46 మధ్యన నిర్వహించి ప్రసిద్ధిపొందారు. ద్రౌపదీ మానసంరక్షణము, రైతుబిడ్డ, సుమతి అనే తెలుగు చిత్రాలలో నటించారు. కథలు వ్రాస్తారు. "పొగడదండ" అనే కథల సంపుటి అచ్చు అయింది. అడ్రసు: 19-ఎ. మసీదువీథి, సైదాపేట, మదరాసు.

పళ్ళంరాజు, మల్లిపూడి; జననం, 1899 ఏప్రిల్ 25; కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో పట్టం పొందారు. 1928 లో గ్రామమునసబు ఉద్యోగానికి రాజీనామా యిచ్చి, రాజకీయాలలో ప్రవేశించారు. 1929 లో కాంగ్రెసు అభ్యర్థిగా, తూర్పుగోదావరి జిల్లా బోర్డు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. 1932 లో గాంధి మహాత్ముని అరెస్టుపట్ల నిరసనం తెలియజేస్తూ, జిల్లాబోర్డు కార్యాలయాలను మూసివేసినందుకు, ఆరు వారాలు శిక్షపడ్డారు. వ్యక్తి సత్యాగ్రహంలో ఒక ఏడాది కఠిన శిక్ష. 1942 లో మళ్ళీ అరెస్టు అయారు. 1937 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. మళ్ళీ 1946 లో కూడా ఎన్నుకోబడినారు. కాంగ్రెసు లెజిస్లేటివ్ పార్టీకి డిప్యూటీలీడర్. అడ్రసు. కాకినాడ.

పాత్రో, అన్నెప వాసుదేవ; జననం, 1907 ఆగస్టు 3; బి. ఎ. (మదరాసు). యూనివర్సిటి బహుమతిని పొందారు. కేంబ్రిడ్జి. ఆక్స్‌ఫర్డులలో కూడా చదివారు. ఇండియా మంత్రి పోటీ పరీక్షలో ప్యాసయి, ఇంపీరియల్ ఇండియన్ పోలీసు సర్వీసులో చేరారు. జిల్లా పోలీసు సూపరింటెండెంటుగాను క్రైంశాఖ డిప్యూటి కమిషనర్ గాను, అసిస్టెంట్ ఇన్‌స్పెక్టర్ జనరల్ గాను, డిప్యూటి ఇన్‌స్పెక్టర్ జనరలుగాను పనిచేసి, 1947 ఆగస్టునుంచీ మదరాసు పోలీసు కమిషనర్‌గా ఉన్నారు. ఈ పదవికి నియమింపబడిన ప్రథమ భారతీయులువీరే. 1948 లో ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా హైదరాబాదు సరిహద్దు రక్షణకు నియమించబడినారు. హైదరాబాదు పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్‌గా 1948 సెప్టెంబరు 19 న నియమింపబడి, అనారోగ్య కారణంగా 1949 జనవరి 20 నుంచి సెలవులో వున్నారు.

రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్ సభ్యులు, ఇంగ్లీషులో రచనలు, పద్యాలూ వ్రాశారు. ప్రసిద్ధ రాజకీయ నాయకులైన కీ. శే. సర్. ఏ. పి. పాత్రోగారి కుమారులు. వీరి రచనలు ఇంగ్లండులోను, అమెరికాలోను ప్రచురింపబడినవి. 'మహాభారతము, మనుచరిత్రము' వీరి అభిమాన గ్రంథాలు. అడ్రసు: 49, వైట్స్ రోడ్స్, రాయపేట, మదరాసు.

పార్థసారథి నాయుడు, పెళ్ళూరి శెట్టి; జననం, 1896 డిసెంబరు 26 నందరులో చిరకాలంగా సనాతనధర్మాలకు ప్రసిద్ధి పొందిన కుటుంబంలో జన్మించారు. ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెని మేనేజింగ్ డైరెక్టర్; ఆంధ్రబ్యాంక్ డైరెక్టర్; అడ్రసు, మచిలీపట్టణం.

ప్రకాశరావు, పుం; జననం: 1902 ఆగస్టు 9; విజయనగరం కాలేజిలో చదువుగా, 1921 లో కాంగ్రెసు ఆదేశానుసారం కాలేజి చదువు వదలిపెట్టారు. తరువాత వ్యాపారంలో ప్రవేశించారు. 1935 లో మదరాసు ఎనేమెల్ వర్క్సునూ, 1945 లో మదరాసు వాచ్ వర్క్సునూ స్థాపించారు. 1946 లో మదరాసు గ్లాస్ వర్క్సును తమ యాజమాన్యంలోకి తీసుకొన్నారు. చెన్నపురి ఆంధ్ర మహాసభ వర్కింగుకమిటీ మెంబరు; కెమికల్ ఇంజనీరింగ్ కార్పొరేషను డైరెక్టరు; అడ్రసు: హోం పార్క్, రాయపేట హైరోడ్, రాయపేట, మదరాసు.

ప్రకాశం, టంగుటూరి; జననం, ఆగస్టు 23, 1869; బారిస్టర్; 30 సంవత్సరాలనాడు, కాంగ్రెసు కోసం గొప్ప ప్రాక్టీసును వదలి, సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. ప్రతి కాంగ్రెసు ఉద్యమంలోనూ జైలుకు వెళ్ళారు. 'స్వరాజ్య' అనే ఆంగ్లదిన పత్రికను స్థాపించి, చాలా కాలం నడిపారు. కేంద్రశాసనసభ సభ్యులు, 1926-30; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు, 1935; 1942-46; మదరాసు అసెంబ్లీకి 1937 లో ఎన్నుకోబడినారు; రెవిన్యూమంత్రి, 1937-39; మళ్ళీ 1946 లో అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు; మదరాసు ప్రధానమంత్రి, 1946-47. అడ్రసు: గవర్నమెంట్ హౌస్, మౌంట్ రోడ్, మదరాసు.

ప్రసాద్, పాండే సుందర నారాయణ; జననం: 24 అక్టోబరు 1910 (యలమంచిలి); బి. ఏ. (కాకి

నాడ); ఎం. ఏ. (బెనారెస్) ఆంధ్ర యూనివర్శిటిలో ఎకనమిక్స్ లెక్చరర్‌గాను, నాగపూర్ హిస్లాప్ కాలేజి, పూనా వాడియా కాలేజి, జయపూర్ మహారాజా కాలేజిలలో ఎకనమిక్స్ ప్రొఫెసర్‌గాను పనిచేశారు. ప్రస్తుతం, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో మానిటరీ రీసెర్చ్ డైరక్టర్‌గా పనిచేస్తున్నారు. స్టెర్లింగు నిల్వవిషయమై బ్రిటిషు ప్రభుత్వంతో సంప్రతింపులకు ఇంగ్లండు వెళ్లిన (1948) ప్రతినిధివర్గంలో సభ్యులు; 1944 లో జయపూర్‌లో జరిగిన ఇండియన్ పొలిటికల్ సైన్సు కాన్ఫరెన్సు గౌరవ కార్యదర్శి; అమెరికా, ఇంగ్లండు, కెనడా దేశాలలో రీసెర్చి సంస్థలను పరిశీలించడానికి సంచారం చేశారు. అడ్రసు: డైరక్టర్, రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.

బలదేవసింగ్, సర్దార్; పంజాబ్ శాసనసభలో అకాలీ పార్టీ నాయకులుగా వుండేవారు; ఆ రాష్ట్రానికి మంత్రిగాకూడా వున్నారు. 1946 సెప్టెంబరు 2 న కేంద్రప్రభుత్వ రక్షణ శాఖాసభ్యులుగా నియమితులైనారు; 1947 ఆగస్టు 15 నుంచి, భారతప్రభుత్వ రక్షణ శాఖామంత్రి; అడ్రసు, న్యూఢిల్లీ.

బలరామ కృష్ణయ్య, బౌద్ధ వాఙ్మయ బ్రహ్మ దుగ్గిరాల: జననం, 1905 జూలై 10; పంజాబు దురంతాలను వర్ణించే నాటకాలను ప్రదర్శించినందుకు 14 వ ఏటనే అరెస్టు చేయబడినారు; 1923 లో హిందీ అధ్యాపకులుగా పనిచేశారు. బుద్ధపురాణం అనే వీరి గ్రంథరచనను హర్షించి, ఆంధ్రమహాసభవారు 1928 లో 'బౌద్ధవాఙ్మయ బ్రహ్మ' అనే బిరుదునిచ్చారు; ఆంధ్రరాష్ట్ర హిందీమహాసభ అధ్యక్షులు. 1938-1930 లో ఏడాది శిక్ష. 1932 లో 9 నెలలు, 1942 నుంచి 1944 వరకు జైలులో వున్నారు. ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభ అధ్యక్షులు, 1940, 1947; అడ్రసు: అంగలూరు.

బాపినీడు, మాగంటి. జననం, 14 ఆగస్టు 1895; బి. ఏ. వరకూ కలకత్తాలో చదివి, అమెరికాకు వెళ్ళి కార్నెల్ యూనివర్శిటీలో బి. ఎస్. సి., కాలిఫోర్నియా యూనివర్శిటీలో ఎం. ఎస్. సి. డిగ్రీలనుపొందారు. 1923 లో ఇండియాకు తిరిగివచ్చి, కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొన్నారు. అప్పటి

సంఘీ కాంగ్రెసుసంస్థ సేవలోనూ, ప్రజాసేవలోనూ వున్నారు. ప్రతి ఉద్యమంలోనూ జెయిలుకు వెళ్లారు. అమెరికా, హవాయీ, జపాన్, చైనా దేశాలలో సంచారంచేసి వచ్చారు. ఆంధ్ర యూనివర్శిటి సెనేట్, అకడమిక్ కౌన్సిల్. సిండికేట్‌లలో సభ్యులు. తెలుగు తల్లి, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, అనే తెలుగు పుస్తకాలనూ, ఈజ్ఇట్ ఇండియన్, సక్సెస్‌ఫుల్ సెక్రటరీ అనే ఇంగ్లీషు పుస్తకాలనూ వ్రాశారు. మదరాసు ఇండస్ట్రీస్ అసోసియేషను స్థాపించి మదరాసులోను, జిల్లాలలోను ప్రదర్శనశాలలను స్థాపించారు. ఆంధ్రదేశ హరిజనసేవక సంఘ కార్యదర్శి 1932-42. చాలాకాలం పశ్చిమ కృష్ణ, పశ్చిమగోదావరి జిల్లా బోర్డులో సభ్యులుగా వున్నారు. 1937 లో మదరాసు అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. ప్రచురణశాఖ మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి 1937-39. 1946 లో మళ్ళీ అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. అసెంబ్లీ కాంగ్రెసుపార్టీ విప్ 1947, 1948. అడ్రసు: 2/5 మాడ్రేస్‌రోడ్, మదరాసు.

బాలసుందరరావు, డాక్టరు గాలి; జననం, 1913 మే 31. రాయపురం మెడికల్ స్కూల్‌లో డి. ఎం. ఎస్. 1939; ప్రాక్టీస్ ప్రారంభం, 1939 నుంచి; మధ్య తరగతి కుటుంబాలవారిక, వారి యింట్లోనే వుండి చికిత్సచేయించు కొంటె అయే ఖర్చులో నర్సింగు హోంలోనే చికిత్సపొందే సదుపాయాలను కలిగించాలనే ఆశయంతో, వీనస్ క్లినిక్ అండ్ నర్సింగుహోంను, అన్నిశాస్త్రీయ పరికరాలతోను స్థాపించారు. చాలా కథలు, 'ఆషాఢం' అనే నాటకాలు కొన్ని వ్రాశారు. ప్రాగ్జ్యోతిష్టూడియో స్థాపకులలో ఒకరు. వైజయంతీ ఫిలిమ్సు డైరెక్టరులలో ఒకరు. ఆంధ్రనాటక కళాపరిషత్తు జాయింట్ సెక్రటరి, 1942-43. అడ్రసు: 172, రాయపేట, హైరోడ్, మైలాపూర్, మదరాసు.

బొబ్బిలిరాజా, రాజా శ్రీరావు శ్వేతచలపతి రామకృష్ణరంగారావు బహదూర్; జననం, 20 ఫిబ్రవరి 1901; మదరాసు యూనివర్సిటి మెట్రిక్యులేషన్ 1918 లో ప్యాసయారు. పట్టాభిషేకం, 1920; కౌన్సిల్ ఆఫ్ స్టేట్ నామినేటెడ్ మెంబరు, 1925; మదరాసు లెజ

నేటివ్ కౌన్సిలు మెంబరు, 1931-37; 1931 లో రౌండ్ టేబిలు కాన్ఫరెన్సుకు వెళ్ళివచ్చారు; 1932 నవంబరునుంచి 1937 మార్చివరకు మదరాసు రాష్ట్ర ప్రథమమంత్రి; ఆంధ్రయూనివర్శిటీ ప్రొ-ఛాన్సెలరుగా 1931 లో నియమింపబడినారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో, నేషనల్ డిఫెన్సు కౌన్సిలులో మెంబరు; 1946 నుంచి కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీ మెంబరు; కస్తూరిబా జాతీయ స్మారకనిధికి విరివిగా విరాళం ఇచ్చారు. బొబ్బిలిలో హాస్పిటలు, స్కూలు, శిశురక్షణ కేంద్రములను నిర్వహిస్తున్నారు. తమ జమీందారీని చాలా సమర్థంగా నిర్వహించే జమీందారులలో ఒకరు. అడ్రసు: బొబ్బిలి.

బోస్, శరత్ చంద్ర: జననం 1889 సెప్టెంబరు 6. బారెట్లా. 1914 లో కలకత్తా హైకోర్టులో ప్రాక్టీసు ఆరంభించారు. 1927 లో కాంగ్రెసు అభ్యర్థిగా బెంగాల్ అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1932 లో అరెస్టుచేయబడి 1935 లో విడుదల పొందారు. 1937 లో బెంగాలు శాసనసభకు సభ్యులుగా ఎన్నుకోబడి, ప్రతికూల పక్ష నాయకులుగా వున్నారు. 1941, డిసెంబరు 11 తేదీన అరెస్టుచేయబడి, 1945 సెప్టెంబరు 14 న విడుదల చేయబడినారు. కేంద్ర ప్రభుత్వ గనులశాఖా మంత్రిగా 1946లో రెండుమాసము లున్నారు. కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులు 1946-47. అఖిల భారత రిపబ్లికన్ సోషలిస్టు పార్టీని 1947 లో స్థాపించారు. అడ్రసు : వుడ్ బర్న్ పార్కు, ఎల్గిన్ రోడ్ పోస్టు, కలకత్తా.

భక్తవత్సలం, ఎం. జననం, 1897 అక్టోబర్ 9. 1927 లో వకీలువృత్తి వదలివేసి, ఇన్సూరెన్సు వ్యాపారంలో ప్రవేశించారు. తమిళ రాష్ట్ర కాంగ్రెసుకమిటిలో 1923 నుంచీ సభ్యులు. సత్యాగ్రహోద్యమంలో ఆరునెలలు శిక్షపడ్డారు. 1937 లో మదరాసు అసెంబ్లీలో సభ్యులు. కాంగ్రెసు ప్రభుత్వంలో పార్లమెంటరీ సెక్రెటరీ. 1942 లో అరెస్టయినారు. 1946 లో మళ్ళీ శాసనసభకు ఎన్నుకోబడినారు. ప్రస్తుతం పబ్లిక్ వర్క్సుశాఖామంత్రి, అడ్రసు : ఫోర్టుసెంట్ జార్జి, మదరాసు.

మత్తియస్, డాక్టర్ జాన్. జననం, 1886 జనవరి 10. ఆక్స్ఫర్డు,

లండన్, మదరాసు యూనివర్సిటీల గ్రాడ్యుయేట్. మదరాసు హైకోర్టు వకీలు, 1910-14. మదరాసు కో-ఆపరేటివ్ డిపార్టుమెంట్ స్పెషల్ ఆఫీసర్, 1918-20. మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో ఎకనమిక్సు ప్రొఫెసర్ 1920-29. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబర్ 1922-25. ఇండియన్ టారిఫ్ బోర్డు మెంబర్ 1925-31. టారిఫ్ బోర్డు ప్రెసిడెంట్ 1931-34. డైరెక్టర్ జనరల్ ఆఫ్ కమర్షియల్ స్టాటిస్టిక్స్, 1935-40. గవర్నమెంటు సర్వీసులో నుంచి రిటైరయి తాతాకంపెనీలో 1940 లో చేరారు. 1944 లో తాతాకంపెనీ డైరక్టరయారు. ఇండియా ప్రభుత్వ ఆర్థిక శాఖా మంత్రి అడ్రసు : న్యూ ఢిల్లీ.

మహబూబ్ అలిబెగ్; జననం, 1894; బెజవాడలో అడ్వకేట్. 1930 నుంచి 1936 వరకు బెజవాడ మునిసిపల్ కౌన్సిల్ ఛైర్మను. ఉత్తరసర్కారుల ముస్లిం నియోజక వర్గంతరపున మదరాసు కౌన్సిలు సభ్యులుగా వుండేవారు. 1937 లో పశ్చిమ గోదావరి - కృష్ణా ముస్లిం నియోజకవర్గం తరఫున మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు; మళ్ళీ 1946 లో ఎన్నుకోబడినారు; రాజ్యాంగ పరిషత్ సభ్యులు. అడ్రసు. బెజవాడ.

మాధవ మీనన్, కె. జననం, 1896 జూలై 15. బి.ఎల్. చదువుతూ 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరి, చదువునూ, త్రివేంద్రం సెక్రటేరియట్ లో ఉద్యోగాన్ని కూడా వదలివేశారు. మలబార్ తిరుగుబాటులో, పోలీసుదెబ్బలకు బాగా గురిఅయిన వారిలో ఒకరు. 1924 లో ప్లీడరి వృత్తి ప్రారంభించారు. కేరళ కాంగ్రెసుకమిటీకిచాలకాలం సెక్రటరీగా వున్నారు. 1937 ఎన్నికలలో, మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకోబడినారు. మళ్ళీ 1946లో కూడా ఎన్నుకోబడినారు. వ్యవసాయశాఖా మంత్రి 1947 మార్చి 23 నుంచి. అడ్రసు : ఫోర్టు సెంట్ జార్జి, మదరాసు.

ముఖర్జీ; డాక్టర్ శ్యామప్రసాద, జననం, 1901 జులై 6. బారిస్టరు. 1929 నుంచి 1947 వరకు బెంగాలు శాసనసభసభ్యుడు. కలకత్తా యూనివర్సిటీ వైస్ ఛాన్సెలర్, 1934-38. బెంగాల్ ప్రభుత్వ ఆర్థికశాఖా మంత్రి, 1941-42; అఖిలభారత హిందూమహా సభకు

చాలసార్లు అధ్యక్షుడు. ఇండియా ప్రభుత్వ పరిశ్రమశాఖా మంత్రి, 1947 ఆగస్టు 15 నుంచి. అడ్రస్ : న్యూ ఢిల్లి.

ముత్తయ్య చెట్టియార్, సర్ ఎం. ఏ. చెట్టినాడు రాజా. సర్ అన్నామలై చెట్టియార్ ప్రథమ పుత్రులు. జననం-1905. బి. ఏ. ప్రెసిడెన్సీ కాలేజి, మదరాస్. మదరాసు ప్రభుత్వ విద్యా శాఖా మంత్రి 1936-37. మదరాసు అసెంబ్లీ సభ్యులు 1946 నుంచి; అడ్రస్ : చెట్టినాడ్ హౌస్; అడయార్, మదరాస్.

మునుస్వామి పిళ్లె, వి. ఐ. జననం. 1889 ఫిబ్రవరి 21; 1926 లో మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా నామినేట్ చేయబడ్డారు. 1937 వరకు దానిలో సభ్యులుగానే వున్నారు. ఆల్ ఇండియా డిప్రెస్డ్ క్లాసెస్ కాంగ్రెసు అధ్యక్షులు, 1932; 1937 లో కాంగ్రెసు అభ్యర్థిగా, మదరాసు అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడినారు. వ్యవసాయ శాఖా మంత్రి, 1937-39; 1946 లో మళ్ళీ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకో బడినారు.

మూర్తి, బయ్యా సూర్యనారాయణ; జననం, 1906 అక్టోబర్ 29; బి. ఏ. రాజమండ్రి ఆర్ట్సు కాలేజి; బి. ఇ. డి. రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజి; ఆంధ్ర విద్యార్థి సమావేశం ప్రధాన కార్యదర్శి, 1930; కవి; కథకుడు; పత్రికారచయిత; 1937 లో మదరాస్ అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడినారు. పరిశ్రమశాఖ పార్లమెంటరీ సెక్రటరీ 1937-39; ఆంధ్రప్రభ అసిస్టెంట్ ఎడిటర్, 1944-46; మళ్ళీ 1946 ఎన్నికలలో అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడినారు. కాంగ్రెసు పార్టీ చీఫ్ విప్. పరిశ్రమ శాఖ పార్లమెంటరీ సెక్రటరీ, 1946-47. 'నవజీవన' సంపాదకులు; ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవాసంఘ అధ్యక్షులు; అడ్రసు 2-20 రండాల్సు రోడ్, వేపేరి, మదరాసు.

రజనీకాంతరావు, బాలాంత్రపు; జననం, 1920 జనవరి 29; 1940 లో ఆంధ్ర యూనివర్సిటీ కాలేజి బి. ఏ., ఆనర్సు డిగ్రీ పొందారు: 1942 లో ఆల్ ఇండియా రేడియోలో చేరారు. 1944 నుంచీ ప్రోగ్రామ్సు అసిస్టెంటుగా వున్నారు. చాలా పాటలు, నాట

కొలు స్వయంగా వ్రాసి, బ్రాడ్ కాస్టు చేశారు. చాలా తెలుగు ఫిలిములకు పాటలను వ్రాశారు. అడ్రసు,127 రాయపేట హైరోడ్ మైలాపూర్, మదరాసు.

రమాకాంతరావు, దామర్ల: జననం, 1913 జూన్; ఎం. ఏ. (ఆంధ్ర యూనివర్శిటీ, 1935); జనవాణిలో సబ్-ఎడిటర్ 1936-37; తరువాత పొగాకు వ్యాపారంలో ప్రవేశించారు. ఆంధ్ర దేశంలో, చేనేతపనివారి సంఘాన్ని చాలా ముందుకు తీసుకువచ్చారు. మదరాసు రాష్ట్ర చేనేత పనివారి కాంగ్రెసు అధ్యక్షుడు, 1942-48; మదరాసు రాష్ట్ర చేనేత సహకారసంఘ డైరెక్టర్, 1939 నుంచి; రాష్ట్ర ప్రభుత్వ నూలుసలహా సంఘంలో సభ్యుడు, 1942; రాష్ట్ర ప్రభుత్వ చేనేత పనివారి జీత నిర్ణయసంఘంలో సభ్యుడు, 1947. 'చేనేత' వారపత్రిక సంపాదకుడు; అడ్రసు, మంగళగిరి, గుంటూరు జిల్లా.

రాఘవరావు, న్యాయపతి: జననం, 1905 ఏప్రిల్ 13; బి. ఏ. (విజయనగరం); 1921 లో అసహయోద్యమంలో చేరి చదువు వదిలి వేశారు. 1931 వరకూ కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. హిందూపత్రిక సంపాదక వర్గంలో పనిచేస్తూ 1944 లో పిల్లలకోసం మొట్టమొదటిగా 'బాల'పత్రికను స్థాపించి, ప్రస్తుతం ఆ పత్రికను నడుపుతున్నారు. పిల్లలకోసం నాటికలు, పాటలు వ్రాసి రేడియో పిల్లల ప్రోగ్రాములను గత ఎనిమిదేళ్ళనుంచీ నడుపుతున్నారు. అడ్రసు; బాల ఆఫీసు, రాయపేట, మదరాసు.

రాఘవయ్య, కొమ్ము: జననం, 1920; (గుంటూరు జిల్లా, ఒంగోలు తాలూకా, వల్లూరు). 1937 లో కాంగ్రెసులో చేరి, 1938 లో జిల్లా కాంగ్రెసు కమిటీ మెంబరుగాను, 1939లో జిల్లా కాంగ్రెసువర్కింగు కమిటీ మెంబరుగాను, 1940 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ మెంబరుగాను ఎన్నుకొనబడినారు. రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ మెంబరు, 1942. ఆంధ్రమహాసభ స్టాండింగ్ కమిటీ మెంబరు, 1943. 1941 లోను, 1942 లోను, జైలుకు వెళ్ళారు. మదరాసు ఆంధ్ర హరిజన మహాసభ అధ్యక్షులు, 1944. ఆంధ్రరాష్ట్ర ఆదిమాంధ్ర మహాసభ వర్కింగు కమిటీ మెంబరు, 1945. ఆంధ్రమహాసభ వర్కింగ్

కమిటీ మెంబరు, 1946. దేశసేవ, హరిజనసేవ ప్రధానంగా పనిచేస్తున్నారు. అడ్రసు: మదరాసు ఆంధ్ర హరిజనమహాసభ, మోతీలాల్ నెహ్రూ వీథి, త్యాగరాయనగర్, మదరాసు.

రాఘవయ్య, వెన్నెలకంటి; జననం. 1896; ప్లీడరు; 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరి చాలాసార్లు జైలుకు వెళ్ళారు. ఏనాదుల ఉద్ధరణ విషయంలో చాలా కృషి చేశారు. ఆదివాసులైన ఎరుకల, లంబాడీ, కొరవ, యానాది, జాతులకు ఉచితభోజనవసతి గృహాములను స్థాపించారు. రాష్ట్ర వ్యవసాయ కూలిసంఘమును స్థాపించారు. దక్షిణ భారత ఆదివాసి సేవకసంఘ అధ్యక్షులు. ప్రధాన మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి 1946-47; అడ్రసు, నెల్లూరు.

రాజగోపాలాచారి, చక్రవర్తి; జననం, 1879; 1900 లో, సేలంలో అడ్వొకేటుగా ప్రాక్టీసు ఆరంభించి, సహాయ నిరాకరణోద్యమంలో చేరి, ప్రాక్టీసు వదలివేశారు. 1921-22 లో కాంగ్రెసు కార్యదర్శి; చిరకాలం కాంగ్రెసు వర్కింగు కమిటీలో సభ్యులు; 1946 లో మళ్ళీ వర్కింగు కమిటీ సభ్యులుగా నియమింపబడ్డారు. 1930-33, తమిళనాడు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు. 1929 నుంచి అనేకసార్లు జైలుకు వెళ్ళారు. 1937 లో మదరాసు అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడినారు; మదరాసు రాష్ట్ర ప్రధాని, 1937-39; కేంద్ర ప్రభుత్వ పరిశ్రమశాఖా సభ్యులు, 1946 సెప్టెంబరు 2 నుంచి 1947 ఆగస్టు 15 వరకు. పశ్చిమ బెంగాల్ గవర్నర్, 1947 ఆగస్టు 15 నుంచి, 1948 జూన్ 21 వరకు; ఇండియా గవర్నర్-జనరల్, 1948 జూన్ 21 నుంచి; అడ్రసు, న్యూ ఢిల్లీ.

రాజన్, డాక్టర్, టి. ఎస్. ఎస్. జననం, 1880. (నాగపట్టణం) మొదట ఎల్. ఎం. పి. పరీక్షలో ప్యాసయి, బర్మా గవర్నమెంటు సర్వీసులో రంగూన్ జనరల్ హాస్పిటల్లో 1905 లో చేరారు. చేరిన మూడు నెలలకు రాజీనామా పెట్టి, రెండేళ్ళ తరవాత ఇంగ్లండు వెళ్ళి ఎం. ఆర్. సి. ఎస్., ఎల్. ఆర్. సి. పి, పరీక్షలు ప్యాసయి, 1911 లో ఇండియాకు తిరిగివచ్చి, రంగూన్లో ప్రాక్టీసు పెట్టారు. 1914 లో తిరుచినాపల్లికి మారారు. అప్పటినుంచీ,

కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొంటూ, 1920 లో ప్రాక్టీసునుంచి విరమించారు. చాలాసార్లు జైలుకు వెళ్ళారు. 1934 లో కేంద్ర శాసన సభకు ఎన్నుకోబడినారు. 1937 లో మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకోబడినారు. 'ఆరోగ్యం, వైద్యం' గురించి తమిళంలో చాలపుస్తకాలు వ్రాశారు. ఆరోగ్యశాఖా మంత్రి, 1937-39. ఆహారశాఖా మంత్రి 1947 మార్చి నుంచి.

రాజమన్నార్, పాకల వెంకట; జననం, 1901 మే 10; బి. ఏ., బి. ఎల్. మదరాస్ యూనివర్సిటీ. తెలుగులో అనేక నాటికలు వ్రాశారు. 'కళ' పత్రిక సంపాదకులు. మదరాస్ అడ్వొకేట్ జనరల్, 1944-45; హైకోర్టు జడ్జి, 1945 నుంచి; ప్రధాన న్యాయమూర్తి, 1948 జనవరి నుంచి; అడ్రస్: విక్టోరియా క్రిసెంట్, ఎగ్మూరు మదరాస్.

రాజేంద్ర ప్రసాద్, డాక్టర్; జననం, 1884 డిసెంబరు 8; ఎం. ఏ., ఎం. ఎల్., ఎల్. ఎల్. డి. 1920 దాకా ప్లీడరీ ప్రాక్టీసు చేశారు. చాలా సంవత్సరాలు బీహారురాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు. గాంధీజీతో కలసి చంపారణ్యా జిల్లాలో రైతుల స్వాతంత్ర్యానికి పనిచేశారు. కాంగ్రెసు మహాసభ అధ్యక్షులు, 1932, 1934, 1939, 1947; 1942 ఆగస్టు 9 తేదిన అరెస్టుచేయబడి, 1945 జూన్ 15 న విడుదల పొందారు. కేంద్రప్రభుత్వ ఆహార శాఖా సభ్యులు 1946 సెప్టెంబరు 2 నుంచి; ఆహారమంత్రి, 1947 ఆగస్టు 15 నుంచి, 1947 నవంబరు వరకు. రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షులు. అడ్రసు: 1 క్వీన్ విక్టోరియా రోడ్, న్యూఢిల్లి.

రాధాకృష్ణ, డాక్టర్ సర్వేపల్లి; జననం; 1888 సెప్టెంబరు 5. కొంతకాలం మదరాసు ప్రెసిడెన్సి కాలేజిలో వేదాంతాచార్యులు. విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సెలరుగా ఉన్నారు. ఆక్స్ఫర్డు యూనివర్సిటీలో స్పాల్డింగు ప్రొఫెసర్ ఆఫ్ ఈస్టరన్ రెలిజియన్సు, 1936. బ్రిటిషు అకాడెమిలో సభ్యత్వాన్ని పొందిన ప్రథమ భారతీయులు. వేదాంత శాస్త్రంమీద అనేక గ్రంథాలు వ్రాశారు. ఆంధ్రమహాసభ అధ్యక్షులు, 1938. ప్రజాపరిషత్తు సభ్యులు, 1946 నుంచి

అడ్రసు: ఎడ్వర్డ్ ఎలియెట్స్ రోడ్, మైలాపూర్, మదరాసు.

రామకృష్ణరాజు, ఆర్. బి. జననం, 1891 ఫిబ్రవరి 10; 1916 లో బి. ఎల్. పట్టాన్ని పొంది, చిత్తూరులో ప్రాక్టీసు ఆరంభించారు. 1937 లో కాంగ్రెసు అభ్యర్థిగా మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1946 లో మదరాసు కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకోబడినారు. మదరాసు కౌన్సిలు అధ్యక్షులు 1946 ఏప్రిల్ నుంచి.

రామకృష్ణప్రసాద్, శ్రీ రాజా యార్లగడ్డ; చల్లపల్లి రాజాగారి సోదరులు; జననం, 1919 డిసెంబర్ 11; బి. ఏ. ఆనర్స్, బి. ఎల్., మదరాసు; మేనేజింగ్ డైరక్టర్, సారథి ఫిలిమ్సు లిమిటెడ్: మేనేజింగ్ పార్ట్నర్, కె. సి. పి. కన్స్ట్రక్షనరీ కంపెనీ; డైరక్టర్, ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ; డైరక్టర్, కె. సి. పి. లిమిటెడ్; అడ్రసు, 5 వెంకటనారాయణ రోడ్, త్యాగరాయనగర్, మదరాసు.

రామచంద్రరావు, తేకుమళ్ళ; జననం, 1905 అక్టోబర్ 16; ఎం. ఏ., బి. ఎల్., వకీలు (బందరు); ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసంఘ ప్రధాన కార్యదర్శి; కృష్ణా జిల్లా గ్రంథాలయ సంఘ అధ్యక్షులు; ఆంధ్రమహాసభ ప్రధాన కార్యదర్శి, 1942; ఆంధ్రమహాసభ కార్యవర్గ సభ్యులు, 1941 నుంచి; ఆంధ్ర విద్యార్థి మహాసభ ప్రధాన కార్యదర్శి 1927-28; చెన్నపురి ఆంధ్రవిద్యార్థి సంఘ కార్యదర్శి, 1926-27. రచనలు: తృషార్పణము, ప్రణయ చాంచల్యము, వీరయువకులు, (నవలలు) కనక దాసు, (నాటకం) బ్రిటిష్ దేశగ్రంథాలయోద్యమ చరిత్రము, గ్రంథవరణము, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర, (ఇంగ్లీషు) మొదలైనవి.అడ్రసు:మచిలీపట్టణం.

రామచంద్రశాస్త్రి, మారేపల్లి; జననం, 1873 నవంబరు 3; 1888 నుంచీ గ్రంథాలయసేవ చేస్తున్నారు.విశాఖపట్టణంజిల్లా గ్రంథాలయసంఘాధ్యక్షులు;కొంతకాలము ఆంధ్రదేశ గ్రంథాలయసంఘకార్యనిర్వాహకవర్గాధ్యక్షులు; ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకసంఘ కౌన్సిల్ అధ్యక్షులు; విశాఖపట్టణం జిల్లా కాంగ్రెసుసంఘాన్ని స్థాపించి, 1930-32 లో జైలుకు వెళ్ళారు. 1941 లో విశాఖపట్టణంలో జరిగిన ఆంధ్రమహాసభ సన్మానసంఘ ప్రధాన కార్యదర్శి, 1941—42

ఆంధ్రమహాసభ ఉపాధ్యక్షులు. రచనలు: తెనుగు తోబుట్టువులు; నుడికడలి; ధీర హరిశ్చంద్ర ను మొదలైనవి, అడ్రసు: ధర్మాశ్రమం, సీతారామస్వామి కోవెలవీధి, విశాఖపట్టణం.

రామమూర్తి, సర్ కొంతి వెంకట; జననం: 1888 ఆగస్టు 1; 1912 లో ఐ. సి. ఎస్. లో చేరి, మదరాసు రాష్ట్రంలో చాలా జిల్లాలకు కలెక్టరుగానూ, వ్యవసాయశాఖా డైరక్టరుగాను పని చేశారు. గవర్నరుకు అడ్వైజర్, 1942-46; ఛీఫ్ సెక్రటరీ, 1946-47; బొంబాయి ఆక్టింగ్ గవర్నర్, 1947; ఉదయపూర్ దివాన్, 1947-1948; అడ్రసు: గ్రీమ్స్ రోడ్, కెతిడ్రల్.

రామయ్య, రావుబహాదూరు శ్రీపాద; జననం, 1905 డిసెంబరు 11; ఆంధ్రయూనివర్శిటి బి. ఏ., 1928; 1930 లో వ్యాపారంలో ప్రవేశించారు. చాల ప్రముఖ కంపెనీలకు ఏజెంటు; గత యుద్ధ కాలంలో, సైనికులకు వినోదాలను ఏర్పాటుచేసే కమిటీకి కార్యదర్శిగానూ, ఇండియన్ హాస్పిటాలిటీ కమిటీకి కోశాధిపతిగానూ వుండి, సైనికుల కృతజ్ఞత పొందారు. 1945 లో, కాకినాడ మ్యునిసిపల్ కౌన్సిలుకు చైర్మనుగా ఎన్నుకోబడి, 1947 మార్చిలో ఆకౌన్సిలు రద్దు అయేదాకా చైర్మనుగా వున్నారు. 1946 జనవరిలో, ప్రభుత్వం వీరికి రావు బహాదూర్ బిరుదు ఇచ్చింది. అడ్రసు: టెంపుల్ స్ట్రీట్, కాకినాడ.

రామలింగారెడ్డి, డాక్టర్ కట్టమంచి, జననం; 1880; ఇంగ్లండులో విద్యాభ్యాసం; బరోడా కాలేజికి వైస్ ప్రిన్సిపాల్ గాను, మైసూరు మహారాజా కాలేజికి ప్రిన్సిపాలుగాను పనిచేశారు. 1937 లో మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలులో మెంబరు; ప్రస్తుతం ఆంధ్ర యూనివర్సిటి వైస్ ఛాన్సెలరు; గొప్ప వక్త; గొప్ప పండితుడు; విద్యాసంస్కర్త; అడ్రసు, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.

రామస్వామి అయ్యర్, సర్ సి. పి; జననం: నవంబరు 12, 1879; ప్లీడరు వృత్తిలో ప్రవేశం 1903; కాంగ్రెసు కార్యదర్శి 1917-18. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యత్వం, 1920; మదరాసు అడ్వొకేట్ జనరల్ 1920; మదరాసు గవర్నమెంటు లా మెంబరు, 1923-28; కేంద్ర

టేబిల్ కాన్ఫరెన్సుకు ప్రతినిధి, 1930; కేంద్రప్రభుత్వ కామర్సు మెంబరు, 1933; తిరువాన్కూరు దివాన్ 1936 నుండి 1947 సెప్టెంబరు 19 వరకు; బిరుదులు: కె. సి. ఎస్. ఐ., కె. సి. ఐ. ఇ., సి. ఐ. ఇ; అడ్రసు: ది గ్రోవ్, మైలాపూర్, మదరాస్.

రామస్వామి చౌదరి. కల్లూరు; జననం, 1901 ఫిబ్రవరి 4; 1920 నుంచీ గ్రంథాలయోద్యమంలో పని చేస్తున్నారు. చాల సంవత్సరములు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు ఉపాధ్యక్షులుగను, సహాయ కార్యదర్శిగను, గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘమునకు కార్యదర్శిగను వున్నారు. విశాఖ పట్టణంలో జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సభకు అధ్యక్షులు. 1920 నుంచి కాంగ్రెసుతో సంబంధంవుంది. 26 ఏండ్లు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘసభ్యులుగను, 10 ఏళ్లు అఖిలభారత కాంగ్రెసుసంఘ సభ్యులుగను, ఎనిమిదేళ్లు రాష్ట్ర కాంగ్రెసుసంఘ సహాయ కార్యదర్శిగను వున్నారు. అడ్రసు: అమృతలూరు, తెనాలి తాలూకా.

రామస్వామి మొదలియార్, సర్ ఎ; జననం, 1887 అక్టోబరు 14; (సర్ ఎ. లక్ష్మణస్వామి మొదలియారూ, యీయనా కవలలు); మదరాస్ క్రిస్టియన్ కాలేజీలోను, లా కాలేజీలోను చదివారు. మదరాస్ లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరు 1920-26; మదరాస్ మేయరు, 1928-30; కేంద్ర శాసనసభ సభ్యులు, 1931-34; రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకు ప్రతినిధిగా వెళ్లారు. వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు మెంబరు, 1939-42; యునైటెడ్ నేషన్సు ఎకనమిక్ అండ్ సోషల్ కౌన్సిలు అధ్యక్షులు, 1946; ఇండియా పక్షాన అనేక అంతర్జాతీయ సమితిలలో పాల్గొన్నారు. మైసూరు దివాను, 1946 ఆగస్టు నుంచి; అడ్రస్, బెంగుళూరు.

రామారావు, రావుబహదూర్ అవసరాల; జననం, 15 అక్టోబరు 1890; బి. ఏ. 1910; బి. ఎల్. 1912; 1916 నుంచి రాజమండ్రిలో అడ్వొకేటుగా ప్రాక్టీస్ చేస్తున్నారు. తూర్పుగోదావరి పబ్లిక్ ప్రాసిక్యూటర్ 1926-35; రాజమండ్రి బార్ అసోసియేషన్ ప్రెసిడెంటు, 1933-46; జిల్లా స్కౌట్ కమిషనర్ 1926 నుంచి, రాజమండ్రి థియొసాఫికల్ సొసైటీ

ప్రెసిడెంటు, 1925 నుంచి. అడ్రస్ : రాజమండ్రి.

రామారావు, కోటంరాజు; జననం, 1896 నవంబరు 9; బి. ఎ. (మదరాస్); అనేక పత్రికలలో సబ్ - ఎడిటర్‌గా పని చేశారు. వాటిలో ముఖ్యమైనవి; టైమ్స్ ఆఫ్ ఇండియా, పయొనిర్; లీడర్. న్యూస్ ఎడిటర్‌గా ఇండియన్ డెయిలీ మెయిల్, పీపుల్, హిందూస్తాన్ టైమ్సు పత్రికలలో; ఎడిటర్, ఫ్రీ ప్రెస్ జర్నల్, స్వరాజ్య, ఫ్రీ ఇండియా. డాన్, నేషనల్ హెరాల్డ్. 1945 లో గాంధిజీతోవుండి. అనేక ప్రధాన పత్రికలకు విలేఖరిగా వున్నారు. చాలా పత్రికలకు స్వతంత్ర రచనలు పంపుతున్నారు. పత్రికా రచయితల సమస్యలపట్ల అభిమానం హెచ్చు. పత్రికా రచన తప్ప ఇతర విషయాలపట్ల శ్రద్ధ తీసుకోరు. ఉపన్యాసాలివ్వడమంటె విరికికట్టరు. అడ్రస్ : ఇండియన్ నేషన్, పాట్నా.

రామేశం, సర్ వేపా; జననం, 1875 జులై 27; బి. ఎ. బి. ఎల్. (మదరాసు); 1892 లో బి. ఏ. లో యూనివర్సిటికల్లా అత్యధికంగా మార్కులు సంపాదించారు. 1895 లో బి. ఎల్. లో ఫస్టు క్లాసులో ప్యాసయారు. 1896 లో హైకోర్టు వకీలుగా ప్రాక్టీసు ప్రారంభించారు. 1916-20 లలో గవర్నమెంటు ప్లీడరు. 1920 నవంబరునుంచి 1935 జులై వరకు హైకోర్టుజడ్జి. 1936-38 లలో రిజర్వుబ్యాంకి మదరాసు బోర్డులో మెంబరు. ఇండియన్ స్కూల్ ఆఫ్ మెడిసిన్ బోర్డు మెంబరు. 1935-48; మదరాసు యూనివర్సిటి ఫెలో 1915-18; 1918-1926; 1936-1939. ఆహార విషయములు, సంతాననిరోధములను గురించి ఉపన్యాసములను, వ్యాసములను వ్రాసి చాలా ప్రచారం చేశారు. అడ్రసు: 10 ఎడ్వర్డ్ ఎలియట్స్ రోడ్, మైలాపూరు, మదరాసు.

రుక్మిణి లక్ష్మీపతి, ఆచంట; జననం, 1891; బి. ఏ. మదరాసు యూనివర్సిటి, డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారి సతి; 1935 లో, కాంగ్రెసు అభ్యర్థిగా మదరాసు కౌన్సిలుకు ఎన్నుకోబడినారు. 1937 లో అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. అసెంబ్లి డిప్యూటీ స్పీకరు, 1937-39; 1947 లో మళ్ళీ అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడి

నారు; ఆరోగ్యశాఖామంత్రి 1946-47. అడ్రసు: 43 హారిస్ రోడ్, మౌంట్‌రోడ్, మదరాస్.

రెడ్డి, బి. ఎన్. (బొమ్మిరెడ్డి నరసింహారెడ్డి) జననం, 1908 నవంబరు 16, కడపజిల్లా పులివెందల తాలూకా కొత్తపల్లిలో; బి. ఎ., 1935; విద్యార్థిగా వున్నప్పటి నుంచీ, నాట్యకళపట్ల అభిమానంతో, చాలా నాటకాలలో పాల్గొన్నారు. 1937 లో ఫిలింపరిశ్రమలో ప్రవేశించి, హెచ్. ఎం. రెడ్డిగారితో కలసి రోహిణీ పిక్చర్సును స్థాపించి, జాయింటు ప్రొడ్యూసరుగా గృహలక్ష్మి నిర్మాణంలో పాల్గొన్నారు. 1938 లో వాహిని పిక్చర్సును స్థాపించి, అప్పటినుంచీ ఆ కంపెనీకి మేనేజింగ్ డైరక్టర్‌గా వున్నారు. వీరు డైరక్టుచేసిన చిత్రాలు: వందేమాతరం, సుమంగళి, దేవత, స్వర్గసీమ. సాహిత్యమంటే వీరికి అభిమానం. అడ్రసు: 16 విజయ రాఘవాచారి రోడ్, త్యాగరాయ నగర్, మదరాసు.

లచ్చన్న, గౌతు. జననం, 16 ఆగస్టు 1909 (బారువలో); 1930 ఉప్పుసత్యాగ్రహం నుంచీ కాంగ్రెసుఉద్యమాలలో పాల్గొని, అనేకసార్లు జైళ్లకు వెళ్ళారు. ఆచార్యరంగాగారి నాయకత్వాన, 1933 రైతు రక్షణ యాత్రలో పాల్గొన్నారు. 1937 లో ఇచ్ఛాపురంలో రైతాంగ విద్యాలయాన్ని నిర్వహించారు. 1940 లో పలాసాలో జరిగిన అఖిలభారత కిసాన్ కాంగ్రెసుకు ఆహ్వానసంఘానికి కార్యదర్శి; 1940 లో ప్రభుత్వపు నిర్బంధపు ఉత్తరువును ఉల్లంఘించి, కనపడకుండా, కాంగ్రెసు ఉద్యమం సాగించుతూ, 1942లో పట్టుబడి, ఏడాది శిక్షబడ్డారు. తరువాత 1945 వరకు నిర్బంధంలో వుంచబడినారు. పలాసాలో 1947 లో కాంగ్రెసు సేవాదళ ఆఫీసర్ల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. ఇండియన్ ట్రేడ్ యూనియన్ ఆంధ్రశాఖకు అధ్యక్షులు; 1948 జూలైలో మదరాసు శాసనసభకు సభ్యులుగా, విశాఖ గోదావరి జిల్లాల కార్మిక నియోజకవర్గం తరఫున ఎన్నుకోబడినారు. 1931 నుంచి జిల్లా కాంగ్రెసు సభ్యులు; 1935 నుంచి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యులు: ఉత్తరవిశాఖజిల్లా కిసాన్ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1935-37; ఉత్తరవిశాఖజిల్లా కాంగ్రెసు

ప్రధాన కార్యదర్శి, 1937-38; 1939-40; అఖిల భారత కాంగ్రెసు సంఘసభ్యులు, 1939-40; 1948 నుంచి; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ సహాయ కార్యదర్శి, 1946 మే నుంచి; అడ్రసు: బారువ.

లక్ష్మణస్వామి ముదలియార్ సర్. ఎ. జననం, 1887 అక్టోబరు 14; మదరాసు క్రిస్టియన్ కాలేజి లోను, మెడికల్ కాలేజిలోను విద్యాభ్యాసం; ప్రసూతివైద్య నిపుణులు; స్త్రీల ఆస్పత్రి సూపరింటెండెంటు, 1934-42; మదరాసు మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్, 1930-42; మదరాసు యూనివర్శిటీ వైస్‌ఛాన్సెలర్, 1942 నుంచి; మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1946 నుంచి; సర్ బిరుదు 1945 లో పొందారు. అడ్రసు: 'కెన్సింగ్టన్,' పూనమల్లి హైరోడ్, కీల్పాక్, మదరాసు.

లక్ష్మీనారాయణ, వున్నవ. జననం, 1877 డిసెంబర్ 4; బారిస్టర్ (డబ్లిన్) 1902 లో గుంటూరులో వీరున్నూ, వీరి సతీమణిన్నీ వితంతు శరణాలయాన్ని స్థాపించి, 30 వితంతు వివాహాలు చేశారు. 1921 లో జాతీయోద్యమంలో ప్రముఖపాత్ర వహించారు. ఆంధ్ర దేశంలో అటవీ సత్యాగ్రహాన్ని జయప్రదంగా నడిపారు. 1930 లో ఏర్పడిన ఆంధ్రరాష్ట్ర నియంతలలో ఒకరు. వీరితోపాటు, వీరిసతి శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు కూడా దేశ సేవకు తమ జీవితాన్ని అంకితం చేశారు. 1921, 1930, 1942 లలో యీ దంపతులు జైలుకు వెళ్ళారు. 1922 లో వీరు గుంటూరులో శారదానికేతాన్ని స్థాపించి నిర్వహిస్తున్నారు. ఆంధ్రోద్యమము ను ప్రారంభించినవారిలో లక్ష్మీనారాయణగారొకరు. వీరి రచనలలో ముఖ్యమైనవి : మాలపల్లి, నాయకురాలు, తిక్కన, భావతరంగాలు. సంగీత నాపసాని. అడ్రసు: బ్రాడీ పేట, గుంటూరు.

లక్ష్మీనారాయణస్వామి, మూలా. జననం 7 జులై 1911, తాడిపత్రిలో. విద్యాభ్యాసం తాడిపత్రిలోనే. 1932 లో మెజారిటీ రాగానే తండ్రి వ్యాపారం డిస్టిలరీ తీసుకొని నడప నారంభించారు. ఆతర్వాత గుత్తి, కడప, తాడిపత్రులలో ఆయిల్ ఎక్స్‌పెల్లర్లు పెట్టారు. అనంతపురంలో ప్రెస్ పెట్టారు, 1937 లో రోహిణీ పిక్చర్సులో భాగస్వామిగా చేరారు. కడియంలో ఏ. వి. రెడ్డి

గారితో కలిసి ఇండియా ఫ్రూట్స్ లిమిటెడ్ పెట్టారు. స్వర్గసీమ యోగి వేమన తీసిన వాహినీ ప్రొడక్షన్స్‌లో భాగస్వామి. 15 లక్షలు పెట్టి వాహినీ స్టుడియోస్ కట్టించారు. ఉత్తమ చిత్రాలు తీయించాలని వీరి ఆశయం.

వరదరావు, జి. రాజమండ్రిలో ప్రసిద్ధ కాంగ్రెస్ వాదులలో ఒకరు; ప్రజాసంస్థలకు చాలా వాటికి విరాళాలిచ్చి, అభివృద్ధిలోకి తెచ్చారు. మోడరన్ హిందూహోటల్ యజమాని; రెండుసార్లు కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీలేకుండా మ్యునిసిపల్ కౌన్సిలుకు ఎన్నుకోబడినారు. అడ్రస్: రాజమండ్రి.

విజయ ఆనంద్, డాక్టర్; విజయనగరం మహారాజకుమార్; కాశీ జమీందారీల యజమాని; జననం: 1905 డిసెంబర్ 28; విజయనగర సంస్థాన రాజవంశీకులు; క్రికెట్ ఆటలో నేర్పరి; 1936 లో ఇంగ్లండుకు వెళ్ళిన భారతీయ క్రికెట్ జట్టు నాయకులు; యు. పి. శాసనసభ సభ్యులు, 1934-36; 1937-46; కేంద్రశాసనసభ సభ్యులు, 1945-47; ఆంధ్రమహాసభాధ్యక్షులు, 1941-46; సర్ బిరుదును 1947 లో త్యజించారు; అఖిల భారత క్షత్రియమహాసభ అధ్యక్షులు, 1944; అడ్రసు: బెనారెస్.

విజయలక్ష్మి పండిట్ శ్రీమతి; జననం, 1900 ఆగస్టు 18; రంజిత్ సీతారాం పండిట్‌తో వివాహం, 1921; యు. పి. అసెంబ్లీ సభ్యురాలు 1937; యు. పి. ఆరోగ్య శాఖామంత్రి 1937-39; అఖిల భారత మహిళాసభ అధ్యక్షురాలు 1940-42; కాంగ్రెసు ఉద్యమంలో మూడుసార్లు జైలుకు వెళ్ళారు. యు. పి. ఆరోగ్య శాఖా మంత్రి 1946-47; రష్యాలో భారతదేశపు రాయబారి, 1947-1949; అమెరికాలో ఇండియారాయబారి, 1949 నుంచి.

విశ్వనాథ్, డాక్టర్ భార్గవతుల: జనవరి, 1889; జనవరి 1; 1934 వరకు ప్రధాన వ్యవసాయ రసాయనశాస్త్రి, కోయంబత్తూరు. ఇంపీరియల్ అగ్రికల్చరల్ రిసర్చి ఇన్స్టిట్యూట్ డైరెక్టరు 1934-44; మదరాస్ రాష్ట్ర వ్యవసాయ శాఖ డైరెక్టరు, 1944-47; బెనారెస్ వ్యవసాయ కాలేజి ప్రిన్సిపాల్ 1947,48; అడ్రస్: 15 కాల్విన్ రోడ్, సివిల్ లైన్సు, అలహాబాదు.

విశ్వనాథం, తెన్నేటి; జననం, 1896; బి. ఎల్, త్రివేండ్రం;

విశాఖపట్టణంజిల్లా కాంగ్రెసు కమిటీకి చిరకాలం అధ్యక్షులు; 1937 లో మదరాసు అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. ప్రభుత్వ పార్లమెంటరీ సెక్రటరీ, 1937-39; 1946 లో మళ్ళీ అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. ఛీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ, 1946-47; మునిసిపల్ ఛైర్మన్, విశాఖపట్టణం, 1947 నుంచి. అడ్రసు : విశాఖపట్టణం.

వీరభద్రరావు, డాక్టర్ అయ్యగారి; జననం; 1908 ఆగస్టు 4: ఆంధ్ర యూనివర్సిటీ బి. ఏ, 1927; మదరాసు యూనివర్సిటీ, ఎం. ఎ. 1929. 1931-33 లో మదరాసు యూనివర్సిటీ లోనూ, 1933-37లో ఆంధ్రయూనివర్సిటీ లోనూ రిసెర్చిచేశారు. 1935 లో ఆంధ్రయూనివర్సిటీ మొట్టమొదటి పి. హెచ్. డి. (డాక్టొరేట్)ను పొందారు. 1938లో ఆల్ ఇండియా రేడియోలో చేరారు ప్రస్తుతం విజయవాడలో స్టేషన్ డైరెక్టర్ గా వున్నారు. నాటకాలు, కవిత్వం అంటె వీరికి అభిమానం. సుమారు 80 నాటకాలు వ్రాసి, బ్రాడ్ కాస్టు చేశారు. చాలా నాటకాలలో పాత్రలను నిర్వహించారు, నాట్యకళాభివృద్ధికి కృషి చేస్తున్నారు. అడ్రసు, ఆల్ ఇండియా రేడియో, విజయవాడ.

వీరరాఘవరావు, పింగళి; జననం: జూలై 1906. (కవుతరం); విద్యాభ్యాసం, బందరు, హైదరాబాదు. 1926 లో ఓ. ఎస్. సి. లో ప్రథమ శ్రేణిలో వుత్తీర్ణులైనారు. 1927 నుంచి 1935 వరకు మదరాస్ అకౌంటెంటు జనరల్ ఆఫీసులోను, 1935 నుంచి 1942 వరకు ఒరిస్సా కంట్రోలరు, ఒరిస్సా సెక్రేటేరియటులోను పనిచేసి, 1943 లో ఇండియన్ ఆడిట్, అకౌంట్సు సర్వీసుకు ప్రమోషను పొందారు. ఇండియా గవర్నమెంట్ సప్లయి శాఖలో కాస్ట్ అకౌంట్సు ఆఫీసరు, 1943-45; 1946 నుంచి, ఇండియన్ టారిఫ్ బోర్డులో కాస్ట్ అకౌంట్సు ఆఫీసరు. అకౌంట్సుశాఖలో ఉన్నతోద్యోగము పొందిన బహు కొద్ది మంది ఆంధ్రులలో వీరొకరు. అడ్రస్: కేరాఫ్ ఇండియన్ టారిఫ్ బోర్డు, బొంబాయి.

వెంకట కృష్ణమాచార్యులు, పీతాంబరం; జననం, 1907 సెప్టెంబరు 1; 1922 నుంచీ గ్రంథాలయ సేవచేస్తున్నారు. గౌరవ కార్యదర్శి శ్రీ వెంకటేశ్వర విలాస పుస్తక భాండాగారము; ప్రధాన

కార్యదర్శి, విశాఖపట్టణం జిల్లా గ్రంథాలయ సంఘము; గ్రంథ భాండారి, శారదా గ్రంథాలయము, అనకాపల్లి; ఖాదీ ఉద్యమములోను, ఆయుర్వేద ప్రచారంలోను కృషిచేస్తున్నారు. కాంగ్రెసులోను, కవితా సమితిలోను, ఆయుర్వేద మండలులలోను సభ్యులు. రచనలు: ప్రణవార్థము బదరికాశ్రమయాత్ర మొదలైనవి. అడ్రసు: శారదా గ్రంథాలయం, అనకాపల్లి.

వెంకటచలం, వారణాసి; జననం 1906 మార్చి 6; 1930, 1931, 1932 లలో మొత్తం మూడు సంవత్సరాలు, సత్యాగ్రహోద్యమంలో జైలుకు వెళ్ళారు. 1935 నుంచీ ఇన్సూరెన్సు వ్యాపారంలో వున్నారు. 1944 నుంచీ, ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ మదరాసు బ్రాంచి మేనేజరుగా వున్నారు. అడ్రసు: ఆంధ్ర ఇన్సూరెన్సు బిల్డింగ్సు, తంబుచెట్టివీధి, జార్జిటౌను, మదరాసు.

వెంకటప్ప, రామచంద్రుని; జననం, 1903 మే 24 (టంగుటూరులో); 1921 లో సహాయ నిరాకరణోద్యమంలోచేరి చదువు మాని వేశారు. వంశపారంపర్య వచ్చిన గ్రామకరణం ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు. 1921లో ఆరు నెలలు, 1932 నుంచి అయిదేళ్లు, 1941 లో రెండున్నరేళ్లు, 1942 లో రెండేళ్లు జైలుకు వెళ్ళారు. 1923-25లో కాకినాడ తాలూకా కాంగ్రెసు ప్రచారకులు; 1938 అంతంవరకు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సంచార కార్యదర్శి; 1939-41, ఆంధ్రమహాసభ స్థాయిసంఘమునకు ఆర్గనైజరు; 1927-28, చెన్నపురి నీలు సత్యాగ్రహసంఘ కార్యదర్శి; 1930, చొల్లంగి ఉప్పు సత్యాగ్రహ శిబిరాధిపతి; 1925-30, కాంగ్రెసు వారపత్రిక నిర్వహణలో పాల్గొన్నారు; 1940 లో మైలాపూరు తెలుగు పాఠశాల కార్యదర్శి; 'చెన్నపట్టణం తెలుగు పట్నం'అనే పుస్తకం వ్రాశారు; ప్రస్తుతం గృహలక్ష్మి పత్రిక వ్రాతసంపాదకులు; అడ్రసు, కేసరికుటీరం, రాయపేట. మదరాస్.

వెంకటప్పయ్యపంతులు, కొండా; జననం. 1866 ఫిబ్రవరి 17; బి. ఏ; మదరాస్; 1915 లో వకీలు వృత్తి మానివేసి, ఆంధ్రోద్యమంలో ప్రవేశించారు. ఆంధ్ర రాష్ట్రోద్యమానికి పితామహులు; అఖిల భారత కాంగ్రెసు మహాసభ ఆక్టింగు ప్రెసి

డెంట్, 1923; గుంటూరుజిల్లా సత్యాగ్రహోద్యమానికి పట్టుకొమ్మగా, 1923 లో పన్నులు చెల్లించకూడదనే ఉద్యమానికి ప్రోద్బలం యిచ్చారు. చాలా సార్లు జైలుకు వెళ్లారు. 1919 లో మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలుకుఎన్నుకోబడినారు. కాని కాంగ్రెసు ఆదేశానుసారంగా 1920 లో ఆ స్థానానికి రాజీనామా యిచ్చారు. 1937 లో మదరాస్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. అడ్రసు: బ్రాడీపేట, గుంటూరు.

వెంకటరమణయ్య, వంగల; జననం, 1902 డిసెంబరు 6; స్వరాజ్య పత్రికా కార్యాలయం లో 11 సంవత్సరాలు పనిచేశారు; 1934 లో ఆంధ్ర బ్యాంకిలో చేరారు; 1945-1948 లో మదరాస్ లోని, ఆంధ్రబ్యాంకి బ్రాంచి ఏజెంటు. ప్రస్తుతం. కాకినాడ బ్రాంచి ఏజెంటు, అడ్రసు: ఆంధ్ర బ్యాంక్, కాకినాడ.

వెంకటరావు, కళా; జననం, 1900 జులై 7; బి.ఏ. చదువుతూ, 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరి, చదువుమానేశారు. 1922లో ఒక సంవత్సరమూ, 1930 లో ఒక సంవత్సరమూ. 1932 లో ఆరు నెలలూ శిక్షపడ్డారు. 1937 లో మదరాస్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. 1942 లో అరెస్టయి, 1945 లో విడుదల అయారు. 1946 లో మదరాస్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. రెవిన్యూశాఖామంత్రి, 1947 మార్చినుంచి 1949 జనవరి. అప్పటినుంచీ అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి. అడ్రస్, ఎ. ఐ. సి. సి. ఆఫీసు, సబ్జిమండి, న్యూఢిల్లీ.

వెంకటరావు, శిష్టా; జననం, 1902 సెప్టెంబర్ 2; అడ్వర్టయిజింగ్ కళనుగురించి బొంబాయిలో చాలాకాలము కృషిచేసి శిష్టాస్ సేల్స్ అండ్ పబ్లిసిటీ సర్విస్ అనే పేరుతో అడ్వర్టయిజింగ్ కంపెనీని బొంబాయిలో 1934 లో స్థాపించారు. దీనినే, 19.9 లో అడార్ట్స లిమిటెడ్ అనే పేరుతోను, ఇటీవల శిష్టాస్ లిమిటెడ్ అనే పేరుతోను లిమిటెడ్ కంపెనీగా మార్చి జయప్రదంగా నిర్వహిస్తున్నారు. బొంబాయిలో, ఆంధ్రులకు అవసరమైన సహాయం చేసేవారిలో ప్రముఖులు; డైరెక్టర్, అడార్ట్స (కలకత్తా) లిమిటెడ్, ఆడ్ సైట్స లిమిటెడ్ బొంబాయి.

మెక్లెక్ న్యూట్రిమెంట్స్ అండ్ ఫార్మస్యూటికల్స్ లిమిటెడ్, మదరాస్; ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్, మచిలీపట్టణం. అడ్రస్, అరుణోదయ, నాపూ పార్క్, మతుంగా, బొంబాయి.

వెంకటరెడ్డి కె. (కె. వి. రెడ్డి) జననం 1-7-1912 తాడిపత్రిలో. ప్రెసిడెన్సీ కాలేజీలో 1935 సంవత్సరం బి. యస్. సి. (ఫిజిక్సు) ఆనర్సు డిగ్రీపొందారు. 1936 లో ఒక స్నేహితుడితో కలిసి దిస్టాండర్డు సైంటిఫిక్ ఇన్స్ట్రుమెంట్సు కంపెనీ పెట్టారు. 1938 లో రోహిణివారి గృహలక్ష్మి ప్రొడక్షన్లో అక్కౌంటెంట్ గా పని చేశారు. 1938 లో వాహినిలో భాగస్వామిగాచేరి వందేమాతరమ్, సుమంగలి, 'దేవత' లో ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ గా పనిచేశారు. భక్త పోతన యోగి వేమన డైరెక్టు చేశారు. ప్రస్తుతం 'గుణసుందరి' అను జానపద చిత్రం వాహినీ స్టుడియోసుకు గాను డైరెక్టు చేస్తున్నారు.

వెంకటశాస్త్రి, చెళ్లపిళ్ల; జననం, 1870 (ఏనాం లో); ప్రస్తుత నివాసం తూర్పుగోదావరి జిల్లా కడియం; వీరున్నూ శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారున్నూ కలసి తిరుపతి వెంకటేశ్వరులు అనే పేరుతో అనేక కావ్యాలు, నాటకాలు రచించారు. ఆంధ్రదేశం అంతా పర్యటనంచేసి, శతావధానాలు అనేకం జరిపారు. వీరు రచించి, అత్యంత ప్రజాదరణ పొందిన గ్రంథాలలో ముఖ్యమైనవి: పాండవ జననం, పాండవోద్యోగం, అశ్వమేధం, రాజసూయం, పాండవ విజయం, ముద్రారాక్షసం, మృచ్ఛకటికం, ప్రభావతీ ప్రద్యుమ్నం, బుద్ధచరిత్ర, దేవీభాగవతం, గీరతం, గుంటూరుసీమ, నానారాజ సందర్శనం, శనిగ్రహం. 1949 మార్చి నుంచి అయిదు సంవత్సరాల పరిమితికి మదరాస్ ప్రభుత్వ ఆస్థాన కవిగా ఎన్నుకోబడినారు. శతావధాని, కళాప్రపూర్ణ బిరుదాంకితులు.

వెంకట శేషయ్య, నీలంరాజు; జననం 1905 డిసెంబరు 22; 1928 లో పత్రికారచనలో ప్రవేశించారు; మొదట్లో స్వరాజ్య పత్రికలో; 1924 నుంచీ ఆంధ్రపత్రికలో రిపోర్టరుగాను, సహాయ సంపాదకుడుగాను, 1945 వరకు పని చేశారు. 1946 జనవరిలో స్వయంగా 'నవోదయ' అనే వారపత్రి

కను తమ సంపాదకత్వాన స్థాపించారు; నాట్యకళాభిమాని; 1933 మొదలు 1935 వరకు నాట్యకళా పరిషత్తుకు కార్యదర్శి. 'నాట్యకళ' అనే పత్రికకు కొంతకాలం సంపాదకులు; "ఉషాపరిణయం" అనే చిత్రంలో నటించారు; మదరాసు నగర జర్నలిస్టుల సంఘాధ్యక్షులు 1944 డిసెంబరు నుంచి; ఆంధ్రరాష్ట్ర పత్రికా రచయితల సంఘ కార్యదర్శి, 1946 జనవరి నుంచి; మదరాస్ ఫిలిం సెన్సారు బోర్డు సభ్యులు 1947; ప్రతిభా పబ్లిషర్సు అనే సంస్థను స్థాపించారు. అడ్రస్: నవోదయ ఆఫీస్, అప్పారావు గార్డెన్సు, 84, సైడెన్ హామ్స్ రోడ్, వేపేరి, మదరాస్.

వెంకటస్వామినాయుడు, ద్వారం; జననం, 1893; ప్రసిద్ధాంధ్ర ఫిడేలుగాయకులు. విజయనగరం సంగీత కళాశాల ప్రిన్సిపాల్; 1924 లో 'గాంధర్వవిద్యాభూషణ' బిరుదునూ, 1929 లో 'గానకళా విశారద' బిరుదాన్ని పొందారు. 1935 లో జయపురం మహారాజా గారి కనక కంకణాన్ని పొందారు. తిరువాన్కూరు, మైసూరు మహారాజుల మన్ననలను పొందారు. 1949 మార్చి 26 న మదరాసులో పౌరప్రముఖులచే సన్మానింపబడినారు. అడ్రసు, విజయనగరం.

వెంకట హనుమంతరావు, చావలి; జననం, 1906 మే 10; బి. ఎ. (రాజమండ్రి) 1925; ఎం. ఎ, 1928; బి. ఇడి. 1931; తూర్పు గోదావరి జిల్లాబోర్డులో టీచరుగా 1931-34 లో పని చేశారు. ఎడిటర్, ఇండియన్ నేషన్ (పాట్నా) 1935-1944; డెయిలీ హెరాల్డ్ (లాహోర్) 1944 మార్చి 1946 మార్చి; మదరాస్ ప్రభుత్వ ప్రచురణ శాఖ డైరక్టరు 1946-1948; ఇండియన్ రిపబ్లిక్ ఎడిటర్, 1949 జనవరి నుంచి; రచనలు: ఇండియాస్ కేస్ ఫర్ ఫ్రీడం, గవర్నమెంట్ ఆఫ్ ఇండియాస్ ఇండస్ట్రియల్ పాలిసీ, సివిల్ డిసొబీడియన్స్ మూవ్‌మెంట్స్ ఇన్ ఇండియా (ఇంగ్లీషు); అనేక పత్రికలకు ప్రత్యేక విలేఖరి, అడ్రస్, ఇండియన్ రిపబ్లిక్, మౌంట్ రోడ్, మదరాసు.

వెంకటేశ్వరరావు, నార్ల; జననం 1908 డిసెంబరు 1; బి. ఏ., (బందరు) 1934; విద్యార్థిగా వుండగానే కృష్ణా పత్రికలో పని చేస్తూ వుండేవారు. 1935 లో స్వరాజ్య పత్రికలో పనిచేశారు;

జనవాణి సబ్-ఎడిటర్, 1936-37; ప్రజామిత్ర అసిస్టెంట్ ఎడిటర్, 1937-38; ఆంధ్రప్రభ న్యూస్ ఎడిటర్, 1938-42; ఆంధ్రప్రభ ఎడిటర్, 1942 నుంచి; స్వదేశ సంస్థానాలు, నేటి రష్యా, రష్యన్ కథలు, ఆస్ట్రియా ఆక్రమణ, చెక్ రాజ్యవిచ్ఛేదం, పాలస్తీనా మొదలైన రాజకీయ గ్రంథ రచయిత; ఇటీవల నాటక రచనలో ఎక్కువ కృషిచేస్తున్నారు. "కొత్తగడ్డ" అనే పేరుతో కొన్ని ఏకాంక నాటికలను ప్రకటించారు. ఆంధ్ర రాష్ట్రపత్రికా రచయితల సంఘ అధ్యక్షుడు, 1945-48; మదరాసు ఫిలింసెన్సార్స్ బోర్డు సభ్యులు, 1948 49; అడ్రస్: ఆంధ్రప్రభ, మౌంట్ రోడ్, మదరాస్.

వెంకటేశ్వరశాస్త్రులు, వావిళ్ల. జన్మస్థానం, నెల్లూరుజిల్లా అల్లూరు. చెన్నపట్టణంలో ఎఫ్. ఎ. ప్యాసయినారు. చదువు మానినప్పటినుంచి వీరితండ్రిగారు స్థాపించిన వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు అను గ్రంథప్రకటన వ్యాపారమును వృద్ధిచేయుటలోను, ప్రజోపయోగ సంస్థలలోచేరి వాటికి సహాయము చేయుటలోను నిమగ్నులై వున్నారు. భాషాభివృద్ధికి వీరు చేసిన గొప్ప సేవకు కృతజ్ఞతగా, వీరికి ఆంధ్ర ప్రజా నాయకులు 'భాషోద్ధారక' అనే బిరుదును ఇచ్చారు. అడ్రస్: 490 తిరువత్తియూర్ హైరోడ్, చాకలపేట, మదరాస్—21.

వేంకటకృష్ణరావు, భావరాజు; జననం 1896 జులై 1; బి. ఏ. పచ్చయప్ప కాలేజి; బి. ఎల్. మదరాసు లా కాలేజి, ఫస్టుక్లాసులో ప్యాసయారు. ఎం. ఏ. ఆంధ్ర యూనివర్సిటీ. 1920 లో రాజమండ్రిలో లాయరు ప్రాక్టీసు ప్రారంభం. పేరుపొందిన చారిత్రక పరిశోధకులలో ఒకరు; 1921 డిశెంబరులో రాజమహేంద్రవరములో ఆంధ్ర ఇతిహాస పరిశోధక మండలిని స్థాపించిన వారిలో ముఖ్యులు. ఇంగ్లీషు భాషలో, 'ఎ హిస్టరీ ఆఫ్ ది ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ' అను పేరుతో ఆంధ్రదేశ చరిత్రలో ఒకభాగము (క్రీ. శ. 200 మొదలు 625 వరకు) రచించారు. దీనికే ఆంధ్ర యూనివర్సిటీవారు వీరికి ఎం. ఎ. డిగ్రీని ఇచ్చారు. మదరాసు హిందూ ధర్మాదాయముల బోర్డు కమిషనరు 1944-48 అడ్రసు 42, మౌబ్రేస్ రోడ్, తేనాంపేట, మదరాసు.

శర్మ, (టి. వి. ఎస్.) తంగిరాల వెంకట సుబ్బయ్య; జననం 1909 డిసెంబరు 31; బందరు జాతీయ కళాశాలలోను, బొంబాయి స్కూల్ ఆఫ్ ఆర్ట్సులోను చిత్రలేఖనాన్ని నేర్చుకుని, బాబూరావు పెయింటక్, హుసేన్ బక్ష్, గంగ నాయక్ దాదా అర్లేకర్ మొదలైనవారి వద్ద కృషిచేశారు. ప్రస్తుతం శోభనాచల స్టూడియోస్‌కు ఆర్ట్ డైరెక్టర్: వీరి ఆర్ట్ డైరెక్షనుతో ఇప్పటికి 32 చిత్రాలు వెలువడ్డాయి. అడ్రసు: శోభనాచల స్టూడియోస్, ఆళ్వార్‌పేట, మైలాపూర్, మదరాస్.

శంభుప్రసాద్, శివలెంక; జననం 1911 జనవరి 25; 1923-27 లో బందరు జాతీయకళాశాల, 1928-29 లో అడయారు థియోసాఫికల్ హైస్కూల్, 1930-32 లో శాంతినికేతనంలో చదివారు. 1932-35 లో ఆంధ్రపత్రికలో సంపాదకీయ శాఖలో పని నేర్చుకున్నారు. 1935-38 లలో ఆంధ్రవారపత్రికను నిర్వహించారు. 1938 లో వీరి మేనమామ, మామగారు అయిన, శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి మరణానంతరం, ఆంధ్రపత్రిక, ఆంధ్ర వారపత్రిక, భారతిలకు సంపాదకులై, వాటిని నిర్వహిస్తున్నారు. అఖిలభారత పత్రికా సంపాదకుల స్థాయీసంఘ సభ్యులు 1942-43, 1947-43; అడ్రసు: ఆంధ్రపత్రిక ఆఫీసు, 7, తంబుశెట్టివీథి, జి. టి, మదరాసు.

శివరామకృష్ణయ్య, మద్దూరి; (49 ఏండ్లు) రాజమండ్రి వీరేశలింగ పాఠశాలలో ఉపాధ్యాయ పదవికి 1921 లో రాజీనామా నిచ్చి, కాంగ్రెసు ప్రచారము సాగించారు. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమములలో పాల్గొన్నారు. 1927 నుండి, ప్లీడరుగా ప్రాక్టీసు ప్రారంభించి, దేశసేవకులకు ఎక్కువగా సహాయ పడ్డారు. తూర్పు గోదావరి జిల్లాలోని ప్రధాన కాంగ్రెసు సహాయకులలో ఒకరు. అడ్రసు, ఇన్నీసుపేట, రాజమండ్రి.

శివషణ్ముగం పిళ్ళై, జె. జననం, 1901 ఫిబ్రవరి, 24; (హరిజన్); ఎం. ఏ., మదరాసు యూనివర్శిటీ; మదరాసు కార్పొరేషన్ సభ్యులు, 1932-35; 1936-37: మదరాసు మేయరు, 1937; మదరాసు అసెంబ్లీసభ్యులు, 1937-39; మళ్ళీ మదరాసు అసెంబ్లీకి 1946 లో ఎన్నుకొన బడినారు; మద

రాసు అసెంబ్లీ స్పీకరు. 1946 నుంచి; అడ్రసు; మేయరు శివ షణ్ముగంపిళ్ళై వీధి, సుంగంబాకం, మదరాసు, 6.

శేషగిరిరావు, డాక్టర్ శిష్ట్లా. జననం; 1907 అక్టోబర్ 5; 1924 వరకు పచ్చయప్ప కాలేజీలో చదివి, తరువాత స్కూల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్‌లో చదివి, 1928 లో ఎల్. ఐ. ఎం. డిప్లొమా తీసుకున్నారు. 1928 లో కేసరి కుటీరం మేనేజరుగా చేరారు. చాల పత్రికలలో, వైద్యసలహాలను ప్రచురిస్తూ వుంటారు. "నమ్మ, నమ్మకపో" అనే వీరి సలహాలు, దైనందిన జీవితంలో, ఆరోగ్య సూత్రాలుగా చాలా ఉపకరిస్తవి. అడ్రసు: కేసరికుటీరం, రాయపేట; మదరాసు.

శ్రీధరరావు, ఇరువంటి; జననం, 15 మే 1915; బి. ఎస్. సి. ఇంజనీరింగ్ (బెనారెస్), 1938; ఎ. ఎం. ఐ. ఇ., ఛార్టర్డ్ ఇంజనీర్, 1947; క్రాంప్టన్ ఇంజనీరింగ్ కంపెనీలో అసిస్టెంట్ వర్క్స్ మేనేజరుగాను, ధనబాద్ బొగ్గు గనులలో అసిస్టెంట్ ఇంజనీర్‌గాను, మధుర మీనాక్షి మిల్స్‌లో ఛీఫ్ ఇంజనీర్‌గాను, తిరుపతి దేవస్థానంలో ఎలక్ట్రికల్ ఇంజనీర్‌గా పనిచేసి, మదరాసులో కుర్ట్జ్ అండ్ రావ్ (ఇంజనీర్స్) కంపెనీలో భాగస్తులుగా ఆ కంపెనీని స్థాపించారు. ఆ కంపెనీ లిమిటెడ్ కంపెనీ అవగా, దానిలో డైరెక్టరు అయారు. ఇండియన్ నేషనల్ ఇంజనీర్స్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్; నేషనల్ ఇంజనీర్ అనే త్రైమాస ఆంగ్లపత్రికకు మేనేజింగ్ ఎడిటర్. అడ్రసు: 2, సారంగపాణి వీధి, త్యాగరాయనగర్ మదరాసు.

శ్రీనివాసరావు, అదుసుమల్లి; జననం. 1901 జనవరి 21; 1920 నుంచి కాంగ్రెసు సేవలో పాల్గొన్నారు; 1927 నుంచి సహకారోద్యమంలో కృషిచేస్తున్నారు. 28 సంవత్సరాలుగా గ్రంథాలయసేవ చేస్తున్నారు. ప్రస్తుతం వేటపాలెం లోని సారస్వత నికేతనమునకు గౌరవ గ్రంథ భాండాగారి; అడ్రసు: వేటపాలెం.

శ్రీనివాసరావు, శ్రీరంగం; జననం, 1910 జనవరి 2; బి. ఏ., 1931; ఆంధ్రప్రభలో సబ్-ఎడిటర్, 1938-42; ఆలిండియారేడియోలో 1942; మిలిటరీలో, 1943; పేరుపొందిన తెలుగుకవి; అనేక గీతాలు కాక, వచన రచనలు: సరి

ణయ రహస్యం, ప్రభవ, వారం వారం. నివాసం, ప్రస్తుతం మదరాసు.

శ్రీ ప్రకాశ; జననం, 1890 ఆగస్టు 3; బారిష్టర్; లీడర్, ఇండిపెండెంట్, ఆజ్ అనే పత్రికల సంపాదకశాఖలో పనిచేశారు; కాశీ విద్యాపీఠ స్థాపకులలో ఒకరు; యు. పి. రాష్ట్రకాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1928-34; ఆలిండియా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1929-31; కేంద్ర శాసనసభ సభ్యులు, 1935-47; 1930, 1932 1942 లలో జైలుకు వెళ్ళారు. చాలాపుస్తకాలు వ్రాశారు. పాకిస్థాన్‌లో భారతదేశం తరఫున హైకమిషనర్ 15 ఆగస్టు 1947 నుంచి 1949 ఫిబ్రవరి 15 వరకు; అస్సాంగవర్నరు, 1949 ఫిబ్రవరి 16 నుంచి; అడ్రసు: షిల్లాంగ్.

శ్రీరాములు, తాడేపల్లి; జననం, 1907; బందరు వర్తకులు; ఆంధ్ర బ్యాంక్, ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, హిందూస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సు కంపెనీల డైరక్టరు. అడ్రసు, మచిలీపట్టణం.

శ్రీరాములు, గోలవరపు; జననం, 1911 మార్చి 16; ఆంధ్ర యూనివర్సిటీ బి. ఏ., 1932; జనవాణి సబ్-ఎడిటర్, 1936-37; ప్రజామిత్ర, 1937-38; ప్రజాబంధు, 1938-40; ఆంధ్రప్రభ, 1940-44; 1944 నుంచీ ఆంధ్ర పత్రికలో సబ్-ఎడిటర్; చాలా కథలు వ్రాశారు. అడ్రసు. ఆంధ్ర పత్రిక ఆఫీసు, తంబుచెట్టి వీధి, మదరాసు.

షణ్ముఖంచెట్టి, ఆర్. కె; జననం, 1892 అక్టోబరు 17; బి. ఎ., బి. ఎల్., మదరాసు; మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1920; కేంద్రశాసనసభ సభ్యులు, 1923; సామ్రాజ్య ఆర్థిక సమావేశానికి భారతదేశ ప్రతినిధిగా, అట్టావా వెళ్ళారు, 1932; కేంద్ర శాసనసభ అధ్యక్షులు, 1933; కొచ్చిన్ దివాన్, 1935-41; ఇండియన్ టారిఫ్‌బోర్డు అధ్యక్షులు, 1945-46; భారతప్రభుత్వ ఆర్థిక మంత్రి, 1947 ఆగస్టు నుంచి 1984 ఆగస్టు వరకు; అడ్రసు, కోయంబత్తూరు.

షెట్టి, ఏ బి. (మంగుళూర్); 1926 లోను, 1930 లోను పోటీ లేకుండా, మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలుకు ఎన్నుకోబడినారు. దక్షిణ కన్నడ జిల్లాబోర్డు ప్రెసిడెంట్, 1932-35; మదరాసు

లెజిస్లేటివ్ అసెంబ్లీకి 1937 లో కాంగ్రెసు తరఫున ఎన్నుకోబడినారు. మదరాసు ప్రభుత్వ పార్లమెంటరీ సెక్రటరి, 1937-39; 1946 లో మళ్ళీ అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. ఆరోగ్యశాఖా మంత్రి, 1947 మార్చి నుంచి; అడ్రసు, ఫోర్ట్ సెంటు జార్జి మదరాసు.

సత్యనారాయణ, కప్పగంతుల: జననం, 1916 జులై 20 (కాకినాడలో); జనవాణి సబ్-ఎడిటర్, 1936 జులై-1937 మార్చి; ఆంధ్ర పత్రిక రిపోర్టర్, 1937 మే-1938 ఆగస్టు; ఆంధ్రప్రభ సబ్-ఎడిటర్, 1933 ఆగస్టు— 1941 ఏప్రిల్; 1942 జనవరి-1942 ఏప్రిల్; దేశాభిమాని సబ్-ఎడిటర్, 1943 జనవరి-జులై; ఫ్రీప్రెస్ సబ్ ఎడిటర్ 1944 జనవరి-జులై; 1945 జనవరినుంచి "మెయిల్" లో సబ్-ఎడిటర్; ఆంధ్రరాష్ట్రపత్రికా రచయితల సంఘ వర్కింగుకమిటీ మెంబరు 1946-48; రచనలు: మాణిక్యం, ఎవరికి వారేనా, సెల్లారుఘూము పారాలు, సెలవు. ఋణవిముక్తి అనే కథల సంపుటిలు; కబుర్లు; అడ్రసు: 5 వీరభద్రన్ స్ట్రీట్, మైలాపూర్, మదరాసు-4.

సత్యనారాయణ, గరిమెళ్ళ: జననం, 1896 జూన్; బి. ఏ. (విజయనగరం) 1920; 1921 లో రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజిలో ఎల్. టి. చదువుతూ, సహాయ నిరాకరణోద్యమంలో చేరి చదువు మానివేశారు. ఈ ఉద్యమంలో దేశాన్ని ఉర్రూతలూగించిన 'మాకొద్దీ తెల్లదొరతనం' అనే గీతాన్ని 1921 లో వ్రాశారు. ఈ పాట వ్రాసినందుకే 1922 ఫిబ్రవరిలో ఏడాది కఠినశిక్ష పొందారు. జాతీయతను ప్రబోధించే గ్రంథాలను వ్రాసినందుకు 1922 లో మరి రెండేళ్ళ శిక్షపొంది, 1924 జులైలో విడుదల అయ్యారు. 1932 లో రాజమండ్రిలో, గ్రామ పునరుద్ధారణను గురించి ట్రెయినింగు క్లాసులు నడిపారు. 1933 లో మదరాసుకు వచ్చి, అనేక తెలుగు పత్రికలలో సంపాదకవర్గంలో పని చేశారు. ఆంధ్రప్రభలో 1941-43; కళ్ళ జబ్బువలన ఉద్యోగం చేయలేక, ప్రస్తుతం పత్రికలకు వ్యాసాలు వ్రాస్తున్నారు. అడ్రసు, 45 వీర పెరుమాళ్ వీధి, మైలాపూర్, మదరాసు.

సత్యనారాయణరావు, యండమూరి; జననం, 1913 మే 8; బి. ఏ. (కాకినాడ); బి, ఇడి. (రాజమండ్రి); తూర్పుగోదావరిజిల్లాలో కొన్నాళ్లు స్కూలు టీచరుగా పనిచేశారు. జనవాణి సబ్-ఎడిటర్ 1937-39; ఆలిండియా రేడియోలో న్యూస్ అనౌన్సర్ 1939-43; ప్రోగ్రామ్సు అసిస్టెంట్, ఢిల్లీలోను, మదరాసులోను 1943-48; కటక్ స్టేషనులో ప్రోగ్రామ్సు అసిస్టెంట్ 1948 జనవరినుంచి; ప్రస్తుతం ప్రోగ్రామ్సు ఎగ్జిక్యూటివ్; సుమారు 200 నాటికలను వ్రాసి రేడియోలో బ్రాడ్‌కాస్ట్ చేశారు. వీరు వ్రాసిన పాటలు చాలా గ్రామొఫోను రికార్డులలోకి ఎక్కినవి. 'సత్య', 'శ్రీవాత్సవ' అనే పేర్లతో పత్రికలలో వ్రాస్తారు. అడ్రసు: ఆలిండియా రేడియో, కటక్.

సంజీవరెడ్డి, నీలం; జననం, 19 మే 1913; అనంతపురం ఆర్ట్సు కాలేజిలో చదువుతూ, సత్యాగ్రహోద్యమంలోచేరి చదువు మానివేశారు. 1938 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు, కార్యదర్శిగా ఎన్నుకోబడి, 1940 లో సత్యాగ్రహోద్యమంలో జెయిలుకు వెళ్లేవరకు ఆ పదవిలో వున్నారు. 1946 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. మదరాసు ప్రభుత్వ మద్యనిషేధ శాఖామంత్రి, 1949 ఏప్రిల్ 9 నుంచి; అడ్రసు, ఫోర్టుసెంట్ జార్జి, మదరాసు.

సాంబమూర్తి, బులుసు; జననం, 1886 మార్చి 4; కాకినాడలో పేరుపొందిన లాయరుగా వుండి, 1920 లో సహాయ నిరాకరణోద్యమంలోచేరి ప్రాక్టీసు వదలిపెట్టారు. చాలాసార్లు జైలుకువెళ్లారు. లాఠీ దెబ్బలు తిన్నారు. కాంగ్రెసుమహాసభ ప్రధాన కార్యదర్శి, 1923; వర్కింగుకమిటీ సభ్యులు, 1923; రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి 1935-37; మదరాసు అసెంబ్లీ సభ్యులుగా 1937 లో ఎన్నుకోబడ్డారు. మదరాసు అసెంబ్లీస్పీకరు 1937-39; మదరాసుజిల్లా ఆంధ్ర కాంగ్రెసు కమిటి అధ్యక్షులు, 1949; అడ్రసు, మైలాపూర్, మదరాసు.

సీతామహాలక్ష్మమ్మ, వల్లభనేని. జననం, 12 జనవరి 1910. వివాహం, శ్రీ వల్లభనేని రామబ్రహ్మంగారితో. సతీపతు లిరువురుకూడా కాంగ్రెసు వుద్యమములలో పాల్గొని జెయిలుకు వెళ్లారు. ఈమె పూర్వం కృష్ణా

జిల్లాబోర్డు మెంబరుగా వున్నారు. ప్రస్తుతం, మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబరు; ఆంధ్రవిశ్వకళాపరిషత్ సెనేట్ మెంబరు; మదరాసు నగర ట్రాన్సుపోర్టు సలహా సంఘసభ్యురాలు. మహిళా సంఘములకు చాలా సేవ చేశారు. అడ్రసు, జమీగొల్వేపల్లి కృష్ణాజిల్లా.

సీతారామరెడ్డి, హాలహరి బి; వయస్సు, 47 ఏళ్లు; బి. ఎ., పచ్చయప్ప కాలేజీ; బి. ఎల్., లాకాలేజి, మదరాస్; బళ్ళారిలో ప్రాక్టీసు ప్రారంభం, 1930; 1937 లో కాంగ్రెసు అభ్యర్థిగా మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీకి బళ్లారి నియోజకవర్గమునుంచి ఎన్నుకోబడినారు; మళ్ళీ 1946 లో కూడా ఎన్నుకోబడినారు. పరిశ్రమల శాఖామంత్రి. 1947, మార్చినుంచి; అడ్రసు: ఫోర్టు సెంట్ జార్జి; మదరాసు.

సీతారామస్వామి, గోన. జననం, 15 ఆగస్టు 1902. బొబ్బిలి యుద్ధంలో పాల్గొన్న పద్మనాయక వీరుల వంశంలో జన్మించారు. దేశస్వాతంత్ర్య పోరాటంలో చిన్నతనంలోనే పాల్గొన్నారు. బొబ్బిలి నగర, తాలూకా కాంగ్రెసు కమిటీల ప్రెసిడెంటుగా వున్నారు. 1936 లో జెయిలుకు వెళ్ళారు. 1942 ఉద్యమంలో ప్రముఖపాత్ర నిర్వహించారు. 1946 లో పోటీలేకుండా, మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు.

సుబ్బరాయన్, డాక్టర్ పి. జననం, 1889 డిసెంబర్ 11; కుమార మంగళం జమీందార్; బి.ఏ, మదరాసు, ఎం. ఏ., (ఆక్సుఫర్డ్) ఎల్.ఎల్.డి.(డబ్లిన్);1926 నుంచీ 1930 వరకు జస్టిసు పార్టీ సభ్యులు. మదరాసు రాష్ట్రానికి ప్రధాన మంత్రిగా వున్నారు. 1937 లో కాంగ్రెసుపార్టీ తరఫున ఎన్నికలలో పాల్గొని, తిరుచెంగోడు నుంచి మదరాసు అసెంబ్లీకి ఎన్నుకోబడినారు, న్యాయశాఖ మంత్రి, 1937-39; హోం మంత్రి; 1947 మార్చి 23 నుంచి 1948 ఏప్రిల్ వరకు.

సుబ్బారావు, కల్లూరి; జననం, 1897 మే 25: 1920 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరి జైలుకు వెళ్ళారు. మళ్ళీ 1922 లో కూడా శిక్షపడ్డారు. 1937 లో మదరాస్ అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. 1946

లో కూడా ఎన్నుకోబడినారు. అడ్రసు: అనంతపురం.

సుబ్బారావు, కె. వి. (కూరపాటి వెంకట); జననం, 1911 సెప్టెంబర్ 8: బి. ఎస్. సి. బెనారెస్; 1933 లో విద్య పూర్తికాగానే, వాల్కార్ట్ బ్రదర్స్ కంపెనీలో చేరి, 1936 లో ఆ వుద్యోగం మానివేసి, స్వంతంగా వ్యాపారం ప్రారంభించి, నేడు పెద్ద పరిశ్రమలను స్థాపించిన ఆంధ్రులలో ఒకరు, గుడివాడ, చికాకోల్, ఉడిపి, కూర్గ్, పార్వతీపూర్ ఎలక్ట్రిక్ కార్పొరేషనులను, మెక్లెక్ ఇంజనీరింగ్ కంపెనీద్వారా స్థాపించారు. కె. వి. సుబ్బారావు అండ్ కంపెనీ, మేనేజింగ్ పార్టనర్. ఈ కంపెనీ కిర్లంపూడి పంచదార మిల్లులను, మెక్లెక్ నూట్రిమెంట్స్ అండ్ ఫార్మసూటికల్ కంపెనిని, మదరాసు వనస్పతి లిమిటెడ్‌ను నిర్వహిస్తున్నది. అడ్రసు: 99/ఎ. ఆర్మీనియన్ వీధి, మదరాసు—1.

సుబ్రహ్మణ్యం, ధూర్జటి; జననం, 1905 అక్టోబరు 27; ఎం. ఏ. (మదరాసు); బి. ఇ. డి. (ఆంధ్ర) ఎ. ఐ. ఎ. (లండన్); ఎఫ్. ఎస్. ఎస్. (లండన్); 1938 లో ఇంగ్లండువెళ్ళి, ఎలయన్సు ఎన్స్యూరెన్సు కంపెనీలో పనిచేసి, ఇండియాకు తిరిగివచ్చారు. ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ సెక్రటరీగాను ఆక్చ్యుయరీగాను ఉన్నారు. ఇంగ్లండు వెళ్ళక ముందు, గుంటూరు హిందూ కాలేజీలో లెక్చరర్‌గా ఉన్నారు. బందరు థియోసాఫికల్ లాడ్జి ప్రెసిడెంట్; అడ్రసు: సెక్రటరీ, ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, మచిలీపట్టణం.

సుందరరామశాస్త్రి, నరసింహ దేవర; జననం, 27 ఫిబ్రవరి 1908. (ఆలమూరు); బి. ఏ. (రాజమండ్రి); ఎం. ఎ. (మదరాసు); ఎం. ఎస్. సి. (మదరాసు) పి. హెచ్. డి. (లండన్); మదరాసు యూనివర్శిటీలో స్టాటిస్టిక్సు డిపార్టుమెంటు ప్రధానోపన్యాసకులు 1934 జులై వరకు; సిమ్లాలో, ఇండియా ప్రభుత్వపు లేబరు డిపార్టుమెంటుకు స్టాటిస్టిషియన్, 1943 నవంబరు నుంచి 1945 సెప్టెంబరు వరకు; ప్రస్తుతం, డైరెక్టరు ఆఫ్ స్టాటిస్టిక్సు, రజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి; పంజాబు, తిరువాంకూరు యూనివర్శిటీల ఎం. ఏ. పరీక్షలకు పరీక్షకులు; ఆంధ్ర, మదరాసు, బొంబాయి యూనివర్శి